అంతర భారతీయ పుస్తకమాల

# జాగరీ

సతీనాథ భాదురీ

అనువాదం

మద్దిపట్ల సూరి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# ఉపోద్ఘాతం

బెంగాలీ నవలా సాహిత్యాన్ని వస్తుతః 'ఆలాతర్ ఘరేర్ దులాల్' (సంపన్నులింటి గారాబుబిడ్డ) నవల దగ్గర్నుంచే మొదలుపెట్టాలి. ఆ నవలా రచయిత ప్యారీచాంద్ అవసరమైన కథా వస్తుజ్ఞానాన్ని ఆ నవలలో పరిచయం చేశారు. అయినా మన నవలా సాహిత్యానికి మొట్టమొదటి ముఖ్యరచయిత బంకించంద్ర చటోపాధ్యాయ్ అనటంలో సందేహంలేదు. 'ఆలాతర్ ఘరేర్ దులాల్'లో నవల నియమనిబంధనలు మాత్రం సరిపెట్టబడ్డాయి తప్ప హృదయస్పందన అనుభూతికాలేదన్న సంగతి అంగీకరించక తప్పదు. బంకించంద్రులే బెంగాలీ నవలను శక్తివంతమైన శిల్పంతో సుప్రతిష్ఠితంచేశారు. ఆయన కల్పించిన కథల్లోని పాత్రలకు బలమైన వ్యక్తిత్వపు జీవితాకాంక్ష ప్రస్ఫుటమవు తూంటుందనటంలో, ఆ పాత్రలకు సంబంధించిన విధి-అదృష్టాల విషయంలో రచయితకు పందొమ్మిదో శతాబ్దపు భావాలున్నాయనటంలో, ఆకాలపు గౌరవ గృహస్థులకు విశిష్ట చైతన్యం వల్ల కలిగిన కొత్త భావాలతో సంఘర్షణ ఉన్నదనటంలో సందేహంలేదు. అయినా ఈనాడు-నూరేళ్ళ వ్యవధానానంతరం-ఆయన సాంసారిక గౌరవ గృహస్థులు యేదో కొంచెం స్తబ్దుల్లా-నీతి-సంప్రదాయాల మధ్య ఊగిసలాడుతూంటారని అనిపించకమానదు. కాని ఏమైనా ఆయన కల్పించిన స్త్రీ పాత్రలు మరిచిపోతగినవీ, అంగీకరించతగనివీ మాత్రం కావు. వ్యక్తిత్వంలో, సజీవతలో, వాస్తవికతలో, అభిప్రాయాల్లో మరపురాని 'శైవలిని' (చంద్రశేఖర్ నవల-1870) నిరుపమానమైన 'రోహిణి'(కృష్ణకాంతుని వీలునామా-1878) విస్మయకరమైన 'మృణ్మయి' (కపాలకుండల-1866). ఆయన నవలల్లోని గౌరవ గృహస్థులు-కృత్రిమ సంశ్లేషణలో అన్వేషణలో వ్యర్థంగా తిరుగు తూంటారు. అలాంటిచోట్ల ఆయన స్త్రీ పాత్రలు- అంతదాకా యెందుకు - 'దేవీ చౌధురాణీ' (1884) లాంటి పరిమితమైన కల్పన సందర్భంలో కూడా నిర్దుష్టమైన జీవిత చైతన్యాన్ని స్పందింపచేశారు. ఈ అంతర-బాహ్య వ్యవధానం-అణగిమణిగి ఉండే పురుష పాత్రలు - అతి వేగవంతమైన స్త్రీ పాత్రలమధ్య ఉన్న దూరత్వం-బహుశా ఆంగ్లేయులు

స్వప్రయోజనం కోసం నిర్మించిన కాలనీల్లోని మధ్యతరగతి ప్రజల అస్తిత్వానికి మరొక మోసకారితనం, మరొక తిరస్కారభావం కావచ్చు.

చివరకు రవీంద్రులే 'చోఖేర్‌బాలీ' (1900) నుంచే మన మధ్యతరగతి జీవితాల్లోని విఫలత్వపు బాధలను, మనోవికారాలను పట్టుకోగలిగారు. ఆయన నాయకపాత్రల్లో ఈ 'కలోనియల్' ప్రజల్లోని క్రుంగుబాటుతనంతో, విఫలత్వంతో పోరాటం సాగించారు. ఈ జాతీయమైన నాయకపాత్రలను సృష్టించిన ఫలితంగా - ఆయన నవలల నిండా అనాటకీయతే. అయినా నిగూఢమైన టెన్షన్‌తో విచలితులైన వ్యక్తుల కథలు కన్పిస్తాయి. ఉద్వేగం వెల్లివిరిసే ఈ నాయక పాత్రల్లో 'గోరా', 'శచీష్' అతీంద్ర్ చిరస్మరణీయులుగా ఉండిపోతారు. ఆయన స్త్రీ పాత్రల కల్పనా విశిష్టతను కూడా మనం జ్ఞాపకముంచుకోవాలి. 'వినోదిని', 'సుచరిత', 'దామినీ', 'కుమూ' వీరెవరూ యెప్పుడూ అలియకుండా హాయిగా తీరికగా గడిపే జీవితాల్లోంచి వచ్చినవారు కాదు. వీరందరి జీవితాలూ దుఃఖదారిద్ర్యానుభవాలతో రాటుతేలినవే. వీరందరూ ఈ దేశపు పరిమిత జీవితాల మధ్యనుంచే స్వాతంత్ర్య చర్చలు చేశారు. అంతేకాదు, ఆయన చివరి వయసులో రచించిన అతి రొమాంటిక్ నవల 'శేషేర్ కవితా' (1929)లోని నాయిక లావణ్య కూడా స్వశక్తి మీదనే నిలబడే స్వభావం కల గవర్నెస్. చోఖేర్‌బాలీ నవలతోనే ప్రస్తుత ప్రానంగింకమైన-బెంగాలీనవలా సాహిత్యంలో ఇరవయ్యో శతాబ్దపు రచన ప్రారంభమైంది. పాత్రల స్వభావ సంఘటనల కల్పనలో బంకించంద్రుని విధానం అంతరించిపోయింది. నాయికా నాయకుల మానసికమైన అఘాత ప్రతిఘాతాల టెన్షన్‌తో నిండిన నవలాయుగం ప్రారంభమైంది. పాత్రల స్వభావ ప్రవర్తనలకు బదులు నాయికా నాయకుల వ్యక్తిత్వం, వ్యక్తి స్వాతంత్ర్యం ప్రాధాన్యం పొందసాగాయి. వీటినన్నింటినీ ప్రారంభించింది రవీంద్రులే. 'గోరా' (1910), 'చతురంగ్' (1915) రవీంద్రుని ఈ రెండు నవలల్లో నాయికా నాయకులు మనుగడకై పడే బాధ అన్నింటికంటే ఎక్కువ శిల్ప సార్థక్యాన్ని పొందగలిగింది. 'గోరా', 'చతురంగ్' ఎప్పుడనగా వ్రాసినవో - కాని ఈనాటికీ మొదటిది మహాకావ్యోచితలక్షణాల్లో సాటిలేనిదిగా నిలిచింది. రెండోది సున్నితమైన సౌంధర్యంలో, టెక్నిక్‌లో పోటీలేనిదిగా ఉండిపోయింది.

బంకించంద్రుని నాయికా నాయకులు-సంఘటనల పర్వతశ్రేణిని ఎక్కుతూ దిగుతూంటారు. రవీంద్రుని నవలల్లో అసలలాంటి సంఘటనలే ఉండవు. కాని ఆయన నవలల్లో స్త్రీ, పురుషుల వ్యక్తిత్వస్పర్శతో సాధారణ సంఘటనలు కూడా అసాధారణంగా రూపొందుతాయి. సంఘటనలతో యేర్పడే టెన్షన్‌ని రవీంద్రులు - వ్యక్తుల జీవితగమన

స్పందనలో చూపెట్టారు. గోరా జన్మరహస్యాన్ని ముందు పాఠకులకు తెలియనీయకుండా దాచటంలాంటి నాటకీయత రవీంద్రులకిష్టంలేదు. ఈ శిల్పసాధర్మ్యాన్ని మొదట నెలకొల్పింది బంకించంద్రులే అయినా, రవీంద్రులే ఈ శిల్పాన్ని - బెంగాలీ మధ్యతరగతి వర్గం తమనుతాము గుర్తించే ప్రోత్సాహ సాధనంగా ఉపయోగించారు. బంకించంద్రులు రక్తమాంసాలతో జన్మించిన వ్యక్తుల ఆకాంక్షా వైఫల్యాలను చిత్రించారు. రవీంద్రులు వ్యక్తి సర్వతోముఖ సార్థక్యానికి అడ్డుయెక్కడ అనేది తెలుసుకోవాలని వాంఛించారు. అందుకని ఆయన వ్రాసిన యే రెండు నవలలు చెప్పతలచిన విషయంలోకాని, ఆకారవైఖరులలోకాని ఒక దానినొకటి అనుసరించి ఉండవు. బంకించంద్రుల నవలలు క్లాసిక్ శిల్పానికి నిదర్శనలు. వాటిల్లో యే ప్రధాన పరిచ్ఛేదాల్లోనయినా సరే నాటకీయ విన్యాసం గుర్తుంచుకోతగినదే. రవీంద్రుల నవలల్లో అన్వేషణే ప్రాధాన్యం వహిస్తుంది. అంచేతనే 'చార్ అధ్యాయ్' (1934) చివరి దృశ్యంలో వదలివేసిన నాటకీయత ఆయన వర్జనీయమైంది.

1913 సంవత్సరంలో శరచ్చంద్రుని 'బడదీదీ' పుస్తకరూపంలో వెలువడింది. అసలది అంతకుముందే పెద్దకథగా 'భారతి' పత్రికలో ప్రకటితమైంది. 1915 సంవత్సరంలో రవీంద్రుని 'చతురంగ్' ప్రచురింపబడింది. 'చతురంగ్', 'బడదీదీ'లాగా పాఠకుల అభిమానాన్ని చూరగొనలేదని వేరే చెప్పక్కర్లేదు. కాని ముఖ్యంగా చెప్పవలసిందేమిటంటే- శరచ్చంద్రులు చక్కని ముగింపుతో ఉండే నిండైన కథలు వ్రాయటం ప్రారంభించే నాటికి- రవీంద్రులు బెంగాలీ నవలను పూర్తిగా కథ చెప్పే విధానానికి దూరంగా తీసుకెళ్లారు. ఆయన 'చతురంగ్' నుంచే నవలఫారంను పూర్తిగా మార్పుచెయ్యటం మొదలెట్టారు. అయితే ఈ ఫారంని మార్పుచెయ్యటం యేదో గొప్పరచయితగా టెక్నిక్‌ను మొత్తం మార్చేసి ఆడుకుందామనే వ్యామోహంతో కాదు. జీవితంలోని గంభీరమైన లోతుల్లోకి చొచ్చుకుపోవాలనే ఉద్దేశ్యంతోనే అనేది వెల్లడయింది. రవీంద్రులు 'చతురంగ్' నవల ఫారంలో కొత్త పద్ధతిని ప్రవేశపెట్టినప్పుడే- యూరప్‌లో- ముఖ్యంగా ఇంగ్లండ్‌లో నవలారచనా విధానంలో సంపూర్ణంగా పెద్దమార్పు ప్రారంభమైందన్న సంగతి గుర్తుంచుకోవాలి.

శరచ్చంద్రులు ఈ కాంప్లికేషన్స్‌తో తలపగలకొట్టుకోలేదు. ఆయన చెప్పతలచిందంత యెక్కువేమీలేదు. బంకించంద్రులు స్త్రీ, పురుషుల శారీరక జీవిత పరిణామాల రూపాల్ని చిత్రీకరించారు. రవీంద్రులు వ్యక్తిత్వంలోని బాధామయమైన ఆత్మవికాసాన్ని గురించి చెప్పారు. శరచ్చంద్రులు - పురుషులకు - ముఖ్యంగా స్త్రీలపట్ల కలిగే

స్నేహం-ప్రేమల విషయంలో ఉండవలసిన తమ హక్కును గురించి నొక్కిచెప్పారు. వంగదేశంలోని సామాన్య పాఠకులు యెప్పుడైతే రవీంద్రులు ఉన్నతస్థాయిలో సృష్టించిన నాయికా నాయకులను అందుకోలేకపోయారో 'భారత' యుగంలోని రచయితల వర్గం కృత్రిమ నాగరికతతో విలాసజీవితంతో సామాన్య మధ్య తరగతి ప్రజల వాస్తవిక జీవితాన్ని ప్రస్ఫుటం చేయలేకపోయిందో- అంతేకాదు, తర్వాత కొద్ది రోజులకే ఢంకానినాదాలతో ప్రచారంలోకి వచ్చిన "కల్లోల" యుగం రచయితల తిరుగుబాటు తత్వం కేవలం విదేశీ ఫాషన్, అనుకరణ అని అనిపించిందో, అప్పుడు ఒక శరచ్చంద్రులే ధూళిధూసరితాలైన సామాన్య జీవితాలమీద ఒక అపూర్వమైన రొమాంటిక్ కాంతిని ప్రసరింపచేశారు. 'కన్సర్వేటివ్'లయిన బెంగాలీ మధ్యతరగతివర్గం-ఒక్క శరచ్చంద్రుల రచనల్లోనే తాము గడిపే జీవితాలకు కావ్యత్వగౌరవాన్ని పొందగలిగారు. ఒక్క 'గృహదాహ్' (1920) తప్ప. తక్కిన శరచ్చంద్రుల నవలలన్నిటి విషయంలోనూ ఈమాట చెప్పవచ్చు. శరచ్చంద్రులకు సమాజం యే అర్థనైతిక విధానంవల్ల భగ్నమయిందో దాని మూల కారణాలను తెలుసుకుందామన్న జిజ్ఞాసలేదు. భగ్నావస్థలో ఉన్న సమాజం మధ్య నిలబడి మాత్రమే శరచ్చంద్రులు - డికెన్స్‌లాగా వ్యక్తిగత సానుభూతిని, సమ్యక్ పరిశీలనను అర్థించారు. డికెన్స్ లాగా ఆయన కూడా Great entertainer అయితే ఆయనది మహత్తరమైన హృదయమనటంలో సందేహం లేదు. కాని అంత గొప్ప హృదయమున్నవారే కాని నవలారచయిత కాగలరా, లేదా అన్న విషయంలో సందేహం కలగటం సహజం.

## 2

బెంగాలీ నవల ఈ శతాబ్దంలోని ప్రస్తుత చతుర్దశకంలో- తన తృతీయ దశకు చేరుకుంది. ముప్ఫయిల్లో మనం నవలా రచయితలుగా చెప్పుకున్నవారే - ఈ యుగంలో ఇంక బెంగాలీ నవల బంకించంద్, రవీంద్రనాథ్, శరచ్చంద్రల్లాగా యే ఒక్కరి ప్రతిభకో మాత్రమే విలాసరంగంగా ఉండదన్న సంగతి రుజువు చేశారు. పెక్కుమంది బెంగాలీ నవలా రచయితలు బెంగాలీ నవలను సర్వతోముఖంగా కాని అన్నీకలబోసి చూస్తే ముప్ఫయిల్లో నవలాకారు లందరిలో ఒక్క తారాశంకర వంధ్యోపాధ్యాయ్ రచనల్లోనే గొప్ప నవలాకారుని Contribution కనిపిస్తుంది. మానిక్ వంధ్యోపాధ్యాయ్ తొలిజీవితంలో గుడ్డి అదృష్టంచేతిలోని ఆటబొమ్మలా - తోడునీడలేని నిస్సహాయ మానవుల్ని చిత్రీకరించేవారుగా ఉండేవారు. తర్వాత మానిక్ వంధ్యోపాధ్యాయ్ మార్క్స్ వాద కాంతితో జీవితాన్ని ఆలోచించసాగారు. దాంతో ఆయన ప్రగతిశీల చైతన్యానికధికారిగా రుజువైంది. కాని

ఈ రూపవిభేదం మానిక్ చిన్న కథల రంగంలో ఫలించినా, నవలా రచయితగా ఆయన లాభాన్ని పొందగలిగాడా లేదా అన్న సంగతి చెప్పటం కష్టం. విభూతి భూషణ్ ప్రకృతి నిత్యలీలావిలాసాన్ని - ధనదరిద్రమానవుల జీవితాల్లో యెన్నో సమయాల్లో అంతులేని కాంతి ప్రసారాన్ని చూసే తృప్తి చెందారు. కాని తారాశంకర వంధ్యోపాధ్యాయ్ భారతదేశ ప్రజల నైతిక దృక్పథాన్ని ఇక్కడి విచిత్ర జన సముదాయాన్ని అన్నిటికంటే ఆధునిక చరిత్రలో త్వరత్వరగా మారిపోతున్న దీని రూపాన్ని చూడగలిగారు. ఈ విషయంలో తారాశంకర్ దృష్టి స్థిరమైనదికనుకనే - ఆయన తొలి జీవితంలో మార్క్సవాద ప్రీతి, తర్వాత కాలంలో గాంధీవాద దీక్ష - ఆయన శిల్పకీర్తి ప్రధానాంశాలకు యెలాంటి హానీ కలగలేదు. భారతీయ జీవితం, భారతీయత్వం ఆయన దృష్టిపరిధి నుంచి యెన్నడూ జారిపోలేదు. ఇదే ఆయన మహత్వానికి సమగ్రమైన కారణం.

## 3

ముప్పదుల్లోని నవలా రచయితలు మంచి పేరుప్రఖ్యాతులతో స్థిరపడిన సమయం 1945 సంవత్సరంలో సతీనాధభాదురీ 'జాగరీ' ప్రకాశితమైంది. సతీనాధభాదురీ జన్మించింది 1905లో - మరణించింది 1965లో. బీహార్ రాష్ట్రంలోని ఒక ప్రత్యేక ప్రాంతం ఈ కథా నవలకు వెనుకతెర. 'చోండాయీ చరితమానస్' - ఒకటి, రెండు భాగాలు (1949-51) 'అచిన్‌రాగిణీ' (1954) ఈ రెండు ఆయన రచించిన తక్కిన నవలలు. హార్దిక రీతి, అభినవ కథావస్తువు, ప్రసన్న ప్రోజ్వలమైన మానవతాదృష్టి ఆయన రచనల్లోని విశిష్టత. జాగరీతోనే ఆయన రచనాయాత్ర ప్రారంభమైంది. వెలువడీ వెలువడటంతోనే 'జాగరీ' పాఠకుల్ని బలంగా ఆకర్షించింది. వెలువడటం విజయలాభం పొందటంల మధ్య క్షణకాలం కూడా ఆలస్యం జరగలేదు. దానికి రెండు కారణాలు. మొదటి కారణం- విప్లవగర్భితమైన నలభైరెండు (1942) రాజకీయాందోళన కథావస్తువుగా మొట్టమొదట రచించిన మంచి నవల కావటం. రెండో కారణం విశిష్టమైన కథా రూప కల్పన. అప్పటికి మూడేళ్ళ క్రితమే నలభైరెండు ప్రజా విప్లవం జరిగింది. సామాన్య ప్రజా హృదయాల్లో అదింకా ప్రత్యక్షంగా, దీప్తివంతంగా ఉంది. కారాగారాల గోడల కారుచీకట్ల మధ్య-తెలతెలవారబోయేముందు యెంతోమంది దేశసేవాకార్యకర్తలు ప్రాణాలర్పించారు. ఈ నవల ఆసామయిక చిత్రాన్ని విశ్వసనీయమైన వాస్తవికతతో చిత్రించింది. బిలు, తండ్రి, తల్లి, నీలు ఒక భయావహమైన తెల్లవారుఝాము కోసరం ప్రతీక్షిస్తున్నారు. ఆ తెల్లవారుఝామున బిలూ ఉరిశిక్ష అమలుజరగవలసి ఉంది. ఈ

నలుగురి నాలుగు హృదయాల్లోని ఏకోక్తి సమీకరణే ఈ నవల. టెక్నిక్ సంగతి తర్వాత చర్చిద్దాం. ముందు ఈ నవలలోని కథావస్తువుని పరిశీలిద్దాం.

యావద్భారతదేశం 1921 నుంచి 1942 వరకు గల మధ్యకాలంలో కనీసం నాలుగుసార్లు ప్రజావిప్లవతరంగా ఘాతాలతో కదలిపోయింది. తత్ఫలితంగా రాజకీయాలు కేవలం వార్తా పత్రికల విషయాలుగానే ఉండిపోలేదు. ప్రజల దైనందిన జీవితాల్లో భాగమయినాయి. మాష్టరుగారి కుటుంబంలా 'రాష్ట్రీయ కుటుంబాలు' తయారయ్యాయి. వంగదేశ చరిత్రలో ఇలాంటి ఆందోళన ఒకటి 1905లో స్వదేశీ యుగంలో జరిగింది. ఈ ఆందోళన కూడా వంగీయుల జీవితాన్ని సంసారరంగంలోను, విస్తృతమైన కార్యరంగంలోనూ స్పృశించింది. అంచేత ఇరవయ్యో శతాబ్దంలో రెండో దశాబ్దం నుంచే - మనం పరిపూర్ణమైన రాజకీయ నవల అనుకునేది-ఆవిర్భవించటం అనివార్యమైంది. 'ఘరే-బాయిరే' (1916) నవలను రవీంద్రులు వంగ విభజనోద్యమ యుగంలోని రాజకీయ ఉత్తేజన ఆధారంగా బాక్‌డ్రాప్‌ని చిత్రించారు. అది కూడా స్త్రీ-పురుష పాత్రల ఏకోక్తి సమీకరణతో రచించిన నవలే. రాజకీయ వాతావరణం ఉన్న నవలలో ఒక కుటుంబం కష్టాల్లో చిక్కుకోవటం ప్రధానమైంది. బెంగాలీ కథాసాహిత్యంలో రెండో సుప్రసిద్ధ రాజనైతిక నవల 'పథేర్ దాబీ' (1926)- వ్రాసింది శరచ్చంద్రులు. విప్లవకారుల అగ్నిలాంటి ఉత్తేజన ఈ నవలలో అంతర్గతమైన యావరేజ్ కథల చుట్టూ ఒక విలక్షణమైన రంగుతొడుగులను తొడిగింది. అందువలన ఈ నవల సహజమైన జనాదరణను పొందగలిగింది. రవీంద్రులు మళ్లీ 1934లో మరొక రాజనైతిక నవల రచించారు. దానిపేరు 'చార్ అధ్యాయ్'. 'ఘరే-బాయిరే', 'చార్ అధ్యాయ్' ఈ రెండు రాజనైతిక నవలలే రవీంద్రులు పార్టీని లేదా - వర్గాన్ని వ్యక్తి స్వాతంత్ర్య వ్యతిరేకత గల పాత్రల్లో చూపించారు. వ్యక్తి స్వాతంత్ర్య వికాస పథంలో - పార్టీ నాయకత్వం, ఆదేశాలు జారీ చేయటం ప్రతిబంధకాలన్నీ రవీంద్రులు రెండుసార్లూ చూపించారు.

మన ప్రాచీన కుటుంబ సంప్రదాయానికి-వర్తమాన కుటుంబ సంప్రదాయానికి ఈ సమయంలో యావద్భారతదేశంలో ప్రజాందోళన ఏ అనుభవాన్ని కలిగించిందో- దాన్ని చక్కని పరిశీలనా దృష్టితో తారాశంకర వంద్యోపాధ్యాయ్ తమ 'ధాత్రీదేవతా' నవలలో (1939) రూపొందించారు. విప్లవకారుల ఆందోళన మెల్లగా దానంతటదే యెలా రూపాంతరాన్ని పొందిందో, ఆ కార్యకర్తలు వ్యక్తిగత విప్లవమార్గాన్నివదలి, గాంధీజీ నడిపించిన ప్రజాందోళనలో యెలా పాల్గొన్నారో- దానికి బృహత్తర చిత్రీకరణే ధాత్రీదేవత. కాని కేవలం అంతేకాదు. ధాత్రీదేవత అసలు రాజనైతిక-సాంసారిక నవల. ప్రస్తుతం

పరిశీలిస్తున్న 'జాగరీ' నవలలో ఒక 'రాష్ట్రీయ కుటుంబాన్ని' చూస్తాం. 'ధాత్రీదేవత' నవలలో 'రాష్ట్రీయ కుటుంబం' యెలా ఉత్పన్నమైనదీ చూస్తాం. నాయకుడైన శివనాథ్‌తో పాటు అతడి భార్య గౌరి, మేనత్త, అంతేకాదు అస్ఫుటభాషి అయిన శిశుసంతానం కూడా 'వందేమాతరం' మంత్రంతో దీక్షపూనారు. ఇదే నవలలోని చివరి మాట. ఉపసంహారంలోని సంఘటనాత్మక మానసికాఘాతాలతో వ్యావృతమైన చరిత్రే ధాత్రీదేవత నవలలోని ప్రధాన రసం. సామాన్యంగా కుటుంబాల్లో యేర్పడే అపార్థాల మూలంగా చితికిపోవటానికి సిద్ధంగా వున్న కుటుంబం- ఏ విధంగా ఛిన్నాభిన్నం కాబోయిందో, జాతీయ చరిత్రలో చటుక్కున మేల్కొన్న కాలపురుషుడు దాన్ని మళ్లీ యెలా సంఘటితం చేశాడో, అంతేకాదు, దానికి కొత్త జన్మనిచ్చాడో - దాన్ని తారాశంకర్ చూపినంత గొప్పగా యెవరూ చూపించలేకపోయారు.

సతీనాథభాదురీ జాగరీ బెంగాలీ రాజనైతిక నవలా సాహిత్యంలో ఒక కొత్త స్వరకల్పన చేసింది. 1942 సంవత్సరంలోనే రాజనైతిక చైతన్యం, దృక్పథాల్లో విభిన్నత క్రమక్రమంగా భిన్నభిన్నమైన పార్టీల్లో చచ్చిపోసాగింది. కాని సి.యస్.పి. కాంగ్రెస్ - సోషలిస్ట్‌పార్టీ కమ్యూనిస్ట్‌పార్టీ - కాంగ్రెస్ సృజించిన బృహత్తరమైన ఐక్యవాద్యంలో తమ తమ స్వరాలకు స్పష్టత నివ్వతలచారు. ఆగస్ట్ ఆందోళన ఔచితిని గురించి కమ్యూనిస్ట్ పార్టీ, కాంగ్రెస్ పార్టీల మధ్య పెద్ద అభిప్రాయభేదాలున్నాయి. ఆందోళనా విధానంమీద - ఈ స్థితిలో 'ప్రాంతీయనవల' జన్మించింది. ఫ్రాయిడ్ మనోవైజ్ఞానిక సిద్ధాంతం, మార్క్స్ సామ్యవాద పరిశీలన ఒకే కాలంలో బెంగాలీ నవలలో సహవాసం చేశాయి. స్వదేశీ జిజ్ఞాస తీవ్రతరమైంది. ఇవన్నీ బహుశా 'కల్లోలయుగం' (1923) ఔన్నత్యపు రోజులు కెలుకుడయిన బురదలోంచి ఉద్భవించియుండొచ్చు. అయితే యిది పేరుకు మాత్రం కల్లోలవాదులుగా చలామణి అవుతూ, వాస్తవంగా కల్లోల వర్గీయులు కానివారి వల్లనే జరిగింది. అసలు ప్రాంతీయ సాహిత్యం శైలజానందచేతినుంచే వెలువడినా, దానికి పరిపూర్ణమైన రూపం తారాశంకర వంధ్యోపాధ్యాయ్ చేతుల్లోనే యేర్పడింది. ప్రేమేంద్ర మిత్ర చేతుల్లో అవహేళిత ప్రజల చిత్రీకరణ ప్రారంభమైన మాట నిజమే కాని, యవనాశ్వ రచించిన 'పటల్‌డాంగార్ పాంచాలి'లోనే సంపూర్ణత సంతరించుకుందన్న మాట ఖాయం. అయినప్పటికీ ఈ విషయంలో మానిక్ వంధ్యోపాధ్యాయ్ రచనల్లోనే నిజమైన నవలా రూపాన్ని పొందగలిగాం. విభూతి భూషణ వంధ్యోపాధ్యాయ్ 'పథేర్ పాంచాలీ' (1929) 'ఆరణ్యక్' (1938) నవలల్లో సరికొత్త దిక్కును చూపించారు. ముప్ఫయిల్లోని నవలాకారుల కొన్ని నవలలు శిల్పపరిపుష్టిలో బెంగాలీ సాహిత్యంలో 'క్లాసిక్' నవలల

గౌరవం పొందటానికి అర్హమైనవి. తారాశంకర్ 'గణదేవత' (1942) 'కవి' (1942) మానిక్ వంధ్యోపాధ్యాయ్ 'పుతుల్ నాచేర్ ఇతికధా (1936), 'పద్మానదీర్ మాఝి' (1936) పైన పేర్కొన్న విభూతి భూషణ వంధ్యోపాధ్యాయ్ రెండు నవలలు ఈ సందర్భంలో పేర్కొనతగిన వాటిల్లో కొన్ని మాత్రమే. ఈ నవలలన్నింటిలో యెంత వైరుధ్యం, కథావస్తువులోకాని, కథనరీతిలో కాని యెంత విభేదం, జీవనవైచిత్రిని, అంతం లేని స్వదేశ జీవితస్వరూపాన్ని, ఈ దేశంలోని వివిధ రకాల మనుషుల పరిచయాన్ని ముప్ఫయిల్లోని నవలాకారులు ఎంతో శ్రమతో, జిజ్ఞాసతో, పట్టుదలతో వాటిని పరిపుష్టం చేశారు. ఇలాంటి నవలల్లో అసలు విశిష్టత పాత్రల వ్యక్తిత్వం - స్టయిల్‌లల సమన్వయం లోనే. ఈ నవలాకారులందరూ ఆ సమన్వయ సాధనలో యెంతో ప్రతిభాసామర్థ్యాలను ప్రదర్శించారు.

'వనఫూల్'- అసలు పేరు బాలాయిచాంద్ ముఖోపాధ్యాయ్. ఈ అధ్యాయం లోని మరొక నవలా రచయిత. ఆయన చెప్పతలచిన దాంట్లో ఆర్జించిన విశిష్టత - విషయవైచిత్రిలో టెక్నిక్‌లో ఆర్జించినంతటిదికాదు. కాంగ్రెస్‌కి, సి.యస్.పి.కి మధ్య అభిప్రాయభేదాలున్నాయి. జాగరీ నవలలో వర్ణించబడిన మాష్టర్‌గారి కుటుంబం - భారతీయ రాజనైతిక జగత్తుకు చిన్న ప్రతిరూపం. బిలూ - కాంగ్రెస్ సోషలిస్ట్, తండ్రి - తల్లి గాంధీ అనుయాయులైన కాంగ్రెస్‌వాదులు. నీలూ కమ్యూనిస్ట్. ప్రచండమైన ఆగస్ట్ ఆందోళనదెబ్బ ఈ కుటుంబంమీద పడింది. బృహత్తరమైన అర్థంలో చెప్పాలంటే యావద్భారతదేశంమీద పడింది. జాగరీ రచయిత మొదటి నవల. కాని ఇంకా రెండు నవలల్లో రచయిత రాజనైతిక ఆందోళన వాతావరణాన్నే ఉపయోగించారు. 'చిత్రగుప్తేర్ ఫయిల్' (1949) ఢోంగాయీ చరిత మానస్ (1949) రెండోభాగం. నా ఉద్దేశంలో 'ఢోంగాయీ...' రచయిత ఉత్తమ రచన. 'ఢోంగాయీ' రెండో భాగంలో ఆయన మళ్లీ అగ్నిగర్భమైన బాక్‌డ్రాప్‌నే ఉపయోగించుకున్నారు. దీన్నిబట్టి అనుభవం దృష్ట్యా రచయితను ఈ సంఘటన యెంత కలవరపరచిందో తెలుసుకోవచ్చు. ఒక ప్రళయ కాలపు మహాగ్నిజ్వాల వెలుగులో - పై ఆవరణలన్నీ తీసివేసిన మానవాళిని చూడతలచా రాయన. రాజనైతిక నవల ద్వారా ఆయన విచిత్రమైన మానవతారసాన్ని పంచిపెట్టారు. ఇది 'జాగరీ'లోని మరొక విశిష్టత. ఇందులోని రాజకీయాలు ప్రచారపు రాజకీయాలు కావు. అంగాంగ పరిశీలన చేస్తే ఆ సంగతి స్పష్టమవుతుంది. సాయంత్రం నుంచి రాత్రి తెల్లవారుజాము వరకు గల ఉద్వేగభరితమైన పన్నెండు గంటలు స్థూలంగా ఈ కథ జరిగిన కాలపరిమితి. కాని అంతర్గతంగా ఉన్న యేకోక్తి మూలంగా పైకి కన్పించే

ఈ పన్నెండు గంటల మీద జ్ఞాపకాలతో సుదీర్ఘమైన గతాన్ని పరిచారు. అంతర్గతంగా ఏకోక్తి ఉన్నది కనుకనే - జ్ఞాపకాల్లోని స్వాతంత్ర్యకాలపు సంఘటనల అనుక్రమణిక అవసరం లేకపోయింది. గోపాలహల్దార్ 'ఏకదా' (1939) నవలలో మనం ఒక రోజులో జరిగిన కథను చదివాం. అక్కడ కూడా నాయకుని జ్ఞాపకస్రవంతి ప్రసక్తులలోంచి పన్నెండు గంటల పరిధి దాటిపోయింది. అయితే 'జాగరీ' ఆంగికరీతి మరొక కారణం వల్ల కూడా అనివార్యమైంది. ఇక్కడ వర్ణించబడిన రాత్రి అంతా నాటకంలోని చివరి దృశ్యంలాంటిది. పడబోయేతెర కింద నాలుగు స్త్రీ పురుష పాత్రల సంభాషణకంటె వాటి సుదీర్ఘ స్వగతోక్తులను వినటం యెక్కువ అవసరం. ఆ నిర్ణీతమైన భయంకర ఘడియలో అడుగులు లెక్కపెట్టుకుంటూ నలుగురు సృష్టించుకున్న నాలుగురకాల ప్రపంచానుభవం మన కళ్ళముందు మూర్తీభవించింది. ఈ విశిష్టమైన టెక్నిక్ మూలంగానే - నాటకీయమైన పరిసమాప్తి చివరి క్షణం వరకు పూర్తిగా అనావృతంగా ఉండగలిగింది. మరొక కారణంవల్ల కూడా ఈ టెక్నిక్ అనివార్యమయింది. రచయిత ఏ రాజకీయోద్దేశం తోనూ ఈ నవలను రాయలేదు. నీలూ పాత్రను వాస్తవికంగా రూపొందించటానిక్కూడా ఈ టెక్నిక్ అవశ్యకమైంది. మామూలు పద్ధతి నవలలో నీలూని ఇంతలోతుగా అర్థం చేసుకోవటం సంభవమయేది కాదు. పార్టీ కార్యకర్తగా కాదు - మనిషిగా. మానవతే జాగరీ కథా వస్తువు.

-సరోజ్ వంద్యోపాధ్యాయ్

# ఉరిఖైదీల-సెల్

రెండో నంబరు వార్డులోని రావిచెట్టు చిటారు కొమ్మలపైన సాయం సమయపు మ్లానకాంతి మిలమిలలాడుతోంది. క్షణం తీరికలేకుండా ఎన్నోపక్షులొకేసారి ఈ కొమ్మమీదికి, ఆ కొమ్మమీదికి ఎగిరి వాలుతున్నాయి. ఇహ కాసేపయితే నాలుగు మూలలా చీకట్లు కమ్ముకుంటాయి. తర్వాత యింక రాత్రంతా నిశ్శబ్దతే. బహుశా చివరి గడియలో ఈ సందడి, ఈ రెక్కల సవ్వడులు ఆనందోత్సవం అందుకేనేమో! కాలం దగ్గిర్నుంచి యెంతో అంత ఆనందాన్ని లాక్కోవాలి. సంజెవేళ పక్షులింత రొదలు చెయ్యటం నిజంగా యిందుకేనా? ఈ సెల్‌లోకి రాకమునుపు రెండోనంబరు వార్డులో ఉన్నప్పుడు- రోజూ సాయంత్రం లాకప్‌లోకెళ్ళటానికి ముందు మేమందరం కాస్త బయటిగాలి పీల్చేవాళ్లం. నిజంగా అవసరమయేనా- అంటే కాదు. ఊరికే గదిలో కూచుని ఉన్నాం కదా అనేనేమో! అసలు బయటికి రావలసిన పనేమీ ఉండేదికాదు. అయినా ఒకసారి బయటికి వచ్చి తీరాలి. చాలామంది రాజకీయబందీల మనస్తత్వం ఇలాగే ఉండటం గమనించాను. వార్డర్లు విసుక్కునేవారు. స్వరాజ్యం వాళ్లు తమను వేధించటానికే ఇలా చేస్తున్నారని వారి ఉద్దేశం. నిజానికెవరూ వారిని వేధించాలనే ఉద్దేశంతో ఇలా చేసేవాళ్లుకాదు. ఎవరైనా సుఖమనుభవించటానికి వీలున్న అవకాశాన్ని ఎందుకు విడిచిపెడతారు?

అవి బహుశా కాకులేమో! ఇంతదూరం నుండి సరిగ్గా తెలియటంలేదు. పక్షులు రాత్రిళ్ళు రెక్కలు టపటపలాడిస్తాయి. ఒకసారి బకడీకోలాలో మీటింగు జరిపి తిరిగి వచ్చేప్పుడు మేము ఆ రాత్రంతా కామాఖ్యాదగ్గిరున్న పెద్దమర్రిచెట్టు క్రింద గడపవలసి వచ్చింది. అక్కడి నేలమీద పడుకుంటే కుష్ఠు రోగం పోతుందట! ఆ నమ్మకంతో చాలా మంది ఎంతో దూరదూరాల్నుంచి కూడా అక్కడికి వస్తూంటారు. అక్కడ అటు యిటు చెట్లక్రింద చాలామంది కుష్ఠురోగులు పడుకుని ఉన్నారు. నేనూ నీలూ యిద్దరమే ఉన్నాం. సహదేవ్ కూడా ఉన్నాడనుకుంటా. రాత్రి తెల్లవార్లూ పక్షులు

రెక్కలు కొట్టుకుంటున్న ఒకటేరొద. ముగ్గురం చెట్టుక్రింద ప్రక్కప్రక్కనే పడుకున్నాం. ఆ చెట్టుక్రింద మకాం చెయ్యవలసి వచ్చినందుకు నీలూకేదో చిరచిరగా ఉందనుకుంటా. నేను-పక్షులలా రెక్కలు తపతపకొట్టుకుంటున్నాయి ఎందుకనంటావు? అని అడిగాను. నీలూ - చీమలో, దోమలో కుడుతూ ఉండి ఉంటాయి అని టక్న చెప్పేశాడు. ఆలోచించటానికి వ్యవధి కూడా తీసుకోలేదు. అతడికన్ని విషయాల్లోనూ కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్నాయి. సాధారణంగా అవి కాస్త అటు యిటు కూడా మారవు. నీలూ మొదట్నుంచీ అంతే.

సంజెకెంజాయ రానురాను ధూసరవర్ణంగా మారుతోంది. ఆకాశపు సిందూరకాంతి రావిచెట్టు చిటారుకొమ్మలపైన పడుతోంది. చెట్టు ఆకులింకా సొంతం ఆకుపచ్చగా కన్పించటంలేదు. ఆకులపచ్చరంగు పోతే పోయింది. ఇక్కడి నుంచి కాస్త పచ్చగా కన్పిస్తోంది. అదీకాక ఈ కటకటాల్లోంచి నీలాకాశం చిన్న పీలికంతమేర-ఇనుపకాడల మధ్య రొట్టెస్లయిస్‌లా కన్పిస్తోంది. సెల్‌లో ఉండే వారికదే వాస్తవం-'సి'క్లాస్ బందీల డయట్ కంటె తృప్తికరమైనదీ. అదికాక సెంట్రల్‌టవర్ పైభాగం కన్పిస్తోంది. దాని గోడమీద పెద్ద అక్షరాలతో ఇంగ్లీషులో పూర్ణియా సెంట్రల్‌జైల్, బీహార్ అని వ్రాసి ఉంది. ఈ ఆకాశపుతునక ఏదో నా స్వంతవస్తువులాగా నాకు చాలా ఆత్మీయమైనది. ఆ నీలపు రంగుని కన్పించినంతసేపూ చూశాను. ఇలా- నాలాగా సరీగ్గా ఇలాంటి ఆకాశపుతునకను మరెవరైనా పొందగలిగారా? నా నీలాకాశం క్షణక్షణానికీ రంగులు మార్చుకుంటోంది. సిందూరం రంగు ఊదారంగుగా మారింది. చూస్తూచూస్తూండగానే అంతలో బూడిదరంగయింది. మళ్లీ ఇప్పుడే కారుచీకటిలో కలిసిపోతుంది. ఇలాంటి విచిత్రమైన రసధునిని- జైలర్ దొర సర్వమూ కోల్పోయిన ఒక ఖైదీ స్వంత సంపదగా యెందుకుకానిచ్చాడో- ఎంత ఆలోచించినా తోచలేదు. బహుశా అతడికి తెలియక పోవచ్చు. తెలిస్తే రేపట్నుంచే తాపీ మేస్త్రీ 'కమాండర్' ఖైదీలకు నా యెదురుగా ఉన్న గోడను బాగా ఎత్తు పెంచే పని పురమాయించవచ్చు. ఇంకా యెత్తు, ఇంకా ఎత్తు - అవసరమైతే ఆకాశాన్ని తాకేంత ఎత్తుకు పెంచమని ఆజ్ఞ జారీ చెయ్యొచ్చు. ఈ చెట్టు ఆకుపచ్చరంగు, ఆ ఆకాశపుతునక తప్ప-ఇక్కడ నుంచి కన్పించేది ఇనుము, ఇటుకలు, సిమెంటు-సిమెంటు, ఇటుకలు, ఇనుమే. అవి దృష్టిని ప్రలోభపెట్టవు. దృష్టిని అటంకపరుస్తాయి. దృష్టిని చిందరవందర కావిస్తాయి. ఈ ఆకుపచ్చ, నీలం రంగులు తప్ప ఏరంగునయినా చూడనీ- అవన్నీ యేదో వెగటుగా మొరటుగా ఉన్నట్లనిపిస్తుంది. కళ్లకు బాధకలిగిస్తాయి. సెల్‌లో సున్నం వేసిన తెల్లటి గోడ కూడా కళావిహీనంగా

వెలవెలపోతూంటుంది. దానికి సున్నంవేసి యెన్నాళ్లయిందో! గోడనిండా - రకరకాల మరకలు - చాలా వరకవన్నీ ఉమ్ముల మరకలే. ఏదో మట్టిరంగుకి మారాయి. బహుశా నా కంటె ముందున్న ఖైదీ నెవరినో సిపాయిలు పొగాకు తినిపించి ఉంటారు. అతడెప్పుడివన్నీ వదిలి ఏ అజ్ఞాత దేశానికి వెళ్లిపోయాడో - గోడల మీద సిపాయిల పట్ల కృతజ్ఞతా చిహ్నాలను మాత్రం ఉంచి వెళ్ళిపోయాడు.

మాట్లాడటానికి మరొక వ్యక్తి లేడు. అందుకనే సెల్ బయటి జైలు - జగతితో చెవి ఒగ్గి సంబంధం పెట్టుకోవటం. ఒక్క వార్డర్‌తో మాత్రం మాట్లాడొచ్చు. కాని ఆ ఆసక్తిలేదు. నాలుగువైపులా గోడ. ఎటువైపు చూసినా దృష్టి గోడకెళ్ళి తగిలి మళ్ళీ వెనక్కి తిరిగి వచ్చేస్తుంది. బయటి నుంచి ఏమైనా విన్పిస్తుందేమోనని ఎప్పుడూ చెవులు రిక్కించుకుని ఉంటాను. పదహారడుగులు పొడుగు, పదడుగులు వెడల్పుగల గది. ఎదుటివైపున పెద్ద ఇనుపకమ్ముల దర్వాజా. దక్షిణపు వైపు గోడను పైకప్పుకి దగ్గరలో ఒక చిన్న కిటికీ. దానికి క్రిందుగా నేల మీద బారెడు వెడల్పు, బారెడున్నర పొడుగు గల రెండు పెద్ద యినుపరేకులు గోడకు బిగించి ఉన్నాయి. బహుశా గాలి రావటానికయినా అయి ఉండొచ్చు. లేదా-ఆ సందుల్లోంచి లోపలున్న ఖైదీలు ఏం మాట్లాడుకుంటున్నదీ బయటి వార్డరు వినటానికైనా అయి ఉండొచ్చు. ఎదుట ఇనుపగుమ్మం దగ్గిర ఒక వార్డర్ ఉండనే ఉంటాడు. అతడికి ఖైదీ ఏం చేస్తున్నదీ లేనిదీ పూర్తిగా కన్పిస్తూనే ఉంటుంది. అయినా ఈ ఏర్పాటెందుకో తెలియదు. గదిలో సామానుల్లో - రెండు తారుపూసిన చట్టీలు ఒక మూల పెట్టి ఉన్నాయి. ఈ మూల అర్ధవర్తులాకారంగా కింద సున్నంపూసి ఉంది. సెల్ బయట కిటికీ వైపున గోడప్రక్క నుంచి వెడల్పయిన గట్టిరోడ్డు ఉంది. రోడ్డు వర్తులాకారంలో జైలు అన్ని వార్డులనూ చుట్టి ఉంటుంది. ఈ రోడ్డుకి అవతలివైపున జైలు ఆస్పత్రి గోడ. ఈ రోడ్డుమీద ఎంతో మంది జనం - ఎందరో ఖైదీలు, వార్డర్లు, డాక్టర్లు, కాంపౌండర్లు, కంట్రాక్టర్లు, ఆఫీసర్లు, మేస్త్రీలు - ఇంకా ఎందరెందరో తిరుగుతూంటారు. పగలు జనం బాగా రద్దీగా ఉండే చిన్న బస్తీరోడ్డు అనిపిస్తుంది. ఈ బ్రహ్మాండమైన పూర్ణియా సెంట్రల్ జైలు బస్తీ కంటె ఏం తక్కువది? మామూలు రోజుల్లో అయితే ఇంచుమించు ఇరవై అయిదువందల మంది ఖైదీలుంటారు. ఇప్పుడు 1943 మే నెలలో నాలుగువేల అయిదు వందల మంది ఉన్నారు. ఇంకా ఎందుకు పెరగలేదో అదే ఆశ్చర్యం. బయట తిండి దొరక్కపోతే రోడ్డు ప్రక్కనో రేవు ప్రక్కనో చచ్చిపడి ఉంటారుకాని - మన దేశంలో జనం - జైల్లోపడే పనేమీ చెయ్యరు. ఒకసారి 'ఇంక్విలాబ్ జిందాబాద్' అని అరిస్తేచాలు - లేదా మిఠాయి

కొట్లో కాస్త తినుబండారమేదైనా కాజేస్తేచాలు- ఆరునెలలపాటు తినటానికి తిండి, తలదాచుకోవటానికి చోటు ఏర్పాటు జరిగిపోతుంది. అలాంటప్పుడు తిండిలేక చచ్చిపోవాల్సిన అవసరం ఏముంది? ... నాలుగువేల అయిదు వందలు ... ఏ బస్తీలో నయినా అయిదువేల మందికి వసతి ఉంటే అది మునిసిపాలిటీగా పరిగణింప బడుతుంది. జైలు కూడా ఒక చిన్న బస్తీ లాంటిదే. ఈ బస్తీకి 'లోహగరాద్' అని పేరు పెడితే బావుంటుంది. సరిగ్గా లెనిన్ గ్రాడ్‌లాగా ధ్వనిస్తుంది చెవులకు. ఇనుపరేకుల కంతల దగ్గిర చెవులు రిక్కించుకుని కూచున్నాను. మనిషి కంఠస్వరం యెంత మధురంగా ఉంటుంది. జైల్లో పాలిటిక్స్, జైలు బయటి పాలిటిక్స్ అన్నీ యిక్కడ కూచుంటే తెలిసిపోతూంటాయి- సూపరెంటెండెంట్‌తో జైలర్ బాబుకి పొత్తు కుదరటంలేదని, హెడ్ జమాదార్‌ని జైలర్ బాబు 'మీరు' అనేది 'నువ్వు' అనేది, జపాన్ వారి యుద్ధ నైపుణి సంగతి. జైల్లో ఖైదీల సంఖ్య పెరగటం మూలంగా ఎంత మంది ఖైదీలను విడుదల చెయ్యాల్సిందీ - (జైలు పరిభాషలో 'కట్' చెయ్యాల్సిందీ) బర్మా జైల్ స్టాఫ్ ఒక వర్గం ఏర్పడి బిహారీ జైలు పనివారి నందర్నీ త్రోసెయ్యాలని ప్రయత్నిస్తున్నారని-ఇలాంటి సంగతులన్నీ - ఇంకా యెన్నో చెవినిపడుతూంటాయ్. రాజకీయ ఖైదీల మీద - అప్పుడు లాఠీచార్జీ జరిగింతర్వాత ఆస్పత్రినుండి ఎన్నిసార్లు స్ట్రెచర్స్ వచ్చివెళ్ళిందీ - ఇక్కడ కూచునే లెక్కపెట్టటం జరిగింది. ధన్‌ధన్‌మని గొలుసులచప్పుడు వినిపిస్తే ఏ ఖైదీకి సంకెళ్ల శిక్షపడిందీ గ్రహించగలను. అతడు బహుశా ఏ జైలు అధికారి ఆజ్ఞనో నిర్లక్ష్యం చేసి ఉంటాడు.

ఏం దోమలు! ప్రొద్దు కూకితే తప్పించుకునే వీలుందా! ఆ రోజున సూపరెంటెండెంట్ వచ్చి, ఏమయినా కావాలా? అని అడిగాడు. అంటే ఏదయినా కావాలని అడిగితే వీలయితే ఇస్తానని. ఉరిశిక్ష పడిన ముద్దాయిని ఇలా అడుగుతారని, చాలామంది మంచి తిండికావాలని కోరుతారని చిన్నప్పట్నుంచీ వింటూవచ్చాను. క్రొత్త సూపరెంటెండెంట్ నేనిలాంటి కోరిక కోరుతానని ఆశించాడా ఏం? నాకు దోమతెర ఒకటి అడుగుదామని ప్రలోభన కలిగింది - ఈ కొద్ది రోజులూ హాయిగా నిద్రపోవచ్చు కదా అని. తీరా అడగమన్నప్పుడు అడగలేకపోయాను. ఆత్మగౌరవమేమిటో అడ్డొచ్చింది. "ధన్యవాదాలు! హాయిగానే ఉన్నాను నేను. ఏమీ అవసరంలేదు" అన్నాను. వార్డరు నాకు తర్వాత చెప్పాడు- ఒరిస్సాలోని ఏ సంస్థానానికో చెందిన ఇద్దరు 'స్వరాజ్య'బాబులను ఈ జైల్లోనే ఉరితీయటం జరిగింది. ఒకతను మీ- ఈ ఒకటోనంబర్ సెల్‌లో ఉండేవాడు. మరొక అతను రెండో నంబరు సెల్‌లో ఉండేవాడు. వారు దొరను ప్రాణాలు పోయేలా

కొట్టారుట- అయిదేళ్ళ కిందటి సంగతి. వారు ఉరితీయటానికి ముందురోజున వారు కావలసినన్ని కోడిగుడ్లు ఉడికించుకుని తిన్నారట! తర్వాత రాత్రంతా ఇంక్విలాబ్ జిందాబాద్ - మొదలైన ఏవో జయజయధ్వానాలు చేశారు. చివరిగడియవరకు జయ జయ ధ్వానాలు సాగుతూనే ఉన్నాయి. ఆ రాత్రి ఏ ఖైదీకి నిద్రపట్టనే లేదు. మీరు కూడా ఏది తినాలని ఉందో అదెందుకు అడగలేదు?

వార్డర్ చెప్పింది నమ్మతగింది కాదనుకోలేదు. కాని అతడి సలహాను పట్టించుకో లేదు. ఈ వార్డర్లు శిక్షణ లేనివాళ్లు. వీలు దొరికితే దొంగతనాలు చేస్తారు. ఖైదీల మీద అధికారం చలాయిస్తారు. దుర్బల మనస్కులైన ఖైదీల మీద అమానుషమైన అత్యాచారాలు కావిస్తారు. గంభీరంగా ఉండే ఖైదీలపట్ల గౌరవంగానే ప్రవర్తిస్తారు. వీరు సరళస్వభావులు. మాటల్లో మెలిక లెరగరు. మర్యాదతో సంబంధం పెట్టుకోరు. సూపరెంటెండెంట్ మొదలైన వారందరు మర్యాదల్ని పాటించే వారవటం వల్ల నా యెదుట-ఉరిని గురించిగాని, దానికి సంబంధించిన సంగతులు గాని ఎత్తనే ఎత్తరు. కాని వార్డర్లు ప్రతి ఒక్కరూ రెండు మూడు మాటలు మాట్లాడగానే ఉరి సంగతి తీసుకుస్తారు. మొదట్లో కొన్నాళ్లు ఆ మాటవినగానే గుండె గుబక్కుమనేది. నాలో నేనే పిరికివాణ్ణి అనుకునేవాణ్ణి. ఏదో పరధ్యానంలో పడిపోయేవాణ్ణి. ఉరితీసే దృశ్యాలన్నీ నాకళ్లముందు మెదిలేవి. బహుశా నా ఉరిశిక్ష రద్దు కావచ్చు- అని నామనస్సుని నేను ఊరడించుకోవలసివచ్చేది. కొద్దిరోజులయ్యేసరికి ఈ మాటలన్నీ అలవాటైపోయాయి. ఇహ ఇప్పుడవేమి మనస్సుకి బాధ కలిగించటం లేదు. సెల్‌కి సరిగ్గా పడమటివైపున ఉరితీసే మంచె. వార్డర్లు వచ్చి - ఇవాళ ఉరికంబానికి నల్లరంగు వేశారు. ఉరిత్రాటికి సరీగ్గా నా బరువంత బరువుగల ఇసుకబస్తా కట్టి త్రాడు గట్టిగా ఉన్నదీ లేనిదీ పరీక్ష చేశారని - ఇంకా ఇలాంటి సంగతులెన్నో చెప్పారు.

నా మనస్తత్వం విచిత్రం, నల్లరంగుని వినగానే బ్లాక్ జపానా? తాడా అని ఆలోచన వచ్చింది. తాడా? ఏంతాడు? సాగనారదా? అని వార్డర్లనడిగాను. నా మనస్తత్వాన్ని నాకే వెక్కిరించుకోబుద్ధేసింది. ఇప్పుడుకూడా అది దేనితో తయారైనత్రాడో తెలుసుకోవటమే నాకు చాలా ముఖ్యం! మొదట్నుంచీ నామనస్సు విలక్షణతను నే గమనించాను. అవసరమైన విషయాల మీదకంటె, అనవసరమైనవాటి మీదనే నాకెక్కువ ఆసక్తి. పరీక్షలకు ముందు అందరూ ప్రశ్నల్ని తయారు చేసుకుంటున్నారు. నాకవి తయారుగా లేకపోయినా వాటికి సంబంధించిన ఏ చిన్న విషయం మీదనే నా శ్రద్ధ అంతా. జామిట్రీలో ముఖ్యమైన థియోరం (Theorem) మీదకంటె అనవసరమైన

ఎక్స్ట్రామీదనే నాకు లేనిపోని శ్రద్ధ. ఫుట్‌నోట్స్ పీఠిక మొదలైనవన్నీ పరీక్ష ముందురోజు కూడా చూశాను. సంవత్సరం మొదలైన దగ్గర్నుంచీ-ముఖ్యమైనవన్నీ తర్వాత చదువుకో వచ్చు. ఇప్పుడు చిన్నచిన్నవన్నీ చదువుదామనిపించేది. చివరికి ముఖ్యమైనవన్నీ చదవనేలేదు.

కాశీ విద్యాపీఠంలో చదువుకుంటున్న రోజుల్లో నాటి ఒకరాత్రి సంగతి గుర్తొస్తోంది. నేను శకిలదేవ్ రాత్రంతా మేల్కొని చదువుకుంటున్నాము. ఒక చిటికె నస్యం పీల్చి, అర్ధరాత్రివేళ అతడు 'ఆజ్' సంపాదకీయం నాకు చదివి వినిపిస్తున్నాడు. కాశీ విద్యాపీఠంలో చదువుకుంటున్నప్పుడు పోలీసులు అనుమానపడి రాజకీయ హత్యారోపణతో నన్ను అరెస్టు చేశారు. అప్పుడు ఉరిసంగతి దానంతటదే తలపుకొచ్చేది. తర్వాత పోలీసులు ఆధారాలు దొరక్కపోటంతో వదిలేశారు. నిజంగా నాకా హత్యతో సంబంధంలేదు. కాని ఉరిపడుతుందన్న భయం విపరీతంగా ఉండేది. ఇప్పుడు నిజంగానే ఉరిశిక్ష జారీ అవటంతో భయం తగ్గింది. దూరంనుంచే భయమెక్కువ. జైలుకి వెళ్లనివారు జైలు కెళ్ళటమెంతో కష్టమని భయపడతారు. కాని జైలుకి కనుక వస్తే ఆ భయం పటాపంచలవుతుంది.

ఉఫ్! దోమలు కుట్టటం నిజంగా మాచెడ్డ బాధగా ఉంది. ఎందుకనో తెలియదు. మా గాంధీ ఆశ్రమంలో దోమల రొద యింతకంటె ఎక్కువ, అవి ఆకారంలో కూడా పెద్దవే, కానీ కుడితే నొప్పితక్కువ అనిపిస్తుంది. నీలూ కనుక ఉంటే నన్ను యెగతాళిచేస్తూ "ఇవి ఆశ్రమంలో దోమలు కదా అహింసా పద్ధతిని నెత్తురు తాగటం నేర్చుకున్నాయి" అనేవాడు. అమ్మ నవ్వు ఆపుకుని విసుగుముఖంలోకి తెచ్చుకుని "మంచిపని అయిందిలే ఇహ వెళ్లండి మీరు" అంటుంది. అమ్మ ముఖం ఇప్పుడెలా ఉందో నాకు స్పష్టంగా కన్పిస్తోంది. కళ్ళక్రింద రెండు ముడతలు ఏర్పడ్డాయి. అమ్మమనస్సు యెప్పుడూ యేదో భయభయంగా ఉన్నట్లు కన్పిస్తోంది. నీలూ నాన్నని ఎత్తిపొడుపు మాటేదో అని ఉంటాడు. ఏమన్నప్పటికీ ఆ మాట నాన్న చెవిని పడనీకుండా ప్రయత్నించటమూ కన్పిస్తోంది. నీలూ మొదట్నుంచీ మొహంమీద మాట అనేసేరకం. దాని మూలంగా యెన్నోసార్లు చిక్కుల్లో పడ్డాడు. కాని యెదుటివారు తనమాటకేమైనా అనుకుంటారేమో, తాను చేసిన దానికేమైనా బాధపడతారేమో అనేది ఎప్పుడూ లెక్కచేయడు. సూక్ష్మవిషయాలెప్పుడూ అతని మనస్సుని కదిలించవు. అతనిది సహజంగా స్థూలదృష్టి. కలం, కుంచె అతనికి పనికిరావు. అతనికి కాయకష్టం సంగతి, సుత్తి కొడవలి, గడ్డపారల సంగతే తెలుసు. అతని చేతిలో పరశురాముడి గొడ్డలిలాగా మంచి పదునుగల ఉక్కుకత్తే ఉంది.

నిర్దాక్షిణ్యుడు, కర్తవ్యనిష్ఠకలవాడు. నీలూ ఒకసారి తనకి కవిత్వం నచ్చదని చెప్పాడు. అతడికి బాగా నచ్చే కవిత్వం రాస్తానన్నాను నేను. ధనికులు శ్రామికుల తగాదాకు సంబంధించిన గేయంవ్రాసి యిచ్చాను. నీలూకి బాగా నచ్చింది. ఆ కవిత ఒక్క పంక్తి కూడా జ్ఞాపకం లేదు. నీలూ దానిని ఫ్రేమ్‌కట్టించి ఆశ్రమంలో అమ్మగదిలో వ్రేలాడ కట్టాడు.

అమ్మ వసారాలో కూర్చుని ఉందనిపిస్తోంది. తలపంకిస్తూ నీలూకేసి చూసి, తాలువులకు నాలికతాటించి 'చ్' అని ధ్వని చేసింది. "స్వభావం చచ్చినా మారదు" అన్న గీతిక అందుకుంది. నీలూ నావైపు "సోదరా ఈసారి" అన్న భావంతో కళ్ళతో సైగచేశాడు. ఇద్దరం సరీగ్గా అమ్మ సంస్కృత శ్లోకం చదువుతుందనుకున్నాం- "అంగార శతధౌతేన మలినశ్చనముంచతే" అని చదివింది. మేమిద్దరం నవ్వాం. అమ్మ సరిగ్గా 'మలినశ్చ' అనే అన్నది. కాని మా నవ్వు విని తప్పు చదివాననుకుంది. "వెధవది ఏం జ్ఞాపకముంటుంది" అన్నది. "అలాంటప్పుడు చదవాల్సిన అవసరమేముంది?" అన్నాడు నీలూ. అమ్మ మాట్లాడే వాటిల్లో ఇలాంటి తప్పులన్నీ మాకు కంఠస్థమే. నీలూ ఎత్తిచూపించాడు. లేకపోతే బహుశా నాకాధ్యాసే ఉండేదికాదు. "దయాదాక్షిణాత్యాలు" అన్నది అమ్మ. "దయాదాక్షిణ్యాలు" అనమని నేనొక రోజున అమ్మతో చెప్పనుకూడా చెప్పాను. మాటల ధోరణిలో అమ్మకు జ్ఞాపకముండకపోవటం గమనించాను. మళ్ళీ చెపితే తెల్లబోతుందేమోనని నేను తప్పు ఎత్తి చూపించను. కానీ నీలూ ఇది సరిగ్గా అర్థం చేసుకోడు. ఎదుటివారిలో ఉండే దౌర్బల్యం, ప్రవర్తనలో యెత్తిపాడుపులో ఉండే పరిమాణం సులభంగా అతనికంట పడతాయి. కాని తన మాటవల్ల ఎదుటివారి మనస్సుకెలాంటి దెబ్బ తగులుతుందో అటువైపు ఆలోచించి చూడనే చూడడు. మేం మొదట్నించీ నాన్న దగ్గిర కొంచెం దూరదూరంగానే ఉంటూ ఉంటాం. సాధారణంగా అవసరమైన దానికి మించి ఒక మాటకూడా మాట్లాడం. అంచేత నాన్న - ఆశ్రమంలో తక్కిన వారందరి భోజనాలయాక నేను నీలూ అమ్మతో కలసి భోజనానికి కూర్చుంటాం. కాసిని పాలు లేకపోతే అమ్మకి భోజనం చేసినట్లుండదు. అమ్మ ఆశించే సుఖం ఇదొక్కటే అనిపిస్తుంది. ఆశ్రమంలో చాలామంది ఉంటూంటారు. అదికాక వేళకానివేళలో క్రొత్త అతిథులు వస్తూండటం రోజూ మామూలే. అంచేత పాలు ఎప్పుడూ తరిగిపోతూంటాయి. కాసిని పాలుంటే అమ్మ నీలూకి నాకూ యిస్తూంటుంది. నేను నాకిచ్చిన పాలలో కాసిని తీసి మరో పాత్రలో పోసి ఉంచేవాణ్ణి. నీలూ ఇలాంటప్పుడు "పాలు లేకపోతే అమ్మకి భోజనమే అవదు" అని కచ్చితంగా అనేస్తూంటాడు. అదేంపెద్ద మాటేమీకాదు.

కాని తనలో దాగి ఉన్న దౌర్బల్యమేదో పట్టుబడిపోయినట్లు - అమ్మముఖం కొంచెం వెలవెలపోయింది. నీలూ కెన్నోసంగతులు కంటపడతాయి. ఇది మాత్రం పడదు.

అమ్మకి సుస్తీ చేస్తే దాన్ని కాస్త ఎక్కువ చేసి చెపితే ఆమె కదో తృప్తి. అందుకని తెలిసి కూడా - ఆమె నుదిటి మీద చెయ్యిపెట్టి "కాలిపోతోంది. జ్వరం బాగా ఉంది" అన్నాను. నీలూ అక్కడుంటే హ్హహ్హహ్హ అని ఇల్లెగిరిపోయేటట్లు నవ్వేవాడు.

సూపరింటెండెంట్‌తో నాకేమీ అవసరంలేదు అని చెప్పినతర్వాత ఆ రోజున నా మనస్సుకి చాలా సంతృప్తి కలిగింది. ఒట్టి సంతృప్తేకాదు, గర్వం కూడా కలిగింది. దొర ఒక్కడూ రాలేదు అతని వెంట జెయిలర్, డాక్టర్, అసిస్టెంట్ జెయిలర్, జమాదార్, కొంతమంది అంగరక్షకులు, వార్డర్, మేట్ అందరూ ఉన్నారు. అ(... ఆ సిక్కుఖైదీ దొరకి పెద్ద కాకీరంగు రాజఛత్రం పట్టుకుని, అతనివెంట పరుగులు పెట్టిన అతని సంగతి వ్రాయటమే మరచిపోయాను. నిజంగానే దోర్దండ ప్రతాపుడయి సూపరింటెం డెంట్ జైలు సామ్రాజ్యానికి ఏకఛత్రాధిపతి... అనాడతని ప్రశ్నకు సమాధానమిచ్చాక ఎవరి ముఖంకేసి చూడలేకపోయాను. ఏమిటో అంతా గజిబిజి అయిపోయింది. కాని నా మాట ఫలితం వారిమీద ఎలాంటి ప్రభావాన్ని కలిగించిందీ తెలుసుకోవాలనిపించింది. నాలో నాకు నాటకంలో నాయకుణ్ణనే భావన కలిగింది. చిన్నప్పుడు సంతోషదా నోటి మీదుగా స్వదేశీ యుగపు కథలు విన్నప్పుడు ఎన్నిసార్లు కళ్ళవెంబడి నీళ్ళొచ్చాయో! అమర్ మృత్యువు స్మృతి నాకళ్ళముందు మెదిలింది. "ఇప్పుడింక విసిగించకు, ప్రశాంతంగా చచ్చిపోనియ్. తుపాకీ గుండు దెబ్బతిని మృత్యుముఖంలో ఉన్న త్యాగవీరుని ఆ మాటలతో నా మాటల్ని పోల్చిచూసుకున్నాను. ఆ మాటవింటే నా కళ్ళలో నీళ్ళు తిరిగేవి! మరి నా మాటలు శ్రోతల మనస్సుల్నేమీ చలింపచెయ్యలేదా! బహుశా చేసి ఉండదు. వీరు నిత్యమూ ఇలాంటివి చూస్తున్నారు. వీరందరూ వయసు, అనుభవం గడించినవారు. ఎంతో ప్రపంచాన్ని చూసిన కుర్రవాళ్ళలాగా ఉద్రేకవంతులు కారు. ప్రజలు మెచ్చుకోవాలి. నన్నుగురించి చెప్పుకోవాలి. అదే నాకు కావలసిందను కుంటాను. ఇది నాలోని దౌర్బల్యం. ఒక్కొక్కప్పుడు దేశ భవిష్యత్తుని గురించి కంటే నా పేరు భవిష్యత్తుని గురించే జాగరూకుణ్ణయి ఉంటున్నానా అని నాలో నాకే సందేహం కలుగుతూంటుంది. నిజంగా అంతేనా? నే నొక్కరోజుకూడా ఎప్పుడూ జీవితపు సుఖాల్లో మునిగిపోలేదు. దేశానికేది మేలనుకున్నానో దాన్ని చెయ్యటంలో కొంచెంకూడా తటపటాయించలేదు. నా వ్యక్తిగత సుఖాన్ని గురించి కాని, నా భవిష్యత్తుని గురించి కాని నేను ఎన్నడూ ఆలోచించలేదు. దానికి బదులుగా ఒకవేళ ఈ దేశ ప్రజలు

నన్నుగురించి ఒకటి రెండు ప్రశంసావాక్యాలు చెప్పుకోవాలి అని కోరుకుంటే నా ఆకాంక్ష అన్యాయమవుతుందా? జైలు డాక్టరు తన యింట్లో నాసంగతి కచ్చితంగా చెప్పి ఉంటాడు. అసిస్టెంట్ జైలరు బహుశా అప్పుడే అప్పర్ డివిజన్ రాజకీయ ఖైదీల వార్డులో కెళ్ళి ఈ సంగతి కథగా చెప్పి ఉండవచ్చు. నాన్న కూడా ఆ వార్డులోనే ఉండేది. ఆయన చెవిని కూడా పడుతుంది. కచ్చితంగా నాన్న నిర్లిప్తుడు. పైనుంచి చూసి ఆయన మనస్సులోని అభిప్రాయాన్ని తెలుసుకునే వీలులేదు. ఏకాంతంగా చర్ఖావడుకుతూ కూచుని ఉన్నాడు. కనుకొలకుల్లో రెండు కన్నీటి బిందువులు రావటంతో దారం సరీగ్గా కనపడటంలేదు. ఉహూఁ... నాన్న ఇంత వ్యాకులపడతారని అనుకోలేదు. బహుశా కొంచెం ఉద్వేగపడవచ్చు. చర్ఖామీద తన్మయత్వం కాసేపు తగ్గవచ్చు. దారం ఒకటి రెండుసార్లు తెగిపోవచ్చు అని మాత్రమే అనుకున్నాను. నాలో నాకే సందేహం కలిగింది. నేనేవిధంగా ఆశించానో - జైల్ స్టాఫ్ వారి మనస్సుల్లో సరీగ్గా అలాంటి భావోద్రేకాన్ని కలిగించలేకపోయానన్న అనుమానం కలిగింది. ఆ మాటల్ని దృఢకంఠంతో చెప్పలేదు. కళ్ళు దించుకున్నాను. బహుశా వారు నా మనస్సు సరళమైనదికాదని భావించి ఉండవచ్చు. నా ధోరణి సర్కారువారికి విరుద్ధంగా - నా మనస్సులోని విద్వేషాన్ని వ్యక్తం చేస్తున్నట్లుందనిపించింది. వారు రాత్రింబగళ్ళు దొంగలతో, హంతకులతో మెలగుతూంటారు.అందుకని వారి మనస్సుల్లోని ఉద్వేగం, కోమల స్వభావం సమసిపోయుంటాయి. వారు రాజకీయ ఖైదీలను తక్కిన దొంగలు, బందిపోట్లకంటె విభిన్నమైనవారినిగా భావించారు. అయితే ఏం అలజడి తెచ్చిపెడతారో అన్న భయం మూలంగా కాని, స్వార్థం మూలంగా కాని వారిపట్ల వ్యవహరించటంలో కొంచెం వ్యత్యాసం కనపరుస్తారు. డివిజన్ త్రీలో - రాజకీయ ఖైదీలకు జబ్బుచేస్తే - డాక్టర్ తిట్టి, 'విరేచనాలవుతున్నాయి, మందుయివ్వ'మంటే - But don't expect dahi (curd) అనేవాడు. అంటే పెరుగు తినవచ్చు అన్న ఆశతో - కావాలని జబ్బుతెచ్చుకున్నారంటే - ఆశాభంగం పొందుతారని అర్థం. మళ్ళీ ఆ డాక్టరే పైతరగతి రాజకీయ ఖైదీల దగ్గిర ఎంత శాంతమూర్తి అవుతాడు! రెండేళ్ళ క్రిందట వ్యక్తి సత్యాగ్రహసమయంలో ఈ జైలు స్టాఫ్ - కాంగ్రెసు నాయకులు చుట్టూ తిరుగుతూ అయినదానికీ కానిదానికీ వారిని ఊరికే పొగుడుతూండటం చూశాను. అప్పట్లో వారు మళ్ళీ బీహారులో కాంగ్రెస్ మంత్రివర్గాన్ని చేపడుతుందని అనుకునేవారు. కాని ఈనాడు...

ఈ జైలు ఉద్యోగుల్ని ఆనాడు నా మాటలతో, ప్రవర్తనతో ఏం ప్రభావితుల్ని చేయగలను? ఇంతకంటే నాటకపక్కీలో బిగ్గరగా- "చెప్పుతో కొట్టి గోదానమా! నాకు

మీదయ యేమక్కర్లేదు" అనవలసింది. లేదా ఇలాంటిదింకా ఏదయినా చేసి ఉంటే అప్పుడు వీరు బాగా ప్రభావితులయేవారు. కొంచెం నాటకధోరణి చూపిస్తే ఏంకావాలో అది అయేది. నాకొక సంఘటన గుర్తొస్తోంది. రెండో నంబరు వార్డులో అక్టోబరునెలలో లాటీచార్జీ జరిగాక, తలపగిలిన స్థితిలో శుకదేవ్ పడుకునే ఉండి నాటకంలో చావుసీనులో డైలాగ్‌లాగ మాటసాగదీస్తూ - 'మీకు సిగ్గులేదు' అంటూ లెక్చరు ప్రారంభించాడు. అదిప్పటికీ చెవులకు స్పష్టంగా వినిపిస్తోంది. నేను ఒకసారి స్కూల్లో ప్రైజ్ డిస్ట్రిబ్యూషన్ సమయంలో మేఘనాధవధ ఆవృత్తిచేశా. అసిస్టెంట్ హెడ్మాస్టరు కాళీబాబు, "ఇంతవరకు మోచేతిమీద భారం మోపుతూ పడుకుని, చెప్ప తర్వాత ఇంక పూర్తిగా వెల్లకిలగా పడుకుని, సాగదీస్తూ కళ్ళు మెల్లిగా మూసుకుంటూ 'నీ యీ కళంకాన్ని ఎవరు ఆమోదిస్తారు కళంకినీ!' అని చెప్ప"మని నేర్పించారు. శుకదేవ్ ఉపన్యాసం అక్కడ చుట్టూ ఉన్న పరిస్థితికి అతికినట్లు సరిపోలేదు. కాని అది కొద్దిమంది దృష్టికే పట్టుపడటం గమనించాను.

"బాబూ! భోజనమయిందా?"

ఆలోచన తెగిపోయింది. వార్డరు దొర ఎదురుగా ఉండటం చూశాను. ఆ కంఠస్వరంలో ఏదో సానుభూతి ఆభాసగా వ్యక్తమయింది. బయట, దీపంపెట్టి వెళ్ళి చాలాసేపయింది. ఇంతవరకు నేను గమనించనేలేదు. దీపం లోపలపెట్టి వెడితే వారికేం నష్టం చుట్టుకుంటుందో తెలియదు. కిరసనాయిల్ పోసుకుని ఆత్మహత్య చేసుకోవటం అంత సుఖకరమేమీకాదు. అయినా వీరు సాహసించరు. అది కలగదుకూడా. వారి నిబంధనలన్నీ అనుభవంవల్ల ఏర్పడినట్టివి. ఇలాంటి అల్పాతి అల్పమయిన నిబంధన మూలంగా నిరుడు జరిగిన జైలు మ్యూటినీ సఫలం కాలేకపోయింది. ఖైదీలు గుంపుగా వచ్చి గేట్‌వాచర్‌ని కొట్టి తాళాలగుత్తి లాక్కున్నారు. కాని పెద్ద తాళాలు రింగ్‌లో ఇంచుమించు రెండు వందలకు పైగా తాళంచెవులున్నాయి. వాటిలో చాలావరకు పనికిమాలినవే. ఇలా పనికిరాని తాళాలు చాలా రింగ్‌లో పెట్టి ఉంచాలని జైలు నిబంధన. జైలు విద్రోహులు తాళాల గుత్తి ఇలా చేజిక్కించుకున్నా ఏ తాళంచెవి ఏ తాళానికి సరిపోతుందో కనిపెట్టలేరు. ప్రయత్నం చేస్తూ చేస్తూండగానే అయిదు నిమిషాలు గడిచిపోయాయి. ఈలోపుగా అలారం మోగింది. రక్షకభటులు, సిపాయిలు వచ్చిపడ్డారు. తర్వాత...

సిపాయిజీ ప్రశ్నకు సమాధానం చెప్పకుండా "ఇప్పుడు టైమెంతయింది?" అని అడిగాను. సిపాయ్‌జీ -"వంతు మార్పు టైమయింది" అన్నాడు. అంటే వీరి స్థానంలో

రాత్రి డ్యూటీ చెయ్యటానికి వార్డర్ల జట్టు వచ్చింది. సెంట్రల్ టవర్‌లో - ప్రస్తుతం ఏ వార్డులో ఎంతమంది ఖైదీలు నిర్బంధించబడి ఉన్నదీ, ఇవాళ క్రొత్త ఖైదీల 'జమ' యెంత, 'ఖర్చు' ఎంత అంటే విడుదల అయింది యెంతమంది? తర్వాత మొత్తం సరిపోయిందీ లేనిదీ లెఖ్ఖలు తయారవుతున్నాయి. సిపాయ్‌జీ అప్పటికీ తన ప్రశ్న మరచిపోలేదల్లే ఉంది. "భోజనం చెయ్యలేదా?" అని అడిగాడు మళ్ళీ.

నేను భోజనం చెయ్యలేదని అతను గమనించటం గ్రహించాను. 'లేదు, ఆకలి కాలేదు" అన్నాను.

"పెరుగుంది, కాస్త భోంచేస్తే పోతుంది" అన్నాడు. వారానికోరోజు వంతున క్రింది తరగతి రాజకీయఖైదీలకు పెరుగువస్తుంది. ఇత్తడి ప్లేట్‌లో పల్చటి పెరుగు. అది పైగా కాటువాసనేస్తూంటుంది. కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పరిచిన నిబంధన-మూడో తరగతి రాజకీయఖైదీలకు నిత్యమూ అపహాస్యం చేసుకునే వస్తువు. కాంగ్రెసు నాయకులు వారి లక్ష్యం - వారు రాజకీయ ఖైదీలనందర్నీ ఒకే తరగతిగా ఎందుకు చెయ్యలేదు? పై తరగతి- క్రిందితరగతిగా రాజకీయ ఖైదీలను విభజించటంలో అర్థమేమిటి? పై తరగతి వారికి పదణాలు, క్రింది తరగతి వారికి మూడణాలన్నర తిండి ఖర్చుకి మధ్యస్థంగా రాజకీయ ఖైదీలను ఒక తరగతి చేస్తే ఏమవుతుంది? క్రింది తరగతి రాజకీయ ఖైదీలకు స్వంతడబ్బు ఖర్చు పెట్టుకునే అధికారం యిస్తే ఏం పోతుంది? బయటి నుంచి వారికి తిండి కాని ఇంకేమైనా కాని వస్తే వాటిని తీసుకోనిస్తే - నాయకుల పంట ధాన్యం ఏం కొల్లబోతుందా? స్వంత డబ్బుతో బీడీలు, సిగరెట్లు త్రాగేందుకనుమతిస్తే వారికేమిటి నష్టం? నెలకు రెండు ఉత్తరాలు వ్రాసుకోనిస్తే కొంపలు మునిగిపోతాయా? ఇంకా ఎన్నో ఆరోపణలు!

ఎత్తయిన సెంట్రల్ టవర్‌పై నుంచి మేఘ గంభీరస్వరంతో రాగవరుసన - బోలోరే ఏక్ నంబర్! బోలోరే దో నంబర్! బోలోరే తీన్ నంబర్! బోలోరే చా-ఆ-ర్ నంబర్, బోలోరే ఏ-ఏ-ఏ- పాంచ్ నంబర్! బోలోరే ఏ ఛే ఏనచ్చూ ఆర్ బోలోరే ఔరత్ కిదా (Women's ward) అరుపులు మొదలయినాయి.

అన్ని వార్డుల నుంచీ జవాబురాలేదు. ఆ కేక మా సెల్ వరకు వచ్చినట్లు లేదు. సెంట్రల్ టవర్ మీది సిపాయికూడా అన్నివార్డుల నుంచీ సమాధానాన్ని ఆశించడేమో! అతని పనంతా యాంత్రికం లాంటిది. ప్రతి వార్డులో ఎంతెంతమంది ఖైదీలు నిర్బంధించబడ్డారో - ప్రతి ఒకవార్డు నుంచీ సమాధానం రావాలి. వీరి మొత్తం ముందే సెంట్రల్ టవర్ క్రింది అంతస్తులో జైలు ఉద్యోగులు లెక్కచేసి ఉంచారు. ఈ కేక

వెయ్యటం కేవలం నియమాన్ని పాటించటమే. అన్ని వార్డులలోని 'మేట్స్' 'పహరా' వాళ్ళకి ఈ సంగతి తెలుసు. అంచేత దీనికి సమాధానం చెప్పే వృథాప్రయాసకిష్టపడరు. ఢంగ్ ఢంగ్ మని గంటమ్రోగింది. లెక్కసరిపోయింది. తొమ్మిది కొట్టింది. నిన్నటి మొత్తం లెక్క యింక చెప్పక్కర్లేదు. సెంట్రల్ టవర్ మీది లైట్ అయిదు వందల కాండిల్ పవర్‌ది. బ్లాక్ ఔట్ మూలంగా దాన్ని నల్లటి కవర్‌తో కప్పారు. కాని సరీగ్గా దాని క్రింద వెదురు ఆకులతో అల్లిన పెద్దగొడుగు - వార్డర్‌ని ఎండ, వాన నుంచి కాపాడటానికి. బ్లాక్ ఔట్ కోసం సెంట్రల్ టవర్‌కి నల్లరంగువేశారు. కాని ఈ గొడుగుమీద లైట్‌పడి, నాలుగు వైపులా ప్రతిఫలిస్తోంది. ఆ లైట్‌కేసి ఏకబిగిని ఎక్కువసేపు చూడటానికి వీలుండదు. గొడుగు బ్లాక్ ఔట్ ప్రయత్నాలనన్నిటినీ విఫలం చేస్తోంది. సెంట్రల్ టవర్‌ని దానిపైన గొడుగుని చూస్తే - కాశీలోని అహల్యాబాయ్ ఘాట్ సంగతి గుర్తొస్తుంది. ఘాట్‌లోని ఆ టవర్ మీద రోజూ మా సాయంకాలపు గోష్ఠి జరిగేది. సింహేశ్వర నుకుల్ ఒక రోజున దానిపై నుంచి తాంబూలపు ఉమ్మివేశాడు. దాని మూలంగా ఎంత పెద్దగొడవయింది. సింహేశ్వర్‌ది అద్భుతమైన సాహసం. అతను చావటానిక్కూడా భయపడక పోవటం చూశాను. అతను ఉరిపడటం సంగతి తేలిగ్గా చెప్పటం చూస్తూంటే- నాకు ఈర్ష్య కలిగేది. అతను నన్ను తన జట్టులో సభ్యునిగా చేసుకోవాలనుకుంటున్నాడని తెలిసింది. కాని అతని కోరికను నెరవేర్చలేకపోయాను. అంతర్యాన్ని తరచి చూసుకుంటే - ఒక్కొక్కప్పుడు నాలో సాహసమనేది లేకపోవటం వల్లనే అతని కోరికను నెరవేర్చలేక పోయా ననిపిస్తుంది. అతని కార్యక్రమం నచ్చకపోవటంవల్ల కాదుకానీ ఇప్పుడా భయం ఎక్కడికి పోయింది? వయస్సు పెరుగుతున్న కొద్దీ మనిషికి మృత్యుభయం ఎక్కువవుతూంటుందని విన్నాను. నా విషయంలో ఈ నియమం వ్యతిరేకమయిందా? సింహేశ్వర్ ఇప్పుడు కనిపిస్తే ఎన్ని సంగతులు మాట్లాడవచ్చు. చాలా రోజుల తర్వాత రామగఢ్ కాంగ్రెస్ సమయంలో హఠాత్తుగా చూడటం! అతను కాంగ్రెస్ మినిస్ట్రీ సమయంలో బెరిల్లీ జెయిల్ నుంచి విడుదలయ్యాడు. మెయిల్ దోపిడీలో అతడికి శిక్షపడింది. లక్నో దగ్గరలో ఆ ప్రదేశం పేరు జ్ఞాపకం రావటంలేదు. పిప్‌రాహో ఏదో ఉంది పేరు...

క్రొత్త సిపాయ్ ఎప్పుడొచ్చాడో గమనించలేదు. "బాబూ! ఒక బీడీ కాలుస్తారా?" అని అతనడిగినప్పుడు గతుక్కుమన్నాను.

వార్డర్లు కూడా ఆత్మీయులు కావాలని కాంక్షిస్తున్నారు. నాకేదైనా ఉపకారం చేయగలిగితే - నన్ను కాస్త సంతోషపెట్టగలిగితే చాలునని కోరుకుంటున్నారు.

సానుభూతి స్వతహాగా ఏర్పడినట్టిది. ఇందులో కృత్రిమత్వంలేదు. అతను సానుభూతితో ఇస్తానన్న దానిని తిరస్కరించటంతో అతని మనస్సు కొంచెం చివుక్కుమన్నట్లుంది. కొంచెం సంకోచం... సంకోచంతో తన డ్యూటీ నిర్వర్తించుకున్నాడు. ఒకసారి తాళాన్ని టక్‌మని కదిలించి చప్పుడు చేశాడు. తర్వాత దబదబా కటకటాల దర్వాజాని ఊగించాడు. ఈ పని అతనికి ముందే చెయ్యవలసింది. ముందు పహరా అతను ఉండగానే. దాని ఉద్దేశం ఈ తలుపులు సరిగ్గా వేశారాలేదా? గడియ సరిగ్గా పడిందా లేదా అని చూడటం. ముందున్న వార్డర్‌తో కలిసి ఖైదు బందోబస్తుగా మూసి తాళం తగిలించేస్తే - ఒకవేళ ఖైదీ పారిపోయినా ముందు వార్డర్ బాధ్యతేమీ ఉండదు. ఎందుకనంటే అతను తన తర్వాత వార్డర్‌కి చార్జీ ఒప్పగించాడు కనుక. అందుకే అంత జాగ్రత్త. ఇంత బందోబస్తు. కాని ముందు వార్డరు వెళ్ళిపోయాడు. ఇంటిముఖంపట్టిన గొడ్డులాగా.... ఈ సమయంలో అలస్యాన్ని సహించరు. ఏకబిగిన ఎనిమిది గంటలు డ్యూటీచేశాడు. తప్పు మాత్రం ఏముంది.

సిపాయ్‌జీ కొంచెం మెచ్చుకున్నాడని పలకరించాను. అటువైపు సెల్స్‌లో పనిపూర్తి చేసుకుని వస్తున్నావా? అని అడిగాను.

"ఆఁ పదోనంబరు, తొమ్మిదో నంబరు, ఏడో నంబరు, మూడో నంబరు, ఒకటో నంబరు- ఈ అయిదు సెల్స్‌లోనూ నేరస్థులున్నారు. ఇవాళ పదో నంబరునుంచే మొదలెట్టాను. వార్డు సిపాయిలు బయటెక్కడో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. నామీద మూడో నంబరు సెల్ సిపాయి మీద లెక్కబాధ్యత అప్పగించారు" అన్నాడు. కన్‌డెమ్డ్ సెల్స్‌లో అయిదుగురు ఖైదీలున్నారు. జైలుపరిభాషలో ఈ వార్డ్ పేరు ఉరిశిక్ష ఖైదీల సెల్ (Condemned Cell) అని వినగానే - ఈ సెల్స్ ఇంజనీరింగ్ శాఖ వారిచే Condemned చేయబడ్డాయి కాబోలు అనిపించింది నాకు. ఇవి Condemned Prisoners కోసం. అందువల్లనే ఈ వార్డ్‌కీ పేరు. ఈ సంగతి మొదట్లో గుర్తురాలేదు. తొమ్మిది, పది నెంబరుసెల్స్‌లో ఇద్దరు బాంబు కేసులో ముద్దాయిలు. అండర్ ట్రయిల్ వారున్నారు. వారిని ఈ సెల్స్‌లో ఎందుకుంచారో తెలియదు. ఉరి ఖైదీల సెల్స్ ఇరవైకాక, ఈ జైల్లో ఇంకా నలభై యాభై సెల్స్ వున్నాయి. అయినా వీరినిక్కడెందుకుంచారో చెప్పటం కష్టం. బహుశా పోలీసులు అలా ఆదేశించారేమో? పోలీసులు వీరిని నేరాన్ని ఒప్పుకునేట్లు చేయాలని ఆశించి ఉండొచ్చు. అందుకనే తక్కిన రాజకీయ ఖైదీలతో కలుసుకోనివ్వరు. ఏడో నంబరులో ఒక పిచ్చివాడున్నాడు. అతను ఊరికే తనలో తాను వాగుకుంటూంటాడు. వార్డర్ కన్పించగానే బూతులు తిట్టటం మొదలెడతాడు. తొమ్మిది,

పది నంబరు సెల్స్‌ల తలుపు పగలల్లా తెరిచే వుంటుంది. ఒక్కొక్క రోజున మధ్యాహ్నమప్పుడు వారు మాసెల్ స్పెషల్ వార్డర్‌కి బీడీలు, పంచదార బిళ్ళలు మొదలైనవి యిచ్చి, దానికి బదులు నాతో రెండు మూడు మాటలు మాట్లాడుతూంటారు. సాయంత్రం వారి సెల్స్ తలుపులు మూశాక, వారు తమ సెల్స్‌లో ఉండే ఆ పిచ్చివాణ్ణి రెచ్చగొడుతూంటారు. అతణ్ణి పేరుపెట్టి పిలిస్తే చాలు తిట్టటం మొదలెడతాడు. అతను ఊరికే పిచ్చివాడుగా నటిస్తున్నాడు. తామిలాంటి వాళ్ళనెంతో మందిని చూశామని "సర్కారువారంత వెర్రివారు కాదు. విడుదల పొందటం తేలికేం కాదు" అనేవాళ్ళు వార్డర్లు. మూడో నంబరులో హత్యానేరం చేసిన ఒక ముద్దాయి ఉన్నాడు. అతను తమ్ముణ్ణి హత్యచేశాడు. అది ఒక అశ్లీలగాథ. అతని సంసార జీవితానికి సంబంధించిన పంకిలపు వివరణ. అతని భార్య జడ్జి కోర్టులో అందరి యెదుటా చెప్పింది. హైకోర్టుకి అప్పీలు జరిగింది. అదికూడా త్రోసివేయబడింది. అతను రాత్రింబవళ్ళు 'సీతారామ్, సీతారామ్' అని భజన చేస్తూంటాడు.

నన్ను వార్డర్ నేరస్థుడనటం - అమాట నాకు నచ్చలేదు. అతనింతకంటే మర్యాదయిన భాష వ్యవహరించటం బావుంటుందనిపించింది నాకు. చిన్నప్పుడు దీక్ష, శిక్షణ నా మనస్సులో వేసిన ముద్రని ఒక్కసారి తుడిచిపారెయ్యటం కష్టం. నిజమేగా! వార్డర్ సరిగ్గానే అన్నాడు. నన్ను నేరస్థుడనక ఇంకేమంటాడు? ఈనాడు నేనే జైల్లో ఉన్న వారందరికంటే పెద్ద నేరస్థుణ్ణి. త్వరలో ఉరితీయబడే వాడే ఒకటో నెంబరు సెల్‌లో ఉండేది. ఒకటో నంబరు సెల్ ప్రక్కనే ఒక దర్వాజా ఉంది. ఉరితీయబోయే ముందు ఈ దర్వాజా తెరిచి ముద్దాయిని ఉరితీసే మంచెమీదికి తీసుకువెడతారు. తక్కిన సమయాల్లో దర్వాజా మూసివుంటుంది. ఆ చివరి క్షణం ముందు ఒకసారి దర్వాజాను చూడాలని బుద్ధిపుట్టింది. దాని తాళం తుప్పుపట్టి ఉందా?... నాకు మృత్యువుకీ మధ్య ఈ దర్వాజా ఒక్కటే వ్యవధానం. అయినా నేరస్థుడన్న మాట నా మనస్సుని గ్రుచ్చుతోంది. బాంబుకేసులో బాబులనుకూడా సిపాయి నేరస్థులనే అన్నాడు. అది నా మనస్సుకి కటువుగా అనిపించలేదు. బాంబుకేసులో ముద్దాయిల మాటలు నా చెవికలవాటయినాయి. ఈ మాటలతో కనీసం నా మనసులో దేశ సేవకుల స్వదేశభక్తికి సంబంధించిన ఎన్నో జ్ఞాపకాలు మిళితమై ఉన్నాయి. కాని ఉరిశిక్ష ముద్దాయి అన్న మాట వినగానే నాకు సహజంగా హంతకులు, బందిపోట్లు గుర్తుకొచ్చారు. వీరి రూపాలు మాటలతో సహా నా మనస్సులో నాటుకుపోయాయి. సిపాయ్ నేరస్థుడన్న మాట ఉపయోగించి, నన్ను దొంగలలో బందిపోట్లలో ఒకణ్ణిగా చేసేశాడు. అందుకనే

నాకామాటంటే అయిష్టం, అభ్యంతరం. మనస్సులో ఆవేదన రేకెత్తింది. ఒక వార్డరు దృష్టిలో కూడా నేను పూజ్యుడైన దేశసేవకుణ్ణి కాను. నేనతని దగ్గిర్నుంచి-నేంచేసిన త్యాగానికి ప్రశంసను మాటల్లో కాకపోయినా ఆచరణలో చేష్టల్లోనైనా చూపుతాడని ఆశించాను. వీరికోసం నేను ప్రాణాల్ని త్యజిస్తున్నాను. వీరెక్కడ కృతజ్ఞులుగా ఉంటారు? అంతేకాదు కృతజ్ఞతకు బదులు - వీరికి సానుభూతి తెలపడం తెలుసు. త్యాగవీరులపట్ల సానుభూతి కాదు. ఇంక కొన్ని గంటలు మాత్రమే విలాససమయమైన భూమిని అనుభవించే అభాగ్యుడిపట్ల జాలి...

పిన్ని జ్ఞాపకం వచ్చింది. పిన్నిని నైహాటీ స్టేషన్‌లో పడమటి రైలు యెక్కించటానికి వెళ్ళాను. పిన్ని జుట్టు అంటకత్తెర వేయించుకుంది. కాషాయ వస్త్రాలు ధరించింది. మెళ్ళో తులసిపూసల పేరు. తన సంసారంతో పెద్ద సంబంధమేమీ లేదు. మఠాల్లోనో ఆశ్రమాల్లోనో ఉంటూంటుంది. నవద్వీపం నుంచి బృందావనం వెడుతోంది. సునాముఖీ ఆకుమూట, కొబ్బరి బోండాలు, పెద్ద పాలకోవాలగిన్నె, నువ్వుపప్పు మూట మొదలైన చాలా సామానులున్నాయి. గురువుగారి తమ్ముళ్ళు చెల్లెళ్ళ కోసం వెడుతోంది. ఈ సామాన్లన్నీ రైల్లో ఎక్కించటానికే నే వచ్చింది. పిన్ని రైల్లో యెక్కింది. సామాన్లన్నీ కూలీల నెత్తిమీద నుంచి దింపి రైల్లో పెట్టాను. పిన్ని "అన్ని సామాన్లూ వచ్చాయా?" అని అడిగింది. నేను ఒక్కొక్కటే అన్నీ లెక్కపెట్టి "ఆఁ మొత్తం ఇరవై రెండు సామాన్లు వచ్చాయి" అన్నాను. నిమిషంలో పిన్ని కళ్ళలో నీళ్ళు తిరిగాయి. నేను చాలా కంగారుపడ్డాను. నాకు తెలియకుండా ఏదో పొరపాటు చేసి ఉంటానని గ్రహించాను. తర్వాత పిన్నే వివరంగా చెప్పింది. పట్టుగుడ్డతో కప్పి ఉన్న స్వర్గీయులైన ఆమె గురుదేవుల తైల చిత్రాన్ని కూడా నే సామాన్లలో లెక్కేశాను. ఆ సమయంలో ఆమె మనస్తత్వం చిత్రంగా తోచింది. మళ్ళీ ఈనాడు ముద్దాయి అన్నమాట విన్న తర్వాత నా ఆలోచనలు చూసి నేను ఆశ్చర్యపోయాను. ఉరి శిక్షపడిన నేరస్థుణ్ణి ముద్దాయి అనకపోతేనే ఆశ్చర్యం...

ఉరి మంచె అన్న మాటలో కూడా ఎందరో త్యాగవీరుల స్మృతుల సువాసనలు అలముకుని ఉన్నాయి. కాని ఉరి మంచె అనగానే ఖూనీలు చేసిన ముద్దాయిల కథలే గుర్తుకొస్తాయి. కాని అన్నిటికంటే ఆశ్చర్యం మనోదృష్టికి ఒక మృతదేహం జిమ్నాస్టిక్ హారిజాంటల్ బార్‌కి వేళ్ళాడుతూండటం కనిపిస్తోంది. మొద్దుబారిన కాళ్ళు రెండు శూన్యంలో గుండ్రంగా ఒకేరీతిని మెల్లిగా ఉత్తరం, ఈశాన్యం, తూర్పు, ఆగ్నేయం, దక్షిణం, నైరుతి, దక్షిణం, ఆగ్నేయం, తూర్పు, ఈశాన్యం, ఉత్తరంగా తిరుగుతున్నాయి.

ఏదో ఇంగ్లీషు నవలలో చదివిన ఒక దృశ్యం.

పదో నంబరు సెల్ నుంచి డ్యూటీ ప్రారంభం చేశానని వార్డరు చెప్పాడు. అంటే ఇవాళ పదకొండు నుంచి ఇరవై వరకు సెల్స్ ఖాళీ అని అర్థం. జైలు నిబంధనల్ని - కట్టడిని భగ్నంచేసే ఖైదీలకు అధికారులు సామాన్య జైలుశిక్ష విధిస్తారు. వారు ఈ సెల్స్‌లో ఉంటారు. సెల్‌లో కొన్నాళ్ళు ఒంటరిగా ఉండాలి అదే శిక్ష. కొన్నాళ్ళు ఏకాకిగా గడపటం ఏం శిక్షో నాకు తెలియదు. వార్డ్‌ల గందరగోళంలోంచి మధ్యమధ్య కొన్నాళ్ళు ఒంటరిగా ఉండటం అంతకష్టంగా ఉండే సంగతేంకాదు. ఈ సెల్‌లన్నీ కూడా బాగా ఉపయోగపడతాయి. ఇవాళ గదులన్నీ ఎలా ఖాళీ అయినాయి? ఇలా ఎప్పుడూ కావు. బహుశా బుద్ధిపూర్వకంగానే వారిని మరొక చోటకు మార్చారేమో! ఒకవేళ సూపరింటెండెంట్ వారి శిక్షల్ని రద్దుచెయ్యమని ఉత్తర్వులిచ్చాడేమో! బహుశా అతను ఇవాళరాత్రి 'కన్‌డెమ్‌డ్ సెల్స్'లో ఎంత తక్కువమంది ఉంటే అంత మంచిదని అనుకుని ఉండొచ్చు. ఇవాళ ఇక్కడుంటే వారిలో ప్రతీకారవాంఛ రేకెత్తవచ్చు. అందుచేత ఇక్కడి నుంచి తప్పించటానికి వీలైనంతమంది నందర్ని తప్పించి ఉండొచ్చు. అధికారుల ఉద్దేశానుసారం చేసినపని. పదమూడోనంబరు సెల్‌లోని కుష్ఠురోగియైన ఖైదీని కూడా జనరల్ వార్డ్‌లోకి తీసుకెళ్ళారాయేం? ఒక్కొక్క సూపరింటెండెంట్‌కి ఒక్కొక్క రకం ఖయాలీ ఉంటూ ఉంటుంది. మేజర్ ఫిలిప్‌టస్‌ని చూశాను. ఆడవాళ్ళ చిత్రాలున్న పుస్తకాల్ని అతనెప్పుడూ జైల్లోకి 'పాస్' చేసేవాడుకాదు. అతను మానసిక వ్యాధి నిపుణుడని వినికిడి. స్త్రీల చిత్రాలు జైల్లో కొన్నాళ్ళు గడిపిన వారి మనస్సుల్లో రకరకాల వికారాల్ని కల్గిస్తాయని అతడి ఉద్దేశ్యం. వెనకొకసారి హజారీబాగ్ జైల్లో ఈ విషయాన్ని పురస్కరించుకుని రామఖేలన బాబుతో దొరకి ఎంత వాగ్యుద్ధం జరిగిందని! పాపం అతనెంతో ఆశతో తెప్పించుకున్న ఆ సంవత్సరపు రాయల్ అకాడమీ చిత్రాల పుస్తకం పదిపదిహేను పేజీలు కత్తెరతో జాగ్రత్తగా కత్తిరించి తొలగింపబడిన తర్వాత అతనికి చేరింది. చిత్రాలు పొందినట్లయితే అతని మనస్సులో ఎలాంటి ప్రతీకారభావం కలిగేదో మేము చూడలేకపోయాం కాని- పొందకపోవడంతో తాత్కాలిక ప్రతీకారం ఏంజరిగిందీ మేమూ చూశాం. ఫిలిప్‌టస్ దొర కూడా చూశాడు. ఫలితంగా అతనికి పధ్నాలుగు రోజులు ఏకాంతవాస శిక్ష విధించబడింది.

వేసవి కాలం సెల్‌లో గాలి వచ్చిపోయేదారి లేదు. వైశాఖమాసం వెళ్ళిపోబోతోంది. ఇప్పుడు సెల్ బయటకూడా ఇలాగే వేడిగా వుంటుందనుకుంటా. గుమ్మం దగ్గిర క్రింద కటకటాలు పట్టుకుని కూచుని ఉన్నా- బయట చల్లదనం కాస్త ఏమైనా తగిలితే

బావుండును! గదిలోని ఉక్కతో తలంతా ఏదో బరువెక్కినట్లుంది. ఇలాంటప్పుడు కాసేపు కటకటాల్లోంచి తల ముఖం వీలైనంత వరకు బయటకిపెట్టి, బయటి స్వచ్ఛమైన గాలి పీలిస్తే మెల్లిమెల్లిగా తలదిమ్ము తగ్గిపోతుందనిపించింది. ముందు తలదిమ్ము ఇంకా ఎక్కువవచ్చు. కొన్నాళ్ళ నుంచీ స్నానం చేసేముందు వార్డరు కాస్త ఆవనూనె యిస్తున్నాడు. ఎక్కడిదో ఒక పాత వెన్నటిన్‌లో కాస్త నూనె కూడబెట్టి ఉంచాడు. ఉరి తీయబోయేముద్దాయి మీద దయ - మొదట్లో తీసుకోవద్దనుకున్నా. కాని అతను ఏం మాట్లాడకుండా చేతిలో పోయగానే అడ్డుచెప్పలేదు. తల దిమ్ము జ్ఞాపకం వచ్చి అయి ఉండొచ్చు. లేదా సిపాయిజీ ఏం మాట్లాడకుండా చేతిలో పోయటం చూడటం వల్లనైనా కావచ్చు. మితంగా మాట్లాడటమనేది వీరికి తెలియదు. పగలు ఎనిమిది గంటలు, రాత్రి రెండుగంటల వంతున డ్యూటీ. వీరిది ఒక విసుగుపుట్టే జీవితం. ఈ డ్యూటీ సమయంలో ఏదైనా మాట్లాడుతూంటే ఆ విసుగు కాస్త తగ్గుతుంది. అతనొక్క మాట మాట్లాడలేదు. పైగా రాచుకోవటానికి ఆవనూనె యిచ్చాడు. ఇంత ఆవనూనె మీద మమకారాన్ని వదులుకున్నాడు. ఆశ్చర్యం! వీరు అన్ని వస్తువులూ జైలు నుంచే దొంగిలిస్తారు- బట్టలుతికే సబ్బు, మరమరాలు, వేరుసెనక్కాయలు, బంగాళాదుంపలు, కొబ్బరితాళ్లు, ఇనపమేకులు, హరికెన్ లాంతరు బర్నర్లు మొదలైన ఏ వస్తువు వీరి చెయ్యి దాటిపోదు. పై తరగతి రాజకీయ ఖైదీల టీ కప్పుల దగ్గర్నుంచి అంగవస్త్రం వరకు అన్ని వస్తువులు రాత్రిళ్లు- వార్డర్లు తప్ప తక్కిన వాళ్లనందర్నీ లోపలకు పంపి తాళాలు వేసిం తర్వాత దొంగిలింపబడుతూంటాయి. దొంగలు గదులు తాళాలు వేసి ఉంటాయి. అయినా దొంగతనాలు మాత్రం జరుగుతూనే ఉంటాయి. ఇలాంటి పరిస్థితిలో వార్డరు ఔదార్యం నన్ను విహ్వలుణ్ణి చేసింది. అంతకంటే ఆ రోజున నా చొక్కా డ్రాయరు పిచ్చి ఖైదీచేత ఉతికించటం మరీ ఆశ్చర్యమేసింది. స్నానం చేసి ఉతికిన పాంట్ తొడుక్కున్నాను. వెంటనే నన్ను ఒక విధంగా బలవంతంగానే సెల్‌లోకి త్రోశారు. నాకు అడ్డుచెప్పే అవకాశాన్ని కూడా యివ్వలేదు. తర్వాత నా హాఫ్ పాంట్ బెల్ట్ వదులుచేసి, వెనకాల నడుము క్రిందకు చెయ్యిపోనిచ్చి ఒక బీడీ బయటికి తీశారు. ఆ బీడీ పిచ్చివాడికిచ్చి తను అగ్గిపెట్టె తీసి వెలిగించారు - అది అతను గుడ్డలుతికినందుకు కూలి అని గ్రహించాను. ముందు చెప్పకుండా ఎవరేం పనిచేసినా - దాన్ని వారించటం చాలా కష్టం. సిపాయిజీ నా త్యాగం, దేశభక్తిని గురించి తెలిసినవాడనిపించింది. తక్కిన సిపాయిల్లాంటివాడు కాదు. మనస్సు బాగా తేలికయినట్లని పించసాగింది. అప్పటి నుంచి ఈ కొద్ది రోజులు అతను పగలు డ్యూటీలో ఉండటం చూస్తున్నాను.

మా పార్టీలోని చంద్రిమ తలకు నూనె రాచుకోదు. నూనె రాచుకుంటే తన తల వేడెక్కుతుందంటుంది. పొట్టిగా చిన్నదానిలా ఉంటుంది. సరళ స్వభావురాలు.

శ్రమ అనేది ఎరక్కుండా మాట్లాడకుండా పనిచేస్తూంటుంది. ఇతరుల పనిలో సాయపడ కలిగితే కృతార్థురాలినయినాననుకుంటుంది. రెండో వార్డులో రాత్రింబగళ్ళు ఒక చోటునుంచి ఒక చోటుకి ఆసులోకండెలా తిరుగుతూనే ఉంటుంది. మెడల మీదికి కత్తిరించుకున్న ఒత్తయిన జుట్టు, నూనె రాచుకోదు. పంథొమ్మిది వందల ముప్పై రెండులో మిలిక్‌గంజ్ కాంగ్రెసు ఆశ్రమం 'జపతీ ఉద్ధార' సత్యాగ్రహ సమయంలో ఆమె చెవుల్లో సైకిల్ పంపుతో గాలి యెక్కించారట! అప్పటి నుంచి ఆమెకి చెవులు వినిపించటం లేదు. కళ్లకెదురుగా కనిపిస్తోంది- ఇవాళ ప్రొద్దున్నే చంద్రిమ రెండో నంబరు వార్డుగదిలో సంతాపసభ యేర్పాటు చేస్తోంది. మౌన సంతాపసభ. రామభజనబాబు సభాపతి. సభాపతితో సహా అందరూ లేచి ఒక్క నిమిషం మౌనంగా నిలబడ్డారు. తర్వాత మెల్లిమెల్లిగా యెవరికి వారు కూర్చున్నారు. చంద్రిమ మాత్రం నిలబడే ఉంది. అటు యిటు రేగిన దుబ్బు జుట్టును రెండు చేతులతో చెవుల వెనక్కి సర్దుకుంది. ఆ జుట్టు సింహం జూలులా కనిపిస్తోంది. ఖైదీలు చేతులకు సంకెళ్లు వేసి నిలబెడితే ఎలా నుంచుంటారో - సరిగ్గా అలాగే నిలబడి మొదలెట్టింది."నా గులాం సోదరులారా! నేడు ..." నాలుగుమూలల నుంచి గుసగుసలు బయలుదేరాయి. అందరు చంద్రిమను ఆగమన్నారు. ఇప్పుడే మీటింగ్ వార్త జైలు అధికారుల దగ్గిరకు వెళ్లిపోవచ్చు. వెంటనే లాటీఛార్జి జరగొచ్చు. 'మనమధ్య సి.ఐ.డి. లెంతమంది ఉన్నారు? సంతాప సభలో ఎక్కడైనా ఉపన్యాసా లిస్తారా?' గాలివేస్తోంది. ఆమె ఏమీ వినిపించుకోదు! ఇలా రకరకాల వ్యాఖ్యానాలు. కాని చంద్రిమ నన్ను గురించి చెప్పుకుపోతోంది - నా త్యాగం సంగతి. నా దేశభక్తి సంగతి, వ్యక్తిగతంగా ఆమెకు నాకు గల పరిచయం సంగతి, ప్రస్తుతం అప్పర్ డివిజన్ వార్డులో ఉంటున్న మానాన్న అయిన మాస్టరుగారిపట్ల సానుభూతి విషయం-స్త్రీల వార్డ్‌లో ఖైదీ దేవీజీ బిలూ తల్లికి - ఈ ఆఘాతాన్ని తట్టుకోగల శక్తి కలగాలని మనః పూర్వకమైన వాంఛను - ఈ రాజకీయ కుటుంబం భారతీయుల కెంత ఉజ్వల దృష్టాంతంగా నిలిచిన సంగతి, శ్రోతల కర్తవ్యం సంగతి, ఇలా ఎన్నో ఒకదానికొకటి గ్రుచ్చి చెప్పుకుపోతోంది. అర్ధనిమీలితాలైన కనుకొలకుల్లో నీళ్లు నిలిచాయి. అందరూ చంద్రిమను పట్టుకుని కూచోపెట్టారు. మృతుని ఆత్మకు శ్రద్ధాంజలి ఘటించటానికి అందరూ రోజంతా ఉపవాసం చెయ్యాలని నిర్ణయం జరిగింది. చంద్రిమకు మొదట్నుంచీ ఉపవాసమంటే అభ్యంతరం. ఆమె పార్టీలోనివారు రాజకీయరంగంలో ఉపవాసాల వల్ల ఫలితం ఉంటుందనే అంగీకరించరు. సందిగ్ధ మనస్కులైన కొందరు శ్రోతలకు - చంద్రిమ ఇది పాపానికి ప్రాయశ్చిత్తం కోసం చేసే ఉపవాసం కాదని, శత్రువుల

హృదయంలో పరివర్తన కలిగించటానికి చేసే ఉపవాసం కాదని, బిలూబాబు కీర్తి దృష్టిలో పెట్టుకుని, మనమూ దేశప్రేమికులం కనుక చెయ్యటం భావ్యం అని తెలియజెప్పింది.

తర్వాత రెండో నంబరు వార్డులో రావి చెట్టు క్రింద కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సభ్యుల మీటింగ్ జరిగింది. గోరేసింగ్ అన్ని విషయాలను ఆబ్జక్టివ్‌గా చూడాలని ఉపన్యసించాడు. ప్రతి మార్క్సిస్టు కర్తవ్యం... ఇంకా ఏవేవో మాట్లాడాడు. జాతీయ పోరాటంలో తమ పార్టీ సహాయానికి వారు గర్విస్తూంటారు. కాని ఒక కామ్రేడ్ మృత్యువుకి వారు విమూఢులవరు. పార్టీకి దానివల్ల గొప్ప నష్టం ఏర్పడిందనే భావాన్ని వారు ప్రదర్శించరు. ఎందరో వస్తారు, పోతారు. ఎన్నో విధాలయిన సామాజిక బంధాల్ని తెగిపోవటానికి వీల్లేని కుటుంబ శృంఖాలను తెగగొట్టుకుని వారు రాజకీయ రంగంలోకి దిగారు. అందరూ కాకపోయినా - చాలామంది. తమ ఆదర్శం కోసం వారిలో ఎవ్వరూ ప్రాణాలివ్వటానికి వెనుకాడరు. తమ ప్రాణాల్ని వారు విలువైనవని భావించరు. ఇతరుల ప్రాణాల మీద కూడా వారికలాంటి సానుభూతి తక్కువ! కామ్రేడ్ భోలా వెనకాల కూర్చుని నవ్వుతున్నాడు. రాజకీయ ఖైదీల్లో ఒక ఆశ్చర్యకరమైన సంగతి గమనించాను. దేశంకోసం తమ స్వార్థాన్ని భవిష్యత్తుని త్యజించినవారు, స్వదేశం కోసం నవ్వు మొహంతో మృత్యువును వరించటానికి కూడా సిద్ధపడిన వాళ్లు- అంతటి రాజకీయ నాయకులు కూడా జైల్లో సామాన్యమైన స్వార్థంకోసం తమ హీనమనఃప్రవృత్తిని బయటపెట్టుకోవటం చూశాను. కామ్రేడ్ భోలా - ఉరిశిక్ష పడకుండా బ్రతికిపోయాడు. కాని కొన్ని కేసులు కలిసి మొత్తం ముప్పై మూడు సంవత్సరాల శిక్ష పడింది. చెప్పలేనంత ఆనందపురుషుడు. ఎప్పుడూ నవ్వుతూండే మొహం. ఉరిశిక్ష పడినా ముఖంలో చిరునవ్వు అలాగే ఉంటుంది. ఏ పనిలో ఎన్ని ఎక్కువ ప్రమాదాలుంటే ఆ పని చెయ్యటంలో అంత ఆనందమెక్కువ. పసిపిల్లవాడి సరళమనస్తత్వం కల స్వదేశ ప్రేమికునికి ఆలోచించే సామర్థ్యం తక్కువ. కాని ఏ ఆజ్ఞను అమలు పరచటంలోనైనా సరే అతను సంకోచించడు. ఈ కామ్రేడ్ కూడా రెండో నంబరు వార్డ్‌లో ఉంటూండగా అతి స్వల్ప విషయంమీద కాళేశ్వరప్రసాద్‌తో తలలు పగలకొట్టుకోవటం చూశాను.

రాజకీయ ఖైదీల ఈ దౌర్బల్యాలన్నీ రోజూ జైలు ఉద్యోగుల కళ్లపడుతూంటాయి. దేశంలో ప్రజలు రాజకీయ ఖైదీలను ఎంత గౌరవదృష్టితో చూస్తారో, జైలు ఉద్యోగులు ఆ దృష్టితో వారినెలా చూస్తారు? ఇందుకనేనేమో దేశంలో ప్రజల ప్రశంసలు కాక వారి ప్రశంసలకోసరం నే ప్రలోభ పడేది! ... జైలర్ ఒకరోజున సూపరింటెండెంట్‌కి తొమ్మిది,

పదో నంబరు సెల్స్‌లో ఖైదీలు చాలా మంచివాళ్లు... నిష్ఠూరంగా చిరచిరలాడుతూ ఉండరు అని తెలియచెప్పాడు. ఇదే వారి ప్రశంసలకు కొలతబద్ద. సూపరింటెండెంట్ ఆ రోజున నాకు అవసరమైన వాటిని గురించి అడిగినప్పుడు జైలరుబాబు ఒక పాకెట్ బుక్ తెరిచి, ఫౌంటెన్ పెన్ తీసుకుని, నేను ఏవేవి కావాలంటానో వాటిని నోట్ చేసుకోవటానికి సిద్ధపడ్డాడు. పెద్దమనిషికి చాలా ఆశాభంగం కలిగించాను... సెల్ బయట నీళ్ల కూజా పెట్టి ఉండే చోటులోనే ఆరోజున జైలరుబాబు నుంచున్నాడు.

గది బయట గుమ్మానికెదురుగా ఒక కూజాతో నీళ్లు పెట్టి ఉంటాయి. ఇది బయట ఉంటుంది. కాని నన్ను ఆత్మహత్య నుంచి కాపాడటానికి కాదు. సెల్స్‌లోని ఖైదీల కందరికీ దీని నుంచి త్రాగేనీళ్లు సరఫరా చెయ్యాలి. తొమ్మిది, పది నంబర్ల సెల్స్‌లో వారికితప్ప... దాహం వేసిన వారు, సిపాయిజీని పిలుస్తారు. లేదా సెల్‌లోని గంట మ్రోగిస్తారు. సిపాయిజీ తన యిష్టానుసారం అవకాశాన్ని బట్టి లేచి వారికి మంచినీళ్లు యిస్తాడు. కాని సాధారణంగా ఎవరికెప్పుడు నీళ్లు కావాలో అప్పుడే దొరకవు. చాలామంది బ్రతిమాలగా బ్రతిమాలగా - లేదా అందరూ కలసి ఒక్కసారి గట్టిగా అరిస్తే అప్పుడు సిపాయ్‌జీ లేచి, కూజాలోంచి నీళ్లు కుమ్మరించి యిస్తారు. ఒకటో నంబరు సెల్‌లో ఉండేవాడికి గౌరవం ఎక్కువ. అంచేత నా గుమ్మం ఎదుటే కూజా పెట్టి ఉంటుంది. కూజా కొమ్ముని కటకటాల్లోంచి దగ్గరకు లాక్కుని గ్లాసునిండా వంచుకున్నాను. వీలైనంతవరకు నీళ్లు కటకటాల బయటకు ఉమ్మెయ్యటానికి ప్రయత్నించి కళ్లు, ముఖం నీళ్లతో కడుక్కున్నాను. కళ్ళలోంచి ముఖంలోంచి ఆవిర్లు వస్తున్నాయి. సెల్‌లో తూము లేదు. ఆ గుమ్మం కిందనుంచే నీళ్లు బయటికిపోవాలి. కళ్లు, ముఖం కడుక్కునేప్పుడు యెక్కువ నీళ్లు లోపలపడ్డాయి. పుక్కిలించి బయటికి ఉమ్మేశాను- గోడ మొదట్లో ఉన్న చిన్న చెట్టుమీద. ఈ చెట్టుకి రోజూ పుక్కిలితో నీళ్లు పోస్తున్నాను. పుక్కిలించినప్పుడల్లా ఎంత దూరం ఉమ్మెయ్యవచ్చునో పరీక్షిస్తూంటాను. మొత్తానికి ఈ విషయంలో ఒక అభిప్రాయం యేర్పడింది. నిల్చుని, కూర్చుని, ముఖభంగిమ మార్చి, ఎన్నో రకాలుగా నాతో నేను పోటీ పడుతూంటాను. ముందు స్థాపించిన రికార్డును అధిగమించటానికి ప్రయత్నిస్తూంటాను. మధ్యాహ్నమప్పుడు బయట సిమెంట్ బెంచి కాలిపోతూంటుంది. అప్పుడు పుక్కిలించి దానిమీద ఉమ్ముతూంటాను. తర్వాత ఒకటి రెండు అని లెక్కపెట్టటం మొదలెడతాను. ఎంతసేపట్లో నీళ్లు పూర్తిగా ఇంకిపోతాయో అని. అదేమి చెట్టో తెలియదు. రాగిరంగు ఆకులు. ఆ ఆకులు చూడటానికి వేపాకుల్లాగా ఉంటాయి. లాంతరు దగ్గరే ఉండటం

వల్ల చెట్టు స్పష్టంగా కనిపిస్తోంది. చిన్న తీగెజాతికి చెందిన చెట్టు. గోడను అంటుకుని ప్రాకింది. లాంతరు వెలుగులో చిన్న చిన్న పసుపుపచ్చపూలు కనిపించటం లేదు. ఆ చెట్టుకి బ్రతకాలని ఎంత ఆకాంక్ష! ఇటుక, సిమెంటు మధ్య పగులు విచ్చింది. వాటి మధ్య నుంచే ఇది జీవనశక్తిని లాక్కుంటోంది. నేను లేకపోయినా తీసుకుంటూ ఉంటుంది. నా పుక్కిలి నీళ్లకోసం ఎదురుచూస్తూ ఉండదు. చెట్టుని చూస్తూంటే - దాని రెమ్మవిరిస్తే చిక్కటి తెల్లపాలలాంటి రసం పైకి వస్తుందనిపించింది. గన్నేరు చెట్టు రసం యిలాగే ఉంటుంది. ఆ రసం ఒకసారి నాకు కంఠంక్రింద బొబ్బ లేస్తే - అది పగలటానికని పెద్దమ్మ పట్టీవేసింది. అప్పట్నుంచి దుర్గక్క బొమ్మరింటి కోసం - పాత ప్రమిదలో నేను నీలూ - గన్నేరుపాలు తెచ్చి ఉంచేవాళ్లం.

దుర్గక్క చెల్లెలు టేపీ. మాసిన గౌనుతొడుక్కుని జుట్టుని నెత్తినముడి మెలిపెట్టుకునేది. నేను, నీలు టేపీని ఆశ్రమం దగ్గర - గాంజెస్ డార్జిలింగ్ రోడ్డు మీది రబ్బరు చెట్టు కిందికి తీసుకెళ్లాం, రబ్బరు పాలను ఎలా తీసి రబ్బరు చేస్తారో చూపించటానికి. నేను చెట్టెక్కి కత్తితో ఒక కొమ్మ మీద గంటుపెట్టాను. టపటప పాలలాంటి రసం పడటం మొదలెట్టింది. నీలూ టేపీని సరిగ్గా దాని క్రింద నుంచో పెట్టాడు. "పైకి మాత్రం చూడకు జాగ్రత్త!" అని చెప్పాడు. తర్వాత పాపం టేపీ ఎంత యేడ్చిందని! రబ్బరుపాలు నెత్తిమీద పడి జుట్టు అట్టకట్టుకుపోయింది. ఆ రోజున నేను నీలూ అమ్మచేత యెన్నో దెబ్బలు తిన్నాం. అదృష్టవశాత్తూ నాన్న మా పల్లెటూరి కెళ్లాడు. ఆ తర్వాత నెల్లాళ్లకే టేపీ చచ్చిపోయింది. తర్వాత నీలూ నేనూ ఎంతో విచారించాం! ఎంతో పశ్చాత్తాపపడ్డాం. ఆశ్రమంలో మొక్కల మధ్య కూర్చుని. రబ్బరు పాలు తలమీద పేరుకోవటం మూలంగానే టేపీకి 'డిఫ్తీరియా' వచ్చిందని నిర్ణయానికి వచ్చాం. నీలూ నాకంటె ముందే డాక్టర్ కార్తిక్ టేపీకి గొంతుదగ్గర ఆపరేషన్ చేసి అక్కడ పేరుకున్న రబ్బరు పాలన్నీ బయటకి తీశాడని వార్త తీసుకొచ్చాడు. ఆ రోజున దుర్గక్క ఇంట్లో పిల్లల్నీ వాళ్లనందర్నీ అమ్మ మా ఆశ్రమం యింటికి తీసుకొచ్చింది. టేపీ అన్న ఛోందా ఈ సంవత్సరం ప్లీడరు పరీక్ష ప్యాసయినాడు! అప్పుడెంత చిన్నవాడు! తల్లి దగ్గిర పడుకున్నాడు. రాత్రి ఇంటికెడదామని మంకుపట్టుపట్టి ఎంత యేడ్చాడు! గుమ్మం ముందు కూచునేందుకు వీల్లేదు. నీళ్లతో ముందంతా తడిసిపోయింది. నీలం చారల పాంట్‌తో నీళ్లన్నీ అద్దాను. పాంట్ మురికి అయినా నష్టంలేదు. రేపు యింక దీన్ని తొడుక్కోవలసిన పనిలేదు. తొమ్మిదేళ్ల క్రిందట భూకంపం వచ్చినప్పుడు క్రింద యిక్కడ గుంట యేర్పడింది. అది యిప్పటికీ అలాగే ఉంటూ పి.డబ్ల్యు.డి. వారి పని

శ్రద్ధకు సాక్ష్యమిస్తోంది. ఒకటో నంబరు సెల్‌లో ఉండేవాడికి కూడా ఇంత కర్తవ్యాకర్తవ్య విచారణ! ఉరిమంచెకి అన్నిటికంటె దగ్గిర ఈ గది. అన్నిటి కంటె ఉరితీసే రోజు దగ్గిర పడిన ముద్దాయికే ఈ గదిమీద హక్కు. సెల్స్‌లో ఉన్న నాలుగువేల ఐదువందల మందిలో ఈ గదిమీద నా హక్కే యెక్కువది. పి.డబ్ల్యు.డి. ఉద్యోగులు సరిగ్గానే యోచించారు. తడినేల మీద కూర్చుంటే వాతరోగం రావటానికి ఎన్నాళ్లు పడుతుందో. ఇందులో ఉండేవాళ్లు అన్నాళ్లు బ్రతకక్కర్లేదు. ఒకవేళ అసంభవమైనదేమయినా జరిగి 'మెర్సీ పిటీషన్' మంజూరు కనుక అయితే సామాన్య రోగం రావటమన్న ప్రశ్నేలేదు. ఇవాళ కూడా ఈ తడిలో కూచుంటే జబ్బు చేస్తుంది అన్న ఆలోచన వస్తోంది. వెనక ఒక కథ చదివాను - ఒక వ్యక్తి ఆత్మహత్య చేసుకోటానికి సిద్ధమయినాడు. విషం సీసా నోటి దగ్గిర వరకు తీసుకున్నాడు. అతని స్నేహితుడు హఠాత్తుగా బయటి నుంచి అదిచూసి, పిస్తోలు అతనికేసి గురి పెట్టి "సీసా వదిలేసెయ్ చెపుతున్నా. లేకపోతే ఇప్పుడే కాల్చేస్తా" అని గద్దించాడు. చేతిలోంచి సీసా జారిపోయింది. మనసు ఇలా ఉంటుందని ఎవరూహించగలరు!

బహుశా గుమ్మం ముందున్న ఈ గొయ్యి భూకంపం వచ్చిన తర్వాత మరమ్మతులు చేసేప్పుడు కన్పించలేదేమో! ఇంజనీర్ల పెద్ద తప్పేమీ లేదు. హఠాత్తుగా కనిపించదు. చుట్టూ దగ్గిరలో వర్షం పడితే గొయ్యి ఉన్నదని అప్పుడు తెలుస్తుంది. ఆ భూకంపం ఎంత దుస్సంఘటన! పంధొమ్మిది వందల ముప్పై నాలుగులో వచ్చిన భూకంపం సంగతి చెపుతున్నా. పాట్నా క్యాంప్ జైలు నుంచి ఉత్తర బీహారుకి చెందిన రాజకీయ ఖైదీల నందర్నీ భూకంపబాధితులైన ప్రజలకు సేవచెయ్యటానికి - గవర్నమెంట్ విడుదల చేసింది. నీలూ పంధొమ్మిది వందల ముప్పై రెండు చివరలోనే విడుదలయి నాడు. నాన్నా- అమ్మ యిద్దరూ జైల్లోనే ఉన్నారు. నీలూ పెద్దమ్మ గారింట్లో ఉండి చదువుకుంటున్నాడు. మేము బి.ఎన్.డబ్ల్యు. రైల్లో వస్తున్నాం. ప్రతి స్టేషన్‌లోనూ భూకంపం తాలూకు విధ్వంసం చిహ్నాలు కన్పిస్తున్నాయి. దిక్కుతెలియని వారు ఏదో స్టేషన్ దగ్గిర రోజంతా ఉండిపోవలసి వచ్చింది. వంతెన కూలిపోయింది. పడవల మీద దాటించటానికి ఏర్పాట్లు జరిగాయి. గవర్నమెంట్ దగ్గిర్నుంచి మూడణాలు వంతున బత్తెం వచ్చింది. ఆ నది రేవులో పెరుగు అమ్మేవానితో నాలుగు పైసల (అణా)కు తాగినంత పెరుగు యిచ్చేట్టు ఒప్పందం అయింది. నగేంద్రసింగ్ ఇంచుమించు నాలుగైదు శేర్ల పెరుగుత్రాగాడు-తీపిలేని ఎరుపుగా ఉన్న పల్చటి పెరుగు. దగ్గిర డబ్బుల్లేవు. 'కారాగోలారోడ్' స్టేషన్ నుంచి పూర్ణియా వరకు నడిచివెళ్లాలి. గాంజెస్ -

డార్జిలింగ్ రోడ్డు పొడుగునా ఎంతో పెద్ద పెద్ద పగుళ్లు! 'హరదా' వంతెన కూలిపోయింది. హరదాబజార్ దగ్గిర కెళ్లాక యింక అడుగు కదల్లేదు. దుబేజీ కాంగ్రెస్ కార్యకర్త. అతని దుకాణంలోకి వెళ్లేసరికి అతని భార్య లోపలకు పరుగెత్తింది. కాసేపట్లో 'నమస్తే' అంటూ మళ్లీ లోపల్నుంచి బయటికి వచ్చింది. మిల్లు చీరె మార్చుకుని ఆకుపచ్చ అంచు ఖద్దరు చీరె కట్టుకుని రావటం గమనించాను. ఇంత వయస్సు ఉన్నా సుందరమైన శరీరఛాయ, పొడుగాటి శరీరం, చిలకముక్కు. అన్నిటికంటె ముఖంలో కళ్లలో ఆత్మగౌరవభావం వృద్ధురాలి రూపాన్ని మరింత కలకల్లాడేట్లు చేశాయి. దుబేజీ భార్య - దుబేజీ ఎంతో మర్యాద చేశారు! పాలలో అటుకులు తడిపి, ఆ అటుకుల్ని పెరుగుతో కలిపి - పరిహాసాలాడుకుంటూ అందరం తృప్తిగా తిన్నాం. పరిహాసాల లక్ష్యం దుబేజీ! అందరూ అతడి భోజ్‌పురీ యాసను అనుకరిస్తూ మాట్లాడటానికి ప్రయత్నించసాగారు... దుబేజీ మాటలోని యాసకు అందరూ ఒకటే నవ్వులు! ఆ వృద్ధుడు, వృద్ధురాలు కూడా మాతోపాటు నవ్వేవారు. వంటగది ప్రక్కన దుబేజీ గృహిణితో రాత్రి ప్రొద్దుపోయే వరకు మాట్లాడటం జరిగింది. అమ్మ సంగతి- ఇహ పెళ్లి చేసుకోవాల్సిందే - ఇంకా ఏవేవో జ్ఞాపకం రావటం లేదు. దుబేజీ గృహిణి ఉప్పు సత్యాగ్రహ సమయంలో ఉప్పు తయారు చేసి జైలు కెళ్లింది. కాని పోలీసులు ఎందుకనో తెలియదు - దుబేజీని అరెస్టు చెయ్యలేదు. బహుశా బాగా వయసైన వాడనేమో! అప్పటి నుంచి ఆమె దుబేజీ కంటె తాను అధికురాలినని భావించుకునేది - దుబేజీయే నా ముందు ఈ ఫిర్యాదులన్నీ వ్యక్తం చేశాడు. భార్యాభర్తలిద్దరూ చాలా సరళ హృదయులు. తమకు గల కొద్దిపాటి ఆస్తిపాస్తుల్నీ భూమినీ కాంగ్రెసుకి విరాళంగా అర్పించారు. రాత్రి పడుకుని ఉన్నాను. వారు మేము నిద్రపోతున్నామనుకున్నారు. మాకు నిద్రాభంగం కలుగుతుందేమోనని మా కంబళ్లమీద మరొక కంబళ్లు కప్పి వెళ్లిపోయారు. తర్వాత అక్కడి నుంచి బయలుదేరి వెళ్లే ముందు - నన్ను అక్కడున్న ప్రైమరీ స్కూల్‌కి ఏకాంతంగా తీసుకెళ్లి -"మా కోరికను నెరవేర్చాలి. మాకు పిల్లలు లేరు. నిన్ను ఎన్నో నాళ్ల నుంచి నువ్వు యింత వాడివిగా ఉన్నప్పటి నుంచీ చూస్తున్నాను. మాస్టరుగారి కుమారుడు మాకూ కుమారుడే. మేము పేదవాళ్లం. మీరు బెంగాలీలు బిలూబాబూ! కాని మా కర్తవ్య బాధ్యత ఒకటి నువ్వు స్వీకరించకతప్పదు. మాకు కొన్ని బిఘాల భూమి ఏదైతే ఉందో దానిమీద వచ్చే ఆదాయాన్ని నేను కాంగ్రెస్ కార్యకలాపాలకే ఖర్చు పెడుతున్నాను. వీటిని వ్రాసి యిచ్చిపోదామనుకుంటున్నాను. మేము చనిపోయాక నువ్వు వీటిని మహాత్మాజీ కార్యక్రమాలకు వినియోగించు. మేము ఇంకా ఎన్నాళ్లు బ్రతుకుతాం!" అని చెప్పారు.

నేను వారి ముందు వాగ్దానం చేశాను! దుబే గృహిణి ఇప్పటికీ బహుశా ఆ క్యాలెండర్ మీది రథం మధ్యలో ఉన్న శ్రీరాముల వారి చిత్రం ముందు కూచుని, దీపపు వెలుతురులో తకిలీతో పట్టుదారం తీస్తూ ఉండి ఉంటుంది.

హరదాబజారు నుంచి మర్నాడు మధ్యాహ్నానికి పూర్ణియా చేరుకున్నాం. గాంధీ ఆశ్రమాన్ని గవర్నమెంట్ 'జప్తు' చేసింది. అయినా అటువైపే వెళ్లాను... దూరం నుంచి చూస్తున్నాను. జిల్లా కాంగ్రెస్ కార్యాలయం ప్రక్కనున్న చిన్న చెట్టు పసుపుపచ్చని బోగన్‌విల్లా పూలు విరబూసి ఉంది. నేను అప్పుడాతిగెను ఈ చెట్టు మీదికి ప్రాకించాను. జెండా స్తంభపు జాతీయ పతాకం పూర్వం చాలా దూరానికే కన్పిస్తూండేది. ఇప్పుడది లేదు. కాని ప్రకాశవంతమైన తెల్లటి మబ్బు 'బాక్ గ్రౌండ్' మీద బోగన్‌విల్లా పూలతో నిండిన చెట్టు జాతీయ పతాక చేసే పనే చేస్తోంది. తెలుపు, కుంకుమపువ్వు రంగు, ఆకుపచ్చ - మూడు రంగులు... ఆశ్రమంలో ఇళ్ళు వెదుళ్లతో నిర్మించినవి. మా యింటి చుట్టూ ఉండే దడి విరిగిపోయింది. ట్యూబ్‌వెల్ పై నుండే భాగం లేదు. ఎస్.డి.ఓ. - దొర సీలు వేసిన దర్వాజాకి తాళం గుర్తు కూడా లేదు. పెద్ద బల్ల, అల్మారా తప్ప ఇంట్లో యింకేం లేవు. చిన్నం చితుకు సామానులన్నీ వీలైనంతవరకు పట్టుకుపోయారు. వంట యింటి గుమ్మం తలుపులు రెండూ ఊడగొట్టి ఎత్తుకుపోయారు. మహాత్మాజీ చిత్రం దొంగిలించబడింది. ననీదీ తయారు చేసి ఇచ్చిన ఫ్రేమ్ కట్టి ఉన్న దూది గుడ్లగూబ కనిపించలేదు. సహదేవ్ చెల్లెలు సరస్వతి చిన్నప్పుడు తయారు చేసిన కార్పెట్ మీద ఇంగ్లీషులో 'అస్పృశ్యత పాపం' అని అక్షరాలు అల్లి ఉండేవి. నేను వ్రాసిన కవితనొకదాన్ని నీలూ పేపరు బోర్డు మీద అంటించి వ్రేళ్లాడ కట్టాడు. అదలాగే ఉంది. వ్రాత మాత్రం స్పష్టంగా కనిపించటం లేదు. నేను చిత్రించిన రవిబాబు చిత్రం- అట్టమీద అంటించినది - దాన్ని చూశాను. వాటినెవరూ ఎత్తుకెళ్ళడానికి యోగ్యమైనవిగా భావించి ఉండరు. బహుశా ఫ్రేమ్ కట్టింది కాదని వదిలేశారేమో! పూలచెట్లు దొంగిలింపబడ్డాయి. ఒక్క గులాబీ, తెల్లటి 'ఖినకీ' పూలు మాత్రం మెల్లా నిండా ఉన్నాయి. బహుశా ఆ మొక్కల్ని ఆవులు, మేకలు తినవేమో! మధ్య మధ్య రెండు మూడు ఆముదం చెట్లు - గొప్ప జాతికి చెందని, లెక్క చెయ్యక్కర్లేని ఖినకీ చెట్లను నిర్లక్ష్యం చెయ్యటానికన్నట్లు ఎత్తుగా పెరిగి ఉన్నాయి. పట్టు పురుగుల్ని పెంచే గూడు సాంతం పడిపోయింది. ఎడ్లబండి చక్రాలు రెండూ ఊడతీసి యెవరో ఎత్తుకు పోయారు. నూనె తీసే మర ఉన్న గది అలాగే ఉంది. కాని గదిలోపల చూడటానికి కందిచెట్లలా ఉండే పిచ్చి చెట్లతో నిండిపోయి ఉంది. లోపలి కెళ్లేందుకు ఆస్కారం లేదు. ఆశ్రమం లైబ్రరీలో పుస్తకాలు

ఒక్కటి కూడా లేవు. చావడిలో చెత్తంతా కుప్పగా ఉండటం చూశాను. రోజూ ఆవుల్ని, మేకల్ని కట్టివేస్తున్న చిహ్నాలు అలాగే ఉన్నాయి. ఇరుగుపొరుగువారు ఈ కాంగ్రెస్ దుర్దినాల్లో కూడా ఇంటిని మరిచిపోక పోవటం గమనించాను.

ఉదాసీనమయింది మనస్సు. ఆశ్రమంలోంచి బయటికి వచ్చి పెద్దమ్మగారింటి గేట్‌లోకి వెళ్లాను. ఇది నాన్నగారి ఆప్తమిత్రుని యిల్లు. సరిగ్గా యింటికెదురుగా ఒక గుడారం. గుడారం గుమ్మంలో ఒక తెల్లమేక మెడసారించి, లతల యంబ్రాయిడరీ చేసి ఉన్న టేబిల్‌క్లాత్‌ని నములుతోంది. ననీదీ కూతురు బుడియా, ఆమె సావాసకత్తెలు - మైదానం మధ్య నుంచి పోయే పెద్ద పగులు మీద దృష్టినిగిడ్చి బోర్లగా పడుకుని ఉన్నారు. నన్ను చూడగానే అందరూ పరుగెత్తుకొచ్చారు. "అక్కడ ఏం చేస్తున్నారు?" అని అడిగాను నేను. "ఈ పగులు మధ్యలోంచి అమెరికా చూడొచ్చు అని చిన్న మామయ్య చెప్పా"డన్నారు. బుడియా బయటి నుంచే "అమ్మమ్మ! ఎవరొచ్చారో చూడు" అని అరుస్తూ లోపలకు వచ్చింది. పెద్దమ్మ, ననీదీ భోజనం ముందు కూర్చున్నారు. 'ననీదీ యెక్కడ?' అంటూ లోపలకు వెళ్లగానే ఇద్దరూ తినటం వదిలేసి బయటికి వచ్చారు. పెద్దమ్మ కుడి చెయ్యి ఎంగిలిది, ఎడమచేత్తో నన్ను దగ్గిరకు తీసుకుంది. నీలూ చూస్తే లోపల వున్నాడు. కళ్ళు నలుముకుంటూ బయటికివచ్చాడు "పెద్దమ్మ భోజనం చెడకొట్టావ్. ఇప్పుడు పెద్దమ్మ విస్తట్లో కూర్చుని అదంతా నువ్వు తిను" అంటూ బిగ్గరగా నవ్వాడు. ననీదీ - "చూడు చూడు, మా భోజనం అయేపోయింది" అన్నది. ననీదీ కళ్లలో కృత్రిమ కోపం వ్యక్తమవుతోంది. పెద్దమ్మ నీలూని మందలిస్తూ -నువ్వు మళ్ళీ ఓమూలపడిపోయిన అగదిలోనే పడుకున్నావా? కప్పుకింద పడి చస్తావా యేం? ఇహ నీతో నేపడలేను. నిన్నిక యిక్కడుంచను. మామయ్య ఇంటికి పంపించేస్తాను. ఎంత దొంగవి! ఎంత దొంగవి! నిన్నరాత్రి కూడా అ పడిపోయిన గదిలోనే పడుకున్నావ్ కదూ! అన్నది. తర్వాత యెన్ని కబుర్లు, ఎన్ని సంగతులు చివరికి నీలూ మాటే నిజమైంది. పెద్దమ్మ విస్తట్లోనే నేను తినవలసివచ్చింది. పెద్దమ్మ యింటిని మేమెప్పుడూ మరొక యిల్లుగా భావించలేదు. పెద్దమ్మ ఇల్లు మొదట్నుంచి మాకు 'అ యిల్లు.'

పెద్దమ్మ గుర్తుకొచ్చింది. ఆమెకి ముందువైపు రెండు పెద్దపళ్ళు బయటికి వచ్చి ఉంటాయి. కనుబొమ్మలు రెండింటి మధ్య పచ్చపొడిచిన నీలపుమచ్చ. సగం సగం నెరిసినతల. చిన్నమొహం, ముఖంలో ఎప్పుడూ నవ్వు తొణికిసలాడుతూంటుంది. నవ్వినప్పుడు క్రింది వరుసలో రెండు పళ్ళు ఊడిపోయినట్లు కనిపిస్తుంది. ముతక సిల్కు చీరె కట్టుకుని వుంటుంది. పెద్దమ్మ కళ్ళలో, ముఖంలో, మాటల్లో కన్పించే

మాతృభావం సాధారణంగా ఇంకెక్కడా చూడం. 'రాఫేల్' మాతృమూర్తి చాలా గంభీరమయిన వ్యక్తి. ఏదో సంకోచభావం, శరీరమంతటా స్వచ్ఛంద రీతి లోపం కన్పిస్తుంది. ఆస్పత్రిలో నర్సులు మేట్రన్లులాగా ఏదో కృత్రిమ గాంభీర్యం నిండి వుంటుంది. కాని పెద్దమ్మ దేశీయ చిత్రకారుడు వేసిన యశోమతి చిత్రం ఉజ్వలంగా ఉండదు. కాని హృదయాన్ని స్పందింపచేస్తుంది. మా అమ్మకు నా మీద, నీలూ మీద ఎలాంటి భావమో, పెద్దమ్మకి ఆవాడలోని పిల్లలందరిమీద అదే భావం. అందరికీ అది అవారితద్వారం. కాని వాళ్ళందరి కంటె నా స్థానం పైన అని నాకు గర్వం. నీలూ వాళ్ళు అప్పుడప్పుడు - పెద్దమ్మను - ఆమె నేనంటే పక్షపాతం చూపిస్తుందని అందరికీ పెట్టకుండా చాటుగా నాకోసం తినుబండారాలు దాచి ఉంచుతూ ఉంటుందని - ఊరికే రెచ్చకొడుతుంటారు. నేను జైల్లో ఉండగా పెద్దమ్మ ఒకసారి చాలా జబ్బుపడింది. ఆ సమయంలో తన సంపదనంతా నాకిచ్చి పోవాలనే కోరిక వ్యక్తం చేసిందట! అప్పుడామె సంపదలో - పాత తలగడా గలీబులో ఇరవైనాలుగు రూపాయలు - నెల నెలా కాస్త కాస్త చొప్పున కూడబెట్టిన ఒక గిన్నెడు పాత నెయ్యి మాత్రం కనిపించాయి. నీలూ ఈ సంగతులన్నీ రసవంతంగా కథలల్లి, అప్పుడప్పుడు పెద్దమ్మను రెచ్చకొడుతూండేవాడు. ఒకసారి పెద్దమ్మ అన్నగారి మనుమరాలి పెళ్ళికి పెద్దమ్మను వాళ్ళ ఊరు తీసుకెళ్ళాను. సాబ్నాజిల్లాలో యమునా నది ఒడ్డున ఉన్న చిన్న గ్రామమది. పెద్దమ్మతో ఆమె ఊరంతా చూడటానికి బయలుదేరాను. వారి ఆయుర్వేద వైద్యుడి ఇల్లు, ఊళ్ళో బాబుగార్ల భగ్న మందిరం భైరవ భూస్వామి - అతని పేరు చెపితే ఎండిపోయిన చెట్లు కాయలు కాచేది - పెద్దపులి ఎద్దు ఒకరేవులో నీళ్ళు తాగేవి. వారి పురాతనపు లోగిలి - ఇంకా ఎన్నో చోట్లు చూశాను. పెద్దమ్మ దగ్గిర - చిన్నప్పట్నుంచి ఈ ప్రదేశాలన్నింటిని గురించి ఎన్నో కథలు వింటూ రావటంతో అవేవీ నాకు క్రొత్తగా కనిపించలేదు. తర్వాత 'జామాయ్‌దీఘీ ప్రక్క డామ్‌మీదినుంచి నడుస్తున్నాం. డాక్టర్ నవద్వీప్ సైకిల్ మీదినుంచి పడిందిక్కడేనని చూపించింది పెద్దమ్మ. "అప్పుడీజిల్లాలో కల్లా ఒక్కటే సైకిల్ ఉండేది. సైకిల్ చూడటానికి ఊళ్ళో వాళ్లం అందరం ఇక్కడి కొచ్చినుంచున్నాం. పాపం అతను దభీమని సైకిల్‌తోసహా మడుగులో పడిపోయాడు" అని చెప్పింది. "పెద్దమ్మా! ఫెర్రిమెంట్ రాస్తా (అసలు పదం Ferry Fund) మీద అని చెప్పావుగా!" అన్నాను నేను. "అరె! ఈ డామ్ మీద నుంచి ఉన్నదే ఫెర్రిమెంట్ రాస్తా. చూడు నీకో మాట చెపుతాను. ఇలా కూచో. నువ్వు నన్ను పెద్దమ్మ, పెద్దమ్మ అని పిలుస్తావ్. నాకదేంబాగుండలేదు. నన్ను 'అమ్మ' అని పిలవలేవూ!"అన్నది. నేనేమిటో మొద్దుబారిపోయాను. ఆమె ముఖంవేసి పరిశీలనగా

చూశాను. ఆమె నా సమాధానంకోసం జిజ్ఞాసాదృష్టితో ఎంతో ఆదుర్దాగా నావైపు చూస్తూ వుండిపోయింది. ఆమె ముఖం ప్రగాఢమైన మాతృవాత్సల్య దీప్తితో ప్రకాశిస్తోంది. ఆ ప్రశ్న మరీ తలవని తలంపుగా అడగటంతో నానోటినుంచి సమాధానం రావటానికి చాలాసేపు పట్టింది. ఎంతో ఆలోచించి, ఆలోచించి "పెద్దమ్మంటే ఎంతో అమ్మ అన్నా అంతే. ఇద్దరూ ఒకటే" అన్నాను నేను. నా సమాధానానికి ఆమె తెల్లబోయింది. అపరాధం చేసిన దానిలా - "నీకు అమ్మ వుంది. నేను నిన్నిలా కోరటం చాలా అన్యాయమే" అన్నది. ఆమెదృష్టి మడుగుకవతలివైపు నెక్కడో వుంది. ఏ నిర్దిష్టమైన వస్తువు మీదాలేదు. ఆరోజు మొదలుకుని ఎవరూ లేనప్పుడు పెద్దమ్మను అమ్మ అనే పిలిచేవాణ్ణి. అందరికీ తెలుసు - అయినా చిన్నప్పట్నుంచీ 'పెద్దమ్మ' అని పిలవటం అలవాటవటంవల్ల - అందరి యెదుటా 'అమ్మ' అని పిలవటానికి సంకోచం కలిగేది. డాక్టర్ నవద్వీప్ సైకిల్ మీదినుంచి పడిపోయిన చోటు చూపించేప్పుడు - పెద్దమ్మకు హఠాత్తుగా నాకు అమ్మ అవాలనే కోరిక ఎందుకు కలిగిందో, అది ఇప్పటికీ తెలుసుకోలేకపోతున్నాను. దీనికి కొన్నాళ్ళతర్వాత సంగతి. నేనేం భయపడ్డానో అదే జరిగింది. మా పెద్దమ్మను అమ్మ అని పిలవటం అమ్మకి అయిష్టమైంది. నేను నీలూ వంటింటి వసారాలో భోజనం చేయటానికి కూర్చున్నాం. అమ్మ వడ్డన చేస్తోంది. వడ్డన చేసి అమ్మ మాతోపాటే భోజనానికి కూర్చుంటుంది. నేను హఠాత్తుగా - "తెలుసా అమ్మా? పెద్దమ్మ నువ్వులు కలిపి, దోసకాయలతో చాలా రుచికరమైన 'సూప్' తయారు చేస్తోంది" అన్నాను. "అయితే అక్కడే తిను. ఇక ఇక్కడ తినాల్సిన అవసరమేముంది?" అన్నది. ఏమాటకు ఏ సమాధానం! అమ్మ సహజంగా తియ్యగా మాట్లాడే మనిషి. ఆమె మాటలోని ఈ ఆకస్మికమైన చురక నన్ను విభ్రాంతుణ్ణి చేసింది. నీలూ హఠాత్తుగా - "నువ్వు పెద్దమ్మను 'అమ్మా' అని పిలుస్తున్నావని ఇవాళ అమ్మతో చెప్పేశానుగా! అందుకని అమ్మ కోపంమీద వుంది. 'నువ్వు' అనలేదు చూడలేదూ?" అన్నాడు. నిజంగానే అమ్మకి బాగా కోపంవస్తే నువ్వు అనదు (మీరు అంటుంది ఎత్తిపొడుపుగా).

నీలూ ఒట్టి అమాయకుడు. అమ్మ ఎదుట లేనప్పుడు చాటుగా ముందే నాతో చెప్పాల్సింది. అమ్మకళ్ళలో నీళ్ళు తిరగటం చూశాను. వాటిని కప్పిపుచ్చుకోవటానికి వంటింట్లోకి వెళ్ళిపోయింది. నాకు చాలా పెద్ద తప్పు చేశానని మనస్సులో అనిపించసాగింది. అమ్మ ఉంటున్నవార్డు పేరు "ఔరత్‌కితా" ఇవాళింక నిద్రపోలేదు. అమ్మ బహుశా దోమతెర వేసుకుని జపం చేస్తూ కూర్చుని ఉంటుంది. మనస్సు బాగుండనప్పుడు - అమ్మ జపం చేస్తూ కూచోటం నాకు తెలుసు. నీలు పోయిన

సంవత్సరం మొదట్లో 'దేఉలీ'లో జబ్బు పడినప్పటి సంగతి చెపుతున్నాను. హఠత్తుగా నీలూకి అజ్మీర్‌లోని ఆస్పత్రిలో అపెండిసైటిస్ ఆపరేషన్ చేశారని కబురు వచ్చింది. ఆరోజున రాత్రంతా అమ్మ పూజగదిలోనే కూర్చుంది. రాత్రి యించుమించు పదకొండు గంటలప్పుడు ఊరికే ఒకసారి నా గదిలోకివచ్చి అద్దం ప్రక్కన షెల్ఫ్ మీద ఉన్న సీసాల ప్రక్కన ఏదో వెతకసాగింది. అమ్మ బహుశా నీలూ జబ్బు విషయం నాతో మాట్లాడటానికి వచ్చి వుంటుందనిపించింది. కాని నేనొకవేళ జబ్బు చాలా ప్రమాదకరమైనదనిగాని, ప్రాణభయం ఉన్నదనికాని ఎక్కడ చెపుతానో అన్న భయంతో మాట్లాడటానికి సాహసించలేకపోయింది. జపం చేసుకున్నా - మనస్సుకి సంపూర్ణమైన బలం కలగలే దనుకుంటా. ఆమె నా దృష్టి అంతా పుస్తకంమీద లగ్నమైవుందని, తనని చూడలేదని అనుకుంది. ఆమె ఎంతో భక్తితో గోడను ఉన్న గాంధీజీ ఫొటోకి నమస్కరించటం చూశాను. తర్వాత తన దణ్ణెం మీద వ్రేలాడేసిన గుడ్డల్ని సర్దటం మొదలెట్టింది. అప్పుడు నేను అమ్మతో - అపెండిసైటిస్ ఆపరేషన్ చాలా సామాన్య విషయం. అందరికీ నయమవుతూంటుంది. ఈ రోజుల్లో విదేశాల్లో ఆరోగ్యంగా ఉన్నవాళ్ళు కూడా ఈ ఆపరేషన్ చేయించుకుంటున్నారు" అన్నాను. అమ్మ తనకిప్పుడు దాన్ని గురించి విచారంగాని, తెలుసుకోవాలని ఆసక్తి కాని లేదన్న భావాన్ని వ్యక్తం చేసింది. "దేలీనుంచి అజ్మీర్ ఎంతదూరంరా?" అని అడిగింది. రాత్రంతా మళ్ళీ జపంతోనే గడిపింది.

సెంట్రల్ టవర్‌మీద నుంచి ఒక వార్డర్ "బోలోరే నయాగోల్! బోలోరే జువినైల్" (Javinile ward) అని సాగతీస్తూ అరుస్తున్నాడు... రాత్రి యింకా ఎక్కువ ప్రొద్దు పోలేదు కాని ఈలోగానే వార్డులలో పహరావాళ్ళే ఎక్కువమంది బాధ్యతాజ్ఞానంతో జవాబివ్వటం మొదలెట్టారు. వార్డరు రాగధోరణిని 'బోలోరే' అని అరుస్తున్నాడు. "బోలోరే పాంచనంబర్" అనటానికి నాకు పదహారు అంకెలు లెక్కపెట్టటానికి పట్టేటంత వ్యవధి పట్టింది. ఒక రోజున వార్డరు నాతో రాగవరుసన పిలిస్తేనే శ్రమ కొంచెం దగ్గుతుందని గొంతు పగిలిపోయే అవకాశమేమీ ఉండదని చెప్పాడు. ప్రతి వార్డులోనూ పైన రెండు, క్రింద రెండు పెద్దహాల్స్టుంటాయి. జైలు పరిభాషలో వీటిని ఖానా (విభాగం)లంటారు. అయిదో నంబరువార్డు నుంచి బొంగురుపోయిన మొరటు గొంతుతో "అయిదో నంబరు మొదటి ఖానా నూటయాభై యేడుమంది ఖైదీలు, తాళాలు, లైట్లు సరిగ్గానే ఉన్నాయి" అని జవాబు వచ్చింది. ఆ గొంతు వినగానే అతను ముఖంనిండా నెరిసీ నెరవని రెండు పెద్ద కోర మీసాలున్నవాడు, బాధ్యత నెరిగినవాడై ఉంటాడని అనిపించింది. అతని నెత్తిన నీలంటోపీ - అంటే పహరా (కాపలాదారు)అన్నమాట! నెలకు నాలుగణాల

జీతం అతని పేర సర్కారు వీరులతరపునుంచి జమ అవుతుంది. దానికి బదులుగా రాత్రి రెండు గంటలు మేలుకుని ఈ కాపలా ఉండే పని చెయ్యాలి. అతను సర్కారు వారి ఉప్పుతింటున్నాడు. పనిలో మోసం యెందుకు చేస్తాడు? అయిదో నంబరు వార్డులోని తక్కిన మూడు ఖానాలనుంచి జవాబులొచ్చాయి. అవి యింత స్పష్టంగా లేవు. వారు అన్నీ వివరంగా చెప్పనేలేదు. 'ఏహో' అన్న మాదిరి ఒక్కమాటే వినిపించింది గ్రామాల్లో చౌకీదారు అర్ధరాత్రివేళ వేసే కేకలాగ. రాగవరుసన చెప్పుదామన్న ప్రయత్నంలేదు - ఏదో వెనకటి పాపాన్ని తగ్గించుకోవాలన్న ధోరణిలో చెప్పటం. వీరు కచ్చితంగా తెల్లటోపీలు ధరించే 'మేట్స్'. అంటే వీరు పహరాదార్లకంటె పాత ఖైదీలన్నమాట. నెలకి ఎనిమిదణాల వంతున జీతం వస్తుంది నిజమే. కాని వారు జైలు వ్యవహారాలెన్నో చూసినవారు, విన్నవారు. ఈ పని సక్రమంగా చెయ్యటంమీద వారికి వచ్చే మినహాయింపు (remission) ఆధారపడి వుండదని వారికి తెలుసు. హెడ్ జమాదారుని ఎలా సంతృప్తిపరచాలో కూడా వారికి తెలుసు. ఒక 'మేట్' అంటే మరీ అలాంటి యిలాంటి వాడేమీ కాదు. అతని అధీనంలో యింతమంది ఖైదీలుంటారు. వారిని అదుపులో పెట్టాలంటే -జైలు అధికారుల పట్ల, జైలు నియమ నిబంధనలపట్ల కొంచెం బేపర్వాతనం - నిర్లక్ష్యత చూపాల్సిందే.

'బోలోరే నయాగోల్ (Segnegation ward) ఏకాంతవాస ఖైదీల వార్డు బోలోరే అనగానే నేను చెవులు రిక్కించుకుని - అయిదో నంబర్ తర్వాత ఆరో నంబరు అని కేకేస్తా 'నయాగోల్' అని కేకేస్తాడా అని - ఎదురు చూస్తున్నాను. దాన్ని బట్టి వార్డరు క్రొత్తవాడైనదీ పాతవాడైనదీ తెలిసిపోతుంది. ఆరో నంబరు వార్డుకి మరో పేరు "దామ్‌లీకితా' యావజ్జీవశిక్ష పడిన ఖైదీలు ఆ వార్డులో ఉంటారు. ఈ ఖైదీలు తక్కినవార్డులలో ఉండే ఖైదీలను పుచ్చకాయల దొంగలని ఎగతాళి చేస్తూ చులకనగా చూస్తారు. వారందరూ సొరకాయలో పుచ్చకాయలో దొంగిలించి జైల్లో పడ్డారట. ఈ యావజ్జీవఖైదీలను వార్డర్లందరూ కొంచెం మర్యాదగా చూస్తారు. ఈ ఖైదీలకు పాతవార్డర్లతో ఒక ఏర్పాటుంది. వారు సెంట్రల్ టవర్ మీద డ్యూటీలో వీరు రాత్రంతా ప్రశాంతంగా నిద్రపోవచ్చు. మేట్ - పహరాల కేకలు, ఖైదీల లెక్కనుంచి వీరికి ముక్తి కలుగుతుంది. పగలంతా ఈ అభాగ్యులు జైలు ఫ్యాక్టరీలో పనిచేస్తారు. కొంచెం నిరాఘాటంగా నిద్రపోయే సుయోగం లభించకపోతే వీరు జీవితమంతా ఎముకలు విరిగే శ్రమ ఎలా చెయ్యగలుగుతారు? క్రొత్త వార్డరు అయితే నిశ్చయంగా 'బోలోరే భయ్ నంబర్' అని అరిచేవాడు. రెండో నంబరు వార్డులోనుంచి ఆరో నవంబరు

వార్డు వైపు చూస్తే పెద్ద జెంక్షన్ అయిన రైల్వేస్టేషన్ ప్లాట్‌ఫారం మీద నిలుచుని ఉన్నామనిపిస్తుంది. ఈవార్డు ఒక రాజా బహదూర్‌గారి దానం. దానం యొక్క అర్హత - ఉద్దేశ్యం ఎన్నుకునే ప్రతిభ రాజా బహదూర్‌గారిది అనన్య సాధారణమని చెప్పాలి.

ఏమైనాకానీ - దానం ద్వారా రాజా బహదూర్‌గారి నిగూఢమైన ఆకాంక్ష ఏదైనా సిద్ధించిందో లేదో తెలియదుకాని జీవితమంతా కారాగారంలో గడిపే అభాగ్యులు మాత్రం వారికి కచ్చితంగా హృదయ పూర్వకమైన ధన్యవాదాలర్పిస్తారు. యావజ్జీవ ఖైదీలు సాధారణంగా మంచివాళ్ళు. ఆరితేరిన దొంగల్లో ఉండే దుర్మార్గం, నీచత్వం వారిలో లేదు. జైలునే ఇల్లుగా చేసుకున్నారు. కొందరు వార్డు ముంగిలిలో ఎంతో శ్రద్ధగా తులసి చెట్లను వేసుకున్నారు. కొందరు కాస్త మేర శుభ్రం చేసుకుని అలికి కూర్చునేచోటు తయారు చేసుకున్నారు. చాలా మందికి స్వంత మిరపచెట్లు - పుదీనా మళ్ళు వున్నాయి. ఈ మొక్కలమీద వారి కెంత మమకారం ! స్నేహం ప్రేమ పుత్రవాత్సల్యపు స్వాభావికమైన ఉద్వేగాన్ని వారీచెట్లమీద పూర్తిగా క్రుమ్మరించుకున్నారు.

హజారబాగ్ జైలు నుంచి ఫ్రెంచి దొర విలియమ్స్ విడుదలయే రోజున ఎంత విలపించాడు! అతను పధ్నాలుగు సంవత్సరాలు జైల్లో గడిపాడు. అతను నాటిన జామచెట్టు ఎంత పెద్దదయింది. అతని చేతితో పెట్టిన "గులాబ్‌జామ్' చెట్టు పౌడర్ పఫ్‌లాగా పూలతో నిండి వుంది. అతను రావిచెట్టు క్రింద కూర్చోవటానికి అరుగు తయారు చేయించుకున్నాడు. దాన్ని గురించి సూపరెండెండెంట్ పి.డబ్ల్యు.డి. ఇంజనీర్ల మధ్య ఎన్ని మనస్పర్థలు రేగాయి! అన్నిటివైపుచూసి కుమిలి కుమిలి ఏడ్చాడు. వయసు మీరినవారిలా కుమిలి కుమిలి యేడవటం చాలా తక్కువ మందిని చూశాను. ఇంటికి వెడుతున్నాం - ఆత్మీయుల నందర్నీ చూడబోతున్నామన్న ఆనందంకంటె ఈ చెట్లను, జైల్లోని మిత్రులను వదిలి వెళ్ళిపోతున్నామన్న దుఃఖం ఎక్కువయ్యింది. చాలాసేపు ఒకే భంగిమలో కూర్చోవటంతో కూడికాలు మొద్దుబారినట్లయింది. గదిలో కొద్దిసార్లు అటూ యిటూ తిరిగాను కాలి తిమ్మిరి పోవటానికి. గుమ్మం కటకటాలు పట్టుకుని, అడ్డంగా కూర్చునప్పుడు నాకు తెలియకుండానే కుడివైపున బరువు మోపి కూర్చున్నాను. పొరపాటునయినా యెడమ బుజం కటకటాలకి మోపించి ఎడమ వైపు బరువు మోపి కూర్చోలేదు.

... అప్పుడు మేమెంత చిన్న వాళ్ళం! స్కూల్‌కి వెళ్ళలేదు. బోర్డింగ్ దగ్గర హెడ్మాష్టర్ క్వార్టర్. నాన్న స్కూల్‌కి వెళ్ళాడు. అమ్మ వక్కలు కత్తిరిస్తూ కూర్చుని వుంది. నేనూ నీలూ తగువులాడుకుంటున్నాం. నీలూ అమ్మ కుడివైపు ఒడి తనది అన్నాడు. ఎడమవైపు

ఒడి నేను తీసుకోవాలనుకుంటే తీసుకోవచ్చు. ఎందుకనో తెలియదు. ఎడమవైపు ఒడి తీసుకోవటం నాకు అవమానంగా తోచింది. ఇద్దరం అమ్మ కుడి ఒడిలో చేతులు వేచి మా హక్కును స్థిరీకరించుకోవటానికి ప్రయత్నించాం. ఈ త్రోపులాటలో హఠాత్తుగా నీలూ కాలు తగిలి కత్తిరించిన వక్కలు పెట్టిన పేముబుట్ట బోర్ల పడింది. అమ్మ దభీ దభీమని నావీపుమీద రెండు గుద్దులు వేసింది. "పెద్ద వెధవ్వి సిగ్గులేదూ? ఏళ్ళు వచ్చిన కొద్దీ బుద్ధులు బుగ్గవుతున్నాయి" అన్నది. "నేను వక్కలు బుట్ట పడత్రోశానా ఏం?" అని జవాబిచ్చాను. "ఇంకా మాట్లాడుతున్నావా మళ్ళీ? తమ్ముడు కుడి ఒడి కావాలన్నాడు. వాడి కుడి ఒడి తీసుకోవాలా? కుడివైపు ఒడి నీలూది. ఇంకా కాస్త అయితే నా చెయ్యి కత్తెర మూలంగా తెగిపోయేది. ఇంకేమన్నావుందా?" అన్నది కోపంతో. అవమానంతో నాకు కళ్ళ వెంబడి నీళ్ళొచ్చాయి. కొంచెం దూరంగా వెళ్ళి మెదలకుండా కూర్చున్నాను. కొంచెం సేపయ్యాక నీలూ లేచి వెళ్ళిపోయాడు. పోటీదారు యెదురుగా లేకపోవటంతో వాడి తగవులాడే కోరిక తీరిపోయిందనుకుంటా. అమ్మ మధ్య మధ్య నేనేం చేస్తున్నదీ చాలాసేపటినుంచి అరకంటితో చూస్తూండటం గమనించాను. తర్వాత వక్కలు కత్తిరించటం అయిపోయాక వక్కలబుట్ట డ్రాయర్‌మీద పెట్టి నా దగ్గిరకొచ్చి "నువ్వింత అమాయకుడివేంరా? ఎడమవైపు ఒడే బాగుంటుంది. కొమ్ము చెంబుతో పాలు తాగించేప్పుడు - ఎడమ వైపు ఒడిలో తలపెట్టి పడుకోపెట్టుకుని, పిల్లలకి కుడిచేత్తో పాలు తాగించటం నువ్వు చూడలేదా? నువ్వు కుడి ఒడిలోనూ పడుకున్నావ్! లే, ఆ దొంగపిల్లాడెటు పారిపోయాడో చూడు" అన్నది. ఆ కారణం ఆ సమయంలో ఖండించటానికి వీల్లేనిదిగా తోచింది.

కుడికాలి తిమ్మిరి తగ్గిపోయింది. గదిలో అటు యిటు తిరగటం చూసి, వార్డరు గుమ్మం దగ్గిరకొచ్చాడు. నేనేం ఆలోచిస్తున్నదీ, హఠాత్తుగా అర్ధరాత్రి వేళ గదిలో ఎందుకటూయిటూ తిరగటం మొదలెట్టినదీ తెలుసుకుందామనుకున్నాడు. బహుశా ఈ బాబు మనస్సు సరీగ్గా లేదని అనుకుని వుంటాడు. ఇవాళ సరిగా వుండేరోజు కాదు కూడా. వార్డరు కటకటాల బయట నిలుచుని చూస్తున్నాడు. జంతు ప్రదర్శన శాల ప్రేక్షకులు - బోనులో ఉన్న యే అడవిజంతువునో చూసినట్లు చూస్తున్నాడనిపించింది నాకు.

జంతు ప్రదర్శనశాలంటే జ్ఞాపకం వచ్చింది. కాశీలో ఉండగా నా మిత్రుడు నరేష్ చిన్న నాయనమ్మ తీర్థయాత్రకి వచ్చింది. కొంచెం దూరపు చుట్టమయిన నాయనమ్మ. ఒక వృద్ధ జమీందారు రెండో పెళ్ళి చేసుకున్నాడామెని. పెళ్ళి అయిన

కొద్దిరోజులకే ఆమె వితంతువయింది. కాశీకి చిన్ననాయనమ్మ వెంట ఆమె తల్లీ తండ్రీ వచ్చారు. వరుసకి చిన్ననాయనమ్మ - ఆమె చిన్న వయసుచూసి విస్తుపోయాను. నేను, నరేష్ వారిని వెంటపెట్టుకుని యెంతో ఉత్సాహంతో కాశీలో చూడవలసిన వాటినన్నింటినీ చూపించాము. మహారాజాగారి జంతు ప్రదర్శనశాల చూడటానికి తీసుకెళ్ళాను. పెద్దపులి బోను గది బయట నుంచున్నాను. పెద్దపులి కాళ్ళు రెండూ ముందుకు చాచి, ఒక వికృతమైన ధ్వనిచేసింది. దాని ముఖభంగిమ చూస్తే ఆవులిస్తున్నట్లుంది. నరేష్ చిన్ననాయనమ్మ అమ్మో అంటూ నన్ను గట్టిగా కావలించుకుంది. భయంతో అనుకుంటాను. కొద్ది కణాల సంఘటన మాత్రమే. బహుశా ఈ సంఘటన ఆమె తల్లి, తండ్రి, నరేష్ ఎవరూ చూసి వుండరు. చూసినా కనీసం విడ్డూరమని అనుకోరు. కాని ఈ కొద్ది క్షణాల సంఘటనతో నా అంతరాంతరాల్లో ఎన్ని కలలు కన్నాను. నరేష్ సలహా ప్రకారం చిన్ననాయనమ్మ తల్లిని పిన్నీ అని పిలవసాగాను. కాశీలో వారున్న బసకు నరేష్‌తో కలిసి వెళ్ళాను. సరాసరి ఆమె వంట చేసుకుంటున్న ఇంట్లోకి వెళ్ళాను. పిన్ని చాలా మంచిది. కబుర్లవీ యెక్కువగా చెప్పలేదు. పట్నంలో చదువుకునే నాగరీకులైన కుర్రాళ్ళతో మాట్లాడబోతే యేంమాట్లాడటానికేం మాట్లాడతామో అని భయం. నేను వంటింట్లోకి వెళ్ళగానే "మా పాడుపడిన కొంపలో చందమామ వెన్నెల" అన్నది. ఆమె ఏ ఉద్దేశంతో అలా అన్నదో సరీగ్గా తెలుసుకోలేకపోయాను. తర్వాత చేతిలో గరిట అలాగే పట్టుకుని ఏదో సంకుచితురాలై నిలబడిపోయింది. ముఖంలో అర్థవిహీనమైన హాస్యభంగిమ. ఆ తర్వాత కొన్నాళ్ళు వాళ్ళతో కలిసి తిరుగుతూ మేము కూడా విడిగా ఉండేవాళ్ళం. చిన్ననాయనమ్మ తండ్రికోసం నాలుగు రకాల టార్చిలైట్లు ఎన్నో దుకాణాలు తిరిగి కొన్నాం. బజారులోకి రాగానే వారికిలాంటి ఏదో వస్తువొకటి కొనాలని జ్ఞాపకం వచ్చేది. ఆయన అనాగరికమైన పల్లెటూరి ధోరణిలో మాట్లాడేవాడు. కూతురికి సంరక్షకుడు (గార్డియన్). అల్లుడు పోవటంవల్ల ఆస్తి, పాస్తులాయనే చూసుకునేవాడు. ఒక్కగానొక్కకూతురి వైధవ్యయోగం ఆయనకంతగా దుఃఖం కలిగించినట్లు లేదు. పైగా తానిన్నాళ్ళూ గడిపిన పేదరికంలో తీరని కోరికలన్నీ తీర్చుకునే అవకాశం కలగటంతో ఆయనలో కొంచెం స్వార్థం పెరిగింది. ఒక్క కూతురంటేనే కొంచెం భయం... కాశీలో చిన్న నాయనమ్మ తల్లికి జబ్బు చేసింది. ఆమె కప్పుడు వాతరోగం వచ్చింది. నా చేతి మీదుగా యిచ్చిన మందు తప్ప ఎవరిచ్చినా త్రాగేదికాదు. ప్రతిరోజూ విశ్వనాధాలయంలోని పాండా యింటినుంచి రోగికోసం కొబ్బరి బొండం తీసుకెళ్ళేవాణ్ణి. ఇంట్లోకి వెళ్ళగానే చిన్ననాయనమ్మ "ఇదిగో సన్యాసిబాబా

వచ్చారు. అమ్మకిహ నిశ్చింత" అనేది. అప్పుడు నాకు కఠోర సాధన చెయ్యాలని కోరిక కలిగింది. నేనప్పుడు జులపాల జుట్టు పెంచాను. గడ్డం మీసాలు వచ్చాయి. కానీ తీసుకోవటం యింకా మొదలెట్టలేదు. అందుకని చిన్న నాయనమ్మ నన్ను సన్యాసిబాబా అనేది. అమె సంగతి గుర్తురాగానే ఆమె కళ్ళముందు మెదులుతుంది. నీలం మబ్బురంగు చీరె, చేతులకు బొంబాయి రకం మెలికల గాజులు, మెళ్ళో లావుపాటి బంగారపు గొలుసు - తల్లి ప్రాణం ఒక్కగానొక్క కూతురు వితంతువేషాన్ని ధరింపనీయలేదనుకుంటా. శరీరం రంగు నలుపు. చుక్కల అంచునీలంరంగు చీరె ఆమె ఒంటికి ఏమాత్రం నప్పలేదు. చిన్ననాయనమ్మ మరీ పల్లెటూరి సామాన్య గృహస్తుల యింటిబిడ్డ. ఆమెకి చెప్పుకోతగిన అందచందాలేవీ లేవు. కాని ఆమె రూపంలోని కోమలత, పూర్తిగా ఆత్మీయుణ్ణి చేసుకుని, చనువుగా, అపేక్షగా మాట్లాడుతూ వ్యవహరించటం నన్ను ఆకర్షించాయి. వారు తమ ఊరుతిరిగి వెళ్ళేరోజున - నేను నరేష్ వారిని రైలెక్కించటానికి వెళ్ళాము. నరేష్, చిన్ననాయనమ్మ నాన్న - కిళ్ళీకొట్టు దాని దగ్గర చివరి క్షణంలో జ్ఞాపకం వచ్చిన మంచి కాశీ జరదా కొనుక్కు తెచ్చుకోవటానికి వెళ్ళారు. నేను ప్లాట్‌ఫారం మీద చేతులు రెండు కిటికీమీద అనించి నుంచుని వున్నాను. చిన్న నాయనమ్మ నా చేతుల మీద చెయ్యి అనించి కిటికీ కెదుట కూర్చుంది. అమె రెండు కళ్ళలో నీళ్ళునిండాయి. నేను ఆమెకేసి చూడలేకపోయాను. నాతో మెల్లిగా "సన్యాసీబాబా! మా ఊరు ఒకసారిరా" అన్నది. ఆమెకి వస్తానని మాట యిచ్చాను. చాలా రోజుల వరకు ఆ మాట నిలబెట్టుకోవాలన్న కోర్కె వుండేది. చిన్ననాయనమ్మ వెళ్ళిపోయాక కొన్నాళ్ళు అంతా యేదో శూన్యంగా ఉన్నట్లు తోచేది. దేనిమీదా మనసు నిలకడగా వుండేది కాదు. అటు తిరిగి ఇటు తిరిగి యెప్పుడూ ఒక ముఖం కళ్ళముందు మెదిలేది. ఉత్తరం వస్తుందన్న ఆశతో పోస్టాఫీసుకి కూడా వెళ్ళి హాజరయ్యేవాణ్ణి.

తర్వాత ఆ నీలంమబ్బు రంగు చీరె, ఆ బొంబాయిగాజుల చేతులు మనస్సుకి తెలియకుండానే మెల్లి మెల్లిగా స్మృతిపథంలోంచి చెరిగిపోయాయి. నాలుగయిదేళ్ళ క్రితం పాత ఉత్తరాలన్ని కుప్పపోసి కాల్చేసేటప్పుడు ఒక నీలిరంగు కాగితం మీద రాసిన ఉత్తరంలోని రెండు పంక్తులు చదివేసరికి ఆమెలోని సంస్కారహీనత నాదృష్టికి చాలా వెగటుగా తోచింది.

"సన్యాసిబాబా! నీ పెళ్ళి భోజనానికి నన్ను పిలవటం మరిచిపోకు. ఆ విందు కోసం 'పొట్ట పొర' తీసుకుని ఎదురుచూస్తున్నాను." పొట్ట పొర తీసుకుని అనే మాట అభిరుచి దైన్యాన్ని వ్యక్తపరుస్తుంది. ఉత్తరం ఇలాంటి ధోరణిలో వ్రాయటం అనేది

తలపుకివస్తేనే మనస్సంతా అవజ్ఞతో నిండిపోతుంది.

టక్ టక్ టక్ పదును నూరే రాయి ఉన్న ముంగిలిలో మిలిటరీ బూట్లు చప్పుడవుతున్నాయి. ముగ్గురు క్రొత్త సిపాయిలు వచ్చారు. ఇంతకుముందున్న వార్డర్ల దగ్గిర్నుంచి ఛార్జీ తీసుకుని, గదుల తాళాలు సరీగ్గా ఉన్నాయో లేదో చూశారు. ఏ సెల్ ముందరా ఎక్కువసేపు నుంచుని కేకలు అరుపులు పెట్టలేదు. సెల్‌లలో ఏ ఖైదీ ఇంకా నిద్రపోలేదని తెలుసుకున్నాను. నిద్రపోయి ఉన్నట్లయితే వార్డర్లు తప్పకుండా పిలిచి లేపేవాళ్ళు. చార్జీ మారినప్పుడు క్రొత్తవార్డరు ప్రతి సెల్‌లోని ఖైదీని అతను బ్రతికి ఉన్నాడో లేదో పిలిచి లేపి చూస్తాడు. ఒకవేళ ఎవరైనా సెల్ గుమ్మంముందు కూర్చుని ఉంటే దగ్గికాని మరొక ఉపాయం దేనితోనైనాకాని తాను ఆరోగ్యంతో బ్రతికి ఉన్నానని వ్యక్తం చేస్తాడు. అప్పుడిహ అతణ్ణి పిలవరు. కాని నిద్రపోతే మాత్రం తప్పించుకునేందుకు లేదు. సెల్‌లో ఉండే ఖైదీ - అతనికి కూడా ఏక బిగిని రెండు గంటలకంటె యెక్కువ సేపు గాఢనిద్ర అవసరం ఏముంది? కారణం అడిగితే - ఇది రూలుబాబూ! ఒకవేళ యెవరైనా స్పృహ తప్పి పడిపోతే లేదా జబ్బు చేసి మాట పడిపోతే - అలాంటప్పుడు పిలవకపోతే మాకు తెలిసేదెలా? డాక్టరుబాబుని పిలిచేదెలా? అంటారు. నిజం చెప్పాలంటే దీనివల్ల ఖైదీలకు అసౌకర్యం ఏమీ కలగదు. దోమలు, నల్లులు, చీమలు - రాత్రింబవళ్ళు పని లేకపోవటం, దిగుళ్ళు - మొదలైన ఎన్నో కారణాల మూలంగా, సహజమైన శ్రమ జీవితపు గాఢనిద్ర సెల్‌లో ఉండేవారికి వుండదు.

పదో నంబరు సెల్‌లోంచి రాగ ధోరణిలో 'శహీందోంకే టోలీ నికలీ' అని గాలిలో తేలి వస్తూ వినిపించింది.

'టోలీ' మాట వినగానే, పాట్నాకాంప్ జైల్లో పంథొమ్మిది వందల ముప్ఫై రెండో సంవత్సరం సేవాదళం ట్రైనింగ్ పొందటానికి నిర్ణయించుకున్నాం. మొదటిరోజున కవాతు పూర్తికాగానే నీలూ నన్ను టోలీ అంటే యేమిట్రా? అని అడిగాడు. నేను వాడికి కొంత మంది సిపాయిలు కలిస్తే టోలీ అవుతుందని సిపాయీలంటే - ప్రైవేట్ వాళ్ళని, టోలీ నాయకుడు - ఎన్.సి.ఒ. అని వివరంగా చెప్పాను. నీలూ అసహనంతో "అవన్నీ ఇవాళ్ళ తెండూల్కర్ బాగా తెలిసేట్లు చెప్పారు. కాని నేనడుగుతున్నది - టోలీ అనే పదానికి వీళ్ళందరూ ఎందుకిష్టపడ్డారు? అంతకంటె మరొక పదం యేదీ దొరకలేదా? అని అన్నాడు. 'టోలీ" అంటూ ఎంత ఎగతాళి. ఆ రోజునే సాయంత్రం తెండూల్కర్ కదమ్‌ఖోల్ సావధాన్ వీటి అర్థంబోధిస్తూంటే - నీలూ చటుక్కున డ్రిల్ మధ్యలో ఫక్కున నవ్వాడు. తెండూల్కర్ కోపంతో మండిపడ్డారు. ఆయన హుబ్లీలో హార్డికర్ క్యాంప్‌లో ట్రైనింగ్

అయినారు. బొంబాయిలో క్యాంప్ నడిపించారు. ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుని ప్రత్యేక కోరిక మీద ఆయన మహారాష్ట్ర విడిచి బీహార్‌లో సేవాదళ్ కార్యక్రమం చేపట్టటానికి వచ్చారు. సేవాదళం ట్రైనింగ్ విషయంలో ఆయనకు బోలెడు అనుభవం ఉంది. కాని డ్రిల్లు జరిగే సమయంలో ఇలా డిసిప్లిన్ లేకపోవటం ఇంతకుముందెప్పుడూ చూడలేదు. ఆయన హిందీ బాగా మాట్లాడతారు. "ఈ కర్ర నీమీద పడుతుంది" అంటూ చేతిలోని లాటీతో ఒక పోటు పొడిచాడు. నీలూ ఆయన జేతిలోంచి లాటీ లాక్కుని బిగ్గరగా "కర్రపడుతుందా? అవన్నీ మహారాష్ట్రలో చెయ్యండి. ఇక్కడ అవేమీ సాగవు. రాష్ట్ర భాష మాట్లాడటానికి రాదు. పూనా నగరాన్ని పూండే అంటారు. కాని హిందీలో మాట్లాడాలని సరదా వుంది'' అన్నాడు నీలూ. తెండూల్కర్ చెయ్యిపట్టుకున్నాడు. నాలుగువైపులనుంచి అందరూ వచ్చి అతణ్ణి విడిపించారు. వెంటనే ఈ సంగతి జైలు అంతా ప్రాకిపోయింది. క్యాంప్ జైల్లో అప్పుడు ఇంచుమించు నాలుగువేల అయిదువందలమంది రాజకీయ ఖైదీలున్నారు. ఏ వార్డులో కెళ్ళినా అన్నిచోట్లా కొద్దిమంది గుంపులుగా కూడి ఈ సంగతినే చర్చించసాగారు. జైలు కేంద్రం - దానికి మేము చౌక్ అని పేరు పెట్టాము. అక్కడ అప్పటికొక పెద్ద గుంపు కూడింది. వార్డర్లు కూడా రాజకీయ ఖైదీలతో కలిసి ఒకటయినారు. వారికి జైలు పాలిటిక్స్ మీద ఉత్సాహం తక్కువేమీకాదు. ఒకరు అసలు పరిస్థితిని అందరికీ వివరిస్తూ, బీహార్‌కి గల మంచి పేరుకి మచ్చ వస్తుంది. తెండూల్కర్ బయటివారు. వారికి అతిథి సత్కారం ఈ విధంగానేనా జరపటం. పైగా రాష్ట్ర భాషను హేళన చెయ్యటమా? అంటూ ఉపన్యాస మిచ్చాడు. తర్వాత దగ్గిరగా ఉన్న శ్రోతలు విశ్వసనీయులుగా భావించి ఏదో రహస్యం చెపుతున్నట్టు కంఠస్వరం తగ్గించి బెంగాలీ కదూ! అన్నాడు. తర్వాత పెదవుల మీదికి చిన్న నవ్వు తెచ్చుకుని, దాని ద్వారా నీకంతా తెలుసు ఇంక మీకు వివరంగా చెప్పవలసిందేముంది? అని వ్యక్తం చెయ్యాలనుకున్నాడు. సిగ్గుతో అవమానంతో నాకు తల కొట్టేసినట్లయింది. వీరు నీలూ మనుస్సులోని భావాన్ని ఎరుగరు. వాడి ప్రవర్తనను బట్టి తమకుతోచినట్లు అర్థం చేసుకున్నారు. ఈ అర్థం వారికి బాగా నచ్చింది. సాయంత్ర మయాక వార్డులో భోజనం సమయంలో నీలూని చూశాను. సూర్యాస్తమయానికి ముందే భోజనాలవుతాయి. అప్పుడు ఆకలి వెయ్యదనీ మేము రొట్టెలు తీసుకుని వార్డ్‌లో ఉంచుకుంటాం. తర్వాత, రాత్రి కొంచెం ప్రొద్దుపోయాక తింటాం. నీలు తానే మాట్లాడటం మొదలెట్టి నా సంకోచాన్ని పోగొట్టాడు. సాయంత్రం సంఘటనకు నేను సిగ్గుపడ్డాను. కాని నీలూ మాత్రం ఏమీ విస్తుపోలేదు. "ఈ డ్రిల్ ఆర్డర్‌లన్నీ ఇంగ్లీషులోనే

ఉంచితే వచ్చే నష్టం ఏముంది? క్విక్ మార్చ్ స్టాండ్ ఎట్ ఈజ్ అంటే భారతదేశానికి స్వాతంత్ర్యం రావటం అసంభవమవుతుందాయేం? హిందీ తెలియదు. అయినా హిందీలో చెప్పాలనుకోవటం మానర్స్ తెలియవు. అల్పులు వారికింకా గౌరవమెందుకు?" అని అతను చెప్పుకుపోసాగాడు. నేను యే విషయంలోనూ ఎప్పుడూ నీలూకి అయాచితంగా సలహా యివ్వలేదు. వాడే ముందు మాట్లాడటం మొదలెట్టకపోతే ఇప్పుడు కూడా బహుశా ఏంమాట్లాడేవాణ్ణి కాను. తక్కిన రాజకీయ ఖైదీలు నీలూ ఆచరణకు ఏఏ వికృతార్థాలు కల్పించారో అది క్లుప్తంగా వివరించి చెప్పాను. నీలూ రెచ్చిపోయి 'వీరా స్వరాజ్యం సాధించేది' అన్నాడు. తర్వాత ఎన్నో అనర్గళంగా మాట్లాడటం మొదలెట్టాడు. కొంచెం సేపయ్యాక చూస్తే ఆ కోపం అంతా ఒక అజ్ఞాత సహచరుడిమీద పడింది. అతను నీలూ దాచుకున్న బెల్లం దొంగిలించి తినేశాడు. ఆదివారం రోజున నియమాన్ని పాటించే రాజకీయ ఖైదీలకు అన్నానికి బదులు బెల్లం, రొట్టె - లేదా అణన్నర పళ్ళు కాని యిస్తారు. నీలూ బెల్లం తీసుకుంటాడు. ఆదివారంనాడు నా అన్నాన్ని ఇద్దరం కలిపి తింటాం. ఈ అసౌకర్యానికిష్టపడి, మేమావారం రోజులూ కొంచెం కొంచెం బెల్లం తింటూ ఉంటాం. ఆ దాచుకున్న బెల్లం దొంగిలింపబడింది. కనుక నీలూకి కోపం రేగటం ఆశ్చర్యమేమీకాదు. కాని నాకు మాత్రం బాగుండలేదు - నీలూ బిగ్గరగా అరుస్తూ రాజకీయ ఖైదీలకు అందరికీ వినిపించేట్లు వ్యాఖ్యానించటం పైగా వాతావరణం ఇతనికి అనుకూలంగా లేనప్పుడు నాకేం నచ్చలేదు. ప్రపంచమంతా తనకెదురు తిరిగినా సరే నీలూ మాత్రం యెప్పుడూ తన దారి నుంచి వెనక్కి తగ్గడు. ఒకసారి అతనొక నిర్ణయాన్ని తీసుకుంటే ఇంక యెవ్వరూ ఆ నిర్ణయాన్ని మార్చలేరు. నేను ఈ నీలూ యేం బెడద తెచ్చిపెడతాడోనని యెప్పుడూ భయపడుతుంటాను. జైల్లో రాజకీయ ఖైదీలకు కాలం గడవటానికేదోపని వుండాలి. పని కావాలనే కోరిక జైలు బయట ఉంటే - అది ఎప్పుడూ వారిని నడిపిస్తుంది. ఆ తృప్తికోసం వారు జైల్లో జట్లు జట్లుగా యేర్పడి పాలిటిక్స్‌ని తీసుకొస్తుంటారు. కాని ఏ రోజుకారోజు క్రొత్త ప్రోగ్రాం లేకపోతే మనస్సు కుదురుగా ఎందుకుంటుంది? ఇందుచేతనే నీలూ వ్యవహారం ఎక్కువ దూరం సాగలేదు. మర్నాడు ఉదయం ఫలహారాలు పంచే సమయంలో ఎవరో - నాన పోసిన సెనగలు ఫలహారంగా యిస్తున్నారు. వీటికి బదులు అటుకులు కనుక యిస్తే చాలా బావుంటుంది అని లేవతీశారు. ఇంకేముంది? వెంటనే "సెనగలు బదులు - అటుకులు కావాలి" అంటూ పాట కట్టేశారు. జైల్లో ఉన్న వాళ్ళందరూ ఇదే ఏకకంఠంతో అరవటం మొదలెట్టారు. దాంతోపాటు చెంబులూ పళ్ళాలూ వాయించసాగారు. కొందరు ఈలలు వేశారు. కొందరు

గుమ్మం కటకటాలపై నుంచి తమ పళ్ళాలను రాయటం మొదలెట్టారు. దాంతో పెద్ద రణగొణధ్వనులు రేగాయి. చాలామంది కిటికీలమీద ఎక్కారు. ఇద్దరు కిటికీల మీద నుంచి ప్రాకి రేకుల కప్పులమీదికి ఎక్కారు. హఠాత్తుగా ఏదో మంత్రదండ స్పర్శతో అందరూ ఒక్కసారిగా ఉన్మాదులయినట్లున్నారు. ఎవర్ని ధీరులు గంభీరులని అనుకున్నామో వారు కూడా అపరిమితమైన ఉత్సాహంతో తమను నిగ్రహించుకోలేక పోవటం గమనించాను. కొందరు పిచ్చివాళ్ళలాగా వార్డులో ఈ చివరనుంచి ఆ చివరకు 'కంబళి' 'కంబళి' అని అరుస్తూ పరుగులు తీయసాగారు. వారి కేకతో చాలామందికి ఒక క్రొత్త ప్రోగ్రాం దొరికింది. చూస్తూ చూస్తూండగానే కొందరు కంబళ్ళు తెచ్చి కుప్పగా పడేశారు. కంబళ్ళను ముక్కలు ముక్కలుగా చించి పారెయ్యటానికి ప్రయత్నం జరుగుతోంది. ఒకరు వంటింట్లో నుంచి మండుతున్న కట్టెతెచ్చి కొన్ని కంబళ్ళమీద పడేశాడు. దాన్నుంచి కొంచెం కొంచెం పొంగ కమురు వాసన రాసాగింది. ఇద్దరు పరుగెత్తుకువెళ్లి సెనగలు నానపెట్టి వున్న గంగాళాన్ని బోర్లించారు. దగ్గిరలో ఉన్న వార్డరు 'అలారం' విజిల్ మోగించాడు. ఆగకుండా విజిల్ మ్రోగుతూనేవుంది. ఇది విని జైలు అంతటా ఎక్కడున్న వార్డర్లు అక్కడనుంచి విజిల్స్ వేయసాగారు. ఫుట్‌బాల్ రిఫరీలకు ఇంజన్ డ్రైవర్లకీ మధ్య ఏదో విజిల్స్ పోటీ జరుగుతున్నట్లుంది. అంతులేని విజిల్స్ మోత జైలు వాతావరణానికి ఒక క్రొత్త రూపాన్నిచ్చింది. సెంట్రల్ టవర్ మీదినుంచి ఢంగ్ ఢంగ్‌మని గంట ఆగకుండా మ్రోగుతూ వుంది. జెమ్‌గేట్‌లో ఇలాంటి మరొక గంట మోగుతోంది. పుస్తకాల్లో చదివిన్న ఓడ మునిగిపోతున్న దృశ్యం. ఇహ ఇటుచూస్తే కంబళ్ళు తగలడుతున్నాయి. కంచాలు మోగుతున్నాయి. 'బానిస ప్రభుత్వం నశించాలి' అంటూ ఒకటే కోలాహలం. ఇంకా ఎన్నో - అన్ని స్పష్టంగా గుర్తు రావటం లేదు. జైలు అధికారులు యెక్కడే స్థితిలో ఉన్నవారు అలాగే కంగారుగా పరుగెత్తు కొచ్చారు. సెంట్రల్ టవర్‌కి వార్డ్ నంబర్ పదిహేడు - పద్దెనిమిది - పంధొమ్మిది అని వ్రాసిన సైన్ బోర్డ్ వ్రేలాడుతోంది. వార్డర్లు లాటీలు పట్టుకుని గేట్‌లోనుంచి సెంట్రల్ టవర్‌వైపు వస్తున్నారు. చాలామందికి టోపీలు లేవు. చొక్కాలు లేవు. బూట్లు లేవు. జైలు డాక్టర్ హరేన్‌బాబు ఒక బనీను తొడుక్కుని వచ్చారు. సెంట్రల్ టవర్ మీదినుంచి ఒక వార్డరు పదిహేడు, పద్దెనిమిది, పంధొమ్మిది నంబర్లు అని అరుస్తున్నాడు. అందరూ ఆ వార్డులకేసి పరుగెత్తుతున్నారు. హఠాత్తుగా "మిలిటరీ వస్తోంది" అని గుసగుస ధ్వనులు మొదలైనాయి. తుపాకులు చేతపట్టుకుని, మిలిటరీ జట్టు ఒకటి జైలు గేట్‌లోంచి లోపల ప్రవేశించింది. వారి ముఖ వైఖరిలో ఆత్రుత ఏమీలేదు. క్విక్

మార్చ్‌చేసి వారు సెంట్రల్ టవర్‌దగ్గరకొచ్చారు. తర్వాత మ్యూడోవార్డు కామన్‌గేట్ కెదురుగా వచ్చి నిలబడ్డారు. వార్డ్ చివర మారేడు ఆకులు కుప్ప పోసి వున్నాయి. క్రిందటి రోజున వార్డులో ఉన్న మారేడు చెట్టు కొట్టివేయబడింది. అందరూ చెట్టుపైన ఎక్కి "గాంధీజీకి జై" అని అరిచేవారు. కాంగ్రెసు జెండా కట్టారు దానికి. అది జైలు బయట చాలా దూరం వరకు కన్పించేది. అందుకని ఆ చెట్టు వెయ్యమని ఉత్తర్వు జారీ అయింది. ముందుగా నలుగురు వార్డర్లు వచ్చి, లాటీఛార్జీ సమయంలో ఖైదీలు వీటిని వార్డర్ల మీద ప్రయోగించకుండా వుండటానికి ఈ మారేడు పోగు చుట్టూ నిలబడ్డారు. మిలిటరీ జట్టు వార్డులను చుట్టుముట్టారు. తర్వాత ఒక గుంపు వార్డర్లు వారితో కొంతమంది మేట్స్ వారి వెంట కొందరు జైలు ఉద్యోగులు - వార్డులో దూరారు. తర్వాత లాటీఛార్జీ ప్రారంభమైంది. సర్కారువారి పరిభాషలో తేలిక లాఠీఛార్జీ. ఇందులో దోషి - నిర్దోషి అన్న విచక్షణలేదు. శాంతిప్రియులు, నిర్విరోధులైన వారే చాలా సందర్భాల్లో ఎక్కువ దెబ్బలు తింటారు. కొట్టేటప్పుడు మిలిటరీ వాళ్ళు నోటితో ఏదో అంటున్నారు. 'అటుపో' ' అటెక్కడికి పరుగెత్తుతావ్'' 'ఈ బద్‌మాష్‌ని కొట్టండి' వార్డర్లు అరుస్తున్నారు. 'మేట్స్ ' ఉత్సాహానికి అంతులేదు. ఆఫీసర్లు నిలబడ్డవైపు ఖైదీలకు కాస్తకూడా తప్పుకునే వీలు లేదు. ఎంచేతంటే వార్డర్లు తమ శక్తి సామర్థ్యాలను పైవారికి చూపించే ఆత్రుతలో ఉన్నారు. కొందరు పడిపోయారు. తల మీద దెబ్బపడగానే కూలపడ్డారు. దర్భాంగా నుంచి వచ్చిన ఒక అమాయకుడైన రాజకీయ ఖైదీ జపం చేసుకుంటున్నాడు. అతనూ తప్పించుకోలేకపోయాడు. వారు నావైపు వస్తున్నారు. నేను చాలా అధైర్యపడ్డాను. దెబ్బలు తింటానని తెలుసు. అడ్డగించలేనన్న సంగతికూడా తెలుసు. ఎలాంటి దెబ్బ తలమీద తగిలేదీ ఊహించుకుంటున్నాను. ఒక లాఠీ నా తలని గురి చేసుకుని వచ్చిపడింది. నాకు తెలియకుండానే రెండు చేతులతో తల ఎప్పుడు కప్పుకున్నానో తెలియదు. చేతి మీద దెబ్బతగిలినప్పుడు లాటీ మీద వుండే ఇనపకడియం మూలంగా చెయ్యి తెగిందని తెలుసుకున్నాను. ఇంకా రెండు మూడు లాటీలు యిటువైపే వస్తున్నాయి. నేను చతికిలపడ్డాను. నీలూ నన్ను వాటేసుకుని పట్టుకున్నాడు. "మళ్ళీ తల కప్పుకో తల కప్పుకో'' అంటున్నాడు. నీలూ మీద కొన్ని లాటీ దెబ్బలు పడ్డాయి. నా మీద ఇంకొకటి పడింది. నీలూ తలలోంచి నెత్తురు వస్తోంది. వార్డర్లు మరొక వైపుకి వెళ్ళారు. ఒకేచోట వారు ఎక్కువ కాలాన్ని వృధా చెయ్యలేదు. వార్డంతా ఏదో నిస్తబ్ధభావం అలముకుంది. కొందరు చాపచుట్టల్లా పడి వున్నారు. దెబ్బలు తినని అదృష్టవంతులు కొందరు - దెబ్బలుతిన్న వాళ్ళకోసం నీళ్ళు తెస్తున్నారు. కొందరు తెలివితప్పి పడివున్న సహచరుల

ముఖాలపైన నీళ్ళు చల్లుతున్నారు. కొందరు అచైతన్యంగా పడి వున్న మిత్రులకు పత్రిక మడతలతో, తువాళ్ళతో విసురుతున్నారు. అనుకున్నదాని కంటె చిన్న చిన్న దెబ్బలు తగిలినవారు తమకు తామే ప్రాథమిక చికిత్సలు చేసుకుంటున్నారు. జైలు ఆస్పత్రిమీద ఆధారపడితే - బహుశా ఇవాల్టికింకా అవకపోవచ్చు. అసలు ఏమీ దెబ్బలు తగలనివారు దెబ్బలు తగిలినవారిని జనరల్ ఇన్‌స్పెక్షన్ చేయటానికి బయటికొచ్చారు - ఘోరమయిన గాలి తుపాను వచ్చిన తర్వాత జనం గ్రామాల్లో సంభవించిన నష్టం లెక్కలు వెయ్యటానికి బయలుదేరినట్లు... ఆ తర్వాత మందులవీ తీసుకుని జైలు డాక్టరు, కాంపౌండరు వచ్చారు. వారి వెంట ఖైదీలు కొందరు బాగా దెబ్బలు తగిలిన వారిని - ఆస్పత్రికి తీసుకెళ్ళటానికి కొన్ని స్ట్రెచర్స్ తీసుకుని వచ్చారు. ''బోలేరే ఆస్పతాల్'' ఆస్పత్రి పహరా గొంతు ఇక్కడినుంచి స్పష్టంగా విన్పిస్తుంది. ఆ వ్యక్తి ఏ మాటా మాట్లాడకుండా కర్కశకంఠంతో వికృతంగా అరిచాడు. కునికిపాట్లతో జోగుతున్నాడేమో! హఠాత్తుగా ఉలిక్కిపడి లేచి తన కర్తవ్యంపట్ల జాగృతుడయినాడు. ఈ అరుపు మూలంగా ఆస్పత్రిలో ఏ రోగికీ బహుశ నిద్ర పట్టివుండదు. సేవలు ఉపచారాలు చేసేవారెవరూలేరు. పైగా ఇలా రోజురోజూ నిద్రలేని రాత్రులు గడవటం. ఇంతకుముందున్న సూపరెంటెండెంట్ ఆస్పత్రి పహరా రాత్రుళ్ళు సెంట్రల్ టవర్‌మీది కేకలకు జవాబు యివ్వవలసిన అవసరం లేదని నియమం పెట్టాడు. మెడికల్ గ్రౌండ్స్ మీద సూపరెంటెండెంట్ ఖైదీలకు అనేక విధాల సౌకర్యాలు కలిగించవచ్చు. ఈ బ్రహ్మాండమైన పేషణయంత్రం లోపలకు ఈ మెడికల్ గ్రౌండ్స్ రంధ్రంద్వారానే కొంచెంగా వెలుతురూ రానీయవచ్చు. సానుభూతిగల ఉద్యోగులు ఈ సాకుతోనే ఖైదీలకు కొంచెం సౌకర్యాలు కలిగిస్తారు. క్రొత్త సూపరెంటెండెంట్ వచ్చి పహరా కేకకు మళ్ళీ పాత నిబంధనను అమలు పరిచాడు. సేవ, సానుభూతుల కోసం తహతహలాడే రోగులైన ఖైదీలు రోగ శయ్యమీద పడుకుని, తమ పెళ్ళాం బిడ్డల సంగతి ఆలోచిస్తారా ఏం? జబ్బు చెయ్యగానే జైల్లో ఇంటి సంగతి ఎక్కువ గుర్తొస్తుంది. సామాన్య ఖైదీలు జైలు వెలుపల ఉన్నప్పుడు బహుశా రెండు పూటలా తిండి తినలేక పోవచ్చు. జైల్లో ఏమీలేకపోయినా కనీసం రెండు పూటలా రెండు ముద్దలు తిండి లభించటం విషయంలో అపనమ్మకం లేదు. కాని దానివల్ల యేమవుతుంది - జబ్బు చేస్తే వారు తాము దిక్కులేని వారమని అనుకుంటారు. ఈ రోగిష్టి ఖైదీలు ఎన్ని దిగుళ్ళలో ఉన్నా ఇవాళ్ళ నా సంగతి ఒక్కసారైనా తలచుకోకుండా వుండగలరా? సానుభూతితో కాకపోయినా భయంతోనైనా వారు ఇవాళ నా ఉరి సంగతి తప్పకుండా తలచుకుంటూ ఉంటారు. సరీగ్గా నా సంగతికాదు.

అపరిచితుడైన ఒకటో నంబరు సెల్‌లో ఉంటున్న ఉరిశిక్ష ఖైదీ సంగతి...

ఆస్పత్రిలో రెండో అంతస్థులోని ఓపెన్ వరండాలో టి.బి. రోగులుంటారు. అక్కడి నుంచి ఉరితీసే మంచె స్పష్టంగా కన్పిస్తుంది. ఇవాళ మంచె నాలుగు వైపులా పెద్ద పెద్ద లైట్ల కాంతితో చాలా వెలుతురుగా వుంది. మంచె చుట్టూ సాయుధ దళం - ఒకవేళ ఎవరైనా వార్డర్లకు డబ్బు వెదజల్లి మంచె యంత్రాలవీ పనిచెయ్యకుండా నిరుపయోగం చేసిపెడతారేమో అని పహరా యిస్తూ నిలబడి వున్నారు. ఈ టి.బి. రోగులు ఈ దీపాల ఉత్సవాన్ని చూస్తున్నారు. బహుశా వారి ప్రాణాలు ఎండిపోతున్నా యేమో! బ్రతకాలనే ఆకాంక్ష ఉన్నప్పటికీ వారు అణువణువు వంతున మరణిస్తున్నారు. అయినా ఉరిఖైదీలకంటె తాము అదృష్టవంతులుగా భావించుకుంటారు. వారి దీర్ఘమైన నిట్టూర్పులను, అయాచితమైన జాలిని వెంట తీసుకుని పోవాలి నేను. ఏమయినా నా ఉరితీత జైల్లో తాత్కాలికమైన సంచలనాన్ని, విషాదాన్ని తెచ్చిపెడుతుంది. కానీ వీరి చావు సంగతి ఎవరికీ తెలియదు. మరీ దగ్గిర చుట్టాల దగ్గిరకు ఒక సర్వీస్ పోస్ట్ కార్డు మాత్రం చేరుతుంది. ఆస్పత్రిలో మృతుల సంఖ్యలో పెచ్చుకనిపిస్తుంది. వారు చనిపోయిన రోజున రాత్రి నైట్ డ్యూటీ జైలు డాక్టరు కప్పుకుని పడుకున్న బొంతలోంచి బయటికేరాడు. ఆస్పత్రి వార్డులలోని పహరాలు రాత్రి కేకలు పెట్టేప్పుడు జమ సంఖ్యలోంచి ఒక అంకె తక్కువ లెక్కపెట్టి కేకేసి ఊరుకుంటారు. రాత్రి నిస్తబ్ధతను భంగం చేసి సెంట్రల్ టవర్ వార్డర్‌తో పరిహాసంగా 'ఒక ముద్దాయి సొంతం విడుదలయి పోయాడు' అని జోక్ చేస్తారు.

రైలింజన్ కూత వినిపిస్తోంది. పన్నెండు ఎప్పుడు కొట్టిందో ఒక రైలు వెళ్ళింది. స్టేషన్ చాలా దూరం ఇక్కడికి. అయినా ప్లాట్‌ఫారం మీద గందరగోళం చెవులకు విన్పిస్తున్నట్లు వుంది.

ప్రయాణీకులు త్రోపులాట 'కూలీ! కూలీ! ఇటు ఇటు' అని అరుపులు, ఆ రా ఉతారాస్టేషన్‌లో 'గంట - గంట' అని స్టేషన్ మాస్టర్ కేక, సిగ్నలర్ గంట కొట్టటం. రైలుబండి కూత ధ్వని, పరిమితమైన జైలు జగతికి బయటి విశాల స్వేచ్ఛా జగతికి సంధాన సూత్రం. ఇంత ప్రాణాల్ని ఉదాసీనం కావించే - మనస్సు నుద్విగ్నపరచే వేణునాదాన్ని - ఏ వైష్టవ కవికూడా ఎన్నడూ ఊహించలేకపోయాడు. "శ్రవణ మార్గాన హృదంతర ప్రవేశం..." అన్నదీ నాడింక ఛందోబద్ధమైన శబ్ద విన్యాసం మాత్రమేకాదు. ఏ అజ్ఞాత స్వర స్పందన... మనస్సులోని అవరుద్ధ తంత్రిని ఇంతగా కదలించ కలుగుతుంది? తెల్లవారుఝామున మిల్లు కూత కూలీలపేటలో తాత్కాలికమైన అలజడి

కల్గిస్తుంది నిజమే - కాని రైలు కూత ప్రతి ఖైదీ హృదయంలోనూ శీఘ్ర సంచలనాన్ని తీసుకొస్తుంది. ఎన్నో సుప్తమధుర స్మృతులను మేలుకొలుపుతుంది. ఆకారంలేని ఎన్నో కాంక్షలకు, ఆశలకు రూపాన్నిస్తుంది. రైలు నడుస్తున్న ధ్వని వినిపిస్తోంది దూరంగా - ఎంతో దూరదూరంగా వెళ్లిపోతోంది. చీకట్లో రెండు వైపులా ఏం కన్పించటం లేదు. గోడలు అడ్డులేని విశాల సీమారాహిత్యాన్ని మాత్రం గ్రహించవచ్చు.

బి.యన్.డబ్ల్యు.ఆర్. మార్చి అన్ని రైళ్లమీద ఒ.టి.ఆర్. అని వ్రాయబడినట్లుంది. బి.యన్.డబ్ల్యు.పేరు ఎప్పుడైనా మారవచ్చు అని ఆలోచిస్తేనే యెలాగో ఉంటుంది. ప్రపంచంలో ప్రతి మూలా రోజు రోజూ ఎన్నో మార్పులు జరుగుతున్నాయి. కాని వాటిలో కూడా కొన్ని వస్తువులకు మేము స్థిరమైన అపరివర్తిత రూపాన్ని తప్ప ఊహించలేము. గడ్డం మీసాలు తీసివేసిన నాన్న ముఖాన్ని నేనెప్పుడూ ఊహించలేను. ఊహిస్తే నవ్వొస్తుంది. సో! అదికూడా జరుగుతుందా?

కేవలం రైలుధ్వనే కాదు. బయటి ఏ ధ్వని అయినా జైలు క్వార్టర్స్‌లోని కుక్కల అరుపు కూడా వినటానికి మధురంగా ఉంటోంది... ఆరోజున జైలు బయటిరోడ్డు మీద నుంచి కొందరు కుర్రాళ్లు గుంపుగా 'హిప్ హిప్ హుర్రే'' అని అరుస్తూ వెళ్లారు. ఏదో మ్యాచ్ ఆడి తిరిగి వస్తున్నారల్లే ఉంది. ఎన్ని పురాతన స్మృతులతో ఈ ధ్వనికి సంబంధం? చిన్న పిల్లలను చాలా రోజులుగా చూడలేదు. హాఫ్ ప్యాంట్ తొడుక్కున్న తొమ్మిది- పదేళ్ల కెప్టెన్ నీలూ పింగాణీ కప్పు సాసరు తీసుకుని, గొంతు చించుకుని "హిప్ హిప్ హుర్రే!" అని అరుస్తున్నాడు. ఎండమూలంగా, శ్రమమూలంగా, అరుపుల మూలంగా వాడి ముఖం ఎర్రబారిపోయింది.

పగలు మూడుగంటలకి, రాత్రి పన్నెండున్నరకి రైలు కూత వేస్తుంది. ప్రొద్దున అయిదుగంటలకి సాయంత్రం ఆరున్నరకీ స్టీమర్ కూతవేస్తుంది. నా గడియారం - సెల్ ముందు నీడకంటె కూడా కరెక్ట్ అయినది - నా ఊహా విలాసాల్లో నెచ్చెలి. అప్పుడప్పుడు ఏరోప్లేన్ ధ్వని వింటూంటాను. రాత్రి ప్రతి రెండు గంటలకు ఒక్కొక్కటి వెడుతుంది. బహుశా అస్సాం ఫ్రంట్‌కి టపాలు తీసుకెడుతూంటాయి అనుకుంటా. కాని ఆ శబ్దం మనస్సులో ఏ స్మృతి సుగంధాన్ని రేకెత్తించవు- ప్రతి రోజూ ఎక్కడికి వెడతాయి. రాత్రిళ్లు మార్గాన్ని ఎలా నిర్దేశించుకోగలుగుతాయి, అని క్షణికమైన కుతూహలం. కంపాస్ మ్యాప్, రైలు లైన్, గంగా - ఇంతకంటె ఎక్కువేమీ ఉండవు. పగలు చాలా విమానాలు ఒక్కసారిగా కలిసి వెళ్లేప్పుడు నేను సెల్ మధ్యన ఉండి, తొమ్మిది - పది నంబర్లలోని బొమార్, బాబు ఇద్దరూ నాకు వార్త అందించటానికి -

ఒకటి, రెండు, మూడు, నాలుగు అంటూ అరుస్తూ లెక్క పెడుతూంటారు. కాని ఎందుకనో తెలియదు, ఏరోప్లేన్ ధ్వని నా మనస్సులో ఎలాంటి చాంచల్యాన్ని కలిగించదు. నా పరిచిత జగత్తులో వీటికి స్థానం లేదు. కారణం నేలతో వాటికి ఉన్న సంబంధం అప్రధానం. అందువల్లనే ననుకుంటా - కాకి, పిచ్చిక, గోరువంక మొదలైన పక్షులు జైలులోపల కనిపించినప్పుడు - అవి దృష్టిని మాత్రం ఆకర్షిస్తాయి. మనస్సుని ఉప్పొంగించవు. ఇవి విసుగెత్తించే ఒకే రీతి జీవితంలో మార్పు తెచ్చే పని మాత్రం చెయ్యగలుగుతాయి. అంతకంటె ఎక్కువేం కాదు. విరహుడైన యక్షుడి మేఘదూత, విరహిణి అయిన రాధ హంసదూత కేవలం కవి కల్పనా విలాసం, వాస్తవమైన మానవ స్వభావానుభవ ముద్ర వాటిలో లేదు.

సిపాయిజీ కూర్చుని తూలుతున్నాడు. బాగా అలవాటయిన పిల్లి మెల్లిగా నా వైపుకి వస్తోంది. నేను గుమ్మంలో కూర్చుని ఉన్నాననియేమో లోపలకు రావటానికి సాహసించ లేక- టక్మని ఆగిపోయి నుంచుంది. రోజూ- రాత్రి పగలు కంచం నాకటానికి వస్తూంటుంది. వారంలో ఒక రోజు కాస్తో- కూస్తో పెరుగు దొరుకుతుంది. తక్కినరోజుల్లో ఏమి తినటానికి వస్తుంది? జైల్లో ఉండి కాస్త కాస్త మాంసంలేని తిండికి అలవాటుపడింది. ఆశ్రమంలో సహదేవ్ దగ్గిరున్న కుక్క కూడా మాంసం లేని ఆహారమే యిష్టపడేది. ఇప్పుడా కుక్క ఎక్కడుందో. సహదేవ్ అన్న బహుశా దాన్ని యింటికి తీసుకెళ్లాడేమో. లాంతరు వెలుతురులో పిల్లి వంటి రంగు స్పష్టంగా కన్పిస్తోంది. పెద్ద పులిలాగా, పసుపు, నలుపు, బూడిదరంగు చారలు, పిల్లిచూడటానికి బాగుంటుంది. ఆ రోజున జైలుదొర - "ఏమిటి? పిల్లితో స్నేహం చేసుకున్నారాయేం? దానికి పేరేంపెట్టారు?" అని హాస్యమాడాడు. "లేదు. అది ఊరికేనే వచ్చింది" అన్నాను నేను. "అయితే దానికి 'టోజో' అని పేరు పెట్టండి" అన్నాడు. తర్వాత తన హాస్యానికి తానే మురిసిపోతూ హ్హా హ్హా హ్హా అంటూ నవ్వాడు. జైలరు దొర పళ్లు తెల్లగా - టూత్పేస్ట్ ప్రకటనలో పళ్లు లాగా ఉంటాయి.

పిల్లికి దారి యివ్వటానికి నేను లేచి ప్రక్కకు తప్పుకుని నుంచున్నాను. పిల్లి ఒకసారి అరిచింది - ఇప్పటికీ నన్ను నమ్మలేకపోతోంది. అన్నం పళ్లెంలోంచి కాస్త కూర-దోసకాయ కూర లాంటిది తీశాను. పిల్లి దోసకాయ తింటుందా? ఒక ముక్క పిల్లిని గురిచూసి విసిరికొట్టాను. పిల్లి 'మ్యావ్' అంటూ పారిపోయింది. దోసకాయ ముక్క కటకటాలకు అతుక్కుంది. గుమ్మం బయటికి పోలేదు.

నేనూ, నీలూ కమలాఫలాలు తింటున్నాము - ఆశ్రమంలో అమ్మ గదిలో

బల్లమీద కూర్చుని. కమలాఫలాల పిప్పి కిటికీ చువ్వల్లోంచి - చువ్వలకు తాకకుండా బయటికి విసరాలి - అని మాయిద్దరి మధ్య పోటీ జరుగుతోంది. కాని ఆశ్చర్యం! చాలా వరకు కిటికీ చువ్వలకే తగులుతోంది. ఎన్ని ఇనుప చువ్వలు, అవి ఆక్రమించుకున్న చోటు యెంత! అయినా పిప్పి చాలావరకు దానికే తగిలింది.

... అటు తిరిగి యిటు తిరిగి నీలూ సంగతే మాటిమాటికీ తలపుకొస్తోంది. దేన్ని మరిచిపోదామనుకుంటున్నామో దానికోసం కాదు కదా! కొన్నాళ్ల నుంచి బుద్ధిపూర్వకంగా ఏ సంగతి నా మనస్సుకి నేను నచ్చచెప్పాలనుకుంటున్నానో - ఆ సంగతి నా అజ్ఞాన మనస్సు ఏ మాత్రం ఒప్పుకోవడం లేదా? నిజమే. నీలూ నాకు విరుద్ధంగా సాక్ష్యం చెప్పి, తన కర్తవ్యాన్ని నెరవేర్చుకున్నాడని నాకు తెలుసు. ఆత్మగౌరవం సత్యనిష్టగల రాజకీయ కార్యకర్త కింతకంటే గత్యంతరం లేదు. కాని ఇది కేవలం ఒక హేతువే. ఈ హేతువు కోర్టులో చలామణీ కావచ్చు. పుస్తకంలో అచ్చు సిరాలో చూడటానికిది బాగుండవచ్చు. కాని తక్కినచోట్ల దీనికి స్థానంలేదని సుప్త చైతన్యంగా భావించవచ్చు. అలాకాకపోతే అటు తిరిగి ఇటు తిరిగి నీలూ సంగతే ఎందుకు తలపుకివస్తుంది? తన పార్టీపట్ల అచంచల విశ్వాసం చూపించటానికి తన స్వంత అన్నకి ఉరిశిక్ష పడే మార్గాన్ని తేలిక చేయటం హృదయంలోని సత్యనిష్టకు నిదర్శనమా? రుగ్నమనస్సుని పరిశుద్ధం చేసుకుంటున్న సూచనా? నీలూ ప్రవర్తనని నాలోని 'అసలు నేను' ఏ మాత్రం సమర్థించలేకపోతున్నా. అందుకని పైన ఉన్న నేను గతస్మృతుల మధువుతో - ఆ అంతర్జ్వాలను చల్లబరుస్తున్నాను.

మళ్లీ వచ్చి గుమ్మం ఎదురుగా - ఈసారి ఎడమవైపు బరువుమోపి,ఎడమచేత్తో కటకటాలు పట్టుకుని కూర్చున్నాను. కుడివైపున బరువుమోపి, కుడిచేత్తో కటకటాలు పట్టుకుని కూర్చోటం ఎంత తేలికగా సుఖంగా ఉందో - ఎడమవైపు బరువు అనించి కూచుంటే అలా ఉన్నట్లనిపించటం లేదు. సరిగ్గా నిమ్నస్థలానికి పైన కూర్చున్నాను. పెద్ద ముసలి యేనుగు మూపుమీద, సరిగ్గా మావటీడు వెనకనే కూర్చున్నట్లనిపిస్తోంది. ఇలాంటి విడ్డూరమైన ఆలోచనలన్నీ వస్తున్నాయి. విడ్డూరం ఎందువల్ల అయిందింతకీ?...

... ఆ 'కారహోగోలా' ధనిక గృహస్థు అయిన ధనపత్ యాదవ్ ఊరువెళ్ళాను. అతడికి దొంగల ముఠా ఉన్నదని, అతని మీద బి.ఎల్.కేసు పెట్టవచ్చు అని పోలీసుల నమ్మకం. అప్పుడు కాంగ్రెసు మినిష్టరీ రోజులు. అతడు మమ్మల్ని తన ఊళ్లో మీటింగ్ పెట్టించటానికి తీసుకుని వెళ్లాడు. ఇన్‌స్పెక్టర్ని భయపెట్టాలని- అతను తాను

కాంగ్రెస్‌వాడినని అనుకునేట్టు చేయాలని ఉద్దేశం. మీటింగ్ చాలా బ్రహ్మాండంగా జరిగింది. భోజనాలవీ అయాక అతను "పదండి, వేటకు ఏర్పాట్లన్నీ చేశాను " అన్నాడు. తుమ్మ, మొగిలి మొదలైన ముళ్లచెట్లున్న అడవివైపు ఏనుగు మీద యెక్కి వెడుతున్నాను. నేను సరిగ్గా మావటీడు వెనకనే కూర్చున్నాను. ముసలి యేనుగు మూపు దగ్గిర బాగా పల్లంలాగా ఏర్పడిన చోటులో చాలా హాయిగా పద్మాసనం వేసుకుని కూర్చున్నాను. అడవి మొదలయింది. అక్కడినుంచి కొంచెం దూరం ముందుకు వెళ్ళాము. ఎదురుగా ఒక పెద్ద రావిచెట్టు కనిపించింది. ఏనుగుకి హఠాత్తుగా రావి ఆకులు తినాలని గుబులు రేగింది. తొండమెత్తి ఒక రావికొమ్మను విరచటానికి ప్రయత్నించింది. క్షణంలో ఏంజరిగిందీ తెలుసుకోలేకపోయాను. నామనస్సుకి నన్నేదో యంత్రం మధ్యలో పడేసి నుగ్గునుగ్గు చెయ్యటానికి ప్రయత్నిస్తున్నట్లనిపించింది. నేను కూర్చున్న పల్లపు చోటు ఏనుగుతలపై కెత్తటంతో, అది సంకుచితమై నా శరీరంలో క్రిందిభాగాన్ని నొక్కేసింది. నేను బాధతో కేకలు పెట్టాను. మావటీడు గ్రహించి ఏనుగుతొండాన్ని క్రిందికి దింపాడు. నేను ఏనుగు దిగాను. కాళ్ళ వైపు మొద్దుబారిపోయిన ట్లయింది.

నా సెల్ వార్డర్ గోడకి చేరగిలపడి జోగుతున్నాడు. తలపాగా తీసి ప్రక్కన పెట్టుకున్నాడు. మూడో నెంబరు సెల్ వార్డర్ కూడా నిద్రపోతున్నాడల్లే ఉంది. పోతే బయట ఈ వార్డ్ వార్డర్ అడుగుల చప్పుడు విన్పిస్తోంది. సెల్స్ అన్నీ ప్రశాంతంగా ఉన్నాయి. అందరూ నిద్రపోతున్నట్లున్నారు. పిచ్చివాడు కూడా ఇవాళ నిద్రలోపడ్డాడా? బాంబుకేసు బాబులు లైట్ వెలిగించి చదువుకుంటున్నారనుకుంటా. కీచురాళ్ల రొద వినిపిస్తోంది. కాని ఆశ్రమంలో కీచురాళ్ల రొదలాగా నిర్విరామంగా సజీవంగా లేదు. శీతాకాలం రాత్రిళ్లు చిన్నప్పుడు మెళుకువ వస్తే కీచురాళ్ల రొదలు ఏ రహస్య రంగమహల్‌ని తెరుస్తాయో. ఈ రొద అంత సజీవంగా లేదు. నీలూ అదొకరకమైన చీమలరొద అనేవాడు. అతనితో ఎవరు వాదిస్తారు? జైలు వాతావరణానికి కీచురాళ్ల రొదకి పొత్తుకుదరటంలేదు. రొటీన్‌గా అంకెలు లెక్కపెట్టటం, సంకెళ్లు, జైలుగోడలు - నియమానుసరణల మధ్య ఈ విలాసానికి చోటెక్కడ? కాని గోడలు కటకటాలతో అన్నింటినీ అడ్డుపెట్టొచ్చునా?

ధన్ ధన్‌మని క్రొత్త వార్డర్ల జట్టు వచ్చేశారు. అయితే ఒంటిగంటయింది. నిస్సందేహంగా వారు ముగ్గురు - ఒకరు నా సెల్, ఇంకొకరు మూడో నంబర్ సెల్, మిగిలిన అతను ఈ వార్డ్‌కి చెందినవాడు. అతను నిద్రపోతున్న వార్డరు తలపాగా తీసి

మెల్లిగా వెళ్లి బయటపెట్టి వచ్చాడు. తర్వాత "ఏయ్ హైదర్! ఇవాళ యిక్కడే నిద్రపోతావాయేం?" అని పిలిచాడు. అతను కంగారుగా ఉలిక్కిపడి జైలరుదొర రాలేదుకదా అనుకుంటూ లేచి కూర్చున్నాడు. "లేదు.... ఎవరూ కిషన్‌చందా? క్రొత్త జట్టు వచ్చేశారా? ఇదుగో భాయ్! తమాషా చెయ్యకు. తలపాగా ఎక్కడ పెట్టావో చెప్పు....! అన్నాడు. క్రొత్త సిపాయి - "నాకేం తెలుసు? వారేవా నేనిప్పుడేగా వచ్చాను" అన్నాడు. హైదర్ మొదట్లో నమ్మలేదు. తర్వాత భయంతో అతని మొహం వెలవెలబోయింది. అతనికిప్పుడే క్రొత్త ఉద్యోగం స్థిరమైంది. ఉద్యోగంలో చేరగానే - జైలరుదొర 'రౌండ్' వచ్చి సిపాయీ నిద్రపోతూండటం చూస్తే - అప్పుడు అతడినేమీ అనడు. అతని తలపాగా మాత్రం తప్పించిపెడతాడు. తర్వాత జరిమానావేస్తాడు- అని కథ విన్నాడు. ఇదే క్రిందటి వారం హరికిషన్ వార్డర్ 'అదృష్టం'లో ఇలాగే జరిగింది. అతను దుస్తుల గోదాం ఇన్‌చార్జి ఖైదీ బ్రిజ్‌బిలాస్‌కి రూపాయిన్నర లంచమిచ్చి ఒక తలపాగా సంపాయించుకున్నాడు. మర్నాడు జైలర్ దొర పెరేడ్ జరిగేప్పుడు అతని తలపాగాచూసి, ఈ తలపాగా యెక్కడనుంచి వచ్చిందన్న సంగతి అడిగాడు. హరికిషన్ మొదట్లో ఏమీ ఒప్పుకోలేదు. తర్వాత జైలరుదొర క్రాస్ పరీక్షలో జరిగినదంతా చెప్పేశాడు. మధ్యలో అతనొక్కడే పోలేదు. బ్రిజ్‌బిలాస్ డబ్బుకూడా పోగొట్టుకోవలసి వచ్చింది. కిషన్‌చంద్ ముఖ భంగిమతో చిటికెవేసి తన కథ పూర్తి చేశాడు. హైదర్ ఇప్పటికి అర్థం చేసుకున్నాడు. అతను కాకాపట్టి తలపాగా తిరిగి తీసుకోవాలనుకున్నాడు. ఇంటికి తిరిగి వెళ్ళబోతున్న ఇద్దరు వార్డర్లు కూడా నా సెల్ యెదుట వచ్చి కలిశారు. హైదర్ తలపాగా తిరిగి తీసుకున్నాడు. అందరూ కలిసి మర్నాడు మధ్యాహ్నం హైదర్ అప్పర్ డివిజన్ రాజకీయ ఖైదీల వార్డ్‌లో డ్యూటీ చెయ్యాలని, అక్కడ నుంచి ఒక గ్లాసు పాలు రేపతను కిషన్‌చంద్‌కి త్రాగించాలని నిర్ణయించారు. అందరూ నవ్వుకుంటూ బయటికి వెళ్ళిపోయారు.

పనితో అలసిపోయే వీరి జీవితాల్లో కూడా - స్థిరమైన జీతం, పెళ్లాం బిడ్డలు - సంసారం... సుఖమనేది వుంది.

టూర్ నుంచి తిరిగి వచ్చాను. సరస్వతి పాపిట్లో సిందూరం చేతులకు శంఖపుగాజులు. గుమ్మం క్రింద నిలబడి, నవ్వు మొహంతో -సిగ్గుతో ఉత్కంఠతో "కూర్చో కాస్త విశ్రాంతి తీసుకుని చల్లబడు. ఈలోగా నేను కొంచెం టీ చేసి తీసుకొస్తాను" అన్నది. నేను సమాధానం చెప్పలేదు. నవ్వుతూ ఆమె వెనక వెనక వంటింట్లోకి వెళ్ళి పీట వేసుకుని కూర్చున్నాను. తడిసిన కట్టెల్ని ఊది మంట చేసే ప్రయత్నంలో కంది

యెఱ్రపడి, చెమటపట్టిన ముఖం విరపోసుకున్న జుట్టుతో కప్పుకుపోయింది... సాధ్యమయితే...

కాని నా జీవితం కఠోరనియమ - ఆదర్శంతో సాగినట్టిది. ఒకవేళ మనస్సులోని వాంఛ మరొక రూపమైనదయితే మాత్రం ఉపాయమేముంది? చిన్నప్పట్నుంచి ఇరుగు పొరుగు వారందరూ "బిలూలాంటి కుర్రాడు సాధారణంగా ఉండడు" అని చెప్పుకోవటం విన్నాను. ఈ ప్రశంసను నిలబెట్టుకోవాలనే ఆకాంక్ష విరాగ మార్గంనుంచి నన్నెప్పుడూ జారిపోనీయలేదు. మనస్సులో నివారించుకోలేని ఎన్ని వాంఛలను కొరడా దెబ్బలతో అదుపులోకి తెచ్చుకోగలిగాను. కాని నా భావనా సరళితో sublimation అయి నేను ఏమైనా పై మెట్టుకి చేరుకోగలిగానా? లేదు. అలా అయితే ఇవాళ మనసులో ఈ సంశయం ఎందుకు రేగుతుంది. ఎన్నిరకాల సుఖాకాంక్షలు మనసు మారుమూలల్లోంచి ఎందుకు తొంగిచూస్తాయి?... ఏమీ సాధించలేకపోయాను. చరిత్రలో పేరుని చేర్చి పెట్టుకోలేకపోయాను. కేవలం ఫుట్‌బాల్ మ్యాచ్‌కి టిక్కెట్లు కొనుక్కునే వారిలాగా దేశ సేవకుల విస్తారిత పథంలో స్థానాన్ని కల్పించుకునే అవకాశాన్ని మాత్రం పొందగలిగాను. అంతే నాసంగతి నా యిరుగుపొరుగువారు కూడా వచ్చే వారంలో మరిచిపోతారు. ఇప్పుడే జ్ఞాపకమున్నదో లేదో ఎవరికి తెలుసు? అయితే ఇన్నాళ్ళూ ఏం చేశాను? నేను మానవాతీతుణ్ణికాను. అతి సాధారణమైన రక్త మాంసాలున్నవాణ్ణి. మనిషిలో ఉండే దోషాలు, పొరపాట్లు, దౌర్బల్యాలు నాలో ఉన్నాయి. కీట్స్ ఇరవై అయిదేళ్ళు బ్రతికాడు. షెల్లీ ముప్పైయేళ్ళు. పిట్ ముప్పై మూడో యేట ఇంగ్లాండు ప్రధానమంత్రి అయినాడు. కాని నేను ముప్పైమూడో ఏట కుక్కలాగా పిల్లిలాగా చచ్చిపోతాను. ఎవరూ వినరు. ఎవరూ తెలుసుకోరు. ఎవరూ రెండు వేడికన్నీటిబొట్లు రాల్చరు. ఏది చెయ్యాలని ప్రయత్నించానో అదంతా పూర్తిగా వ్యర్థమైపోయింది. ఈ నిష్ఫలమైన ప్రయాసకు యేమీ విలువలేదు. పృథ్విలో ఏదీ వ్యర్థంకాదు, పత్రలలో నదులు ప్రవహించటం కూడా సార్థకమే అని యెన్ని పద్యాలయినా వ్రాయనీ- ఈ మాటలన్నీ పూర్తిగా అర్థంలేనివి. వ్యర్థతతో అనుభవంలేని కవి భావవిలాసం.

కాదు. బహుశా ఇది సంపూర్ణంగా నిరవధికంకాదు. నాలాంటి రెండు మూడు జీవితాల విలువేమిటి? జనశక్తి ప్రస్తుత రూపం - గత ఆగస్టు మాసంలో చూశాను. బ్రహ్మాండమైన కొండశిల అడుగున యుగయుగాలుగా సంచితమై ఉన్న ఏ సుప్త శక్తిని కనుగొనగలిగామో అది సచేతనమైతే ఏమి చెయ్యగలదో దాని పూర్వ రుచి ప్రజలకు తెలియచెయ్యటంలో నా సాయం లెక్కలేనిదికాదు. రాజకీయ కార్యకర్తల మార్గం చాలా

కఠినమైనది, అస్తవ్యస్తమైనది. "తఖ్త్ యాతఖ్తా" (రాజపీఠం లేదా ఉరిపీఠం) ఉరిత్రాడే ఆశించాలి. బహుశా గౌరవప్రదమైన రాజకిరీటాన్ని పొందినా పొందవచ్చు. అపారమైన క్లిష్టజీవితం. రోజురోజుకీ జీవిత శక్తి, ఉత్సాహం కణంకణంగా క్షీణించిపోవటం చూడగలవు. తన మనస్సంతృప్తి తప్ప ఇంకేదైనా ఆశపెట్టుకుంటే నిరాశ పొందవలసి వస్తుంది. పేరుకుపోయిన అనాదరణ, ఉదాసీనతల భారంతో జీవితం దుర్భర మవుతుంది. ఒక్క అడుగు ముందుకు పోదామని వెళ్లు - ఎన్నోవందల మంది స్వార్థపు ఆఘాతాలు తగులుతాయి. ప్రతి ఒక్కరు నీకు శత్రువులుగా నిలబడతారు. ఒక వ్యక్తి గౌరవాన్ని ఆకర్షించవచ్చు. కాని అడుగడుగునా నువ్వు పదిమంది ఉపేక్షా-ఉపహాసాలకు పాత్రుడవైనావని అనుభవమవుతుంది. ఈ జీవితం నుంచి జైలుకి రావటం హాయిగా నిట్టూర్చి బ్రతికిపోవటమే. మరణశిక్ష కూడా శాపంలో వరం- ఏ అపరాధం లేకుండా యెంతోమంది యుద్ధంలో చనిపోతున్నారు. ఎందువలన అనేది వారికి తెలియదు. ఎందరెందరో తిండిలేక చచ్చిపోతున్నారు. అపరాధం-జీవితంతో దానికేమీ ప్రమేయం లేదనటానికి అమోఘమైన సూచన. దారిలో కారుకిందపడి చనిపోవటంలాగా, పొలంలో పాము కరిచి చనిపోవటంలాగా రాజకీయ రంగంలో మరణదండన కూడా ఒక సామాన్యమైన ఆకస్మిక దుస్సంఘటన. అంతే! అంతకంటె ఎక్కువేమీ కాదు. వర్గానికి బయట ప్రపంచంతో సంఘర్షణ! ఎన్నో ప్రతీకారశక్తులతో సంఘర్షణ. వాటికి ప్రతి రాజకీయ కార్యకర్త సన్నద్ధుడై ఉండాలి... కాని లోపల? లోపల సంఘర్షణ అంతకంటె భయంకరమైనది. ఉపవర్గానికి - ఉపవర్గానికి సంఘర్షణ, వ్యక్తికీ - వ్యక్తికీ సంఘర్షణ, స్వార్థానికీ - స్వార్థానికీ మధ్య సంఘర్షణ, జాతికీ - జాతికీ మధ్య సంఘర్షణ, ప్రాంతానికీ - ప్రాంతానికీ మధ్య సంఘర్షణ. ప్రాణాలు విసుగెత్తిపోతాయి. ఇవన్నీ రాజకీయ క్రీడా నిబంధనల్లో నిష్ఠుర నిర్దాక్షిణ్యములైన నియమాలు. ఇక్కడ దుర్బలుడికి స్థానంలేదు. అందరూ ముందుకు పోయేవారే - వెనక యెవరైనా పడ్డారో, చచ్చారో తిరిగి చూడవలసిన అవసరంలేదు.

"బాబూ! దోమలు బాగా కుడుతున్నాయా యేం?" వార్డరు అడిగాడు.

"ఆఁ ఎందుకు?"

"కాస్త కిరసనాయిల్ ఒంటికెందుకు రాచుకోకూడదు? ఆవనూనె ఇప్పుడు దొరకదు - కాదంటే ప్రయత్నం చేసి' చూస్తాను."

"సరే ఇవ్వు."

ఆవనూనె దొరక్కపోవటమే మంచిదనుకున్నాను. వెనక ఒకరోజున ఆవనూనె

రాచుకుని పడుకున్నాను. నిద్ర మెళకువ వచ్చి లేచి చూసేసరికి ఒళ్ళంతా చీమలు పుట్టలా పట్టుకున్నాయి. చిన్న చిన్న ఎర్రచీమలు. వాటికి నూనె త్రాగటం ఇష్టమేమో! వార్డర్లు లాంతరుకి పెట్టివున్న కాయితం బిరడాతీసి ఆ కాయితాన్ని ఒకవైపున చింపి, పొడుగ్గా మెలిపెట్టాడు. దాన్ని కిరోసిన్‌లో ముంచితీస్తూ నా చేతిలో బొట్లుబొట్లుగా కిరోసిన్ వేశాడు. నేను దాన్ని ఒంటినిండా రాచుకున్నాను. అది ఏదో ఉడుకులాంలాగే చల్లచల్లగా ఉంది. దిగ్‌బయ్‌లో దోమలు లేవా?

మేజర్ గోమెస్ పాట్నాకాంప్ జైల్లో చేశాడు. కిరోసిన్ నూనెతో ఏదో ఎమల్షన్ తయారుచేయించాడు. అంతపెద్ద జైల్లో ఒక్కదోమకూడా ఉండేదికాదు. దొర చపలచిత్తుడైతే ఏం - కార్యదక్షుడు. నల్లగా పొడుగ్గా పిచ్చి వాలకంగా ఉండే మనిషి. నేను ఇండియన్‌ని అనేవాడు. ఒకనాడు గయ రాజకీయ ఖైదీని "జోయాన్ నువ్వు సాలా, నేను సాలా. సాలాలందర్నీ క్షమాపణ కోరుకుంటున్నాను" అన్నాడు (సాలా అనేది తిట్టు. అసలు సాలా అంటే భార్యతమ్ముడు) అతడందర్నీ "జోయాన్" అనేవాడు.

"ఎహెయ్ జోయాన్ ఎహెయ్"... కవైయా గ్రామంలోని జనం వందమందికిపైగా పెద్దపెద్ద చెట్లతుండ్లు దొర్లించుకొచ్చి గుట్టగా పడేస్తున్నారు. నవ్వులు, పరిహాసాలతో పనులు జరిపించేవాడు. పూర్ణియారోడ్డు మీద చెట్లతుండ్లతో 'బారికేడ్' తయారయింది. అపరిమితమైన ఉత్సాహంతో అసంభవమైనదాన్ని సంభవం చేయించాడు. పేదరైతు వర్గానికి జీవితంలో ఎప్పుడూ స్వేచ్ఛగా నవ్వే అవకాశం లేదు. అలాంటి వారికివాళ ఏమయింది? ప్రతివారికీ ఏదో కొంత చెప్పుకోవలసింది ఉంది? ఈ కొద్దిరోజుల్లో అందరూ కొన్ని కొన్ని కథలు తయారు చేసిపెట్టుకున్నారు. వినేవాళ్ళు లేరు. "వీరగ్రామం ఠాణాలో కాల్పులు జరిగాయి. నలభై యేడుగురు చచ్చిపోయారు. గాయపడినవారు లెక్కలేదు. ఇన్‌స్పెక్టర్ భార్య-ఇన్‌స్పెక్టర్‌గారు ఉద్యోగానికి రాజీనామా ఇవ్వకపోతే అతనికింక తిండి వండిపెట్టనన్నది. గ్రామ పంచాయతీ మంగలి హర్‌ఖూకి జరిమానా విధించింది. అతను నాయబ్ (జమీందారు ఏజెంట్) బాబుకి క్షురకర్మ చేశాడు. హర్‌ఖూ అందరి ఎదుటా తప్పు ఒప్పుకున్నాడు. నాయబ్‌బాబు గాంధీటోపీ పెట్టుకోవటం చూసి మహాత్మాజీలో పేరు రాయించుకున్నాడు. (స్థానికులైన అశిక్షిత ప్రజలు కాంగ్రెస్‌లో పనిచేసేవారిని మహాత్మాజీలో పేరు ఎక్కించుకున్నారని అంటారు) నాకు యే శిక్ష అయినా వెయ్యండి వ్రేళ్ళు మాత్రం నరికితీసుకోకండి" అన్నాడతను. టామీ-పంటన్ కుశనది మధ్య స్టీమర్‌లో ఉన్నారు. ఒడ్డున రాత్రంతా గడిపే సాహసంలేదు. ఇంకా ఎన్నో రకాల కథలు.

కొయ్య తుండ్ల గుట్ట చాలా ఎత్తు అయింది. ఇంక మిలిటరీ లారీలు రాలేవు.

ఇంతవరకు జ్ఞాపకం రాలేదు. రహుయాదగ్గిర రోడ్డు ప్రక్కన పెద్ద మర్రిచెట్లున్నాయి. 'చలో - చలో'... గొడ్డళ్ళు, గడ్డపారలు, కత్తులు, కొడవళ్ళు ఎవరికేది అందితే అది చేతపట్టుకున్నారు. క్విక్ మార్చ్‌కాదు - చాలా శీఘ్రంగా పరుగు - అలసిపోయిన ఆగటానికి వీల్లేదు. హరేశ్వర్ చేతిలో చిన్న కాంగ్రెస్ జెండా. అత నిటీవలనే కొద్దినెలల క్రితం కాంగ్రెస్ సేవాదళం ట్రెనింగ్ పొందాడు. జిల్లా కాంగ్రెస్ కమిటీ గ్రామ రక్షణ దళం కోసం ఒక ట్రైనింగ్ కాంప్ తెరిచారు. అందులో ఊళ్ళో ఇప్పుడతని కెంత గౌరవం అతను గ్రామంలో కొన్నాళ్ళ నుంచీ తాను క్రొత్తగా నేర్చుకున్న దెబ్బలాటలో మెలకువలు. లాటీ త్రిప్పటం, సైకిల్ సవారీ - అవీ చూపిస్తున్నాడు. అతడు "నవయువతరం కదిలింది..." అని పాట మొదలెట్టాడు. పిల్లలు- పెద్దలు రొప్పుతూ అందరూ అది పాడటానికి ప్రయత్నిస్తున్నారు.

రహుయా - రహుయా గ్రామ ప్రజలు కూడా వచ్చి చేరారు. రెండు గంటల్లో రహుయా పర్వం పూర్తి అయింది. మళ్ళీ 'చలో- చలో' కృత్యానందనగర్ రైల్వే స్టేషన్ వైపు. దారి అరికట్టాలన్న ఉద్వేగమేమీలేదు. ఠాణా తగలపెట్టాక ఈ పనులన్నీ ఆసక్తి లేనివయినాయి. ఇప్పుడింక కవైయా రహుయా గ్రామాల కలసిపోయిన జనం గుంపు భూతం ఆవేశించినట్లు - కైపెక్కినట్లున్నారు. నన్ను సైకిల్ మీది నుంచి దిగనీయరు. అందరూ కలసి సైకిల్ త్రోసుకుంటూ తీసుకెడతారు. అంతమంది మధ్యనుంచి సైకిల్ మీద వెళ్లటానికి వీలవుతుందా? ఎవరు చెపితే ఎవరు వింటారు? "గాంధీజీకి జై!" ఎదురుగా బురద. "ఏం పర్వాలేదు" "భారత మాతాకీ జై" బురద మధ్యలోంచే సైకిల్ వెడుతుంది. "బొంబాయి నుంచి తాజావార్తలొచ్చాయి." ఎన్ని క్రొత్త వార్తలు! రహుయా విద్యార్థి ఒకడు జేబులోంచి వ్రాత పత్రిక పైకితీసి వల్లిస్తునట్లు చదివాడు. పత్రికపైన పెద్దపెద్ద అక్షరాలతో "దేశం పిలుపు" అని వ్రాసి ఉంది. "జిన్నాసాహెబ్ అరెస్ట్" "విజయలక్ష్మి పండిట్ మీద తుపాకీ కాల్పులు జరిగాయి." "ముంగేరు జిల్లాలో స్వరాజ్యం వచ్చింది." ఇంకా ఎన్నో ఉత్తేజకరమైన సంఘటనలు. ఇప్పుడింక సంభవమా, అసంభవమా అని ఆలోచించే ఓర్పు వారికి లేదు. ఎలామాత్రం ఉంటుంది? జరిగిన కొద్దిరోజుల్లో వారు ఎన్ని అసంభవమైన విషయాలు సంభవంకావటం చూశారు! ఏ వార్తా అబద్ధమని ఊహించటానికి వారు ధైర్యం చెయ్యరు. జిల్లా కలెక్టర్ ఆఫీసు స్వాధీనం చేసుకున్న రోజున రహూయా కవైయా జనం కలిసిపోయిన సమ్మిళిత వర్గానికెవరు నాయకత్వం వహిస్తారు? దాన్ని గురించి బాగా తర్కవితర్కాలు రేగాయి. కవైయాకు చెందిన హరేశ్వరా? లేకపోతే రహుయావాసియైన తిలక్ ధారీసింగా? హరేశ్వర్

సేవాదళం ట్రెనింగ్ పొందితే ఏమయినట్లు ? అతని కింకా మీసమైనా సరిగ్గా రాలేదు. కవైయా వాళ్ళు 'అతడు పసివాడు' అంటారు. ఇంక తిలక్‌ధారీ అతను ముప్పై రెండులో పిలుపు అందుకున్నాడు. అంటే పంథొమ్మిది వందల ముప్పై రెండో సంవత్సరంలో జైలుకెళ్ళాడు. ఇందుకే నన్ను మధ్యవర్తిగా అంగీకరించటమనుకుంటా.

గ్రామం ఊళ్ళో కెళ్ళేదారిలో ఒక ముసలిది, అర్ధనగ్నంగా ఉన్న కొంతమంది మగపిల్లలు, ఆడపిల్లలు నిలబడి వున్నారు. ఆమె అంటరానివాడైన బదర్‌తల్లి అని విన్నాను. జాతికి మాదిగ. ఊరుమధ్యన ఉండే ఆచారంలేదు. అందుకనే వారిని 'అంటరానివాళ్ళు' అంటారు. ఒక కుర్రవాడి చేతిలో బంతిపూలదండ. బాదర్‌తల్లి - పిల్లలందరూ ఒక్కసారిగా 'దణ్ణాలు' అన్నారు. ముందే నేర్చుకుని ఉన్నారనుకుంటా. ముసలిది చాలా సంకోచిస్తూ "తమ(ర్ని ఏమీ గౌరవం చెయ్యలేకపోతున్నాను. ఏమి మాత్రం చేశాను? తమరు మంజూరు చేసిన బావి వుండటం మూలంగా రోజులు సుఖంగా గడిచిపోతున్నాయి. అది రెండేళ్ళ నుంచి ఇసకమేట వేస్తోంది" అన్నది. వృద్ధురాలికి ఎక్కువగా మాట్లాడటం యిష్టమని గ్రహించాను. ఎర్త్‌క్వేక్ రిలీఫ్ కార్యక్రమంలో బావి సంగతి గుర్తువచ్చింది. కాంగ్రెస్ వాలంటీరు విరించి మక్‌సూదన్ సింగ్ దగ్గిర్నుంచి అయిదు రూపాయలు లంచం తీసుకుని తన అధీనంలోని స్థలంలో బావి తవ్వించి ఇస్తానని మాట యిచ్చాడు. నేను ఇన్‌స్పెక్షన్‌కి వచ్చి, బావిని అంటరానివాళ్ల గుడిసెలకు దగ్గిరగా ధామ్‌దాహ్-పూర్ణియా రాస్తా ప్రక్కన తవ్వించి యిచ్చాను.

"ఒక లోటా మంచినీళ్లు-చల్లటినీళ్లు ఇయ్యి అమ్మ! మీ బావి నీళ్లు ఎలా ఉంటాయో చూస్తాను" అన్నాను. వృద్ధురాలు తలవని తలంపుగా వెల్లడించిన కోరికకు ఏం చెయ్యటమో తేల్చుకోలేకపోయింది. మొహంలో గౌరవంకంటె భయచిహ్నాలే స్పష్టంగా కనిపించాయి. అక్కడ చేరిన జనంలో తమ ఊరి ప్రజలెవరైతే ఉన్నారో వారందరి మొహాలకేసి ప్రశ్నార్థకంగా చూసింది. ఈ బావి నీళ్లు మాష్టరుబాబుగారి కొడుకు తాగుతాడా ఏం? ఊళ్లో ఇంకెవరూ ఈ బావినీళ్లను ఉపయోగించరు. ఏమంటుంది? ఆమె నీళ్లు తెచ్చియిస్తుందా! ఆమెకి మిన్నువిరిగి నెత్తినపడ్డట్టుంది. తిలక్‌ధారీసింగ్ ఆమెకి ధైర్యం కలిగిస్తూ "లోటా శుభ్రంగా తోమి కడిగి నీళ్లు తీసుకురా! బిలూబాబూ అడిగారుగా!" అన్నాడు. లోటా నిండానీళ్లు తెచ్చింది. పొడుగాటి ముసుగువేసుకున్న బాదర్‌పెళ్ళాం దాంతోపాటు మద్ది ఆకులతో చుట్టిపెట్టిన, మట్టి కొట్టుకున్న ఎన్నాళ్లనుంచో దాచిపెట్టుకున్న బెల్లం యిచ్చింది. సిగ్గుపడుతున్న బాలబాలికల మొహాల్లోని అభ్యంతరాన్ని త్రోసేసి, వాళ్ల చేతుల్లో కొంచెం కొంచెం బెల్లం పెట్టాను. నేను కూడా

బెల్లంతిని నీళ్లు త్రాగాను. బాదర్ తల్లి కన్నార్పకుండా నావైపు చూస్తూ ఉంది. అ చూపు - భోజనం వడ్డించి, ప్రక్కన విసనకర్రతో విసురుతూ కూర్చునే తల్లి చూపు ఎలా ఉంటుందో అలా ఉంది. నాకు భోజనం పెట్టిన సమయంలో అమ్మ, పెద్దమ్మ, ననీద, సహదేవ్‌తల్లి, దువేజీ భార్య, సరస్వతి-అందరి చూపుల్లోనూ ఒకే భావం వ్యక్తమవుతుంది. "బోలో గాంధీజీకి జై" అని అందరూ ఒక్కసారి అరిచారు. "బాదరమ్మా! నాక్కూడా ఇవ్వు నీళ్లు" అన్నాడు హరేశ్వర్. బాల్చీతో వచ్చాయ్ నీళ్లు. అందరూ ఒకర్నొకరు త్రోసుకుంటూ ముందుకు వచ్చి, అంటరానివాళ్లు తాకిన నీళ్లు త్రాగుతున్నారు. ఊళ్లో, సంఘం కళ్లముందు ఈ అనాచార కృత్యం చెయ్యగల సాహసం ఈనాడు వీరికెక్కడి నుండి వచ్చింది? అందరి ముఖాల్లో, కళ్లలో ఏదో సాహసం చేసిన భావం ప్రస్ఫుటమయింది. "గాంధీజీకి జై! జై మహాత్మాజీకీ జై!" అని రామజయధ్వనుల మధ్య అందరూ తమ మనస్సుల్లోని ఉదారతను నాకు చూపించాలని ప్రయత్నించారు. కాని ఇంక ఇక్కడ ఆగటానికి టైమెక్కడుంది? "నవయువతరం కదిలింది..." వృద్ధురాలి కనుకొలకులు అతి కృతజ్ఞతతో మిలమిలలాడాయి. గ్రామవాసుల ఉదారతకు ఇదే వారిచ్చే మూల్యం? మహాత్మాజీ వారి ఇలవేల్పుకంటె జాగృతుడైన దైవం. అ మాటే వారు తలచుకుంటున్నారు. భూకంపం వచ్చిన తర్వాత మహాత్మాజీ కారులో ఈ దారినే ధామ్‌దాహా వైపు వెళ్లారు. అంతమంది జనంలో కారులో వారు మహాత్మాజీని గుర్తు కూడా పట్టలేకపోయారు. మాష్టరుగారిని మాత్రం గుర్తించగలిగారు. "మహాత్మాజీ ముఖంలోంచి జ్యోతి వెలువడుతోంది" అన్నాడు బాదర్. అతను గాంధీజీని ఉద్దేశించి నమస్కరించాడు. జనం వెడుతున్నారు. ముందుకు వెడుతున్నారు. వెనక్కి తిరిగి ఎందుకు చూస్తారు? ఎంతమంది బాదర్‌ల తల్లులు ఎన్నిచోట్ల ఇలా నమస్కారాలు చేస్తున్నారు. వీరిని చూడటానికి వ్యవధి ఎక్కడ? వీరి చేతుల్లో ఇప్పుడెన్ని పనులు! వారి తలల మీద ఎంతబాధ్యత! "జై బిలూబాబుకీ జై" ఒక వర్గం "బొంబాయి నుంచి నినాదం వచ్చిం"దన్నారు. మరొక వర్గం "ఏమిటానినాదం?" అని అడిగారు. వారి గొంతులతో గొంతులు కలిపి అందరూ "ఇంక్విలాబ్ జిందాబాద్" అన్నారు. కవైయాలోని ఉన్నత ప్రాథమిక పాఠశాల మాష్టరు- ఏదో నగర సంకీర్తనం జరుగుతున్నట్లు జయజయధ్వనులు చేస్తున్నప్పుడు నృత్యం చెయ్యసాగాడు. అతని గొంతు బొంగురుపోయింది./ఉబ్బసపురోగి దగ్గటానికి ప్రయత్నించినప్పుడు ఎలాంటి ధ్వని వస్తుందో, జయధ్వనులు చేసేటప్పుడు అలాంటి ధ్వని మాత్రం వస్తోంది. కాని అతని ఉత్సాహానికి అంతులేదు. తన శిష్యుల ఎదుట ఆత్మగౌరవాన్ని కాపాడుకోవాలన్న

ప్రయత్నం లేదు. ఒక వ్యక్తి గుర్రం మీద ఎక్కి కృత్యానందనగర్ వైపు నుంచి వస్తున్నాడు. మమ్మల్ని చూసి దిగాడు. "నమస్కారాలు" అతను - మీ తమ్ముడుగారు - కృత్యానందనగర్ హరఖ్‌చంద్ మర్వాడీ కొట్టు కొచ్చారు. కిరోసిన్ ధర ఎలావున్నదీ విచారించటానికి అని నాకు వార్త చెప్పాడు. అతను నాతో ఇంకేమీ చెప్పలేదు. కాని ప్రక్కనున్న ఒకరిద్దరితో ఏదో గుసగుసలాడుతూ చెపుతున్నాడు. జనం ఆ సంగతి బయటపెట్టదలచుకోలేదల్లే ఉంది. నీలూ పీపుల్స్ ప్రైస్ కంట్రోల్ కమిటీ సెక్రటరీ. కిరోసిన్, నూనె స్టాకు ఇంకా తక్కినవేవో విచారించటానికి వచ్చాడని తెలుసుకున్నాను. అయితే అతను కృత్యానందనగర్ ప్రజలు రైల్వేలైన్ సీలెయ్యటం, దారి అరికట్టడం, టెలిగ్రాం తీగెలు తెంచెయ్యటానికి విరుద్ధంగా ఏదో అన్నాడు. జనప్రవాహం సాగిపోతోంది. మన పూర్వులు పొట్టచేతపట్టుకుని నిరాశా హృదయాలతో అనిశ్చిత లక్ష్యాలతో ఎలా బయలు వెడలారో ఇది అలాంటిది కాదు. ఇది నూతన జగతి ఆశతో ఉద్విగ్నులైన ప్రజలు నిర్దిష్టమైన లక్ష్యంవైపుకి వెళ్ళడం. కేవలం అంటే కవైయ మేష్టారి పూర్తి పరిచయం కాదు. పోతే కేవలం అతని అపరిమితమైన ఉత్సాహాన్ని పూర్తిగా వివరించినట్లు కాదు. రైల్వేలైన్ దూరంగా కృత్యానందనగర్ కన్పిస్తోంది... అరగంటలో పావుమైలు రైల్వేలైను పూర్తిగా రూపులేకుండా పోయింది. రైలుపట్టాలు, కొయ్యస్లీపర్లు అందరూ భుజాన వేసుకుని మొక్కజొన్న చేలల్లోనో, రైల్వేలైను ప్రక్కనున్న నీళ్ళల్లోనో పారేస్తున్నారు. కృత్యానంద నగర్‌లోని వృద్ధులైన ఇద్దరు పెద్దమనుషులొచ్చారు, ఈ గుంపును ఈ భయంకర కృత్యం నుంచి ఆపించాలని. జనం వారిని గేలిచేసి పంపించారు. ఒకరు రెల్లుదుబ్బును తీసుకుని రెండు చేతికడియాలలాగా తయారు చేస్తున్నాడు. కొందరు పరిగెత్తుకెళ్ళి ఆ ఇద్దరు పెద్దమనుష్యులను పట్టుకున్నారు. హరిశ్చందర్ వారి చేతులకు ఈ కడియాలు తొడిగి, "ఈ గాజులేసుకుని వంటింట్లో మూలకుపోయి కూర్చోండి" అన్నారు. మరొకరు- "ఆహా ఎంత నాజూకుగా మెత్తగా ఉంది చెయ్యి! ఇంకో జత గాజులిస్తాము. మీ నీలూ బాబుకి తొడగండి. కలెక్టర్ దొర డబ్బుతో ఈ పరగణాకి జిత్తులు చెయ్యటానికి రావద్దని చెప్పండి. కవైయా, రహుయా ప్రజలకు గూఢచారులతో ఎలా వ్యవహరించాలో తెలుసు. జ్ఞాపకం లేకపోతే నీలితోటల దొర విల్సన్‌కి ఏం జరిగిందో జ్ఞాపకం చెయ్యండి" అన్నాడు. జనం నిగ్రహం కట్టలు తెంచుకుంది. ఇంక వారికి నీలూని గురించి నాయెదుట యెలాంటి 'రిమార్క్' చెయ్యటానికీ సంకోచంలేదు. రైల్వేలైన్ కొయ్యవంతెనకు నిప్పు అంటించబడింది. ఇంత త్వరగా అంత కొయ్యమొద్దులు ఎలా అంటుకున్నాయి? అమ్మ పొయ్యి అంటించటానికే ఎంత సతమతమవు

తూంటుందో చూశాను! ఎర్రబనీను తొడుక్కున్న ఆ రహంయా కుర్రవాడు ఫాదిరీ దొరను అనుకరిస్తున్నాడు. నిన్నవారు దొరయింటిని 'ఘెరావో' చేశారు. ఫాదిరీ దొర ఎలాంటి గొంతుతో "గాంధీజీకీ జై" అన్నాడో విని అందరూ ఘొల్లున నవ్వారు. హఠాత్తుగా రైలు వస్తున్న ధ్వని వినిపించింది. నిజంగా రైలు ఇంజన్ కనిపిస్తోంది. అదుగో వచ్చిపడింది. మిలటరీతో నిండిన రైలు. వారి వెంట రైల్వే ఇంజనీర్ ఉన్నాడు. పరుగు! పరుగు! ఎటువైపు వీలయితే అటువైపు గోతుల్లోంచి, గుట్టలమీది నుంచి, డాముల మీద నుంచి పరుగులెత్తారు. ఒక్క నిమిషంలో జనం అందరూ చెల్లా చెదురయినారు. చేతి గన్‌ల కర్కశ ధ్వనులు వినిపిస్తున్నాయి. కృత్యానందనగర్ వైపునున్న ఒక మొక్కజొన్న చేలో దూరాను నేను. కృత్యానందనగర్‌లోకి నేను బుద్ధిపూర్వకంగానే వెళ్ళలేదు. గ్రామ వాసుల సానుభూతి లేనప్పుడు ఎందుకు వెడతాను? సైకిల్‌ని కంగారుగా లైన్‌మీద వదిలేసి వచ్చాను. మొక్కజొన్న చేను! ఫాదిరీ దొర గడ్డం మొక్కజొన్న కండె పీచులాగానే ఉంటుంది. మొక్కజొన్న చెట్లు పొత్తులతో నిండి వున్నాయి. పొలంలోని మొక్కజొన్న సువాసనల మధ్య మందుగుండు వాసన రాలేదు.

ఆ కేసు విచారణ జరుగుతున్న సమయంలో సర్కారు వకీలు హేళనగా మొక్కజొన్న చేనుని గురించి వివరణనిస్తూ తెల్లవారి బృందం ఈ మొక్కజొన్న చేను చూసి ఈ మొక్కజొన్న ఇండియన్ కార్న్ కాదు, నాజీకార్న్ అని రిమార్క్ చేశారు అని చెప్పటం మొదలుపెట్టాడు. జడ్జిగారు గంభీర్యం వదిలి నవ్వసాగారు. పేష్కార్ నవ్వుతున్నాడు. నా వకీలు హరేన్‌బాబు కూడా ఈ చతురోక్తికి నవ్వకుండా ఉండలేకపోయాడు... పెరూ, చిలీ సూర్యమందిరాల్లో - కృత్రిమమైన మొక్కజొన్న చెట్లు పెట్టి ఉంటాయి. మొక్కజొన్న కర్ర - ఆకులు వెండివి, మొక్కజొన్న గింజలు బంగారపువి...

కళ్లరెప్పలు నిద్రమత్తు వస్తూండటంతో బరువెక్కుతున్నాయి. కాస్త కాళ్లు చేతులు చాచుకుందాం. ఆహా! ఒళ్లు, కాళ్లు, చేతులు ఊరికే కూర్చుని కూర్చుని ఉండటం మూలంగా నొప్పులెక్కాయి. ఆవులింతలొస్తున్నాయి. ఇవాళకూడా నిద్ర వస్తుందా ఏం? ఎంతమంది కథలు వింటూ వస్తున్నాను. ఉరి తీసేముందు రోజున వారందరికీ జుట్టు నెరసిపోయింది. నా జుట్టుకూడా నెరసిపోదుకదా! ఒక అద్దం ఉంటే బాగుండేది! కామ్రేడ్ చనర్‌వల్లీ ఉరి తీయడానికి ముందు పిచ్చివాడై పోయాడు. కాని నాకు మాత్రం నిద్ర వస్తోంది. ఆశ్చర్యం!...

...నాకు కనుక కావల్సినంత డబ్బుంటే ఇవాళ విల్లు రాసిపోయేవాణ్ణి! ఎన్నో

కోట్ల రూపాయలు. దాంతో మార్క్సువాద ప్రచారకార్యం సాగించేపని! భారతదేశంలోని ప్రతి ఊళ్ళోనూ - రష్యాలో బాలల సంఘాలు, యువజన సంఘాలులాగా - సంఘాలు నిర్మించేవాణ్ణి. కాని డబ్బు ఎక్కణ్ణుంచి వస్తుంది! ఒకవేళ లాటరీ టిక్కెట్ కొనకుండా లాటరీ వచ్చే వీలు ఉంటే అలా అయితేనే ఒక్క డబ్బు వచ్చే ఆశ. అదికాక - రాష్ట్రం కనుక నాచేతిలోకి వస్తే పని చేయించి చూపిస్తాను - పదేళ్లలో దేశానికెంత చెయ్యవచ్చో!... కాంగ్రెసు కార్యకర్తలు మళ్లీ జైళ్లనుంచి వస్తారు. కచ్చితంగా నా పేర యేదో ఒకటి స్థాపిస్తారు! "బిలూబాబు పాఠశాల" బిలూ ఆశ్రమం కాదు, బహుశా నా అసలు పేరుతోనే 'పూర్ణాశ్రమం' అని వ్యవహరించవచ్చు. కాని నా అసలు పేరు 'పూర్ణ' అని ఎవరూ యెరుగరు. అందరూ యెరిగి ఉన్నది బిలూబాబునే. ఇంక ఆ తర్వాత కూడా ఇంకా యెన్నో జరగవచ్చు. బహుశా పూర్ణియాపేరు - స్టాలిన్‌గ్రాడ్ గోర్కీనగర్ అయినట్లు - పూర్ణనగర్ కావచ్చు. బజారులో బాలముకుంద సాహా సత్రం మూలలో నా స్ఫటిక విగ్రహం, ఉపన్యశిస్తున్న భంగిమలో నెలకొల్పబడుతుంది. ప్రతి సంవత్సరం ఈ రోజున జనం గుంపులు గుంపులుగా వచ్చి, ఆ వేదిక దగ్గర నా స్మృతినుద్దేశించి శ్రద్ధాంజలి ఘటిస్తారు. .. మూసుకున్న కనురెప్పలపైన ఆకుపచ్చని శిఖను - నెమలి కన్నులాంటి దాన్ని- కాని అటుయిటూ చలిస్తున్న దాన్ని చూస్తున్నాను. ఆ శిఖ యెర్రదయింది, ఆకుపచ్చ, పసుపు, నీలం, నలుపు... శిఖా అసలు ఉందా లేదా?...

చీకటి...

పెద్దమ్మ తన వంటింటి వరండాలో కత్తిపీటమీద మామిడికాయలు తరగటానికి కూర్చుంది. బుట్టనిండా ఉన్నాయి గులాబిరంగు మామిడిపళ్లు - ఎదురుగా చిన్న గంగాళం ఉంది. మామిడి పళ్లు తొడిమలు కోసి, గంగాళంలో నీళ్లలో వేస్తోంది. నేను, సరస్వతి ఆమెకెదురుగా పీటలు వేసుకుని కూర్చున్నాం. "ఒక పళ్లెం నిండా యిస్తాను. మీరిద్దరూ తినండి" అన్నది పెద్దమ్మ. ముక్కలుకోసి ఆమె పళ్లెం నిండా పెట్టింది. సరస్వతి - పెద్దమ్మతో "మామిడి పళ్లముక్కలితడికి రుచిస్తాయా? పెద్ద పండు పండూ ఇచ్చేసెయ్" అన్నది. పెద్దమ్మ సరస్వతిని యెగతాళిచేస్తూ "అమ్మో! ఇంతలోనే అంతయిదా?" అని, నా చేతికొక మామిడిపండు యిచ్చింది - పచ్చగా బంగారపు రంగుగా మూతిదగ్గర యెర్రగా ఉన్న పండు. నేను మామిడి పండు క్రిందివైపున చిన్న రంధ్రం చేశాను. మామిడి పండుని నొక్కి నొక్కి మెత్తగా చేసి, తర్వాత దాన్ని చీకుతూ తినాలి. అమ్మ పడకగది వసారాలో కూర్చుని ఉంది, వంటింట్లోకి వెడదామని, కాని వెళ్లలేకపోతుంది. మధ్య మెల్లాలో పెద్ద నల్లటి పాము - పడగ విప్పి కదలకుండా ఉంది. "నీలూ త్వరగా వచ్చి

దీన్ని కొట్టు, వెంటనే చంపెయ్" అని అమ్మ అరిచింది. "వద్దు చంపవద్దు, చప్పట్లు కొట్టు, వెళ్లిపోతుంది" అన్నాడు నాన్న. నీలూ నాన్న మాట వింటాడా? పెద్ద కర్ర ఒకటి తీసుకుని వచ్చాడు పాముని కొట్టడానికి. పాము పారిపోయింది. చీకట్లో నూతి రాతి కట్టడంలో దూరింది. అది నూతి బాల్చీ త్రాడయింది. నీలూ కోపంతో కర్రతో బాల్చీమీద ఒక్కటి కొట్టాడు. ధన్‌ధన్‌మని పెద్ద చప్పుడయింది.

ఏదో చప్పుడు నిద్రమత్తు వదిలిపోయింది. బూట్ల చప్పుడు నెత్తిమీద. ఆ! అయితే నన్ను తీసుకెళ్లటానికి వచ్చారా యేం? ఈ ద్వారం నుంచి లోపలకు వస్తారనుకుంటా, ఒళ్లంతా చెమటలు పోస్తున్నాయి. కదలికలేకుండా నిశ్చలంగా పడి ఉన్నాను. లేదు, గుమ్మం తెరవలేదు. అయితే బహుశా క్రొత్త వార్డర్లు వచ్చినట్లున్నారు. బరువు తీరినట్లు నిట్టూర్చాను. ఆ... అదీ నిజమే... ఎంతసేపు నిద్రపోయాను? తూర్పురేకలా యేం? ఇంకా పక్షుల కూజితాలు విన్పించడంలేదు. ఎన్ని గంటలయిందో వార్డర్ని అడగనా యేం? వద్దు, అవసరమేముంది? ఎప్పుడు టైమయితే అప్పుడే తెలుస్తుంది. అడిగితే నన్ను దుర్బల చిత్తుడనని అనుకుంటారు. జీవితంలో ఈ చివరిగడిలో - ఒక సామాన్యుడైన వార్డరు యెదుట చులకనవలేను. పిచ్చివాడుకూడా తెల్లవారుజాము నుంచి అరుపులు మొదలెట్టాడు. అయితే ఇంకా తెల్లారటానికి వ్యవధి ఉంది. ఈ జగత్తుతో ఇంక రెండు గంటలు సంబంధం. బయట ఉండగా అవకాశం ఉన్నప్పుడు జీవితాన్ని అనుభవించలేదు. ముప్పైమూడు సంవత్సరాల దీర్ఘ జీవితం ఎలా గడిపానో సరిగ్గా గుర్తురావటంలేదు. నిరర్థక జీవితంలో అంతులేని స్మృతుల పొరల పొరల్లో - ఒకటి అర స్మృతుల కంకాళాలు పడి ఉన్నాయి. వీటి సంగతి నాకు తప్ప యెవరికీ తెలియదు. బ్రతకాలని వాంఛ కలుగుతోంది. మిగిలిన రెండు గంటలు స్వప్న విలాసాల మధ్య జగత్తుని మెలిపెట్టి యే సుఖాలయితే ఉన్నాయో వాటినన్నిటినీ ఒకటిగా చేసి పొందాలని వాంఛగా ఉంది. ఒకవేళ ఈ చివరి క్షణంలో నా ఉరిశిక్ష రద్దయినట్లు ఉత్తరువు వస్తే! ఇలా కూడా జరుగుతుంది. ఎంతోమందికి ఇలా జరిగింది. కసాయివాడు కత్తి పైకెత్తుతున్నాడు. అశ్వారోహకుడు దూరంనుంచి నక్షత్ర వేగంలో (ఉల్కావేగం) వస్తున్నాడు. ఘాతకా వధించకు, వధించకు. ఎన్నో కథలు చదివాను. పిథియస్ అండ్ డెమన్...

పంథొమ్మిది వందల ముప్పైనాలుగులోని భయంకర భూకంపంలాంటిది ఒకవేళ యిప్పుడొస్తే జైలు గోడలన్నీ ఒకవేళ పడిపోతే - అలా జరిగినా నాకు బ్రతికే వీలులేదు. ఒకవేళ ఉరితీసే వాడికి హఠాత్తుగా జబ్బు చేస్తే? అలా జరిగితే మరొక వ్యక్తి

దొరకటానికెంతోసేపు పట్టదు. ఒకవేళ హైకోర్టు నుంచి, లేదా Provincial advisor దగ్గిర్నుంచి నా ఉరిశిక్ష అపుచేయమని ఉత్తరమొచ్చి ఉంటే ఒకవేళ అది పొరపాటున తెరవకుండా కూడా ఉండొచ్చు. ఆశ్చర్యమేముంది? ఇలాంటిది కొన్ని సంవత్సరాల క్రిందట పంజాబ్‌లో జరిగింది. పెద్దదొర జేబులోనే ఉత్తరం ఉండిపోయింది. ఆ వ్యక్తిని ఉరితీశాక అందరికీ గుర్తొచ్చింది... బ్రతకాలనే ఆకాంక్ష నన్నెక్కడికి తీసుకెడుతోంది? అనిర్దిష్ట శక్తి యొక్క అమోఘ - ఆదేశాన్ని నేనెప్పుడూ విశ్వసించను. నిజంగా ఇది మృత్యు భయమా? నిశ్చయంగా భయమే. కొంచెంసేపటి క్రితం వార్డర్ అడుగుల చప్పుడులో నా మనస్సులో కలిగిన భావం భయంకాక ఇంకేమిటి? ఉత్కంఠ యొక్క చివరి అనుభూతి నిరాశ కలుగుతుంది. నా మనస్సుమీద ఈ నిరాశకు ప్రతి విధానమే జరుగుతోంది.

లావుపాటి గట్టిత్రాడు. చిన్నప్పుడే మేము ఈ త్రాడును 'లక్‌లైన్' అనే వాళ్లం. దానికొక జారుముడి. (ఉచ్చు) జారుముడి మొదట్లో ఇత్తడిరింగు. త్రాడు ఈ చివరనుంచి ఆ చివరదాకా బాగా క్రొవ్వు పట్టించినది. క్రింద చీకటి గొయ్యి - చూడటానికి అచ్చంగా నుయ్యిలా ఉంటుంది. గొయ్యి ఎంతలోతు - బహుశా ఎక్కువ ఉండదు. కొయ్య బల్ల లాగేస్తే శరీరమంతా - కాళ్ళు రెండూ నేలకు తగలకుండా వ్రేలాడుతూంటుంది. అందుకే గొయ్యి అవసరం. అందుకని గొయ్యి ఎక్కువ లోతు ఉండదు. ఎక్కువలోతు తవ్వితే నీళ్లు వస్తాయిగా! నాలుగైదు బారల కంటె ఎక్కువ ఉండదు. కాని గొయ్యి ఎంత లోతు అయితే త్రాడు ఎంత పొడవయితే శరీరం క్రిందికి పడేపుడు అంతయెక్కువ ఊగులాడుతుంది. అసలు ఈ ఊగులాటే అసలు విషయం. కాకపోతే మెడ దగ్గర యెముక ఎలా విరుగుతుంది? ఉరి అంటే కేవలం ఊపిరి బంధించి చంపడంకాదు. అలా అయితే గొంతు పిసికి చంపేస్తే పోతుందిగా! ఈ యంత్రాలు సరంజామా అవసరమేముంది? తక్కువసేపులో, తక్కువ శ్రమతో మరణశిక్ష అమలు చేయటానికే ఉరి సృష్టింపబడింది. ఇత్తడి రింగు మెడ ఎముకమీద గట్టిగా దెబ్బకొట్టింది. టక్‌మని చప్పుడయింది. తర్వాత... తర్వాత అంతా శాంతిస్తుంది. కాదు. ఒక్కసారిగా యెలా శాంతిస్తుంది? మనిషికి బ్రతకాలని ఇంత ఆకాంక్ష! అది జీవిత విలాసి అయిన ఇచ్ఛాశక్తి తరమటంతో, నిస్సహాయమైన శిథిల శరీరం కొంచెమయినా 'రెస్పాన్స్' యివ్వదా? ఒకవేళ ఇచ్ఛాశక్తి అనేది లేకపోతే - అలా అయినా రిఫ్లెక్సు ఆక్షను వల్ల కలిగే సంచలనం ఉంటుంది. బలియిచ్చిన తర్వాత మేక మొండెం గిలగిల కొట్టుకోవడం చూశాను. ఆ తర్వాత ఉరిశిక్ష ముద్దాయి శరీరం ఊగిసలాడుతోంది. చీకట్లో అటు ఇటు ఊగుతోంది.

త్రాడును వదులు చెయ్యటం జరిగింది. మృత శరీరం కాళ్లు గొయ్యి మధ్య నేలకు తగిలాయ్. డాక్టరు కాళ్లమీద నరాన్ని కోస్తాడా ఏం? కథ విన్నాను. ఎవరోవొక అతను బ్రతికాడు. అందుకేగా ఇంత జాగర్త! అన్నీ ఒట్టిమాటలు. డాక్టరుకి అవేమీ అక్కర్లేదు. కేవలం సర్కారు వారి నియమాన్ని కాపాడటంకోసం. ఉరి తీసేటపుడు డాక్టరు ఉండటం అవసరం. అతను - ఈ ముద్దాయి నిజంగానే చచ్చిపోయాడు అని - న్యాయశాస్త్ర భాషలో ఎంతవరకు చచ్చిపోడో అంతవరకు ఉరిలో వ్రేలాడాలని శిక్ష కనుక - చెప్పాలి. తర్వాత ఢిల్లీ పాదుషా పిచ్చిదాని చిన్న సంస్కరణలాగా - గొయ్యి లోపల క్రిందికి దిగే మెట్లమీద నుంచి అతను క్రిందికి దిగుతాడు. అతను మరీ అలాంటి యిలాంటివాడు కాదు. ఒక్కక్షణం శారీరక కష్టానికి ఎంతమంది అయిదు రూపాయలు సంపాయించగలరు? అపైన 'రెమిషన్' ఉండనే ఉంది. నియమనిబద్ధమైన పీస్‌వర్కు మజూరీ. శవదేహం కాదు, అదింక శవదేహంకాదు, శవాన్నే పైకి తెచ్చిపడెయ్యటం జరిగింది. బీభత్సంగా ఉంది ముఖం. కళ్లు రెండూ పెకలించుకుని బయటకు వస్తున్నాయి. కంబళితో కప్పేశారు. బల్ల తప్పించే సమయంలో ఎంత దారుణమైన బాధ! అది దుర్భరమైన బాధ! కళ్లవెంబడి నీళ్ళొస్తున్నాయి. ఛీ! ఎంతసేపుంటుంది ఆ బాధ! బహుశా ఆ సమయంలో అది తెలుసుకునే శక్తికూడా ఉండదు. బహుశా మనస్సు ఇతర ఆలోచనలతో సతమతమవుతూంటుంది. కనుక ఆ బాధసంగతి గుర్తు కూడా ఉండకపోవచ్చు. యుద్ధంలో ప్రమాదకరంగా గాయపడిన వ్యక్తికూడా మత్తులో ఉన్నట్లు తన పనిచేసుకుపోతూ ఉంటాడు. అతనికి తన బాధ సంగతి ఆలోచించుకునే తీరిక ఉంటుందా? ఒకవేళ ఆ బాధ అతి దుర్భరమైనదే కావచ్చు. అయినా దానివల్ల పోయేదేముంది? జీవితానికే ఆశ లేనప్పుడు. ఒక్క క్షణం బాధ సంగతి ఆలోచించటం నిరర్థకం. చనిపోయేముందు - జీవితమంతా చలనచిత్రంలో బొమ్మల్లాగా కళ్లముందు మెదులుతుందని విన్నాను. నాకు నమ్మకం కలగలేదు... మరణశిక్ష లేని దేశంలో కనుక నాకు శిక్షపడినట్లయితే! అలా అయితే బహుశా ఆజన్మ కారాగారశిక్ష నన్ను ఈ విచిత్రమయమైన పృథివినుంచి విచ్ఛిన్నంచేసి ఉండేది. కాని జైలుమధ్యలో కూడా ఒక చిన్న జగత్తు ఉంది. జైల్లోకూడా గ్రీష్మ, శీత, వర్షాకాలాల పరివర్తన గ్రహించవచ్చు. ఆకాశం, గాలి, సూర్యచంద్రులు, నక్షత్రాలు అక్కడకూడా తమ మాధుర్యాన్ని వెదజల్లటంలో పక్షపాతం చూపించవు. వేసవి సుడిగాలుల ఉన్మత్తత, తొలకరి వాన కురిసిన తడినేల వాసన, అర్థరాత్రి వర్షం మూలంగా మత్తెక్కిన మనస్సు చక్రభ్రమణం- ఎన్నో స్మృతులతో నిండిన శరత్కాలపు బంగారు పారల యెండ, నిగూఢమైన శీతాకాలపు

పొగమంచు - జైలు గోడల మధ్యకు కూడా ఇవి నిరాటంకంగానే వస్తూంటాయి./పైగా మనుషుల ముఖాలు కనిపించటం - వారు దొంగలేకాని, బందిపోట్లేకాని మనుషులేగా! వారి మధ్య బ్రతికి ఉండటం, ఒక త్రాడుతో వ్రేలాడి చావటంకంటె చాలా నయంకాదూ? అమెరికాలో ఎలాగో ఎలక్ట్రికల్ ఛెయిర్‌లో కూర్చున్నాను. ఒక్కక్షణంలో అంతా పూర్తి అయిపోయింది. బాధ అనేది రవంతకూడా లేదు. కాని చావుకి ముందు మానసికవేదన ఇక్కడెలా ఉంటుందో అక్కడా అలాగే ఉంటుంది. వారి మారణ యంత్రం మాత్రం కొంచెం మెరుగు. అదే వ్యత్యాసం! కాని కొన్ని దేశాల్లో తుపాకితో కాల్చిచంపటం, కత్తితో నరకటం 'గిలోటిన్' చెయ్యటం కంటె మన దేశంలోని పద్ధతే నయం. ఖడ్గంతో తల నరకటం సంగతి తలచుకుంటేనే మనసు కంపించిపోతుంది. సరే కాని ఒకవేళ ముద్దాయికి మార్ఫియా ఇంజక్షన్ యిచ్చి కాని, క్లోరోఫారం యిచ్చికాని తర్వాత మరణదండన అమలుపరిస్తే గవర్నమెంట్‌కి నష్టం ఏమిటి? దానివల్ల అతను శారీరక బాధ, మానసిక బాధలనుంచి బ్రతికిపోతాడు. అతణ్ణి సమాజంలోంచి తప్పించి వెయ్యటమే రాష్ట్రం లక్ష్యమైతే స్పృహ తప్పేట్లు చేసిన తర్వాత ఉరి యేర్పాటు చెయ్యాలి. అన్నిటికంటె పొటాసియం సైనేడ్ మంచిది. క్షణంలో అంతా పూర్తి అయిపోతుంది.

నీలూ కాలేజీ లేబొరేటరీలోంచి కొంచెం తీసుకుని వచ్చాడు. ఈ వస్తువును గురించి ఎన్నిరకాల ఆలోచనలు, ఎన్నెన్ని ఊహలు! చిన్న రబ్బరు 'కాప్సెల్'లో పెట్టి నోట్లో వేసుకోవడం అన్నిటికంటె మంచిది. అదే నిర్ణయమయింది. అరెస్ట్ అయినా భయంలేదు. ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు నోట్లో పెట్టుకున్న 'కాప్‌సెల్'ని పంటితో కొరికి చిన్న రంధ్రం చెయ్యి. అప్పుడేమి ఆలోచించానో, నిర్ణయించానో అలా ఒకవేళ చేసి ఉంటే ఇవాళ ఈ మానసికమైన దుశ్చింతకు కారణమే ఉండేదికాదు. కాని అప్పుడు నిజంగా నాకీ వస్తువు అవసరమవుతుందని అనుకోలేదు. అవసరమని అనుకుని ఉంటే ఆ తెల్లవారకట్ల బూట్లచప్పుడు వినగానే కాప్‌సుల్ మింగేసేవాణ్ణి...

తలుపు తెరిచి వారు ఆశ్చర్యపోయేవారు. ఘాతకుడు ఖైదీలు ఆశాభంగం చెందేవారు. సూపరెంటెండెంట్ మళ్లీ ఇదో పెద్ద చిక్కువచ్చిపడిందే-ఇప్పుడు మళ్లీ డిపార్ట్‌మెంటల్‌గా వెయ్యి వ్రాత - కోతల మధ్య యిరుక్కోవలసివచ్చిందే అనుకునేవాడు. అందరూ - భయంతో హార్ట్‌ఫెయిల్ అయి చచ్చిపోయాడనుకునేవాళ్లు. అహ( పోస్ట్‌మార్టం తప్పకుండా జరుగుతుంది. అది జరిగాక పొటాసియం సైనేడ్ సంగతి వెల్లడవుతుంది. కాని పొటాసియం సైనేడ్ మ్రింగటం అంత తేలికకాదు. అప్పుడు మ్రింగలేకపోయాను. అప్పుడు - డిస్పెప్సియాతో బాధపడుతున్నప్పుడు - సాయంత్రం ప్రతిరోజూ ఫుట్‌బాల్

మ్యాచ్ చూడటానికి వెళ్లేవాణ్ణి. ఒకరోజున జితేన్‌దా యస్.డి.ఒ. దొరను' కమ్ అప్ ఇస్మాయిల్' అని పిలుస్తూండటం చూశాను. ఇద్దరూ కారులో నుంచుని మ్యాచ్ చూస్తున్నారు. ఒకరి బుజంమీద ఒకరు చేతులు వేసుకుని నుంచున్నారు. హఠాత్తుగా మనసేమిటో నిస్పృహతో నిండిపోయింది. నా దౌర్బల్యం, అప్రయోజకత్వం, బుద్ధిమాంద్యం మనసులో సుళ్లు తిరుగుతూ గ్రుచ్చసాగాయి. జితేన్‌దా తెలివి, చురుకుదనం నాకెందుకు రాలేదనిపించసాగింది. జితేన్‌దా మీద ఈర్ష్యకలగలేదు. ఎస్.డి.ఒ. దొరతో స్నేహం కోసం కూడా నేను ఆరాటపడలేదు. అయినా ఎందుకనో ఏమో మనస్సంతా నైరాశ్యంతో నిండిపోయింది. క్షణంలో జీవితం మీద విరక్తికలిగింది. మనస్సుకి ఊరికే-బ్రతికి మాత్రం ఏం లాభం? నేను హీనుణ్ణి బ్రతకవలసివస్తుంది. అంతకంటె చావు చాలా మేలు-అనిపించసాగింది. ఆ రాత్రే పొటాసియం సైనేడ్ మ్రింగాలని నిర్ణయమయిపోయింది. ఇలా ఎన్ని రాత్రులు మేలుకునివుండి, జిల్లా కాంగ్రెసు కార్యాలయంలోని పెద్ద గడియారం గంటలు కొట్టటం విన్నాను! తర్వాత సరిగ్గా చివరిక్షణంలో- "ఇవాళ ఆగుదాం" అనిపించింది. లేడీస్ ఆఫ్టర్‌నూన్ బిస్కట్లు బాగా తిందామని కోరిక కలుగుతోంది. రేపు ఈ కోరిక తీర్చుకుని ఆత్మహత్యసంగతి తర్వాత ఆలోచిద్దామనిపించింది. మర్నాడు మనసు మరొక విధంగా మారిపోయింది. తర్వాత ఎప్పుడు తలపుకి వచ్చినా ఆ సంఘటనంతా హాస్యకథలాగా తోచేది. కాని ఇప్పుడు సైనేడ్ వుంటే తప్పకుండా మ్రింగుతాను. ఇది స్వేచ్ఛగా ఆత్మహత్య చేసుకోవటంకాదు, రాబోతున్న మరొక విపత్తు నుంచి తప్పించుకునే ఉపాయం మాత్రమే. సైనేడ్ సీసా నిమ్మచెట్టు క్రింద మట్టిలో పాతిపెట్టేశాను. మనస్సుకేం తోచిందో తెలియదు. సీసాను మట్టిలో పాతిపెట్టటానికి ముందు దాన్ని బాదంరంగు పాత మేజోడులో పెట్టి తర్వాత పాతిపెట్టాను. ఇప్పటికీ కచ్చితంగా అక్కడ పాతిపెట్టే వుంటుంది.

నిమ్మచెట్టు క్రిందవైపు నేలబారు కొమ్మలు కొన్ని ఎప్పుడూ - అంట్లు కట్టటానికి - మట్టితో కప్పి పెట్టి వుంటాయి. జిల్లాలోని కాంగ్రెస్ కార్యకర్తలందరూ-ఏదో పనిమీద జిల్లా ఆఫీసుకి వస్తూండేవారు. వారిలో చాలామంది ఈ చెట్టుమొక్కలు తీసుకెళ్లేవారు. నీలూకి భోజనం చేసేప్పుడు ప్రతిరోజూ నిమ్మకాయ కావాలి. పప్పులో నాలుగయిదు బొట్లు నిమ్మరసం పిండనిదే అతనికి బాగుండేదికాదు. ఆశ్రమంలో చేపలు వండరు. అందుకని పెద్ద చేప దొరికిందంటే - పెద్దమ్మగారింటికి భోజనానికి మాకు పిలుపువచ్చేది. ఆ యింటికి భోజనానికి వెళ్లేప్పుడు కూడా నీలూ ఒక నిమ్మకాయ జేబులో వేసుకుని

వెళ్లాల్సిందే - వాళ్లింట్లో నిమ్మకాయ ఉందో లేదో ఏం తెలుసు! ఆ యింట్లో చిన్న పిల్లలకి కూడా ఈ సంగతి తెలుసు. కొందరు నీలూ బాబాయ్ జేబుచూస్తుంటారు. ఎవరో ఒకరు నీలూ మామజేబులో నిమ్మకాయవుందని అమ్మమ్మతో చెప్పటానికి పరుగెత్తారు. పెద్దమ్మ వంటింట్లోంచి బయటికి వచ్చి నుంచుంది. "ఏరా! మాఛ్‌పాత్‌రీ! వచ్చారా మీరు?" చాలా రోజుల క్రిందటి సంఘటన. పెద్దమ్మ యింట్లో వసారాలో వరుసగా పీటలు వేసి వున్నాయి. ఎదురుగా అన్నంగిన్నె వున్నది. నేను, నీలూ, జితేన్‌దా, గ్యాంటా-అందరం భోజనానికి కూర్చోబోతున్నాం. "అరె మాఛ్‌పాత్‌రీ" అంటూ పరుగెత్తి పీట మీద కూర్చోబోయాడు. పీటజారిపడింది. దాంతో అన్నంపళ్ళెం ఎగిరి అవతలపడింది. మొత్తానికి అంతా చెల్లాచెదరయింది. అప్పటినుంచి పెద్దమ్మ నీలూని 'మాఛ్‌పాత్‌రీ' అంటూ వుంటుంది. ఆ మాటలో హాస్య సూచన ఏదయితే వుండేదో అది యిప్పుడు లేదు కాని మాట మాత్రం అలాగే వుండిపోయింది. తర్వాత పెద్దమ్మ "ఏరా 'బారిందర్ బేటా' (వీరేంద్రుని కొడుకు) నిమ్మకాయజేబులో వేసుకునివచ్చావ్‌గా! ఇలా ఇయి, కోసి వుంచుతాను" అన్నది.

ఆ నీలూ ఆ చిన్న హాఫ్‌ప్యాంట్ తొడుక్కునే కెప్టెన్ నీలూ... ఆ 'మాఛ్‌పాత్‌రీ' నీలూ, అన్నా అన్నా పిలవటంతో మైమరచిపోయే అమాయకుడైన నీలూ, వాడేనా నాతో ఇలా వ్యవహరించింది. అతనిలా వ్యవహరిస్తాడని నేనెన్నడూ ఊహించలేదు. అతని ఇంత అసహ్యంగా మారింది! ఛీ! ఏమిటిది? ఏమిటి నేను ఆలోచిస్తోంది? కాలిగాయం మీద దెబ్బతగులుతుందని-చెయ్యివేయటం మానుతానా? రోడ్డుమీద, రేవులో, సంతలో జనంగుంపులో దెబ్బతగలకుండా గాయాన్ని ఎంతో జాగ్రత్తగా చూసుకుంటూ వచ్చినవాణ్ణి. ఇంటికి వచ్చి కాలు టేబుల్ మీద పెట్టి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో దాని మీద ఇంత దెబ్బతగిలిందేమిటి. మనస్సుకి తగిలిన లోతైన గాయాన్ని విస్మృతులతో నిమిరి, కారణాలు పులిమి కప్పిపుచ్చటం సాధ్యంకాదు. కాదు. నేనే నీలూని సరిగా అర్థం చేసుకోలేకపోతే, బయటివాళ్లు ఎలా అర్థం చేసుకుంటారు? పూర్వం అనేకచోట్ల - శియాల్ గ్రామంలో ఉపద్రవం చేస్తే అతణ్ణి పట్టుకుని గ్రామంలో నాలుగు వీధుల కూడలిలో ఉరితీసే ఏర్పాటు వుండేది. లోకులు కేవలం తమకు కలిగిన నష్టం దృష్టిలో పెట్టుకునే సంఘటనను ఆలోచిస్తారు. ఆ దృక్పథంతో అనిష్టం చేసిన వాని మీద ప్రతీకారం తీర్చుకుంటారు. నేను నీలూ దృష్టి కోణం నుంచే జరిగిన సంఘటనలన్నీ చూడాలి. ఆ రోజున నీలూ చూడటానికి వచ్చినప్పుడు ఈ కంబళిమీదే కూర్చున్నాడు. నా ముఖంకేసి నిస్సంకోచంగా స్వేచ్ఛగా

చూడలేకపోయాడు. అతని కళ్లలో ముఖంలో అపరాధి సంకుచిత భావం వ్యక్తమయింది. ఎందుకని? ఎక్కడో తప్పకుండా పొరపాటు వుండివుంటుంది. లేకపోతే అతని సంకుచితత్వానికి కారణమేమిటి? వివేకం కాటు వెయ్యటమా? లేక కేవలం పశ్చాత్తాపమా? నీలూ నాతో ఏదో చెప్పాలనుకున్నాడు. ఏం చెప్పాలనుకున్నాడో అది కూడా నాకు తెలుసు. కాని నేను అతనికి ఆ ప్రస్తావన తీసుకొచ్చే అవకాశం యివ్వలేదు. ఇచ్చినట్లయితే బహుశా నా నిగ్రహం కూడా కట్టలు తెంచుకునేదేమో! నీలూ తన అన్నయ్యని కలుసుకుందామని వచ్చాడు. తనకు ప్రత్యర్థి అయిన స్థానిక రాజకీయ నాయకుడు బిలూబాబుతో కాదు. ఆ రోజున అతని ఎదుట నా మనస్సులోని సంఘర్షణ ఆభాసగానైనా వ్యక్తం కాలేదు. ఎంత అదృష్టం! నాకు మళ్లీ కాస్తకే కళ్లవెంబడి నీళ్లు వచ్చిపడతాయి. అదే నా భయం. కాని ఏమయితేయేం-ఎలాగో అలా ఇంటర్వ్యూ బాగా జరిగిపోయింది. అతను వెళ్లిపోవటానికి ముందు నేను నిగ్రహాన్ని కోల్పోలేదు. కాని అతనివైపు నుంచి అపరిమితమైన ఆవేశం వ్యక్తమవటం చూశాను. వెళ్లేటప్పుడు రెండు చేతులతో - ఒక్క క్షణం నా కుడిచేతిని నొక్కిపట్టుకున్నాడు. కొద్దిగా వణుకుతున్న చేతి-మంచులాంటి శీతల స్పర్శ అనుభూతి ఇప్పటికీ అలాగే వుంది. అమ్మను కలుసుకోమని చెప్పాను. కలుసుకున్నాడో లేదో ఏం తెలుసు? అమ్మను గురించే భయం. అమ్మ ఒక్క కొడుకయినా వున్నాడు. కళ్లు మూసుకుని అమ్మ ముఖం గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నించాను.

అమ్మ భోజనంతో ఉసిరికాయ ఊరగాయ తింటోంది. తలమీద ముందు వైపు తెలుపు నలుపు కలిసిన వెంట్రుకలు. నల్లవే ఎక్కువ. పాపిట్లో వెంట్రుకలు కొన్ని ఊడిపోవటంతో పాపిడి వెడల్పయింది. దానిమీద వెడల్పుగా సిందూరం. దాని వెనుక ఖద్దరుచీరె ఎర్రటి అంచు కనిపిస్తోంది. మెడ, చెవులు పూర్తిగా నిరాభరణంగా వున్నాయి. అర్థనిమీలితాలై కనుల కొనల్లో కొన్ని ముడతలు ఒకటి కొంచెం లావుగా, తక్కినవి తలవెంట్రుకల్లా సన్నగా వున్నాయి. ముక్కుకింద నుంచి రెండు చర్మపు ముడతలు పెదవుల కొనవరకు వ్యాపించివున్నాయి. నిగనిగలాడుతున్న పైరేఖలు రెండూ బాగా లోతుగా కనిపిస్తున్నాయి. అమ్మ-పెదవులు రెండు సన్నగా చేసి నాలిక చప్పరిస్తోంది. మెడ కింద నరాల మృదుకంపనం పైనుంచే తెలుస్తోంది. నాలిక అంగటికి తాకించి చిన్న ధ్వనిచేసింది. పెదిమలు రెండూ విప్పితే క్రింద పళ్లలో ఒకటి లేకపోవటం కనిపిస్తుంది. ఆ సందులోంచి ఎర్రటి నాలిక కనిపిస్తోంది. "మీరు లేవలా? లేవండి" అన్నది మేము మాత్రం కూర్చునే వున్నాం.

పెద్దమ్మకు క్రింది వరుస పళ్లు కొన్ని లేవు. ఎలా మాత్రం వుంటాయి? ఇరవై నాలుగుగంటలు పళ్లకింద, పెదవుల మధ్య ఇంత సున్నంతో కలిపిన జర్దా పెట్టుకునే వుంటుంది. లోకంలో తాంబూలంతోపాటు జర్దావేసుకుంటారు. కాని రోజూ యింతింత ఒట్టి జరదా అలవాటుగా తినేవాళ్లను నేనెక్కడా చూడలేదు. పెద్దమ్మ ఇప్పుడేంచేస్తోంది? ఇవాళ రాత్రి పెద్దమ్మకు నిద్రపడుతుందా? వేసవికాలం కానీ, శీతాకాలంకాని - ఆమె మొదట్నుంచీ రాత్రి మూడు గంటలకు లేచి, ప్రక్కమీద కూర్చునే మాలత్రిప్పుతూ జపం చేస్తుంది. నిద్రలేవగానే లాంతరు వత్తి పెద్దది చేసి ప్రక్కనున్న కిటికీలో పెడుతుంది. లాంతరు వెలుతురు గోడనున్న రాధాకృష్ణుల పటంమీద పడుతూంటుంది. తర్వాత సులోచనాలు కళ్లకు కట్టుకుని అటుకేసి చూస్తూ నిశ్చలంగా కూర్చుంటుంది. అలా చేయాలని గురుదేవుల ఆదేశం. గుండ్రటి ముఖం. అమ్మ ఒకసారి అన్నది-జర్దా డబ్బాలా గుండ్రంగా వుంటుందని.. ముఖంమీద స్ఫోటకపు మచ్చలు, నుదుటిమీద నీలి పచ్చబొట్టు, మెళ్లో తులసి పూసలమాల. జపంచేస్తూ చేస్తూ మధ్య మధ్య ప్రక్కనున్న కిటికీలోంచి జరదా ఉమ్మేస్తుంది. ఆ సమయంలోనే ఆకాశంవైపు చూస్తోంది - తెల్లారటానికి ఇంకా ఎంత ఆలస్యముందని. ఇంతలో బయట గచ్చు నూతిలో బాల్చీవేసిన చప్పుడవుతోంది. పొరుగు చిల్లరకొట్టు రామదేవ్‌సాహ్ రోజూ తెల్లవారకముందే నూతిలో నీళ్లు తోడుకోవటానికి వస్తూంటాడు. అతనే పెద్దమ్మ గడియారం. "బేలీ రేయ్‌బేలీ! ఇవాళ లేవవా ఏం?" ననీదీ కంగారుగా ప్రక్కమీది నుంచి లేస్తుంది.

నీలూని చిన్నప్పుడు కుదిపి నిద్రలేపబోతే-మొదట-"బాగుండదు చెపుతున్నా అన్నయ్యా" అని మళ్లీ ప్రక్కకి తిరిగిపడుకునేవాడు. మళ్లీ కుదిపి లేపబోతే - "మళ్లీనా" అనేవాడు. ఆ తర్వాత "ఇంకానా!" అనేవాడు. ఇంకోసారి లేపబోతే - "అయినా యింకా" అంటాడు. ఈసారి గొంతు పెద్దదిచేసేవాడు. తర్వాత తనలోతాను సణుక్కుంటూ లేచి కూర్చునేవాడు. "ఈ తెల్లారకట్టలేస్తే పాము మంత్రకట్టు వదలటం మొదలవుతుంది" అనేది అమ్మ. నీలుముఖం గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తున్నా. ఎంత ప్రయత్నించినా గుర్తు రావటంలేదు. అప్పుడప్పుడు నీలూ మొహం గుర్తుకొచ్చేది. కాని యిప్పుడు చివరి గడియలో తృప్తికోసం గుర్తుచేసుకోవాలని కోరుకుంటున్నా. కాని యిప్పుడింకా గుర్తొస్తుందా? నీలూ మొహం గుర్తు చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. కాని గనౌరీ మహతో మనోఫలకం మీద ప్రస్ఫుటమవుతోంది. బోడిగుండుతల చట్టిముక్కు బుల్‌డాగ్ లాంటి మొహం, ఒక చెవి పై భాగంలో ఒక బంగారుపోగు.

శరీరం వణుకుతోంది. తెల్లారకట్ట గాలి మరీ చలిగా వుంటుంది. ఇప్పుడిహ

రెండుగంటలు మాత్రం సెల్‌లో చలివేస్తుంది. పిచ్చివాడు అరుపులు మొదలెట్టాడు. మూడోనంబరులో భజన ఎప్పుడు మొదలయిందో అది నేను ముందు గమనించనేలేదు. రావి చెట్టుమీద కాకులు ఒకసారి కూసి మళ్లీ మెదలకుండా ఆగిపోయాయి. బహుశా - ఇంకా తెల్లవారలేదని గ్రహించి వుంటాయి. కాలాన్ని లెక్కవెయ్యటంలో పొరపాటు రావటం వల్ల - కొంచెం సేపు ముందుగానే అరిచాయి. ఇంక నాకున్న వ్యవధి ఎంత? ఇప్పుడు నాకొక్క క్షణం ఎంత విలువయినది. చలన చిత్రమయితే బహుశా డమరుకం లాంటి వాలుకా యంత్రపు గడియారం. పైన కప్పులోని యిసుక యించుమించు అయిపోతోంది. కాని టప్‌టప్‌మని ఇసుకరేణువులు నిర్విరామంగా క్రిందపడుతున్నట్లు చూపించేవారు. లేకపోతే దీపం ప్రమిదలో నూనె అయిపోవటం చూపించేవారు. గడియారం ముళ్ళు కదులుతున్నాయనుకుంటా. నా గడియారంకూడా తన ధోరణిని నియమం ప్రకారం నడుస్తోంది. చలిగాలి, పిచ్చివాడి అరుపులు, మూడోనంబరులో భజన-మిగిలిందల్లా ఆకాశంలో ఇంకా కొంచెం వెలుగురావటం. శుక్ర నక్షత్రాన్ని గుర్తుపట్టగలిగాను. పోతే అన్నిటికంటె కఠోరమైన వాస్తవం-నావార్డరు దొర సెల్ ముంగిలిలో రాతితొట్టెమీద కూచుని జోగుతున్నాడు.

ఇప్పుడు బిలూ వున్నాడు. ఇంక కొన్ని క్షణాలయినాక వుండడు. రక్తమాంసాలతో సుఖదుఃఖాలతో నిండిన బిలూ అనేవాడు లేడు. నేను సర్కారువారి 'స్టాటెస్టిక్స్'లో ఒక సంఖ్యను మాత్రమే. అంతులేనన్ని సంఖ్యలలో ఒక సంఖ్య తగ్గినా హెచ్చినా పోయేదేముంది? వైజ్ఞానికమైన ప్యారలక్స్ ఆర్ ఇన్‌స్ట్రమెంటల్ ఎర్రర్ (దృష్టి విభ్రమం - యంత్రంలోని పొరపాటు) కోసం నూటికి కొన్ని సంఖ్యలు వదిలేయనే వదిలేస్తారు. వ్యవసాయంలో పొల్లు అనేది వుంది. బహుశా నేను వాటికిందికివస్తాను. బహుశా భారత సర్కారువారి లెక్కల సమయంలో నేను -పూర్ణియా జైల్లో ఉరిశిక్షపడిన ముద్దాయిలలో పదకొండువందల తొమ్మిదోనంబరు వాణ్ణి. ఉరిఖైదీల నూటిరేటులో ఒక డిసిమిల్ ఫ్రాక్షన్ పరిమాణాన్ని పెంచుతాను. సర్కార్ రిపోర్టులో ముద్రించటానికి కొంచెం సిరా ఖర్చు. ఇదే నా జీవితానికి మూల్యం. జాతీయ చరిత్రలో బిలూబాబు దానం.

ఎడ్లబండి చక్రం కిరకిరలాడినట్లు ఒక ధ్వని అయింది. బహుశా వార్డరు తలుపుతీసిన ధ్వనేమో! అయితేయేం? సరిగ్గా అదే! నేను ఏది ఊహించానో అదే. సెల్‌ముందు సిమెంట్‌మెల్లాలో ఒక్కసారిగా లెక్కలేనన్ని బూట్లధ్వనులు వినిపిస్తున్నాయి. ఎంతమంది వస్తున్నారు? ఒక పటాలం సైనికుల పద ధ్వనుల ప్రతిధ్వనికి ఒక వంతెన కూలిపడిపోవచ్చు అని విన్నాను. నిజంగానే ఎంత గట్టిగా బలంగా వినిపిస్తున్నాయి

ధ్వనులు! ఈ అడుగుల చప్పుడుతోపాటు లోపల గుండె దడదడ కొట్టుకుంటోంది. గుండెదడ సవ్వడి స్పష్టంగా వినిపిస్తోంది. రసమోహన్ డ్రమ్ము కూడా ఏ మహానవమి పూజారాత్రి కూడా ఇలాంటి ధ్వనితరంగాలను సృష్టించలేకపోయింది. శరీరమంతా కంపిస్తోంది. నిట్టూర్పులు త్వరత్వరగా వస్తున్నాయి. కళ్లముందు ఏదో ఒక పరదా పడినట్లయింది. తలలో ఏదో చల్లదనం, శూన్యత ఆవరించుతోంది. ఒకసారి నా కుడిచేతి వ్రేలు సైకిల్ స్పోక్ మధ్యపడి తెగిపోయింది. రక్తం కట్టుపడలేదు. ఆరోజున రక్తం చూసినప్పుడు తలలో యిలాగే నరాలు పట్టుతప్పినట్లయినాయి. నుదుటిమీద ముక్కుక్రింద చెమటబిందువులు కన్పిస్తున్నాయి. ఎందుకో తెలియదు లేచి నుంచోవా లనిపించింది. కటకటాలు పట్టుకుని నుంచోటానికి ప్రయత్నించాను. కాళ్లు చేతులు విపరీతంగా వణుకుతున్నాయి. నుంచోలేకపోయాను. పాదాలవైపు ఏదో పక్షవాతం వచ్చినట్లుంది. అప్పుడొకసారి టైఫాయిడ్ వచ్చిన తర్వాత మొదటిసారి మంచం దిగబోయి నప్పుడు యిలాగే అనిపించింది. వార్డర్ నిలబడి, తలపాగా సరిజేసుకున్నాడు. పిచ్చివాడు అరుస్తూ వున్నాడు. మూడోనంబరులో భజనపాట ఆగలేదు. బూట్లచప్పుడు దగ్గిరగా - ఇంకా దగ్గిరగా వస్తోంది. పొత్తికడుపు ఏదో ఖాళీ అయినట్లుంది. కడుపులోపల మంచుగడ్డ పెట్టినట్లు చల్లగా ఉన్నట్లనిపించసాగింది. ఒకసారి కార్నివాల్‌లో 'జైంట్‌వీల్' ఎక్కినప్పుడు - చక్రం పైకి వెళ్లి కిందికి దిగేప్పుడు పొత్తికడుపు యిలాగే అనిపించింది. నాలిక ఎండిపోయి ఆకురాయిలాగా గరగరలాడసాగింది. గొంతులో ఏదో దూరినట్లనిపిస్తోంది.

సరస్వతి! అమ్మ! పెద్దమ్మ! నీలూ! నీలూ ఏమిటి నువ్విలాచేశావ్? ఒక ఉక్కు హారిజాంటల్ బార్‌లో నిస్సారమైన నా మృతదేహం వ్రేలాడుతోంది. కాళ్లు రెండు శూన్యంలో ఉత్తరంగా ఈశాన్యంగా, తూర్పుగా, ఆగ్నేయంగా, దక్షిణంగా ఊగుతున్నాయి.

ఇదేమిటి? బూట్ల ధ్వని ఇంకా నా వైపుగా ముందుకు రావటం లేదు. నా వార్డరు వార్డు మెల్లావైపుకి తొంగిచూస్తున్నాడు. హఠాత్తుగా మూడోనంబరులోని భజనగానం ఆగిపోయింది.

నా శ్రవణశక్తి, మానసికోద్వేగం హఠాత్తుగా లుప్తమైపోయిందా యేం? లేదు. మూగవాడు మాట్లాడటానికి ప్రయత్నిస్తున్నట్లు ఒక ధ్వని చెవికి వినిపించింది. జాలి గొలిపే భయవిహ్వలమైన నిస్సహాయ ఆర్తనాదం.

ఎవరు? ఎందుకని?

ఈసారి - ఈసారి కేవలం అసంఖ్యాకమైన బూట్ల ధ్వనులేకాదు, గౌరీశృంగం శిఖరం విరిగిపడిపోతోంది. వేసవి గాలి దుమారపు తీవ్రమైన ఉన్మత్తత - మళ్లీ ఆర్తనాదం

- మేఘాడంబరమైన అకాశాన్ని చీల్చి వేసే అర్తనాదం "హోశియారసే" (సావధానంగా) పాదాల క్రింద భూమి పగిలి ముక్కలు ముక్కలైపోయింది. క్రింద-క్రింద - అతలమైన అంధకారం మధ్య...

"ఎదుటికి దీపం చూపించు" వికృతాంగులైన కొన్ని ప్రేతల ఛాయలు క్రమంగా చిన్నవై, చిన్నవై లాంతరు వెలుగులో కలిసిపోయాయి. లాంతర్లు ఇటువైపు వస్తున్నాయి. వేలకొలది గ్రహాలు - ఉపగ్రహాలు కక్ష్యలోంచి జారిపోయి నావైపుకు పరుగెత్తుకు వస్తున్నాయి. ప్రతి రోమకూపంలోను ఊహించిన భయసంచలనం ప్రతి స్నాయువులోను తుఫాను విక్షోభం - ఈ కలవరం కళ్ళలో ప్రస్ఫుటమై వెలుపలికి పోవాలనుకుంటోంది. దారుణమైన పెనుగాలి విసురు ఇంక నుంచోకలిగేట్లు లేదు. కటకటాలను గట్టిగా పట్టుకున్నాను.

# అప్పర్ డివిజన్ వార్డు

"రాష్ట్ర గగన్‌కీ దివ్యజ్యోతీ రాష్ట్ర పతాకే నమో నమో"...

సంధ్యా కీర్తన.గానం పూర్తి అయింది. వార్డర్ తలుపులు మూస్తూ తనలో తాను సణుక్కుంటూ పోతున్నాడు. శ్రోత ప్రక్కన మరొక వార్డరు నుంఛుని వున్నాడు.

"ఒకబాబు ఇక్కడైతే మరొక బాబు అక్కడ. ఒకర్ని కేకేసి గదిలోకి పంపించే సరికి మరొకరు బయటికి వెళ్ళారు. ఒకరెవరో పాయిఖానాలోకి పోయి కూర్చున్నారు. ఒకరెళ్ళి పూజలో కూర్చున్నారు. ఒక్క నిమిషం సిపాయిజీ అన్నారొకరు. పేకాటలో ఈ చేతిలో ఆట ఒకటీ పూర్తికానియ్ సిపాయీ సాహెబ్! అన్నారొకరు. పూదన్‌బాబు పచార్లు పూర్తి అవటం వుండదు. తలుపులు మూయటంకోసం నుంచుని ఉన్నానని చూస్తున్నారు. అయినా లోపలకు వెడదామన్న ధ్యాసేలేదు. అరగటానికి అంత పచార్లు అవసరమయితే - కాస్త తక్కువ తింటూ ఉండాలి. ఇంటిదగ్గిర ఏంతింటారో అది తెలుసు. ఇక్కడ అప్పర్ డివిజన్ దొరికింది కదా అని కడుపులో గాలి నీరుకోసమయినా కాస్త చోటు వుంచుకోనక్కర్లేదా?"

మెహర్‌చందర్‌జీకీ "రాష్ట్రగగన్‌కీ" పాట స్వరం తెలుసు. మేము అతడితో స్వరం మాత్రం కలుపుతాం. ఇక్కడ ఈ పాట పేరు ప్రార్థన. ప్రార్థనకు ముందు లాంతర్లు తగ్గించాలి. ప్రతిరోజూ అతను పాటలో ఒక లైను మరిచిపోతూంటాడు. అప్పుడు లాంతరు వత్తికాస్త పెద్దదిచేసి, జేబులోంచి 'ఆశ్రమభజనావళి' పైకితీస్తారు. ఇన్నాళ్ళనుంచి పాడుతున్నారు. ఆ చరణం నోటికి రావలసిన సమయమయింది. కాని ఇప్పటికీ అతనికా చరణం నోటికి రాలేదు. తక్కిన వారికి చాలామందికి నోటికి వచ్చేసింది. కాని అందరూ తమాషా చూద్దామని పాటలో ఆ చరణంరాగానే - మెహర్‌చందర్‌జీ లాంతరు కోసం చెయ్యి చాచేసరికి - గది అంతా ఆపుకున్న నవ్వుల ధ్వనితో నిండిపోతుందని - ఆ సంగతి అతనికి తెలియదు. నేను ఆరోజున చరణం జ్ఞాపకం చెయ్యటానికి ప్రయత్నించాను. అతనికది యిష్టంలేకపోవటం చూశాను. అందుకని నేనింకేం

మాట్లాడలేదు.

...ఈ ఏర్పాటు బాగుంది. లాకప్‌తోపాటు ప్రార్థన, భజన పూర్తి అవుతాయి. ఇది వరకు తలుపులు మూసేశాక ప్రార్థన మొదలయ్యేది. కాని సోషలిస్ట్ పార్టీలో చాలా మందికిది యిష్టం లేకపోవటం చూశాను. ఈ జట్టులోని బ్రహ్మదేవ్ శివపూజన్ ఒకరోజున ప్రార్థన సమయంలో పోటీగా అపస్వరాలతో మరొక పాట ప్రారంభించారు. వారు మా పాటకు యింత విసుగు చెందుతారని ముందు తెలుసుకోలేకపోయాను. అప్పటినుంచి ఎన్నో విధాల నచ్చచెప్పి ప్రార్థన సమయాన్ని ముందుకు జరిపించాను. దానివల్ల లాకప్‌లోకి వెళ్ళే ముందే పాట పూర్తి అవుతుంది. మెహర్‌చంద్, సదాశివ్, వీర్మైనా రాజీ పడేట్టులేరు. "మనం ఎందుకు వెనక్కి తగ్గాలి? వారు రాత్రి పన్నెండు గంటలదాకా ముక్కు మీద బీడీ పొగలు వదులుతుంటారు. లక్ష్మీకాంత్ మార్క్స్‌క్లాస్ లెక్చర్ కొట్టేప్పుడు మనకు నిద్రపోయే ఉపాయంలేదు - అయినా మనమేమయినా అన్నామా? తమరు మాష్టరుగారు, మమ్మల్ని అది మాత్రం కోరకండి. వారిని శాంతపరచటానికి ఎక్కువ శ్రమ తీసుకోవలసిన అవసరంలేదు" అన్నారు వారు. ఎంత వివరించి చెప్పాను! "వారికి నిజంగా అసౌకర్యం కలిగించే పని మనమెందుకు చెయ్యాలి? వారిష్టం ఏదైనా చెయ్యనీ. మనవైపునుంచి కర్తవ్యంలో పొరపాటు ఎందుకు రానివ్వాలి? వాళ్ళు చిన్నవాళ్ళు. మీ ఆదర్శం మహాత్మాజీ చూపిన మార్గం. అది ఎంత ఉన్నతమైనది ! దానినుంచి ఎందుకు జారిపోవాలి?" ఇలా ఎంతో నచ్చచెప్పిన తర్వాత మనసులో సంతుష్టులు కాకపోయినా, నా మాటని మన్నించారు. అప్పటినుంచి తలుపులు మూయటానికి ముందే మేము సాయంత్రం ప్రార్థన పూర్తి చేస్తున్నాం. ఇప్పటికీ వారేమయినా చిన్నవాళ్ళా - స్కూలు, కాలేజీల విద్యార్థులు. వాలీబాల్ ఆడేప్పుడు ఒకనాడు కామ్రేడ్ మధ్యేరామ్, కామ్రేడ్ మురళీమిశ్రా గుండెల మీద కూర్చుని అతడి గొంతునొక్కి పట్టుకున్నాడు. భోజనం విషయం మీద ఇప్పుడు కూడా వారు కిచెన్ మేనేజర్‌తో తగవులాడతారు. ఇవాళ ఇతనితో మాటలు బంద్, రేపు అతడితో తగాదా. ఇవి నిత్యమూ జరుగుతూనే ఉన్నాయి. వీరందరు మరీ చిన్నపిల్లలు. వారి తప్పొప్పులు మనం విచారిస్తూ కూచోవటానికి మూడు వంతుల జీవితం వెళ్ళిపోయి ఒక వంతు మాత్రం మిగిలివుంది. ఇప్పటికీ మనం మన మనఃప్రవృత్తుల్ని నిగ్రహించు కోలేకపోతున్నాం. ఇహ వాళ్ళు కుర్రవాళ్ళు. వారి తప్పులను పొరపాట్లను పట్టించుకునేట్లయితే మనమీ మార్గానికి రావటమే వృథా. బిలూ కూడా ఈ సంఘం సభ్యుడు. అందులోని ప్రతి కుర్రవాడూ నాకు బిలూలాంటి వాడే. ఇవాళరాత్రయినా

కనీసం బిలూ దగ్గిర ఉండగలిగితే... కాదు కలిసి ఒకచోట ఉండకపోవటము మంచిదే అయింది. అలా ఉన్నట్లయితే బహుశా ఇద్దరం అధైర్యంతో క్రుంగిపోయేవాళ్ళం. అయినా చివరి క్షణం వరకు మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళం. బహుశా అసలు మాటలే దొరికేవి కాదేమో! కుర్రవాళ్ళెప్పుడూ నాతో అవసరమైన విషయాలు తప్ప తక్కిన వేవీ మాట్లాడేవారుకాదు. నా ఎదుటికి రాగానే బిలూ - ఏదో సంకోచంతో ముడుచుకు పోయేవాడు. మొదట్నుంచి వాడికి కొంచెం చురుకుతనం తక్కువ. వాడు చిన్నప్పట్నుంచీ గుడిపాములా ఇల్లు కదిలేవాడుకాదు. కాని అ దోషం నే శిక్షణ యివ్వటంలోనిది. వారిని ఎలా తయారు చేశానో వాళ్ళు అలాగే తయారయ్యారు. ఒకవేళ శిక్షణలోని లోపం వల్లనే  వాడి స్వభావం ఇలా అయినట్లయితే - నీలూ స్వభావం ఇలా కాలేదెందుకని? బిలూ ఇంగ్లీషు కాలేజీలో చదువుకోలేదని వాడిలో ఒక విధమైన ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు. నీలూ కాలేజీలో చదువుకున్నాడు. అందుకనేననుకుంటా నీలూ మనస్సులో ఈ భావంలేదు. పిల్లల బయటి ప్రవర్తన సంగతి చెప్పలేను. అయినా నాకు వాళ్ళకీ మధ్య ఉన్న వ్యవధానానికి మాత్రం నేనే బాధ్యుణ్ణి. నేను వాళ్ళతో స్వేచ్ఛగా ఎన్నడూ కలవలేదు. ఒళ్ళో కూర్చోపెట్టుకుని, బుజాన ఎక్కించుకుని గారాబం చెయ్యలేదు. పిల్లలతో స్నేహ భావం పెట్టుకుంటే వాళ్ళను అదుపులో పెట్టటం కష్టమని నా నిశ్చితమైన అభిప్రాయం. వారితో తక్కువగా మాట్లాడితే వారు భయ గౌరవాలతో మసలుకుంటారు. వాళ్ళకి చనువిస్తే నెత్తికెక్కి కూర్చుంటారు. ఈ విషయంలో నేనెప్పుడూ యెవరి మాటా మన్నించి ఎరుగను. స్కూల్ మాష్టర్ని. అలవాటువల్లకాని, మరేదైనా ఇతర కారణంవల్లకాని ప్రపంచంలో అన్నిచోట్ల ఈ గురుశిష్య సంబంధం చూస్తున్నాను. అంచేత రాజకీయ రంగంలో కూడా పెద్దలను గురువులుగా భావిస్తాను. చిన్నవాళ్ళను శిష్య దృష్టితో చూస్తాను. కామ్రేడ్‌ని ఎన్నడూ కాలేకపోయాను. జితేన్ చిన్నవాడుగా ఉన్నప్పుడు ఇరవై నాలుగు గంటలూ యదుదా వెంటనే ఉండేవాడు. తండ్రి పెద్దలాటీని చేతపట్టుకుని, బొద్దుగా ఉండే కుర్రాడు అతని ముందు నడిచేవాడు. సంతకి, బజారుకి, విందులకు అన్ని చోట్లకు. అప్పుడు తండ్రితో మా సాయంత్రపు గోష్ఠికి వచ్చి నాతో కూడా చక్కగా కబుర్లాడటం మొదలెట్టాడు. పరాయి పిల్లవాణ్ణిగా గారాబంచేయటం, అతని కోసం లాజెన్స్ తెచ్చి జేబులో పెట్టటం, తన బిడ్డలతో వ్యవహరించటంలోని ఈ వ్యత్యాసం బిలూ తల్లి దృష్టికి కూడా అసంగతంగా అనిపించింది. బిలూ తల్లి వస్తుతః మితభాషిణి. ఆమె కూడా ఒక రోజున "మీ బిడ్డలవైపు కూడా కాస్త తిరిగి చూడండి" అని నోరు తెరిచి అనటం విన్నాను. చిన్న నవ్వు నవ్వి ఆరోజున మనసులోని అశాంతిని

దూరం చేసుకున్నాను. కాని అప్పటినుంచి పిల్లలతో కొంచెం కలసి మెలసి ఉండే సంబంధం పెట్టుకున్నట్లయితే ఇవాళ వారితో ప్రేమ సంబంధం ఏర్పడేది. భయగౌరవాల సంబంధంకాదు. నీలూ, బిలూల గారాబం, మంకుపట్టు అన్నీ తల్లితో. తల్లితో కలసి భోజనానికి కూర్చోవటం - మనస్సువిప్పి చెప్పుకోవటం - చిన్నప్పటినుంచీ ఇప్పటికీ అవన్నీ అలాగే వున్నాయి... పిల్లల పేర్లు తలపుకివస్తే నీలూ బిలూ - ముందు నీలూ తర్వాత బిలూ గుర్తుకొస్తారు. బిలూ వయస్సులో పెద్దవాడు. అయినా ముందు బిలూ పేరు తలపుకి రాదు - కార్తిక గణేశుల పేర్లలాగా. అన్ని పనుల అరంభంలోనూ గణేశుడి పేరు. కాని ముందు గణేశ్‌ని తర్వాత కార్తికేయుణ్ణి చెప్పాలికదా! గణేశ్... కార్తికేయ రెండుపేర్లు ఏమిటో ఒక్క గుక్కలో చెప్పలేం. సదాశివ్ నా దోమతెర వేయటానికి వచ్చాడు. నేను జపంలో కూర్చుంటానని అనుకుని వుంటాడు. దోమల బాధ మూలంగా దోమతెర వెలుపల పూజకు కూర్చునే వీలెక్కడ! దోమలు కుట్టటంతో మనస్సు ఏకాగ్రత సడలిపోతుంది. రాత్రి పడుకునేప్పుడు దోమతెర ఉపయోగించను. శరీరాన్ని ఎంత సహింపచేస్తే అంత సహిస్తుంది. దోమకాటుని సహించగల పాటి సహనం లేకపోతే, ఆ మాత్రం కఠిన సాధన చెయ్యగల ఓర్పు లేకపోతే - పెద్ద పెద్ద పనులు మనవల్ల ఎలా అవుతాయి? బిలూకి దోమతెర లేకపోతే ఎంతో యిబ్బంది అవుతుంది. దోమతెర వెయ్యవద్దని సైగతో అతణ్ణి వారించాను. ఇవాళ సోమవారం. నాకు మౌనవ్రతం. మహాత్మాజీ 'ఆత్మశుద్ధి' కోసం చేస్తారు. ఆయన ఏది చెయ్యటం మంచిదనుకుంటారో దానిని మనం చెయ్యలేమూ! తక్కిన సోమవారాల్లో సంధ్యాసమయానికి ముందు పూజచేసి, తర్వాత ఉపవాసం విరమించేవాణ్ణి. భోజన సమయాన మాట్లాడేవాణ్ణి. అది దృష్టిలో పెట్టుకునే సదాశివ్ నా పూజకేర్పాటు చెయ్యటానికి వచ్చాడు. సదాశివ్ చాలా మంచి కుర్రవాడు - నిజంగానే సదాశివుడు. కొన్ని యేళ్ళక్రితం 'వస్త్ర స్వావలంబన ప్రతిజ్ఞాపత్రం' మీద సంతకం పెట్టటంతో - అప్పటి నుంచీ ప్రతిరోజూ కనీసం వెయ్యిగజాలయినా నూలు వడుకుతాడు.

అప్పర్ డివిజన్ వార్డు పెద్ద హాలులాంటి గది. ఇప్పుడు ముప్పైనలుగురు ఖైదీలు ఈ గదిలో వుంటున్నారు. పంధొమ్మిదిమంది విడి ఖయిదీలు, పదిహేను మంది రాజకీయ నిర్బంధితులు - శిక్షపడినవాళ్ళు లేదా విచారణలో వున్నవారు. మధ్య దర్వాజా ప్రక్కన నా సీట్. గది మధ్య నుంచి రాకపోకలదారి. దానికి రెండు వైపులా గోడకి ఆనించి వరుసగా బల్లలు. దానికి దోమతెర నెట్ వేల్లాడేసివుంది. ప్రతిబల్ల ప్రక్కన ఒక టేబుల్, ఒక కుర్చీ, ఒక పుస్తకాల షెల్ఫ్. చాలా బల్లల ప్రక్కన నేలమీద కంబళ్ళు

పరిచి ఉన్నాయి. టేబిల్‌మీద ఒక్కొక్క టేబుల్ క్లాత్, దానిమీద అద్దం, దువ్వెన ఇంకా ఎన్నో. ఇనప కటకటాలు, తాళం, చెవి, వార్డర్ల మొహాలు చూడకపోతే దీన్ని జైలు అని తెలుసుకునే వీలులేదు. సరిగ్గా ఏదో కాలేజీ విద్యార్థులుండే హాస్టల్! గడచిన ఆగస్టు నెలలో హరిహరజీ తండ్రిని దొమ్మీ కేసులో అండర్ ట్రెయిల్ కోసం ఇక్కడికి తీసుకొచ్చారు. అప్పుడు హరిహర్ తండ్రి పోలీసులు తనని ఒక సత్రానికి తీసుకొచ్చారనుకున్నాడు. తర్వాత జైలుకి తీసుకెడతారని అతని ఉద్దేశం. ఒకసారి కొడుకుని కూడా 'తనని జైలుకి ఎప్పుడు తీసుకెడతారు?' అని అడిగాడు వృద్ధుడు.

పోలీసులు అతణ్ణి తర్వాత కొద్దిరోజులకు వదిలేశారు. పంథొమ్మిదివందల ఇరవై ఒకటి - ఇరవై రెండులో జైల్లో ఉన్నాను. అప్పటి జైలుకీ ఇప్పటి జైలుకీ ఆకాశ - పాతాళాల వ్యత్యాసం. అప్పుడు సామాన్య ఖైదీల తరగతిలో ఉండేవాణ్ణి. ప్రతి ఒక ఖైదీ పనిచెయ్యాల్సిందే! "సర్కార్ సలాం"ని గురించి ఎంత గొడవయింది!' "ఎక్కడికి పోతున్నావ్" - హఠాత్తుగా మేట్ కర్కశ స్వరం వినిపించేది. "జోడీగా కట్టకట్టుకుని వెళ్లండి" పాయిఖానాకి వెళ్లేప్పుడు కూడా ఇలా లైన్‌గా వెళ్లాలిసివచ్చేది! అందరి చేతుల్లో ఒక్కొక్క లోహపాత్ర. భోజనం- వగైరా అన్ని పనులు ఈ పాత్రతో పూర్తి చేసుకోవాల్సిందే! మాట మాట్లాడితే 'డాండా బేడీ' చేతులకు సంకెళ్లు వేసి నుంచోపెట్టటం - 'చట్టి పన్ హావ్' (సాక్‌క్లాత్) మొదలైన శిక్షలు. దానితో ఈనాటి పరిస్థితిని పోల్చగలమా? అటు యిటు తిరగటం, భోజన-భాజనాలు, నివాసం సంబంధంలో ప్రతి సామాన్య అధికారం పొందటానికి వెనుక ఎంతో త్యాగం, ఎందరో విస్మృత అమరవీరుల ఆత్మగోపన ఉన్నాయి. కాని వీరి విచారణ ఆశ్చర్యం! నాకు అప్పర్ డివిజన్ యిచ్చారు. నా భార్యకీ అప్పర్ డివిజన్ యిచ్చారు. మా కొడుకు బిలూకి డివిజన్ త్రీ ...

చరఖా తీసుకుని కూర్చోవాలి. మనస్సులోని ఉద్వేగాన్ని చల్లబరచటానికి ఇలాంటి సాధనం మరొకటి లేదు. కాసేపు ఏకాగ్ర మనస్సుతో చరఖా వడికితే స్నాయువుల్లోని ఉత్తేజన మెల్లిమెల్లిగా చల్లబడుతుంది. డాక్టర్లు నవ్వనీ, సోషలిస్టులు నమ్మకపోనీ - నాకు దీనితో ప్రత్యక్షానుభవం ఉంది. చరఖా తీసి, తెరిచి కూర్చున్నాను. సదాశివ్‌దేదో చెప్పాలనుకుంటున్నాడల్లే ఉంది. లేకపోతే ఎందుకు నుంచుని ఉంటాడు! కళ్ల సంజ్ఞతో "ఏమిటి?" అని అడిగాను. అతను కొంచెం తటపటాయిస్తూ - "మేము కొంతమందిమి యిప్పుడు 'సూత్రయజ్ఞం'లో కూర్చోవాలనుకుంటున్నాం. దానికి మీకు అభ్యంతరమేమీ లేదు కదా!" అని అడిగాడు. అతణ్ణి కూచోమని సైగతో చెప్పాను. ఈ కాలపు కుర్రవాళ్లు ఇంత 'ఫార్మాలిటీ' పాటిస్తూ వ్యవహరిస్తారు! ఆశ్చర్యం! అందరూ కలిసి కూర్చుని చరఖా

వడకటం ఆనందకరమైన విషయం! మీకిలాంటి మంచి బుద్ధి కలగటం కంటె కావల్సిందేముంది! దీనికి మళ్ళీ నా అభిప్రాయాన్ని తెలుసుకోవలసిందేముంది? నేను కోరుకునేది ఇదే! మిమ్మల్ని గురించే భయం! సోషలిస్టులు మిమ్మల్ని వారి పార్టీలో సభ్యుల్నిగా చేర్చుకోవటం కోసం ఎప్పుడూ ఎదురు చూస్తూ కూచోవటం చూస్తున్నాను. మీ మీద నమ్మకం పెట్టుకోటం యెలా?... సాయం సమయంలోలాగా ఉదయం కూడా ప్రార్థనలు చేద్దామన్న ప్రస్తావన వారి దగ్గిర తీసుకొచ్చి వెళ్లిపోవలసివచ్చింది. మెహర్‌చంద్ కూడా నా చాటున హేళనగా "పదణాల బత్తెంతో రెండు పూటలా ప్రార్థన చెయ్యటానికెక్కడ వీలవుతుంది? రేషన్ రూపాయి పావలా చెయ్యండి. తర్వాత రెండు పూటలా సామూహిక ప్రార్థనలు చేద్దాం. వస్తువుల ధరలన్నీ మండిపోతూండటం వల్ల త్వరలోనే బత్తెం పన్నెండణాలకు పెంచుతారని విన్నాను. పెంచిన తర్వాత వారానికి ఒకరోజు వంతున చీకటితో ప్రార్థన చెయ్యగలం" అనటం విన్నాను. అని 'హీ, హీ' అని నవ్వాడు. ప్రార్థన చెయ్యాలని లేకపోతే చెయ్యకండి. కాని ప్రార్థన విషయాన్ని హేళన చెయ్యటానికి సిగ్గులేదూ? మీరు గాంధీజీ శిష్యులు, సత్యాగ్రహులు, మీరు నాస్తికులేం కారు. మీరే ఈ విషయాలన్నీ తీసుకుని హేళన చెయ్యటం మొదలెడితే - సోషలిస్టులు - నోటికొచ్చినట్లల్లా మాట్లాడితే యెలా తప్పుపట్టగలం?

సదాశివ్ మెహర్‌చంద్ - వరుసగా కంబళ్లు పరిచారు. నా సీట్ సరిగ్గా వార్డ్ మధ్యలో. గదిలోకి రాగానే ఎడమవైపున మహాత్మాజీ భక్తుల వర్గం. అంటే కాంగ్రెసులో మెజారిటీ అనుయాయులు. వీరుగాక అటువైపున ఒక కమ్యూనిస్ట్, కిసాన్ సభ సభ్యులొకరు ఉన్నారు. వీరిద్దరినీ గవర్నమెంట్ ఎందుకు బంధించి ఉంచారో వీరికే తెలియదు. వీరు మనస్ఫూర్తిగా ప్రస్తుత యుద్ధంలో గవర్నమెంట్‌కి సహకరించాలని కోరేవారు. గదిలో కుడివైపున సోషలిస్ట్ ఫార్వర్డ్ బ్లాక్ సభ్యులున్నారు. మధ్యలో నేను బఫర్ (Buffer)ని. జైలు తరఫునుంచి ఇలా సీట్ల ఏర్పాటు జరగలేదు. మా సౌకర్యానికనుగుణంగా చాలాసార్లు సీట్లు అటు-యిటు మార్చుకున్నాక ఈ ఏర్పాటు స్థిరమయింది. నా సీటు ప్రక్కనే వార్డ్‌లో ప్రవేశించే గుమ్మం. గుమ్మానికి ఎదురుగా చాలా స్థానాలు ఖాళీ. ఈ స్థానం మరీ రాస్తా మీదికి ఉండటం, పైగా దీనికి సరీగ్గా పైన పావురాలగూడు ఉండటం వల్ల ఇక్కడింక మరోసీటు లేదు. ఇక్కడే కంబళ్ళు పరచుకుని అందరూ చరఖాలు తెచ్చుకుని కూర్చున్నారు. రామచంద్ర్, కిషన్‌దేవ్, హరిహర్, రామదేనీ, సదాశివ్, రామశరణ్, భూషణ్ ప్రసాద్, రామలోచన్, మెహర్‌చంద్. ఎక్కువ పేర్లలో మొదట 'రామ' పదం కనిపిస్తుంది. రామదేనీ తప్ప అందరి ఎదుటా యెరవాడ

'చక్రం'. రామదేనీ జైలుకి వచ్చి చరఖావడకటం నేర్చుకున్నాడు - రెమిషన్ ఆశతో ... రెడ్ ఠానా, గవర్నమెంట్ స్పెషల్ కోర్టు తగలపెట్టాడని. ఈ రెండు నేరాలతో పాపం అతనికి పన్నెండేళ్ళు శిక్ష పడింది. జైల్లో అతనికి చరఖా వడికే పని లభించింది. అందుకని అతని ముందు జైలు అధికారులిచ్చిన బ్రహ్మాండమైన బీహార్ చరఖా. ఇద్దరు మనుషుల స్థలం ఆక్రమించుకుంటుంది. రామదేనీ మొదట్లో సూపరెంటెండెంట్‌తో - తాను జైల్లో పనిచెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. తనకి పని ఏదైనా యివ్వమని అడిగినప్పుడు - అందరూ అతణ్ణి వెలివేయాలనే ప్రస్తావన తీసుకొచ్చారు. కాని కొన్నాళ్ళయిన దగ్గిర్నుంచి మళ్ళీ అందరూ అతనితో మాట్లాడటం ప్రారంభించటం గమనించాను. వారు చరఖాలు తెచ్చుకుని కూర్చోగానే - కుడివైపు సీట్లలో నుంచి ఒకరు చరఖాధ్వనిని అనుకరిస్తూ ధ్వని చెయ్యటం మొదలెట్టారు. దాంతో యిద్దరు ముగ్గురు నవ్వారు. సుఖలాల్ కాక ఇంకెవరవుతారు? అహ, సుఖలాల్‌కాదు, కామ్రేడ్ సుఖలాల్. వెధవది గుర్తుండదు. కుర్రవాడు చక్కగా అనుకరించగల కారికేచర్ చూపించగలడు.

రెండు లాంతర్లు - ఇంతమంది నూలు వడకటానికి సరిపడ వెలుతురెలా వస్తుంది? కాని అంతకంటె ఎక్కువ వెలుతురు ఎక్కడినుంచి వస్తుంది? యుద్ధం మూలంగా కిరోసిన్ పరిమాణం తగ్గించారు. తలసరి పావుచటాకు కిరోసిన్ ఇస్తారనుకుంటా. అందుకని కొంతమంది కలసి ఒక లాంతరు వెలిగించుకోవాలి. వార్డ్ బయట ఎలక్ట్రిక్ లైట్లు ఉన్నాయి. వార్డులోపలకూడా కొన్ని లైట్లు ఏర్పాటు చేస్తే ఏంపోతుంది? గవర్నమెంట్ ఉద్దేశం ఏమిటో తెలియదు. ఎలక్ట్రికల్ లైట్లు ఇస్తే చాలు ఖైదీలు ఆత్మహత్య చేసుకోవటానికవకాశం ఏర్పడుతుంది అని వారి భయం. అందరూ ఏదో ఆత్మహత్య చేసుకోవాలనే ఉత్కంఠతో ఉన్నట్లు! అందుకనే జైల్లో ఉన్న పాత బావులనన్నింటినీ చెక్కలతో గట్టిగా మూయించేశారు. ఎప్పుడేముద్దాయి బావిలో దూకి పడిందీ దృష్టాంతాలు లేకపోలేదు. ఇంతెందుకు - అప్పుడు కొంతమంది "బాసిలరీ డిసెంట్రీ" వచ్చిన తర్వాత నేను డాక్టరుతో - మావార్డులో ఒక బాటిల్ ఎలక్ట్రొలిటిక్ క్లోరిన్ యిస్తే అందరూ త్రాగే నీళ్ళలో అందరూ దాన్ని ఉపయోగించే ఏర్పాట్లన్నీ నేను చేస్తానని చెప్పాను. డాక్టర్ బాబు చేతులు రెండూ జోడించి నాతో "క్షమించండిసార్! అలా మాత్రం కోరకండి, పెన్షన్ తీసుకోటానికిక మూడేళ్ళు మాత్రం గడువుంది. ఈ మధ్యనే రెండుసార్లు డిపార్ట్‌మెంట్ యాక్షన్ తీసుకోవటమయ్యింది. ఒకసారి ఒక వ్యక్తి మాలిష్ మందు ఒక సీసా త్రాగాడు. మరొకరు ఫినాయిల్ త్రాగారు. ఇంత ఫినాయిల్ ఒక్కసారిగా ఎలా సంపాయించాడు అన్న దానికి నేను ఎక్స్‌ప్లనేషన్ యిచ్చుకోవలసి

వచ్చింది. పాకీవాడు ఖైదీల దగ్గిరనుంచి ఎవరూ ఫినాయిల్ తీసుకోలేరు. ఈ డిపార్ట్‌మెంట్‌కి అబ్బ అమ్మ అంటూ ఉన్నారాసార్?" అన్నాడు.

ఒక్కసారిగా అనేక రకాల ధ్వనులు వినటానికి చాలా బాగుంటాయి. పైన ఎంతో ఎత్తునుంచి విమానాలు ఎగిరి వెడుతున్నట్లుంటుంది. బంగారు భారతదేశాన్ని నిర్మించే పథంలో నేనొక్కడినేకాదు యాత్రికుణ్ణి అని మనస్సుకి తలపు తెప్పిస్తుంది. ఇది కేవలం ఇన్ని గజాలు, ఇన్ని బారలు నూలు వడకటంకాదు. ఇప్పుడు చరఖాకు ప్రాణ ప్రతిష్ట చేయటం జరిగింది. ఇది రామరాజ్యాన్ని తిరిగి తీసుకురావటానికి ఏకైక అస్త్రం. రామరాజ్యం ప్రేమరాజ్యం, గౌరాంగరాజ్యం అవుతుంది. లోకులు హింసను ద్వేషాన్ని మరచిపోతారు. శ్రమ చెయ్యి, సుఖంగా తిను, పెట్టు. హాయిగా వుండు. ఎవరికీ అభావమనేది వుండదు. ప్రతి గోశాలలోనూ ఆవులు, గేదెలు, ఎడ్లు. ప్రతి గాదెలోను ధాన్యం. ఎన్ని గజాలు నూలు వడికితే లక్ష్యానికి అంత చేరువవుతావు. ఒకరు మరొకరికి సహాయం చేస్తున్నాడు. ధనవంతుడు దరిద్రుడికి తన డబ్బు పంచియిస్తున్నాడు. గ్రామాలు తమ అవసరాలకోసం బయటివైపుకి చూడటమంటూ వుండదు. పేదవాణ్ణి పీడించే మార్గాలన్నీ బంధింపబడతాయి. ఎవరి మీద ఆధారపడనప్పుడు ఎలా పీడించగలరు? సూత్రయజ్ఞం నాపద్ధతినే తలపుకి తెస్తే - ఇంకా చాలా మంది ఆలోచిస్తారు. రాజకీయ కార్యకర్తలు - గ్రూప్‌లు గ్రూప్‌లుగా మా సిద్ధాంతాలను వదిలి వెళ్ళిపోతున్నారు. అర్థం చేసుకోనీ - చేసుకోకపోనీ - విశ్వసించనీ - విశ్వసించకపోనీ - సోషలిస్ట్ కావటం ఒక ఫ్యాషన్‌గా పరిణమించింది. నీలూ, బిలూల సంగతే తీసుకోరాదూ! పంథొమ్మిది వందల ముప్ఫై - ముప్ఫై రెండులో ఎంత చరఖాలు వడికారు! ఎన్ని మాటలు చెప్పారు! వారు ఈ విధంగా తయారవుతారని, ఈ ఉన్నతాదర్శాన్ని వారెన్నడైనా విడిచి పెట్టగలరని నేను ఎన్నడూ అనుకోలేదు. ఇప్పటికీ - నా సిద్ధాంతాన్ని అనుసరించే వారు వెళ్ళారంటే నా మార్గం సరియైనదేనా అని నా మనస్సులోనే సందేహం కలుగుతుంది. తమ దేశంలోని వేదాలు - పురాణాలు, మునులు, ఋషులు, చరిత్ర అన్నీ పోయాయి. అందరిదృష్టీ రష్యామీద. అరే! రష్యా నీ దేశం కంటె కూడా ఎక్కువైనదా? దేశ విదేశ చరిత్రలు మేము కూడా చదివాం. మ్యాజినీ గ్యారిబల్డీ ఇటలీకి చెందిన సుప్రసిద్ధ దేశభక్తుడైన సైనికాధికారి (1807-1882). వాషింగ్టన్ ప్రసిద్ధుడైన అమెరికన్ ప్రెసిడెంట్ (1732-1799) కోసుథ్ (1802-1894) ప్రసిద్ధుడైన హంగేరియన్ పేట్రియాట్, స్టేట్స్‌మన్‌ల అమర గాథలు మాకూ గగుర్పాటు కలిగిస్తాయి. వారి కీర్తి ప్రేరేపణే మమ్మల్ని విద్యార్థి దశలో ఉత్తేజితుల్ని చేసింది. అలా

అని శివాజీ గౌరవ గాథను విస్మరించలేదు. వివేకానంద్ సూక్తులు విడిచిపెట్టి మార్క్సు ప్రవచనాల వలలో పడలేదు. మహాత్మాజీ కంటె స్టాలిన్ గొప్పవాడని భావించలేను. విదేశీ పండితుల రచనలు చదవకపోవటమేమిటి? చదువు. మేము కూడా బెన్‌థామ్ విఖ్యాత రాజనీతి శాస్త్రజ్ఞుడు (1748-1832) స్పెన్సర్ ఇగ్లాండుకి చెందిన ప్రసిద్ధ కవి (1552 - 1599) మిల్ - ప్రసిద్ధ ఇంగ్లీషు తత్వవేత్త (1806-1873)లను చదవలేదూ? కాని అలా అని తమ చరిత్రనంతా పూర్తిగా మరిచిపోవాలా? బిలూ మొదట కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీలో చేరినప్పుడు - అప్పుడైనా వాడికి నచ్చచెప్పటానికి ప్రయత్నించినట్లయితే బహుశా వాడికీనాడు యిలా జరిగేది కాదేమో. బిలూని శాసించగలిగినట్లయితే నీలూ కూడా గుప్పిటిలోంచి బయటికి పోగలిగేవాడుకాదు. చెవి మెలివేస్తే బుద్ధి వస్తుంది. అన్న ఏది చేస్తే వాటికన్నిటికీ నకలు చెయ్యాలని వాడి కోరిక - అది మంచి కానియ్, చెడు కానియ్, వాడికి తెలియనీ తెలియకపోనీ... కాని బలవంతంగా ఎవరినైనా కనీసం బుద్ధిహీనులు కాని వారిని - ఏ సిద్ధాంతాలకైనా కట్టుబడి ఉండేట్లు చెయ్యగలమా? బిలూ వయసొచ్చిన యువకుడు - వాణ్ణి శాసించినా? ఇంతకీ ఎందుకు? నా సిద్ధాంతాలతో ఏకీభవించలేదనేగా ! వాడి వ్యక్తిత్వానికి రవంత గౌరవాన్ని అయినా యివ్వకపోతే - మా మార్గంలో నిగ్రహం సహన శీలత యెక్కడున్నట్లు? వారు అజ్ఞానులు కారు. నేను అన్ని సంగతులు వారికి వివరించి చెప్పగలిగినా వారే తమలో తాము పర్యాలోకన చేసుకోలేదా? వారు నా సిద్ధాంతాల వాతావరణంలో రాజకీయాశ్రమంలో పెరిగినవారు. వారికి వీటిలోని సూక్ష్మతిసూక్ష్మ భేదాభేదాలు కూడా తెలుసు. ఈ విషయాన్ని గురించి చర్చలు, సమాలోచనలు - ఎన్నోచోట్ల, ఎన్నోసార్లు విన్నారు. బిలూ మూడు నెలలు సబర్మతీ ఆశ్రమంలో కూడా వున్నాడు. మహాత్మాజీ పాదధూళి తీసుకునే అదృష్టం బిలూ, నీలూ యిద్దరికీ కలిగింది. వారు పూర్ణియా ఆశ్రమంలో మహాత్మాజీతో ఫొటో కూడా తీయించుకున్నారు. కొద్ది రోజులే అయితే మాత్రం ఏం- ఇలా మహాత్మాజీ సంస్పర్శలోకి వచ్చినా కూడా, ఆయన ప్రభావం వారిమీద పడనప్పుడు - ఆ స్థితిలో నేనేదైనా చెయ్యబోవటం మూర్ఖత్వం! నేను గవర్నమెంట్ స్కూలు హెడ్మాష్టర్ ఉద్యోగం వదిలేసి, రాజకీయ రంగంలోకి దిగినప్పుడు ఎవరిమాటయినా విన్నానా! ప్రపంచంలో అందరూ వారించారు. డి.పి.ఐ. నా ఉద్యోగం రాజీనామా పత్రాన్ని త్రొక్కిపట్టి, నాకు బోధించటానికి పిలిపించారు నన్ను. పాట్నాలో ఆ దొర బంగళాకి దొరగారిని కలుసుకోటానికి వెళ్ళాను. దొరగారి నౌకరుకు కూడా నా రాజీనామా సంగతి తెలిసిపోవటం గ్రహించాను. అదివరకు కలుసుకోవటానికి కార్డు యిచ్చేప్పుడు అతణ్ణి సంతృప్తిపరచవలసి

వచ్చేది. బక్షీష్ ఇవ్వవలసి వచ్చేది. బంట్రోతు ఏదో నిర్లిప్తభావం చూపేవాడు. అలాంటిది ఇప్పుడు చూద్దునుకదా కాళ్ళకి వంగి పాదధూళి తీసుకున్నాడు. "మాష్టారుగారూ! స్వరాజ్యంలో కలిశారని విన్నాను". నాకు నమస్కరించగలగటంతో నేనేదో అతని పని చేసినట్లు - కృతజ్ఞతతో అతని ముఖం విహ్వలమైంది. "నాక్కూడా స్వరాజ్యంలోకి వచ్చి తమ సేవ చేయాలని కోరిక ఉంది నాకు. కుర్రవాడికి వచ్చే ఏడు మాధ్యమిక ఇంగ్లీషు పరీక్షలు. తర్వాత దొరగారిని వేడుకుని వాడికి నౌకరీ యిప్పిస్తా. ఆ తర్వాత నేను కూడా స్వరాజ్యంలోకి వస్తా" అన్నాడు. డి.సి.ఐ. అనుగ్రహ దృష్టి వున్నది నామీద. బి.టి. చదివేప్పుడు - అయన మా కాలేజీ ప్రిన్సిపాల్‌గా ఉండేవాడు. దొర చెయ్యి పట్టుకుని కూర్చోబెట్టాడు. పై అధికారి క్రింద పనిచేసే ఉద్యోగికి ఎలా సంభాషణ జరగటం సముచితమో అలా కాకుండా గురు - శిష్య భావంతోనే సంభాషణ జరిగింది. దొర వచ్చేప్పుడు కూడా - "సన్యాల్! పొరపాటు చేస్తున్నావు. మళ్ళీ ఆలోచించుకుని చూడు" అన్నాడు. అప్పుడు నేను "ఇంతకాలం పొరపాటు చేస్తూ వచ్చాను. ఇంక చెయ్యను" అన్నాను. పొరుగువారైన మిత్రాగారు - కాళీగుడి వెనక ఇటికల గుట్ట దగ్గిరకు తీసుకెళ్ళి ఎంతో సానుభూతితో "ఎందుకు ఈ గొడవల్లో పడుతున్నావ్? పెళ్ళి - గిళ్ళి అయింది. పెళ్లాంబిడ్డలు సంసారం వుంది. వెనకాముందు ఆలోచించకుండా ఒక్కసారిగా దూకటం మంచిదేనా? భారతదేశంలో అన్నిచోట్లా స్వరాజ్యం వస్తే పూర్ణియాలో కూడా వస్తుంది. ఈ ప్రదేశాన్ని వదిలేసి స్వరాజ్యం రాదుకదా!" అని బోధించారు. ఎంతమంది ఎన్ని రకాల వ్యాఖ్యానాలు వ్యక్తం చేశారు? ఎవరి మాటలకైనా నేను చెవి ఒగ్గానా? ఈ మార్గానికి వచ్చేముందు ఎవరినయినా సలహా అడిగానా? అడగవలసిన వారిలో ఒక్క బిలూ తల్లిని మాత్రమే అడిగాను. అది కూడా సరిగ్గా అడగటంకాదు. నా సంకల్పం స్థిరం చేసుకున్నాక ఒకసారి తెలియచెయ్యటం. ఆమె ఏమి ఆలోచించుకున్నదో నాకు తెలియదు. "మీకు ఏది మంచిదనిపిస్తే అది చెయ్యండి. ఆడదాన్ని సలహా ఇవ్వటమా"? అనిమాత్రం అన్నది. నేను ఎవరి అభిప్రాయాన్ని తీసుకునీ వ్యవహరించటంలేదు. నేను ఏది మంచిదనుకున్నానో అదే చేస్తున్నా. మరి బిలూ మాత్రం నా అభిప్రాయాన్ని తీసుకుని ఎందుకు నడుస్తాడు?

ఒక చరఖానుంచి బండి చక్రం ధ్వనిలా కిర్‌కిర్‌మని ధ్వని వినిపిస్తోంది. ఇది అంతులేకుండా పదే పదే వినిపించటం కర్ణకఠోరంగా వుంది. సిమెంట్ చేసిన గచ్చు నేలమీద నుంచి ఏ ఇనుప వస్తువు అయినా బరబర లాగితే యెంత దుస్సహంగా ఉంటుందో అలా వున్నట్లనిపిస్తోంది. సున్నితమైన గాయం మీద ఎవరో మెరుగు

కాయితంతో రాపిడి పెడుతున్నట్లుంది. జైలుకి రాకముందు నా ఈ నరాల దౌర్బల్యాన్ని గమనించలేదు. ఆరోగ్యకరమైన నా నరాలు స్వల్పమైన వాటికి దుర్బలంకావు - అని నాకు గర్వంగా వుండేది. ఈసారి జైలుకి వచ్చాక ఏమిటిలా అయింది? ఈ ధ్వని తప్పకుండా రామదేనీ చరఖా నుంచే వస్తూంటుంది. నా చేతిలోని దారంమీది నుంచి చూపుమరల్చి, రామదేనీ చరఖావైపు చూశాను. రామదేనీతో కళ్ళు కళ్ళు కలుసుకున్నాయి. రామదేనీ చరఖా చరకా విడిచిపెట్టి లేచాడు. తన సీట్లువైపుకి పరుగెత్తుకుని వెడుతున్నాడు. అందరూ అతని వైపు చూస్తున్నారు. బహుశా ఇది శిష్టాచారం తెలియని వాడని ఆలోచిస్తున్నాడనుకుంటాను. సామూహిక చరఖా స్థలంనుంచి లేచి వెళ్ళటం. రామదేనీ తిరిగివచ్చాడు. చేతిలో నూనె సీసా వుంది. చరఖాలో ఒక్కొక్క బొట్టే నూనె వేశాడు. తర్వాత మళ్ళీ నూలు వడకటం మొదలెట్టాడు. అందర్నీ చూస్తున్నాడు. నూలు వడుకుతూ మధ్య మధ్య నాముఖంకేసి ఏమిటి చూస్తున్నారు? నా మొహంలో పరివర్తనని చూస్తున్నారా? ఈ మధ్య కొన్నాళ్ళ నుంచి నా మనస్సులో ఏ సంఘర్షణ, ఏ సంశయం రేగుతోందో దాని చిహ్నాలు వీరు నా ముఖంలోనూ, కళ్ళలోనూ చూడగలుగుతున్నారా? మనసులోని భావాన్ని కప్పిపుచ్చటం వీలవుతుందా? వేసవి కాలంలో ఉపవాసం చేస్తే బహుశా నా ముఖం వాడిపోయినట్లు కనిపించవచ్చు. కాదు ప్రతి సోమవారం యెన్నాళ్ళనుంచి ఉపవాసం చేస్తున్నాను? ఉపవాసం మూలంగా ఏమీ కాదు. వీరి సానుభూతికి విలువ ఏమి చెల్లించగలమని నేను కనీసం కొంతసేపైనా మనస్సులోని అశాంతిని మరిచి పోగలగటంకోసం వీరందరూ కలిసి చరఖాలు వడకటానికి కూర్చున్నారు. అందరూ కలిసి నా బరువుని తీసుకుని నా మనస్సుని తేలిక చేయాలని కాంక్షిస్తున్నారు. ఒత్తయిన ఉంగరాలజుట్టు, అందమైన తెల్లటి శరీరచ్ఛాయ, కొంచెం కొనదేలివుండే పొడుగాటి ముఖం, సన్నటి గడ్డం, నల్లటి కళ్ళు, ఊహాభరితమైన దృష్టి. నేను బిలూ కేసి చూడగానే వాడు కళ్ళు క్రిందికి వాల్చుకుంటాడు... కాని ఈ కళ్ళలోంచి కూడా వజ్ర సదృశమైన అగ్నిజ్వాల బయలువెడటం చూశాను. నేను ఉద్యోగం వదిలెయ్యటానికి కొంచెం ముందు జరిగిన సంఘటన. హైస్కూల్ ప్రక్కనే "ప్లాంటర్స్‌క్లబ్". రెండు కాంపౌండుల మధ్య తీగదడి. క్లబ్‌లో 'చారిటీషో'యో ఏదో జరుగుతోంది. ఆడవాళ్ళు రకరకాల విలాస వస్తువుల 'స్టాల్' తెరిచారు. నీలూ, బిలూ ఈ తీగెల దడిమీద ఎక్కి, దొరసానుల ఉత్సవాన్ని చూస్తున్నారు. నీలూ అప్పుడు చాలా చిన్నవాడు. బిలూ మధ్య తీగెమీద నీలూని నుంచోపెట్టి పట్టుకుని ఉన్నాడు. కార్యూ బంగళా పెరిన్ దొర హఠాత్తుగా మా క్వార్టర్ గేట్‌లోకి రావటం చూశాను. చేతిలో లాటీ, ఉద్ధతదృష్టి, నాతో

"లేడీస్ స్టాల్ తెరిచారు. కాంపౌండ్ తీగెలమీది నుంచి కుర్రవాళ్ళు ఇరవై నాలుగు గంటలూ నోరు తెరుచుకుని ఏం చూస్తారు? 'యు సి హెడ్మాష్టర్' దీన్ని మీరు స్టాప్ చెయ్యకపోతే ఈ అసభ్యత ఎలా అరికట్టాలో మేమే స్వయంగా చూస్తాం." తీగెల దడిమీద కూర్చుని ఉన్న నీలూకేసి లాటీ ఝళిపించి యెంత అనాగరికమైన పొగరుబోతు భంగిమలో వచ్చాడో అలాగే వెళ్ళిపోయాడు. నేను బిలూని పిలిచి "ఖబడ్దార్! అటువైపు వెళ్ళకు" అన్నాను. నా ముఖంకేసి తలయెత్తిన బిలూ కళ్ళలో సుప్త పౌరుషఛాయ చూశాను. కళ్ళల్లోంచి నిప్పురవ్వలు వస్తున్నట్లు నావైపు చూశాడు "ఏం? అక్కడికెడితే ఏమయింది?" ఏం అని నన్ను ప్రశ్నించటం! నా మాటకి మాట జవాబు చెప్పటం! వాణ్ణి చెవిపట్టుకుని ఇంట్లో లోపలకు లాక్కుని వెళ్ళాను. వాడి తల్లి అప్పుడు వంటింట్లో వుంది. "చూడు ప్రబుద్ధుడైన నీ కొడుకు చేసిన పని! దొరలతో తగవు పెట్టుకుంటే ఉద్యోగం నిలుస్తుందా?" అన్నాడు. తర్వాత నేను వసారాలో నుంచుని బిలూ తల్లితో "'ఏం? మన జాగాలోనుంచుని దొరసానుల ఉత్సవం చూశాం. దానివల్ల ఏమయింది?" అనటం విన్నాను... ఆరాత్రి బిలూ అన్నం తినలేదు. కోపం మూలంగానో అభిమానం మూలంగానో తెలియదు. అర్ధరాత్రి బిలూ తల్లి నన్ను పిలిచి నిద్ర లేపింది. బిలూ ప్రక్కమీదలేడు. బిలూ ఎక్కడికెళ్ళాడు. వెతకండి, వెతకండి నౌకర్లు, చాకర్లు, స్కూల్‌దర్వాన్ నేనూ అందరం లాంతర్లు, లాటీలు పట్టుకుని బయలుదేరాం. బిలూ తల్లి బావురుమని ఏడుస్తోంది. "వ్రేలెడంత పిల్లలు దొరసానుల ఆటలు చూశారు? ఇందులో వారికి అవమానం జరిగిందేముంది?" అంటూ తప్పు నామీద మోపి మాట్లాడింది. బిలూ ఎక్కడా కనిపించలేదు. చివరికి బోర్డింగ్‌లో ఉండేకుర్రాడొకడు బిలూని వెతికి పట్టుకున్నాడు. పగలు బిలూ - నీలూ ఎక్కడ ఉండి దొరసానుల ఆటలు చూశారో సరీగ్గా అక్కడే - తీగెలదడి మీద బిలూ కూర్చుని వున్నాడు. ఉత్సవందీపాలు ఎప్పుడో ఆరిపోయాయి. కాని బిలూ నా బెదిరింపులోని అన్యాయాన్ని నిరూపించటానికి, తన తిరుగులేని హేతువుతో తాను చేసిన పనిలోని సామంజస్యాన్ని నిలుపుకోవటానికి ఈ చలికాలపు రాత్రి చీకట్లో ఒక్కడూ యిక్కడికి వచ్చి కూర్చున్నాడు. ఒంటిమీద లేత ఆకుపచ్చ చిన్న సిల్కు దుప్పటి తప్ప ఏమీ లేదు. కాళ్ళకు చెప్పులులేవు. కాళ్ళు చేతులు మంచుగడ్డలా చల్లపడిపోయినాయి.

బిలూ చేత బలవంతంగా ఏదయినా చేయించగలగటం సాధ్యంకాదు. వాణ్ణి మోసం చేసి, బులిపించి కాని, వాడి సున్నిత హృదయాన్ని ఆసరాగా తీసుకుని కాని, వాడిచేత ఏ పని అయినా చేయించగలరు. కాని కండబలం చూపించబోతే - బిలూ

చిర్రెత్తిపోతాడు. క్షణంలో స్వాభావికమైన మెత్తనితనం ఎక్కడికోపోతుంది. చిన్నప్పటినుంచి వాడిలో యిది గమనిస్తూనే వున్నాను. ఇరవై ఏళ్ళ క్రిందటి సంగతి - బిలూ తల్లి కేకలువిని, జిల్లా కాంగ్రెసు ఆఫీసు గదిలోంచి లేచి, మా కుటీరంకేసి వెళ్ళాను. బిలూ తల్లి గట్టిగా అరుస్తూ "చెప్పు త్వరగా - ఇప్పటికైనా చెప్పు. నువ్వు నిజంగా ముసల్మానుల ఎంగిలి తిన్నావా? మళ్ళీ లేదంటున్నావా?" అంటున్న మాటలు వినిపించాయ్. ఇంట్లోకి వెళ్ళి చూస్తే బిలూ తల్లి గరిటె చేత పట్టుకుని నీలూని కొట్టబోతున్నట్లు భయపెడుతోంది... జరిగిందంతా విన్నాను. నీలూ - బీలూ అటర్నీ బేహబూద్‌గారి తోటకి రేగిపళ్ళు తినటానికి వెళ్ళారు. అక్కడ బేహబూద్ అల్లుడు వాళ్ళని పట్టుకున్నాడు. ఇద్దర్నీ ఒక్కొక్క రేగి ఆకుమీద ఉమ్మివేయమన్నాడు. అది నాకివేసి ఇంకెప్పుడూ రేగి పళ్లు రాలకొట్టటానికి రాను అని అనమని హుకుంజారీ చేశాడు. అలా కనుక చెయ్యకపోతే కొడతానని మాష్టారుగారికి చెపుతానని భయపెట్టాడు. నీలూ భయపడిపోయి, ఉమ్మినాకాడు. బిలూ ఒప్పుకోలేదు. ఏమేమో అన్నాడట! తర్వాత బేహబూద్ అల్లుడు వాళ్ళను వదిలేశాడు. ఇప్పుడు బేహబూద్‌గారి కూతురువచ్చి బిలూ తల్లి దగ్గిర - బిలూ వాళ్ళు తన భర్తను అవమానం చేశారని ఫిర్యాదు చేసింది. దాంతోనే అన్ని సంగతులూ బయటపడ్డాయి. బిలూ తల్లి యిప్పటికి కూడా అసలు ప్రశ్న - అంటే కులం పోవటం - అవమానం చెయ్యటం అన్న ప్రశ్న - పట్టించుకోలేదు. ఇప్పుడు ఆమె దృష్టిలో ముఖ్య విషయమైన 'నీలూ నాకిన ఉమ్మి - అది నిజంగా నీలుదేనా? లేక బేహబూద్ అల్లుడిదా?" అన్నదానిమీదే క్రాస్ పరీక్ష జరుగుతోంది.

ఉలిక్కిపడ్డాను. హహహ అని యిల్లంతా అదిరిపోయేట్లు. ఇన్ని చరఖాల సమ్మిళిత గరగర ధ్వనులను కూడా మ్రింగివేస్తూ బిగ్గరగా నవ్వులు రేగాయి. నా కుడివైపున రెండు సీట్ల అవతల - కిటికీ తెరలు- దుప్పట్లు చుట్టూ అమర్చి గదిలాంటిది ఏర్పాటు చేయబడింది. దీనిలోపల సోషలిస్టు పార్టీ వారి 'క్యాపిటల్' క్లాస్ జరుగుతుంది. ఫార్వర్డ్ బ్లాక్‌కి చెందిన నలుగురూ ఆ క్లాసులో పాల్గొన్నారు. వారు పగలు ఒకచోట కూర్చుని ఏవో కొన్ని మార్క్సిస్టు పుస్తకాలు చదువుతారు. 'క్యాపిటల్' చదువుతున్నారు. అందులో మళ్ళీ ఇంత నవ్వులు దేనికి? ఈ వేసవిలో నాలుగు వైపులా పర్దాలు వేసుకుని కూర్చోవలసిన అవసరం ఏముంది? ఈ కాలపు కుర్రవాళ్ళ చర్యలన్నీ ఆశ్చర్యమే. పర్దాలపైనుంచి పొగలు వలయాలు లేస్తున్నాయి. వారు సిగరెట్టు కాల్చుకొనే వీలుకోసరం ఈ పర్దాలు వేసుకోలేదుకదా? లేదు. ఆ రోజులు, ఆ కాలం ఇంకా ఎక్కడున్నాయి? సిగరెట్లు చుట్టలు కాల్చుకోవటంకోసం - వీరికింత చాటు ఏమీ

అవసరంలేదు. ఆ వర్గంలోని కామ్రేడ్ బానారసీ - బిలూ కంటె ఎంత చిన్నవాడు? - పెదిమల కొసను ఒక సిగరెట్. అందరూ జైలు ఆఫీసర్ పర్సనల్ ఎకౌంటునుంచి డబ్బు అప్పు తీసుకుంటారు. మళ్ళీ అటువైపున -

"ఎంతమంది ఉన్నారు మీరు?"

అలా అయితే పదకొండయిందన్నమాట. కొత్తవార్డరు వచ్చాడు. చుట్టూ ఉన్న పర్దాల మధ్యనుంచి ఒకరు వార్డర్‌ని ఉద్దేశించి, "వెళ్ళు - అట్టే అరవకు" అన్నారు. మరొకరు ఈ వార్డ్‌లో ముద్దాయిలు ఏడున్నరమంది అన్నాడు. వార్డర్ కోపంతో చిరచిరలాడుతూ వెళ్ళిపోయాడు. వెడుతూ వెడుతూ నాన్‌రొట్టె, కోడిగ్రుడ్లు తింటారు వీరు. మళ్ళీ మహాత్మాజీ కార్యాలు చెయ్యటానికని జైలుకివచ్చారు.

పర్దాలోపలనుంచి "ఒకరు - వైద్యనాథ్ త్వరగాలే, రాస్కెల్ ఒంటి మీద కూజానీళ్ళు కుమ్మరించండి" అన్నారు. అందరూ హడావిడిగా లేచారు. కామ్రేడ్ వైద్యనాథ్ ఒక గ్లాసు తీసుకుని బయటికి వచ్చాడు. సన్నగా ఎండిపోయినట్లుండే శరీరం. పాయ్‌జామా తొడుక్కున్నాడు. వదులు లాల్చీ, లాల్చీ కాలరు ఎత్తి పెట్టివుంది. సోషలిస్టులందర్నీ చూశాను. 'క్లాత్ గోడౌన్, ఖైదీ దర్జీకి బీడీలు లంచమిచ్చి ఇలాంటి చొక్కాలు కుట్టించుకుంటూంటారు. ఇంత ఉక్కలో కూడా చొక్కాలు విప్పుకుని ఉండరు. వీరే మళ్ళీ ప్రపంచంలో సర్వసమతా రాజ్యాన్ని తీసుకొస్తారట.

పదకొండు కొట్టింది. అందరూ చరఖాలు వడకటం ముగించారు. కదుళ్ళు - ఏకులు అన్నీ సర్దుకుని లేవటానికి తయారవుతున్నారు. ఏకబిగిని రెండు గంటల కంటె ఎక్కువసేపు చరఖాలందరూ వడకగలుగుతారా? వ్యక్తి సత్యాగ్రహ సమయంలో హజారీబాగ్‌జైల్లో గాంధీ జయంతి రోజున ఏకబిగిని ఎనిమిది గంటలు నూలు వడికిం తర్వాత నాకు కిడ్నీ ట్రబుల్ వచ్చింది. అప్పటినుంచి ఏకధాటిగా ఎక్కువసేపు నూలు వడకలేదు. బహుశా ఇతర కారణాల వల్ల జబ్బుచేసి ఉండొచ్చు. కాని జైలు డాక్టరు అంతసేపు ఒకే విధంగా కూర్చోటం వల్లనే కిడ్నీ ట్రబుల్ వచ్చిందని అభిప్రాయపడ్డాడు. డాక్టరు చెప్పిన దానికి విరుద్ధంగా ఏం మాట్లాడటానికి వీల్లేదు. అందరూ తమ తమ సీట్లలోకి వెళ్ళిపోయారు. సదాశివ్, మెహర్‌చంద్ నుంచుని వున్నారు.

"మాష్టారుగారూ! కొంచెం ఏదైనా తినండి. రోజంతా పైత్యం కలిగించింది. తమ భోజనం టేబుల్ మీద పెట్టి ఉంచాను. రెండు రొట్టెలు తినండి" అన్నాడు మెహర్‌చంద్. ఒక కాగితంమీద 'ఈ ఉక్కలో ఏమీ తినబుద్ధి కావటంలేదు' అని వ్రాసి యిచ్చాను.

"కొంచెం పెరుగు తీసుకువస్తాను, మా యింటినుంచి యివాళ పెరుగు తెచ్చి యిచ్చి వెళ్ళారు. స్వంత యింటి ఆవుపాల పెరుగు. అడికాకపోతే తమకు చెప్పేవాణ్ణేకాను. తమరు గాంధీ సేవా సంఘం సభ్యులు. గేదెపాలు, నెయ్యి తీసుకోరు. ఆ సంగతి ఎవరికి తెలియదు? అందుచేతనే జైల్లో పాలు నెయ్యి మీరు తీసుకోనే తీసుకోరు. ఏదో దైవికంగా మా ఇంటినుంచి వచ్చింది. అవి కూడా మీరు కనుక తీసుకోనంటే నాకు విచారం వేస్తుంది" అన్నాడు మెహర్‌చంద్. మెహర్‌చంద్ నాటక ఫక్కీలో చేతులు జోడించుకుని నుంచున్నాడు. "ఈ కోరిక మీరు మన్నించి తీరాలి మాష్టరుగారూ! మా ఫాదర్ వెంట తీసుకొచ్చారు పెరుగు..." మళ్ళీ ఫాదర్ అన్నాడు. బీహార్‌లో కొద్దిగా ఇంగ్లీషు చదువుకున్నవాళ్ళు కూడా అమ్మ, నాన్న, అక్క, పదాలను తమ భాషలో చెప్పరు. 'మీ సిస్టర్ పెళ్ళాయేం"? అని అడుగుతారు. ఎవరో తల గుండు చేయించుకుంటే ఏమిటి కారణం అని అడిగితే 'మదర్ డెత్ అయ్యింది' అని చెబుతారు. మాటల మధ్య వీరు ఎక్కువ ఇంగ్లీషు పదాలు ఉపయోగిస్తారనికాదు. అయినా నాన్న, అమ్మ, చెల్లెలు ఈ మాటల్ని తమ భాషలో చెప్పటానికి ఎందుకో కాని సంకోచిస్తారు.

"మాష్టరు గారికి పెరుగు యివ్వమని ఫాదర్ మరీ మరీ చెప్పారు నాతో. పిడకల దాలిలో వొచ్చిన పాలతో తయారయిన ఫస్ట్‌క్లాస్ పెరుగు" ఇలా బతిమాలుతున్నాడు. కాదనటానికి వీల్లేదు. కాస్త తాగకపోతే వీరు చాలా విచారిస్తారు. సైగతో వారికి అంగీకారాన్ని సూచించకపోతే వాళ్ళు విడిచిపెట్టరు. అంగీకారాన్ని చెప్పకపోతే గంటసేపు నా చెవులు దిమ్మెక్కేట్లు చేస్తారు. వారి సంగతి నాకు తెలుసు. మెహర్‌చంద్, సదాశివ్ కళ్ళతో ఏవో సైగలు చేసుకున్నారు. ఓ! అలా అయితే సదాశివ్‌ని మెహర్‌చంద్‌ను నావెంట పడేట్లుచేసి ఉంటాడు. తనకి ధైర్యం కలగలేదు. బహుశా ఒప్పుకునేంతవరకు విడిచి పెట్టి వుండవద్దు అని చెప్పి వుంటాడు. మెహర్‌చంద్ అన్నీ సర్ది చరఖా బాక్స్‌మూసి, ఎత్తి పెట్టి వుంచాడు. తర్వాత కంబళ్ళు అన్నీ ఎత్తి మడతపెట్టి ఒక మూల పెట్టేశాడు. గదిలో నీళ్ళ డ్రమ్ ఉండేచోట నా తుండు మగ్ పెట్టి వచ్చాడు. మంచంకిందనుంచి, పాంకోళ్ళ జత తీసి ఎదురుగా పెట్టాడు. నా బిడ్డల దగ్గిర్నుంచి ఇంత సేవా శుశ్రూషలను ఆదరాన్ని ఎన్నడూ పొందలేదు. ఎన్నడైనా అడిగానన్న సంగతి జ్ఞాపకం రావటంలేదు. ఉద్యోగం వదిలెయ్యటానికి ముందు సెలవు రోజున నీలు, బిలూని ఎండలో ఆడుకోనీకుండా చెయ్యటానికి తలలో నెరసిన తెల్ల వెంట్రుకలు తీసెయ్యమని చెప్పాను. పంధొమ్మిది వందల ఇరవై ఒకటి తర్వాతనుంచి బుద్ధిపూర్వకంగానే ఎవరి దగ్గిర్నుంచి ఎలాంటి సేవలు తీసుకోలేదు. బిలూ తల్లి దీని గురించి ఎన్నో ఆరోపణలు ఎత్తిపొడుపులు చేసేది.

క్రొత్త పాంకోళ్ళ జోడు నాలుగయిదు నెలలక్రితం రామ్‌చరిత్తర్‌జీ నాకు ప్రెజంట్ చేశారు. అతణ్ణి వద్దు అనలేకపోయాను. చాలా నచ్చను కూడా నచ్చాయి. తర్వాత విన్నాను - విష్ణుదేవ్‌జీ రామచరిత్తర్‌జీని "బెల్టింగ్ చర్మాన్ని ఎంతలో సంపాయించావ్?" అని అడుగుతున్నాడు. రామ్‌చరిత్తర్‌జీ - "చర్మం నాలుగు 'బీడీ'లతో చెక్క ఆరు 'బీడీ'లతో అని చెప్పాడు. విష్ణుదేవ్‌జీ తెల్లబోయి "అంతమండిపోయే ధరా? పది 'బీడీ'లతో జైల్లో పిల్ల కంబళీకూడా వస్తాయ్‌గా! మీరే బజారును పాడుచేస్తున్నారు - అందుకు అంటున్నాను!" అన్నాడు. ఇంత వెడల్పయిన చక్కని కొత్తరకం - జైలు ఫ్యాక్టరీలోని కంబళ్ళ మిల్‌లో తయారయిన బెల్టింగ్ ! అమర్యాదగా వుంటుందని వాటిని తిరిగి యిచ్చివెయ్యలేదు. కాని ఆ పాంకోళ్ళను యింతవరకెప్పుడూ ఉపయోగించలేదు. మంచం క్రింద పెట్టి ఉంచాను. సదాశివ్ మళ్ళీ వాటిని లాగి బయటికితీశాడు. ఇలాంటి సంసర్గంలో పడిపోయాను. వీరిమధ్య నా నీతి నియమాలను సిద్ధాంతాలను చెక్కుచెదరకుండా వుంచుకోలేము. పాంకోళ్ళ జోడును మళ్ళీ మంచం కింద పెట్టేశాను. డ్రమ్ దగ్గిరకెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కున్నాను. సదాశివ్ తువాల చేతికందించాడు. డ్రమ్ ప్రక్క సీట్ దాన్‌జీది! అతను గుర్రుకొడుతున్నాడు. ప్రతిసారీ ఊపిరి తీసుకునేప్పుడల్లా నోట్లోంచి గాలి బయటికి వస్తోంది. దాంతో పెదవులు రెండూ కంపిస్తూ గుర్‌గుర్‌మని ధ్వని వస్తోంది. గుర్రం గడ్డి మేసేప్పుడు మధ్య మధ్య ఇలాగే సకిలిస్తుంది. ఆ పెద్దమనిషి సరిగ్గా చీకటిపడగానే పడుకుంటాడు. పడుకోగానే నిద్ర పట్టేస్తుంది. ఇహ మళ్ళీ రాత్రి రెండింటికి లేస్తాడు. ఈ ఉక్కలో కూడా రాత్రి ఎనిమిదింటికల్లా ఎలా నిద్రపోతాడు! రామాయణం మహాభారతాల్లో ఇచ్ఛామృత్యువు సంగతి ఉంది. కాని ఇచ్ఛానిద్ర కూడా తక్కువ సాధన ఫలితంకాదు. చీకటిపడ్డాక ప్రార్థన జరుగుతుంది. ఎంత సందడి హడావిడిగా వుంటుంది. కాని దానివల్ల అతని నిద్రకుమాత్రం ఏమీ భంగం కలగదు. నా బల్ల ప్రక్కన మెహర్‌చంద్ పెరుగుతో షర్బత్ తయారు చేస్తున్నాడు. బెల్లం వెయ్యనా? నాటు చక్కెర వెయ్యనా? అని అడిగాడు నన్ను. బెల్లమే వెయ్యమని అతనికి సైగతో చెప్పాను. ఒక లోటా షర్బతు తయారయింది. సదాశివ్ కంబళి పరిచాడు. అతని కెదురుగా ఉన్న చోటులో నీళ్ళు చల్లి అక్కడ లోటా గ్లాసు తెచ్చి పెట్టాడు. నేను అల్యూమినియం గ్లాసులో ఒక గ్లాసు షర్బతు పోసి తీసుకున్నాను. పెరుగు ఇచ్చాడు. షర్బతుకాదు. పలచటి పెరుగు. జైల్లో గ్లాసులు కూడా విలక్షణంగా వుంటాయి. నీళ్ళు త్రాగేప్పుడు ఒంటిమీద గుడ్డలమీద తప్పకుండా పడతాయి. చాలా మిఠాయి కూడా యిచ్చాడు. మెహర్‌చంద్ కథగా చెప్పుకుపోతున్నాడు. "ప్రొద్దున్నే ఇంటర్వ్యూ ఉంది.

రెండు కుండలు పెరుగు వచ్చింది. ఒక బుట్టెడు రవ్వలడ్డూలు వచ్చాయి. ఆఫీసర్లుకి ఇష్టమో ఏమో ఎవరికి తెలుసు? జైలరు ముందు జమాదారుతో పుల్ల గుచ్చి కుండ అడుగుకల్లా చూడు. పెరుగు కాక ఇంకేమైనా ఉందేమో! తర్వాత ప్రక్కనపెట్టు. డాక్టర్‌గారొస్తే పాస్ అవుతుంది. జైలరు నామీద కోపం ఎందుకు తెచ్చుకున్నాడో ఏం తెలుసు? ఇంకా ఎవరి విషయంలోనూ ఇలా చెయ్యలేదు. జమాదారుకి నాలుగు రవ్వలడ్డూలిచ్చి మెదలకుండా బుట్ట తీసుకొచ్చేశాను.

తర్వాత ఏమనిపించిందో "పంచదారతో చేసిన లడ్డూలు కదా! అందుకని నీకు యివ్వలేదు. ఇంకో గ్లాసు యివ్వనా మాష్టరుగారూ?" అన్నాడు అతణ్ణి వద్దని వారించాను. ఒక గ్లాసు త్రాగటమే కష్టం. పైగా మళ్ళీ ఇంకో గ్లాసా? చేతులు మూతి కడుక్కుని మళ్ళీ కంబళీ మీదికి వచ్చి కూర్చున్నాను. మెహర్‌చంద్ గ్లాస్‌తో కుండను వాయిస్తూ "చలో చలో షర్బత్ పీనేవాలో!" అని అరుస్తున్నాడు. విఘన్‌దేవ్‌జీ తప్ప ఇంకెవరూ తీసుకోలేదు. చక్కెర హర్బత్ అయితే బహుశా కొందరు తీసుకునేవారు. విషన్‌దేవ్‌జీ అర్థశేరు మైదా రొట్టెలు తింటాడు. వయస్సు తక్కువ, ఆరోగ్యం మంచిది. కాని అలా అని రాత్రి పన్నెండు గంటలకు భోజనమదీ అయాక - గ్లాసెడు పెరుగు త్రాగుతాడాయేం? ఈ వార్డ్‌లో బెల్లం షర్బత్ ఎవరూ త్రాగాలని అనుకోరు. కాని బిలూ? మూడో తరగతి ఖైదీలు కాస్త బెల్లం, ఒక మిరపకాయ, ఒక ఉల్లిపాయ తినగలిగితే కృతార్థులవుతారు. "స్కర్వి"ని నిరోధించే లెక్కలో వారు వారానికి రెండుసార్లు ఊరగాయ-పొందగలుగుతారు. ఈ విలాస ఖాద్యవస్తువు ఉన్న రోజున వాళ్లకి అన్నం తింటే కడుపునిండినట్టుండదు. ఒక్క ఊరగాయతోనే అన్నం అంతా తినేస్తారు. బాగా తినటానికి అన్నం ఎక్కడ? అతి కష్టంమీద తెచ్చుకున్న పప్పులో మిరపకాయ వృధా అయిపోయిందనిపిస్తుంది. బిలూకి రెండుపూటలా అన్నమే తినటం అలవాటు. ఇక్కడ అదయినా దొరుకుతోందో, లేదో. ఏం తెలుసు? జైలుకోడ్ ప్రకారం రెండుపూటలా అన్నం అంటే 'బెంగాల్ డయట్' ఇది పొందనివారికి - సాయంత్రం పూట అరచేతులంత రొట్టెలనబడేవి రెండేసి చొప్పున యిస్తారు. ఈ సగం కాలిన, జీర్ణం కాని ఖాద్యవస్తువుని - అరగించుకోవటం భీముడికి, వినాయకుడికి సంభవమైతే కావచ్చు, కాని సామాన్య బెంగాలీలకు మాత్రం అసంభవం. మనస్సుకి అనిపిస్తుంది - తన సంగతే తలచుకుంటూ ఈసారి జైల్లో పళ్లు, పాలులాంటివి ఏవీ తీసుకోవటం లేదని, దోమతెరవేసుకుని పడుకోవటం లేదని, బిలూకి తెలియాలి. ఒకవేళ బిలూ ఈ సంగతి తెలుసుకుంటే, వాడి మనస్సుకి కొంచెం సంతృప్తి కలగవచ్చు. తన తండ్రి తన కోసం దిగులు పెట్టుకున్నాడని వాడు తెలుసుకుంటాడు. బిలూకి ఒకవేళ ఉరిశిక్ష పడకపోయినట్లయితే - బహుశా ఈ సమయంలో ఇలా చుట్టూ పరదాని దింపిన

గది మధ్య కూర్చుని, తన పార్టీలో వారికి 'కాపిటల్' చెపుతూండే వాడు. బిలూ ఇక్కడ ఉంటే - ఇంక కామ్రేడ్ లక్ష్మీచతుర్వేదీ ఇక్కడ గురువుగా వ్యవహరించక్కర్లేదు. 'మనిహారీ ఘాట్'లో వెనక వారి పార్టీవారు 'సమ్మర్ ట్రైనింగ్ కాంప్' పెట్టినప్పుడు బిలూయే దానికి అధ్యక్షుడుగా ఉన్నాడు. కామ్రేడ్ బనారసీ కూడా చుట్ట కాలుస్తూ, కాలుస్తూ నాతో - "బిలూబాబూలాగా మా పార్టీలో ఎవరూ పాఠం చెప్పలేరు. అందుకనే అప్పుడు 'సోనాపూర్'లో మా ప్రాంతీయ సమ్మర్ కాంప్ పెట్టినప్పుడు - అక్కడ "డయలెక్టికల్ మెటీరియలిజం" చెప్పే భారం బిలూబాబుమీద పడింది. 'ఆపర్ట్యూనిస్టుల' మాట వదిలేసి, నిజమైన వర్కర్ల సంగతే కనుక తీసుకున్నట్లయితే - మా పార్టీలో 'ఇంటలెక్చ్యుయల్స్'లో బిలూబాబుదే అందరికంటె పై స్థానం... వస్తుత: బిలూబాబులో 'మిలిటెంట్' తత్వం కొంచెం తక్కువ. అందుకనే పార్టీలో అన్నిటికంటె ఉన్నతమైన శిఖరాన్ని చేరుకోలేకపోయారు" అని చెప్పాడు. కామ్రేడ్ బనారసీ ఇంకా చాలా చెప్పాడు. అవన్నీ గుర్తుండటం కష్టం. మాట్లాడేప్పుడు వారికి కొన్ని కొన్ని పదాలు ఉపయోగించటం అలవాటయింది. - ఆమాటల అసలు అర్థం ఒక విధంగా మాకు తెలియదు. వారితో మాట్లాడేప్పుడు సరియైన స్థానందొరకదు. సాధారణమైన వ్యవహార భాషలో మాట్లాడుకోవటానికి కుదరదా? వారు యింటి దగ్గిర కూడా ఈ భాషలోనే మాట్లాడతారా? వారు మాట్లాడేది మాకే సగం తెలియదు - వారి తల్లులు, చెల్లెళ్లు ఇవి ఎక్కడ అర్థం చేసుకోగలరు? వెనకటి కొక కథ ఉంది కదా!- ఒకరు ఇంగ్లీషు చదవటం మొదలెట్టి, తల్లితో కూడా ఇంగ్లీషులో తప్ప దేనిలోనూ మాట్లాడకూడదని నిర్ణయించుకున్నాడట! తర్వాత పాపం జబ్బుచేసి దప్పికతో చనిపోయాడట. 'వాటర్' అన్న మాట అతని తల్లి అర్థం చేసుకోలేకపోయింది. అలాగే అవుతూంటుంది - అంతకంటె ఏముంది? బిలూ కూడా ఆ పార్టీలో ఒక నాయకుడే. వాడు ఈ విధంగా మాట్లాడటం ఎప్పుడూ నా చెవిని పడలేదు. పార్టీలో ఏం మాట్లాడుతూంటాడో నాకు తెలియదు. కాని ఇంట్లో మాత్రం అస్వాభావికమైన సామ్యవాద నిఘంటువులోని ఒక్క మాటను కూడా ఉపయోగించటం నేను వినలేదు. వారి పాయజామా, ఎత్తుకాలరు లాల్చీలు ధరించటం కూడా ఎప్పుడూ చూడలేదు నేను. వాడి దగ్గిర ఎన్నడూ నాకు పొగాకు వాసన కూడా వెయ్యలేదు. మీ భాషలో 'మిలిటెంట్' అంటే అర్థం నాకు సరిగ్గా తెలియకపోవచ్చు - దేశం కోసం ఈనాడు ఉరి(త్రాటిలో తలదూర్చేవాడిని మీరు 'మిలిటెంట్' అనరు. వాడెందుకు మిలిటెంట్ అవుతాడు?' - ఆ ఎముకల పోగు వైద్యనాథ్ - ఇంతకు ముందు వార్డర్ మీద నీళ్లు పోయటానికి - గ్లాసుతో నీళ్లు తీసుకెళ్లిన వాడు - 'మిలిటెంట్!' ఛీ! ఏమిటి నేనిలా ఆలోచిస్తున్నాను! బిలూ మిలిటెంట్ అవటమే నాకేదో గర్వకారణమైనట్లు! మహాత్మాజీ! నా నమస్కారాలు స్వీకరించండి. బహుశా బనారసీ సరీగ్గా చెప్పాడేమో! బిలూ నా వెనుక ఆశ్రమం వాతావరణంలో పెరిగినవాడు. వాడు 'మిలిటెంట్' కాకపోవటమే- సహజం... సదాశివ్ నా

టేబిల్ మీద కాళ్లు వ్రేళ్లాడేసి కూర్చున్నాడు. అతను నాముఖం కేసి చూస్తున్నాడు. హఠాత్తుగా నేనెందుకు నమస్కరించానా అని తప్పకుండా ఆలోచిస్తూంటాడు. అతనేదో ఊహించుకుంటాడు.

"విషున్‌దేవ్‌బాబూ ! విషున్‌దేవ్‌బాబూ !"

ఎడమవైపున రెండు మూడుసీట్లు దాటిన తర్వాత విషున్‌దేవ్ సీట్. ఒక వార్డరు అతని సీట్ కెదురుగా ఉన్న కిటికీ బయటనుంచి అతణ్ణి పిలుస్తున్నాడు. విషున్‌దేవ్‌జీకి బయట చాలా పెద్ద వ్యాపారం ఉంది - వర్తకజీవి "ధాన్యం మర స్వర్గానికెళ్ళినా ధాన్యాన్నే విసురుతుంది" విషున్‌దేవ్‌జీ జైల్లో కూడా వ్యాపారాన్ని బాగా విస్తరింపచేసుకుని కూర్చున్నాడు. అతను మా కిచెన్ మేనేజరు. జైలు కంట్రాక్టర్లతో లావాదేవీలు ఉన్నాయి. ఈ వార్డరు కంట్రాక్టరికీ - అతనికి మధ్య వార్తలు, సరుకులు అటుయిటు అందించే పనులు చేస్తూంటాడు. ప్రతిరోజూ జైలు కంట్రాక్టరు రేషన్ రిక్విజేషన్‌లో వుండేదాని కంటె తక్కువ యిస్తూంటాడు. కాగితం మీద మేనేజరు చేత అన్ని వస్తువులు యిచ్చినట్లు సంతకం చేయించుకుని తీసుకెడుతూంటాడు. తర్వాత రాత్రి ఈ వార్డర్ వచ్చి రేషన్‌లో లేని ఇతర వస్తువులేవో యిచ్చి వెడుతూంటాడు. జైలు అధికారులకు కూడా యీ సంగతి కొంతవరకు తెలుసు. దీన్ని ఆపుచేయటానికి జైల్లో రేషన్ సరుకుల గోదాంలో నుంచి షెడ్యూల్ ప్రకారం వస్తువులిచ్చే ప్రయత్నాలు కూడా కొన్నిసార్లు చేశారు. కాని ఈ యుద్ధపు మార్కెట్‌లో షెడ్యూలు ప్రకారం రోజూ అన్ని సరుకులు యివ్వటం కష్టం. ఇవ్వకపోతే చిక్కు. బహుశా అప్పర్ డివిజన్ రాజకీయ ఖైదీలు నిరశన వ్రతం ప్రారంభించవచ్చు. బహుశా లాక్ అప్‌లోకి వెళ్లటానికి నిరాకరించవచ్చు. బల ప్రయోగంతో లాటీఛార్జితో వీరి మానసిక క్రోధాన్ని అదుపులో పెట్టొచ్చు. కాని రెండు మూడుసార్లు ఇలాంటి రగడ జరిగితే 'టాక్ట్‌ఫుల్' కాదని డిపార్ట్‌మెంట్ జైలరు, సూపరెంటెండెంట్‌లకు చెడ్డ పేరు వస్తుంది. కొద్ది రోజుల్లో బదిలీ ఉత్తర్వులు వస్తాయి. పైగా కొట్టి బెదిరించి అసలు జరిగినదాన్ని కప్పిపుచ్చటం విడి ఖైదీలుండగా వీలుపడదు. జిల్లా మేజిస్ట్రేట్ ఆర్డరు లేనిదే వారి మీద లాటీఛార్జీ చెయ్యటానికి వీల్లేదు. ఇప్పుడు జైల్లో స్థలాభావం వల్ల ఇంతమంది విడి సామాన్య ఖైదీలను వేరుగా వుంచే ఏర్పాట్లు చెయ్యటమూ కష్టమే. ఎన్నో విధాల ఆలోచించి అధికారులు రాజకీయ ఖైదీలు గొడవలేమీ చెయ్యకుండా వుండాలని కోరుకుంటారు. ఏదో ఒకటి రెండు చూసినా చూడనట్లు ఊరుకుంటే జరిగిపోయేదానికి వారిని రెచ్చకొట్టవలసిన అవసరమేముంది? వారికి కంట్రాక్టరు దగ్గిర్నుంచి వచ్చేది దీనివల్ల తగ్గిపోయేదీ హెచ్చేదీ యేమీ లేదు. అందువల్లనే

విషున్‌దేవ్‌కి మంచి అవకాశం దొరికింది. విషున్‌దేవ్‌జీ - వార్డరు మెల్లిమెల్లిగా ఏం మాట్లాడుకుంటున్నదీ సరిగ్గా తెలియటంలేదు. విషున్‌దేవ్‌జీ హఠాత్తుగా "సిపాయిజీ ! కొంచెం పెరుగు హర్బత్ త్రాగుతారా ఏం?" అని అడిగాడు బిగ్గరగా. "ఇవ్వండి" అన్నాడు సిపాయిజీ. గ్లాస్ కటకటాల్లోంచి ఇవతలికి రాలేదు. "ఉండండి నేను కప్పుతీసుకొస్తాను" విషున్‌దేవ్‌జీ టీ కప్పుతో వార్డర్‌కి నాటు చక్కెర షర్బత్ త్రాగమని ఇచ్చాడు. ఓ - ఇందు కోసమే అతను షర్బత్ తీసుకున్నాడు. అదే చెపుతున్నా - హఠాత్తుగా అతనికి బెల్లం వేసిన నాటు చక్కెర షర్బత్ త్రాగాలని కోరిక ఎందుకు కలిగింది ? సిపాయిజీ వెళ్లిపోయాడు. అతని డ్యూటీ మరొక వార్డులో అనుకుంటా. భూషన్‌జీ తన సీట్ దోమతెర వేసుకుని పడుకున్నాడు. సరీగ్గా విషున్‌దేవ్‌జీకి ప్రక్కనే అతడి సీట్. అతను దోమతెరలో నుంచి "నియమ నిబంధనలకు విరుద్ధంగా సంగ్రహించటానికి 'తిక్రమ్' అని వారే పేరు పెట్టారు. అసలు ఆ మాటకు అర్థమేలేదు. ఈ జైలులోనే ఆ మాట సృష్టించబడింది. విష్ణుదేవ్ ప్రతిరోజూ బీడీలు తెప్పిస్తాడు. పగలు మేట్ చేతిమీదుగా ఈ బీడీలు అమ్మటానికి జైలు ఫ్యాక్టరీకి పంపిస్తూంటాడు. అక్కడ సాధారణ ఖైదీలు ఈ బీడీలను కట్ట పది పైసలవంతున కొంటారు. విషున్‌దేవ్‌జీకి ఇందులో చాలా లాభం ఉంటుంది. మెస్‌లోని మెంబర్లలో గొడవ ఎవరు చెయ్యగలరో వాళ్ల నోరు కట్టటాని కోసం మధ్య మధ్య వాసన నూనె ఇంకా చిన్న చిన్న అవసరమైన వస్తువులు తెప్పించి యిస్తాడు. అదికాక జైలు గోదాం ఖైదీలతో కూడా ఏర్పాట్లు చేసుకున్నాడు. రెండు బండిల్స్ బీడీలకి ఒక గ్లాస్ నెయ్యి, ఒక ప్యాకెట్ బీడీలకు అర్థసేరు పంచదార. బీడీయే జైల్లో లీగల్ టెండర్ ముద్ర ... భూషణ్‌జీ విష్ణుదేవ్‌తో "నాకొక బండిల్ బీడీలివ్వరాదూ ? - ఉలెన్‌షర్ట్ శీతాకాలం వచ్చాక ఉతకలేదు. రేపు దాన్ని ధోబీకమాండ్‌కి పంపించాలి ఇస్త్రీ చేయించటానికి. అది కాక రేపు నాకోసం ఫౌంటెన్ పెన్ యింక్ తీసుకు రమ్మని చెప్పు కంట్రాక్టర్ భాయ్‌కి." అని చెప్పి తర్వాత ఫక్కున నవ్వి "మేమొచ్చి ఝుపట్టానంద్ వర్గంలో వాళ్లంగా" అన్నాడు. ఈ ఝుపట్టానంద్ అన్నమాటకి ఒక చరిత్ర వుంది. విషున్‌దేవ్‌జీ ఒక గేయం తయారు చేశాడు. గేయం సరీగ్గా జ్ఞాపకం రావటం లేదు. అయినా దాని భావార్థం ఇది - జైల్లో రాజకీయ కార్యకర్తలందరూ సిద్ధ పురుషులు. వారిని మూడు వర్గాలుగా విభజించవచ్చు. మొదటి వర్గం పేరు జోగాడానంద్. వీరు బీడీలు-డబ్బులు లంచమిచ్చి తియ్యటి మాటలతో జైలు డాక్టర్ని పొగిడి, మధ్య మధ్య జైలు ఉద్యోగులతో జగడం పెట్టుకుని రకరకాల వస్తువులు సంగ్రహించుకుంటారు. వీరికి మత్తు వస్తువులు దగ్గర్నుంచి ఏ వస్తువుకీ లోటు ఉండదు.

సంగ్రహించే కపట యుక్తుల్లోనే ఉంటారు. రెండో వర్గంలోకి వస్తారు "ఝుపట్టానంద్‌ల వర్గం వాళ్ళు" ఝుపట్టా-మారనా అనే మాటకు అర్థం తన్నుకుపోవటం. ఈ ధోరణి ఖైదీలు సాధారణంగా ఏం మాట్లాడకుండా నిర్లిప్తుల్లాగా ఉంటారు. కళ్ళలో ముఖంలో ఆ భావం స్పష్టంగా వ్యక్తమవుతూంటుంది. కాని గద్ద చెట్టుపైన సమాధిలో ఉన్నట్టు కూర్చున్నాను. తాను తన్నుకుపోవాల్సిన దానిమీద మాత్రం సరిగ్గా చూపు పెట్టుకున్నట్టు - వీరు కూడా ఎప్పుడూ 'జోగాడానందులు' ఎవరేం చేస్తున్నారని కన్ను వేసే ఉంటారు. జోగాడానంద్‌ల చేతుల్లోకి ఏ వస్తువైనా వచ్చిన సమయంలో ఝుపట్టానంద్ లందరూ అందులో ఒక వంతు డిమాండ్ చెయ్యటాని కెదుటికి వస్తారు. 'తిక్రమ్' చెయ్యబోయి పట్టుపడితే ప్రమాదం వుంది. కానీ ఝుపట్టానంద్‌లకు ప్రమాద భయమేమీ లేదు. అయితే జోగాడానంద్‌ల కంటె వీరికి వస్తువులు తక్కువగా లభిస్తాయి. 'జోగాడానంద్'లు ఇష్టం లేకపోయినా కొద్ది కొద్దిగా వీరికివ్వక తప్పదు. గొడవ చేసే వారిని కాస్త చల్లపరిచి వుంచాలి. తర్వాత ఇహ మిగిలిన రాజకీయ ఖైదీలందరూ ఒక వర్గం - గేయంలో వీరికి బేవకూఫానంద్‌లని పేరు పెట్టబడింది. వీరి సంఖ్య ఎక్కువ. వస్తువులు సంగ్రహించాలని, సంగ్రహించిన వాటిల్లో భాగం తీసుకోవాలనే కోర్కె వీరికి నూటికి నూరుపాళ్ళు ఉంటుంది. కాని కోర్కె వుంటే ఏమయినట్లు ? సామర్థ్యం చాలదు. పట్టుపడకపోయినా తక్కిన వారందరూ తమను గురించి చెడు ప్రచారం చెయ్యకమానరని వీరి భయం. ఇహ ప్రత్యక్షంగా పట్టుబడితే - ఇంతా అంతాకాని చెడ్డ పేరు వస్తుంది. కనుక ఈ చిక్కు వ్యవహారాలన్నిటికీ దూరంగా వుండి విమర్శనాధికారం వుంచుకోవటమే బుద్ధిమంతుల లక్షణం ...

అందరు గోలగోల చేస్తూ - కుడి వైపున చుట్టూ పర్దాలున్న స్థానం నుంచి బయటికి వచ్చారు. అయితే వారి క్లాసు పూర్తి అయింది. పగలల్లా తీరిక వుంటుంది. అయినా కూడా వీరు రాత్రంతా మేలుకుని చదువుతూంటారు. ప్రొద్దున యెనిమిది దాటితే కాని వీరెవ్వరూ నిద్రలేవనేలేవరు. కాని రాజకీయ రంగంలోకి వచ్చినా కూడా వీరు చదువుకోవటం మరిచిపోలేదు. అది చూస్తే నిజంగా ఆనందం వేస్తుంది. మాష్టరుగిరీ చేశాను. కుర్రవాళ్లు చదువుకోటం చూస్తే - కలిగే ఆనందాన్ని ఆపుకోలేను. సోషలిస్టులు, ఫార్వర్డ్‌బ్లాక్ యువకులు- కమ్యూనిస్టులు-కిసాన్ సభ యువకులిద్దరు - అందరిలో చదువుకునే ఉత్సాహం చూస్తుంటాను. వారితో మా పంథాలోని యువకుల్ని పోల్చి చూసుకొని తెల్లపోతారు. ఫార్వర్డ్ బ్లాక్‌కి చెందిన ముగ్గురు యువకులు మాత్రం ఇక్కడ ఉన్నారు. కాని వారు కూడా ఎంతో ఖర్చు పెట్టి సెన్సార్ చెయ్యని మార్క్సిస్ట్ పుస్తకాలన్ని

తెప్పించారు. కమ్యూనిస్టు కుర్రాళ్లు కూడా చిన్న చిన్న పుస్తకాలు తెప్పించటం అలా జరుగుతూనే వుంది. వీరిలాగా గడియారం ముల్లులా అధ్యయన తరగతులు మొదలెట్టబోతే మా వర్గంలో యువకులు దొరకనే దొరకరు. దానికి ప్రత్యక్ష ప్రమాణమే వుంది. సదాశివ్ ప్రోత్సాహంతో - అతని కోరిక మీద నేను శీతకాలంలో బిల్వ వృక్షాల క్రింద రచనాత్మక కార్యక్రమం మీద పాఠాలు ప్రారంభించాను. మొదటి వారంలో కొంతమంది కుర్రాళ్లు వచ్చారు. కాని తర్వాత మిగిలిన్న వాళ్లు - సదాశివ్ దాస్‌జీ, రామ్ శరణ్‌జీలే! సి.ఐ.సి. వారి 'రష్యా విప్లవ చరిత్ర' తరగతిలో జనం పట్టేవాళ్లు కాదు. మా పిల్లలు కూడా అక్లాసులో కూర్చుని ఉండటం చూశాను. నిజానికిది అసహజమేమీ కాదు. నీలూ, బిలూ వాళ్ల పార్టీ ప్రోగ్రాం - ఈనాడు ప్రజల మనస్వభావాల పునాది మీద ఆధారపడి వుంది. మా కార్యక్రమానికి స్వార్థరహిత, హింసారహిత ఆదర్శ ప్రజా హృదయం పునాది. అందుకని మామూలు జనాన్ని వారి మార్గమే ఎక్కువ ఆకర్షిస్తుంది.

నీలూ-బిలూలకు చదువుమీద ఎంత ఆసక్తి ! కాని మా పంథా అనుసరించే జనానికి ? వారి సంగతి ఇంక చెప్పి ఏ లాభం ? నేనొక పుస్తకం తీసుకుని కూచోగానే- "మాష్టరుగారు మళ్ళీ పరీక్షల కెడతారాయేం?" అనేవాళ్లు. మా వర్గంలోని రామచందర్‌జీ, హరిహరజీ వీరిద్దరికీ చదువు జబ్బు వుంది. వారిలో రామచందర్‌జీ జలచికిత్స (Hydropathy) గ్రంథాలు చదివేవాడు. హరిహరజీ ఆసనాలు - ప్రాణాయామం పుస్తకాలు చదివేవాడు. గాంధీజీ సిద్ధాంతం మీద విశ్వాసం ఉన్నవారు ఇంకా ఏదో చదివి క్రొత్తగా తెలుసుకోవల్సిందేముంటుంది అని వారి నిశ్చితాభిప్రాయం. నీలూ మమ్మల్ని ఊరికే హేళన చేస్తాడా ? నేను టూర్‌కి బయలుదేరివెడుతున్నప్పుడు - నీలూ తల్లి నా సూట్‌కేస్ సర్దియిస్తూంటుంది. అప్పుడు నీలూ వాళ్ళ అమ్మతో హేళనగా 'అమ్మ ! పాతసర్వోదయ (గాంధీజీవాదానికి భూమిక) ఫైల్ ఇచ్చావ్ కదా!' అని అనటం ఎన్నోసార్లు విన్నాను. నీలూకి చిన్నప్పట్నించీ పెద్ద - చిన్న జ్ఞానం తక్కువ. ఈ విషయంలో బిలూకి నీలూకి ఆకాశ పాతాళాలంత వ్యత్యాసం. నీలూది మొదటి నుంచి కొంచెం ఉద్ధతస్వభావం. కోపం వస్తే వాడికి జ్ఞానం ఉండదు.

... ఇంట్లోకి వచ్చి చూస్తే... వంటింటి వసారాలో బిలూతల్లి, నీలూ - బిలూ - కొంచెం దూరదూరంగా కూచొని ఉన్నారు... ఏదో ఒకరికీ ఒకరికీ ఏమీ సంబంధం లేనట్లు. బిలూ, బిలూతల్లి ఏడుస్తున్నారు. నీలూ ఒక చీపురు పుల్లతో క్రింద అలికిన నేలమీద-ఏదో రాస్తూనో, గీస్తూనో ఉన్నాడు. ప్రక్కన ఒక కత్తిపీటపడి వుంది. దగ్గరిగా వెళ్ళినిలబడి నీలూతల్లి ఏదో దాచటానికి ప్రయత్నించటం గమనించాను. నేను వెళ్లి

అడిగేసరికి జరిగిన సంగతి బయటపడింది. బిలూ చేతిలోంచి సిరాబుడ్డి బోర్లపడి, నీలూ 'క్షేరేర్‌పుతుల్' పుస్తకం అట్ట పాడయిపోయింది. దాంతో నీలూ కోపం వచ్చి, బిలూ 'మార్స్‌డెన్ హిస్టరీ' కత్తిపీటతో కోసేశాడు. నిజంగానే రెండు ముక్కలుగా కోసేశాడు. అది చూస్తే రెండు చిన్ననోట్ పుస్తకాలయినట్లు కనిపించింది. విచిత్రమైన కుర్రవాళ్లు! దానికి తోడు వాళ్ల అమ్మకూడా మరీ గారాబం చేసి పిల్లల బుర్రలు పాడుచేసింది. పిల్లలు అనుచితమైన పనిచేశారు. ఎక్కడా నాతో వచ్చి చెప్పవచ్చునుగా ! అది లేదు. జరిగిన సంగతి నా దగ్గర దాచటానికి ప్రయత్నం జరిగింది.

"ఏం సదాశివ్ ! భూమిహార్-రాజపూత్ జాతీయ మహాసభ సమావేశం అయిపోయిందా?" కామ్రేడ్ వైద్యనాధ్ సదాశివ్‌ని వ్యంగ్యంగా అడిగాడు. లక్ష్యం "సూత్రయజ్ఞం" మీద. బీహార్‌లోని తీవ్రవాదులు-అంటే సోషలిష్టులు, కమ్యూనిస్టులు, ఫార్వర్డ్ బ్లాక్, కిసాన్‌సభ సభ్యులు 'కుడిపక్షం' వారిని - బీహార్ ప్రదేశ్ కాంగ్రెస్ కేవల స్థానీయులైన భూమిహార్ - రాజపూత్ జాతుల పరస్పర పోటీ ముఠాల 'బాకా' మాత్రమేనని గేలి చేస్తూంటారు. ప్రదేశ్ కాంగ్రెస్‌లో రాజకీయ ముఠాలు లేవట. పోటీ ముఠాలున్నది కులాలు ఆధారంగా-వ్యక్తులు ఆధారంగా ఏర్పడినట్టివి. ఆమాట కొంత వరకు నిజమే. జైల్లో కూడా రామశరన్‌జీ, హరిహర్‌జీ కులాల ప్రాతిపదిక మీద చిన్నచిన్న ఉప-ముఠాలు నిర్మించటానికి ప్రయత్నిస్తుంటారు బయటికి వెళ్లినా తమ నాయకత్వం నిలుపుకోవ టానికి. మన దేశానికి స్వరాజ్యం ఎప్పటికైనా వస్తుందా ? ఒక్కొక్కప్పుడు అసహ్యం వేస్తూంటుంది. నీలూ - బిలూ వర్గాల వారు చెప్పేవన్నీ తప్పులు కావు. అలా అని వీరంతకుముందు 'సూత్రయజ్ఞం'లో కూర్చోవటానికి, కులాల పోటీ ముఠాలకీ ఏం సంబంధం ? సదాశివ్ అంటే పోనీ, నీ సమానవయస్కుడు, కాని అతడు నాయెదుట కూర్చుని ఉన్నప్పుడు - నన్ను కూడా అఘాతపరచాలనేగా దీని అర్థం. వయస్సులో పెద్దలకు కొంచెం మర్యాదయిస్తే - ప్రపంచమంతా తలకిందులయిపోతుందా ఏం ?

"ఊరుకో లాల్‌దాసియా ! బ్రాహ్మడికి భోజనం పెట్టి, రాజపూత్‌ని బాబూసాబ్ అని పిలిచి, కాయస్థుడికి డబ్బు యిచ్చి ఇహ తక్కిన కులాల వారందర్ని కొట్టి వారిచేత ఏపనుల యినా చేయించుకోవచ్చునని సామెతగా చెపుతారు. కాస్త డబ్బు కనుక వస్తే ఇప్పుడే పార్టీ వదిలి పెట్టి వెళ్లిపోవటానికి వెనుకా ముందు ఆడవు. మీ కాయస్థుల సంగతి నాకు తెలియదా?" అని సదాశివ్ జవాబు యిచ్చాడు.

వైద్యనాధ్ కాయస్థుడు. మిథిలా ప్రాంత కాయస్థులకు సాధారణంగా-లాల్ అని కాని దాస్ అని కాని వంశనామం ఉంటుంది. అందుకని కాయస్థుని మామూలు

జనం అందరూ 'లాల్‌దాసియా' అని పిలుస్తారు. తరచుగా జమీందారు ఏజెంట్, గుమాస్తా కరణీకం మొదలైన పనుల్లో వారిదే మొనాపలీ. అందుకని పేద రైతుల దగ్గర వీరికి జన ప్రియత్వం తక్కువ. దీనివల్లనే 'లాల్‌దాసియా' అన్న పదానికి అర్థం కేవలం స్థానీయులైన కాయస్థులే అని కాదు. దానికి ధనాశాపరులైన-అంకెలకు లంకెలు పెట్టే మనస్తత్వంగల జీవులని రూఢి అర్థం ఏర్పడింది.

"అఁ మరొక సామెత జ్ఞాపకం ఉందా ? గొల్లవాడి కంటపడిన కొంప, బ్రాహ్మడి కంటపడిన పెరుగు - రెండు వస్తువుల అదృష్టం ఒకటేనట !" అన్నాడు వైద్యనాథ్.

సదాశివ్ భూమిహార్ బ్రాహ్మడు...

"అది నేను ఒప్పుకుంటాను. చూడలేదూ - నేనిచ్చిన పెరుగు మాష్టరుగారు త్రాగారు. కాయస్థుల సామెతల నిజాన్ని ఒప్పకోరు కనుకనేగా మాటలు పెరుగుతాయ్" అని జవాబిచ్చాడు. తర్వాత సదాశివ్ టేబిల్ మీది నుంచి దిగి, వైద్యనాథ్ దగ్గర కెళ్లాడు. ఇద్దరూ ఏవేవో గుసగుసలాడుతూ మాట్లాడుకున్నారు. వారికి మళ్లీ హఠాత్తుగా రహస్యాలు ఏం జ్ఞాపకం వచ్చాయి ? ఇవాళ వైద్యనాథ్ వర్గంలో నాయకస్థానంలో ఉన్న ఒక కామ్రేడ్‌కి ఉరి ! కాని వీరి కార్యకలాపాల్లో తక్కిన రోజుల్లో కంటె విలక్షణతేమి నాకు కనబడలేదు. అపరదాల మధ్య క్లాసు, అ నవ్వులు, మధ్య మధ్య - వ్యాల్యూ, లేబర్ పవర్, సర్‌ప్లస్ వ్యాల్యూ పదాలు-ఇతర రోజుల్లోలాగా ఇవాళా వినిపిస్తున్నాయి. నా యెడమ ప్రక్కన ఉన్న వారి జీవితం కూడా యించుమించు ఇతర రోజుల్లో లాగానే కనిపిస్తోంది. ఎక్కడా ఒక్క గతుకు కూడా పడలేదు. కాదు బహుశా అందరూ ఫీలవుతూనే ఉన్నారేమో! లేకపోతే, దాస్‌జీ తప్ప తక్కిన వారందరూ కూడా ఇప్పటిదాకా ఎందుకు మేలుకుని ఉంటారు? భూషన్‌జీ, విషున్‌దేవ్‌జీ దోమతెరలు వేసుకుని పడుకున్నారు. నిజమే. కాని వారు మాట్లాడుకోవటం ఇంతకుముందే విన్నాను. వారు నిద్రపోలేదు. చాలా సీట్లు దోమతెరవేసి ఉన్నాయి. ఎక్కువ దూరంవరకు కన్పించటం లేదు. అయినా చెవులకు మాట్లాడుకుంటున్న గుంజన ధ్వని వినిపిస్తోంది. ఆస్కార్ వైల్డ్ అ Ballad of Reading goal... 'ఉరినాటి రాత్రి' పంక్తులు కొన్ని జ్ఞాపకం వస్తున్నాయి.

But there is no sleep, when men must Weep
who never yet have wept.
So we the fool the fraud, the knave-
That endless vigil kept,
And through each brain, on hands of pain
Another's ferror crept ...

ఇంక జ్ఞాపకం రావటంలేదు. ఎప్పుడో మాష్టరీ వదిలేశాను. అదేం ఈనాటి సంగతా? ఈ కొద్ది లైనులు జ్ఞాపకం ఉన్నాయ్ అదే ఆశ్చర్యం ! ఇప్పుడు జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. ఇప్పుడిక జ్ఞాపకంరావు. తర్వాత ఎప్పుడో ఒక అక్కరలేని క్షణంలో అనుకోకుండా జ్ఞాపకం వచ్చేస్తాయి. వీరందరూ భయంతో మేలుకుని ఉన్నారా? బహుశా సానుభూతితో - కాదు. వారు మేలుకుని వుండటం బుద్ధిపూర్వకంగా కాదు. ప్రయత్నించినా వీరికి నిద్రరావటంలేదు. వీరు కథలు చెప్పుకుని మనసులోని బరువును తేలిక చేసుకోవాలనుకుంటున్నారు. పోతే నా మనసు మాత్రం చాలా శాంతంగా ఉన్నది. బహుశా నేను నా పిల్లలను ఎంత గాఢంగా ప్రేమించటం న్యాయమో అంత గాఢంగా ప్రేమించలేదేమో ! లేకపోతే ఇప్పటికీ నామనసులో అలాంటి రకపు చాంచల్యం లేదు. ఎందుకని? వైద్యనాథ్ సీట్ ప్రక్కన, సదాశివ్-వైద్యనాథ్ కొన్ని కుర్చీలు తెచ్చివేసి వుంచారు. ఇంత రాత్రివేళ కుర్చీలతో పనేముంటుంది? సదాశివ్ తర్వాత వచ్చి నా మంచం మీద కూర్చున్నాడు. నేను క్రింద కంబళి మీద కూర్చున్నాను. వైద్యనాథ్, లక్ష్మీచతుర్వేదీ, రామప్రకాష్, గిరీధర్ కుర్చీల్లో కూర్చున్నారు. వీరు రాత్రంతా మేల్కొంటారా ఏం? బిలూకి కూడా రాత్రిళ్లు మేలుకుని చదవటం అలవాటు. ఎన్నాళ్లు వారించాను! బిలూ ఇప్పుడేం చేస్తున్నాడు? బహుశా మతి చలించినవాడిలా సెల్‌లో పచార్లు చేస్తూ తిరుగుతున్నా డేమో! వాడికి ఒక్కసారి తండ్రి సంగతి జ్ఞాపకం రాదా? వాడు భయపడే కుర్రవాడు కాదు. కాని చరఖా వడకడు. భగవంతుడి మీద నమ్మకమూ లేదు వాడికి. ఇవాళ రాత్రి ఈ రెండింటిలో ఒకటైనా వుంటే ఎంతో బలం వచ్చేది మనస్సుకి! స్కూల్లో సంస్కృత పండితుడు జైల్లో రెలిజియస్ ఇన్‌స్ట్రక్టర్. ఆదివారంనాడు జైల్లో హిందూ ఖైదీలకు ధర్మోపదేశం యివ్వటానికి వస్తూంటాడు. నేను హెడ్మాష్టరుగా వున్నప్పుడే పండిట్‌జీ ఉద్యోగంలో ప్రవేశించారు. ఆ కారణంగా ఆ రాత్రి చూడటానికి వచ్చారు. బిలూ ఆయన విద్యార్థి. ఆయన విచారించాడు - బిలూ సెల్‌కి వెళ్లారట ఆయన. బిలూ ధర్మోపదేశాల అవసరం ఏమీ లేదన్నాడట! అయినా బిలూ మాత్రం ఆయనకు పాదాభివందనం చెయ్యటం మరిచిపోలేదట. ఇంకా ఎన్నో చెప్పారు. బిలూ అలాంటి కుర్రవాడు కాదు. అవునూ భగవంతుణ్ణి విశ్వసిస్తే నిజంగా సామ్యవాదికావటానికి వీల్లేదా? ఎంతోమంది కాషాయవస్త్రాలు ధరించిన స్వామీజీలను చూశాను. అందరూ వారి పార్టీల్లో సభ్యులే. వారు కూడా భగవంతుని విశ్వసించరా ? ఆ రోజున ఒక అసిస్టెంట్ జైలరు చేత పాకెట్ సైజ్ భగవద్గీత ఒకటి బిలూ కివ్వమని పంపించాను. అసిస్టెంట్ జైలరు మర్నాడు తిరిగి తెచ్చి ఇచ్చి, వెళ్లేప్పుడు "మీ కొడుకు ఈ పుస్తకం అవసరం లేదు, వేరే మంచి

పుస్తకాలేమైనా చదువుకోగలను'' అన్నాడని చెప్పాడు. నా దగ్గర కొన్ని ఇతర పుస్తకాలున్నాయి. ఆ పుస్తకాలు బిలూకి యివ్వమని అతణ్ణి కోరాను. ధర్మ గ్రంథాలు యివ్వటానికి నాకు అధికారం వుంది. డివిజన్ త్రీ కన్‌డెమ్డ్ ప్రిజనర్‌కి ఇతర పుస్తకాలివ్వాలంటే సూపరెంటెండెంట్ అనుమతి తీసుకోవాలి... "దొర చాలా లీనియంట్. ఎంతో మంచివాడు. అయన మీకొడుకుని ఏ వస్తువులు అవసరం ? అని అడిగాడు. కాని ప్రిజనర్ స్వయంగా దొరగారి ఎదుట తనకే వస్తువులూ అవసరంలేదని చెప్పాడు'' అన్నాడు.

సరిగ్గా చెప్పాడు ! ఇలాంటి సమాధానమే బిలూ దగ్గిర్నుంచి ఆశించవలసింది! చివరగడియ వరకు తల అలా ఎత్తుకుని ఉంచుకునే వెళ్లిపోతాడు. నాపేరుని ఉజ్వలం చేసి, అన్ని రకాల హీనతలను కాలితో తన్ని, గౌరవోజ్వలమైన ముఖంలో నిర్లక్ష్యపు చిరునవ్వుతో... 'నాన్ మిలిటెంట్' బిలూ వెళ్లిపోతాడు ...

గడిచిన మహాయుద్ధానంతరం వేసిన ఒక వ్యంగ్య చిత్రం సంగతి తలపుకి వస్తోంది. 'పంచ్'లో ప్రకటించబడింది. ఇద్దరు వృద్ధులైన 'లార్డ్'లు ఎంతో శ్రద్ధగా పెంచుకున్న క్రొవ్వు బలసిన తమ స్థూలదేహాల్ని ఒక అరిస్టోటిక్ క్లబ్‌లో మెత్తటి కుషన్ల సోఫాల్లో చేరవేసి కూర్చున్నారు. నోట్లో సిగార్, టేబిల్ మీద బాటిల్ గ్లాసులు. ఇద్దరూ పోటీపడి మాట్లాడుకుంటున్నారు. ఎవరి ఎందరు కొడుకులు యుద్ధంలో చచ్చి పోయారు? కొడుకుల చావుని గురించి ఎవరూ విచారించటం లేదు. అవతలవారిని ఓడించగలిగిన గర్వం ముందు - కొడుకుల దారుణమైన మృత్యువు ఒక అతి అప్రధాన మైన సంఘటన. కాని వారి గర్వానికి పునాది ఈ సంఘటన. అది ఎవరు ఆలోచిస్తారు? నా గర్వం కూడా ఇలా హాస్యాస్పదమైనదే. తండ్రిగా తన కర్తవ్యాన్ని నెరవేర్చని కొడుకు చేసిన పనిలోని గౌరవంలో పాలుపంచుకోటానికి నా మనస్సు వెనుతీయటంలేదు ... నేను ఈ మార్గానికి కనుక రాకుండా ఉన్నట్లయితే, ఈనాడు బిలూకి ఈ దుర్దశ కలిగేదేనా? నా తండ్రి సర్కారు ఉద్యోగం చేసేవారు. నేను సర్కారు ఉద్యోగం చేశాను. నా కొడుకు కూడా తక్కిన అందరు గృహస్థుల కొడుకుల్లాగానే - చదువు పూర్తి అయింతర్వాత సంపాదనలో పడేవాడు. పెళ్లాం బిడ్డలతో సంసారం చేసేవాడు. మా పొరుగు వృద్ధులైన మిత్రాగారు చెప్పినది సరియైనదే. పెళ్లి చేసుకున్న తర్వాత, ముఖ్యంగా పిల్లలు కనుక వుంటే ఎవరికీ తమ యిష్టానుసారం జీవితం సాగించుకోవాటానికి అధికారం ఉండదు. అప్పుడు అతని జీవితం కేవలం తన ఒక్కడిదే కాదు. దాని మీద మరి కొందరికి హక్కు ఏర్పడింది. నాకు డబ్బులేదు. ఆ ఆలోచనాలేదు. బాగా డబ్బు

వున్న ఇలాంటి సందర్భాలలో భార్య-బిడ్డలు సంసారం కోసం ముందు నుంచి ఏదో ఏర్పాటు చేసి వుంచగలిగేవారు. కాని అలా అయితే తన కర్తవ్యం పూర్తి అయినట్లేనా?

అలా అయితే పిల్లా-పాపా బహుశా కొంచెం నిశ్చింతగా వుండగలుగుతారు. కాని నిశ్చింతగా వుండగలగటమేనా ప్రపంచంలో కోరుకోవలసింది? గృహస్థ జీవితంలో ఒకరికీ ఒకరికీ ఏర్పడే మధురమైన సంబంధాలకు విలువేమీ లేదా? సిద్ధార్థుడు రాజ్యాన్ని ఐశ్వర్యాన్ని వుంచివెళ్లాడు కదా అని భార్య, కొడుకుపట్ల న్యాయంగా ప్రవర్తించినట్లేనా?

బిలూని ఇంగ్లీషు కాలేజీలో చదివించలేదు. వాడి తల్లి కోరిక మీద హైస్కూల్లో మెట్రిక్యులేషన్ వరకు చదివించాను. ఒకవేళ నాయిష్టప్రకారమే కనుక జరిగి వున్నట్లయితే- బహుశా వాడు ఇంగ్లీషు స్కూల్లో యింతదూరం చదవటం జరిగేది కాదు. వాణ్ణి బీహార్ విద్యాపీఠానికి పంపాలని నా ఉద్దేశం. బిలూని ఇంగ్లీషు స్కూల్లో చదివిస్తున్నందుకు - నా సహచరుల దగ్గిర్నుంచి రకరకాల మాటలు వినవలసి వచ్చింది. మహాత్మాజీ పాదధూళి మా ఆశ్రమంలో పడిన భాగ్యం లభించిప్పుడు - జయసోయాలజీ భార్య ఈ సంగతి వారి చెవిన కూడా వేసింది. ఆ గౌరవ కుటుంబ గృహిణికి కాస్తవెర్రి తనపు లక్షణాలున్నాయి. కాని ఆమె తనంతటతానే ఈ సంగతులన్నీ మహాత్మాజీకి చెప్పలేదని నాకు తెలుసు. ఎవరో నా శ్రేయోభిలాషి అయిన సహచరుని ప్రోద్బలం మీదనే ఆమె ఈ పనిచేసింది. మహాత్మాజీ ఈ విషయంలో అప్పుడు నాతో ఏం చెప్పలేదు. "అన్ని రకాల కుర్రవాళ్లు ఉంటారు ఇంత మహాదేశంలో. నా పిల్లలు కూడా నన్ను తప్పు పడతారు''. ఈ ఒక్కమాట మాత్రం అని నవ్వుతూ విషయాన్ని ఎగరకొట్టేశారు. సిగ్గుతో నాతల ఒరిగిపోయింది. కాని ఈ అభిప్రాయంలోని తీవ్రతను బిలూ, బిలూ తల్లి పూర్తిగా గ్రహించారు. అందుకనే బిలూ మెట్రిక్యులేషన్ ప్యాసయిన తర్వాత బిలూ, బిలూ తల్లి వాడు కాశీ విద్యాపీఠంలో చదవటం మంచిదనే నిర్ణయానికి వచ్చారు. ఇంగ్లీషు కాలేజీలో ఏంచదివేవాడో అక్కడ మాత్రం అంతకంటే తక్కువ నేర్చుకున్నాడా? నీలూ బి.ఎ. ప్యాసయినాడు. ఏ విషయంలోనైనా సరే వాడికి బిలూ కంటే ఎక్కువ తెలుసా ? బిలూ పార్టీలో ఎక్కువమంది కాలేజీలో చదివిన వాళ్లు. బి.ఏ., యం.ఏ ప్యాసయిన కుర్రవాళ్లు. అయినా వాళ్లందరూ బిలూ దగ్గర చదువుకోవటానికి వెడతారు ఎందుకని ? కాని ఇన్ని వున్నా లోకులు విద్యాపీఠంలోని శాస్త్రి డిగ్రీని నిరసిస్తారు అని మాత్రం తెలుసుకోవచ్చు. బిలూ ప్యాసయిన వార్త వచ్చిన రోజున - ఆ ఉత్తరం చేతపుచ్చుకుని, బిలూ తల్లికి ఆ వార్త చెప్పటానికి లోపలికి వెళ్లాను. ఇవాళ నుంచి బిలూ పేరు 'పూర్ణచంద్రశాస్త్రి' అని చెప్పాను. ఈ మాట విని బిలూ తల్లి ఎంతో ఉత్సాహం వ్యక్తం చేస్తుందని అనుకున్నాను

నేను. కాని నా మాటకు చిన్న జవాబు కూడా చెప్పకపోవటం గమనించాను. తల వంచుకుని అదే ధ్యాసలో వడియాలు పెట్టసాగింది. తర్వాత ఎన్నో సందర్భాలలో చదువు ప్రసక్తి వస్తే బిలూ తల్లి దాన్ని తొక్కిపెట్టటానికి ప్రయత్నించటం గమనించాను. ఈ కారణాలన్నిటి వల్ల బిలూలో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు వచ్చి పడింది. బిలూ తల్లి కూడా - తన కొడుక్కి పెద్ద చదువురాలేదు. కుర్రవాడి తప్పుకాదది. పదిమంది పదిరకాలుగా అనటం వల్ల - ముఖ్యంగా నా తప్పువల్లనే అని మనస్సులో అనుకునేది. నిజంగా బిలూ లాంటి బుద్ధిమంతుడు అదృష్టం, అవకాశం కలిసివస్తే బహుశా ప్రొఫెసర్‌కాని, విజ్ఞానవేత్త కాని అయేవాడు. క్రొత్త క్రొత్త పరిశోధనలతో ప్రపంచ ఖ్యాతి ఆర్జించేవాడు. కాని నేను వాణ్ణి జైలుకి వచ్చినా విశ్రాంతి మనశ్శాంతి పొందగలిగిన వాతావరణంలోకి తెచ్చి పడేశాను. ఈ పరిధుల మధ్య వాడు పెరిగాడు. అక్కడ ఉరిశిక్ష ఉత్తర్వు సామాన్య దుర్ఘటన తప్ప అంతకంటే ఏమీ కాదు. కాని బిలూ మూర్ఖుడుకాడు. మంచి చెడు ఆలోచించుకోగల సామర్థ్యం వుంది వాడికి. పెద్ద అయాక వాడి మార్గాన్ని వాడే ఎన్నుకున్నాడు. అంతకంటే వేరే ఇంకేం మాత్రం చేస్తాడు ?

ఉలిక్కిపడ్డాను - ఇలా తలుపుకొడతారా ? తలుపు వేసి ఉందా లేదా అని చూడటం - అంతవరకే నీపని. దీనికి ఇంత బలం చూపించవలసిన అవసరం ఏముంది? ప్రక్క సీట్‌లోంచి ఒకరు - "అ: విరగ్గొట్టు విరగ్గొట్టేసెయ్" అన్నారు. మరొక దోమ తెరలోంచి - ఎవరో ఒకరితో - "అలా అయితే బ్రతికిపోవచ్చు" అన్నారు.

అయితే రాత్రి ఒంటిగంట కొచ్చే వార్డరు వచ్చాడన్నమాట ! వార్డరు నన్ను చూస్తున్నాడు-పెద్ద పెద్ద నెరిసిన మీసాలు, అందమైన మొహం, కళ్లు కళ్లు కలియగానే చేతులు జోడించి నాకు నమస్కారం చేశాడు. తర్వాత వైద్యనాథ్ ఇంకా నలుగురు కుర్చీల్లో కూచుని వున్న వైపుకి తిరిగి - "నమస్తే బాబుల్లారా ! మజాలో వున్నారా ?" అని అడిగాడు.

"అరె! సింగ్‌జీయా? చాలా రోజుల తర్వాత నిన్ను డ్యూటీలో చూస్తున్నాను. ఏమిటి సంగతి?" అని అడిగాడు లక్ష్మీచతుర్వేది.

"ఒకవారం సెలవు తీసుకుని యింటికి వెళ్లాను. నిన్ననే మళ్లీ 'జాయన్'! అయాను. యుద్ధం వార్తలవీ చెప్పండి."

"మేము నీకు వార్తలు చెప్పమా ? మేము ఉంటున్నది జైల్లో. నువ్వు మాకు బయటి వార్తలు చెప్పాల్సింది అదిలేదు. మాదగ్గర్నుంచి వార్తలు వినాలనుకుంటున్నావా?"

"ప్రభువులు ఇంగ్లీషు పత్రిక చదువుతారుగా! అందుకని అడిగాను!" ... తర్వాత వార్డరు ... యుద్ధానివి, నగరంలోవి - తన దేశంలోవి, మహాత్మాజీ గురించినవి ఎన్నో విడ్డూరమైన కబుర్లు చెప్పటం మొదలెట్టాడు - ఒక గూడ్స్‌రైలు నిండా నక్కల్ని, గద్దల్ని యుద్ధ రంగానికి పంపిస్తున్నారు. మహాత్మాజీ నిరశన వ్రతం ప్రారంభించిన రోజునే ఎందుకనో హఠాత్తుగా ఫట్‌మని గవర్నరుగారి బంగళాపైకప్పు పగులు విచ్చింది. మహాత్మాజీతో కలుసుకోవటానికి వెళ్ళినప్పుడు ఆసారి రాజ్‌కోట దివాన్‌కి ఏమయిందో ... ఇంకా ఎన్నో కబుర్లు. ఈ కబుర్లనీ చెప్పటానికే అతను ఆరాటపడుతున్నాడు. అతను మొదట అడిగిన ప్రశ్నలన్నీ వీటికి పీఠిక మాత్రమే. తర్వాత తను వైద్యనాథ్ కిటికీ బయట వరండాలోకి వచ్చికూచున్నాడు. చక్కగా పకడ్బందీగా కథలు సాగించటానికి ఇతర రోజుల్లో నైట్‌డ్యూటీ సమయంలో ఎవరూ మేలుకుని వుండరు. అప్పుడు చాలా ఒంటరితనంగా తోస్తుంది. ఆవలిస్తూ, తూలుతూ, పహరా వాళ్లను మేల్కొలుపుతూ ఎన్నిసార్లు పచార్లు చేసినా రెండు గంటలు ఎంతసేపటికీ గడవనంటాయి. తమ కబుర్లలో వార్డరు వచ్చి కూచోవటం - ఇది బహుశా వైద్యనాథ్ వర్గంలో వారికి బాగున్నట్లు లేదు.

"సింగ్‌జీ, మీరు ద్వాపరయుగంలో కృషన్‌జీని, కృషన్‌జీ తల్లిని జైల్లో బంధించారు. ఈ యుగంలో మహాత్మాజీని, ఆయన శిష్యుల్ని బంధించారు" అన్నాడు వైద్యనాథ్! "కర్మవిధిని తప్పించటానికి వీలవుతుందా? కృషన్‌జీని ఎన్నాళ్లు బంధించి ఉంచాం? తమరు ఎన్నాళ్లుంటారో దానికి నిర్ణయమంటూ ఉందా? ఈ పాడు యుద్ధం కూడా ఎప్పటికీ పూర్తవుతుందని తోచదు" అన్నాడు వార్డరు.

వైద్యనాథ్ వర్గం వారు హహహ అంటూ నవ్వారు. సింగ్‌జీని వారు వల్లో పడేశారు. 'రాధా కిషన్' అనగానే సింగ్‌జీ ఛర్రుమంటాడు. అతను 'బొలో సీతారామ్' అన్నాడు. ఇవాళ తనకి తెలియకుండా తనంతట తానే కిషన్‌జీ పేరు తెచ్చాడు. సిగ్గు పడి నవ్వుతూ నవ్వుతూ - రెండు చేతులతో ఒకసారి చప్పట్లుకొట్టి సిపాయ్‌జీ పరుగెత్తుతూ ఇక్కడి నుంచి వెళ్లి పోయాడు. వైద్యనాథ్ వెళ్ళే అతణ్ణి "ఇదుగో, వినువిను సింగ్‌జీ మమ్మల్ని వదిలిపెట్టే వార్త" అంటూ పిలిచాడు. వాళ్లమాట ఎవరు వింటారు ? సింగ్‌జీ అప్పటికి వార్డు మరో వైపుకి వెళ్లిపోయాడు. వార్డర్ల చేతుల్లో ఒకొకటి వంతున లాంతర్లు ఉంటాయి. సింగ్‌జీ తన లాంతరు కిటికీ ఎదురుగా పడేసి వెళ్లిపోయాడు. కామ్రేడ్ గిర్‌ధర్ కటకటాల్లోంచి చెయ్యిదూర్చి అతని లాంతరులోని నూనెను ఒక టీ కప్పులోకి వంచి తీసుకున్నాడు. తర్వాత కప్పు లోపలికి తీసుకొచ్చి నూనె తన లాంతరులో పోసుకున్నాడు. ఈ రోజుల్లో యుద్ధం బజారులో కిరోసిన్‌కి చాలా కరువు. వారందరూ విడుదలయ్యే

కథ చెప్పుకుంటున్నారు. హోమ్ మెంబరు స్టేట్‌మెంట్ తర్వాత - అమరీదొర పార్లమెంటులో ఏం చెప్పారో, ఏ ఏ కాంగ్రెస్ కార్యకర్తలను విడుదల చేశారో - వీటి ఆధారం మీద వారు గవర్నమెంట్ అభిప్రాయంలో మార్పు వచ్చిందా లేదా అని వాదోపవాదాలు తర్జనభర్జనలు చేసుకుంటున్నారు. జైలుకి వచ్చి ముందు హాయిగా నిట్టూర్చి బ్రతికిపోవచ్చు - కాని కొద్ది రోజుల్లోనే జైలు జీవితం చాలా విసుగుగా తోస్తుంది. తర్వాత యిహ రాత్రింబగళ్లు విడుదల పొందటం సంగతి మొదలవుతుంది. వార్తా పత్రికల్లోంచి తమకు అనుకూల ప్రతికూల నిదర్శనాలను ప్రోగుచెయ్యటం! పూదన్‌బాబు తనకుతానే ప్రేరేపితుడై విడుదలవటాన్ని బలపరచే నిదర్శనాలను ప్రోగు చెయ్యటాన్ని గుత్తకు తీసుకున్నాడు. పత్రికలు చదివేసిన తర్వాత అతని చుట్టూ ఎంతమంది గుంపుకూడారు! విషన్‌దేవ్‌జీ ఈ సంఘటన మీద తులసీదాస్ అనుకరణతో ఒకగీతిక కూడా తయారు చేశాడు. ప్రతిరోజూ మేట్ పత్రికల కట్టతీసుకుని లోపలకు రాగానే ఎవరో ఒకరు ఈ పంక్తులు అవృత్తి చేసేవారు.

"తులసీ ధూరతో జేల్‌మే బహ్ బడొహియా అఖ్‌బార్
జిస్‌మే చర్చా సులహకీ కరతిహొ సర్‌కార్."

అంటే - తులసీదాస్ జైల్లో-గవర్నమెంట్ మాతో సంధి సమాలోచనలు చేస్తున్నారు అని ఎందులో వ్రాసి ఉందో - ఆ సుందరమైన వార్తా పత్రికను వెతుకుతున్నారు' అని...

ఇవాళ విడుదల కాకపోవచ్చు. ఎప్పుడో అప్పుడు అందరూ విడుదలవుతారు. కాని బిలూ? బిలూని వెంట తీసుకుని వెళ్లలేను. నేను ముసిలివాణ్ణి అయాను - నాలో ఇప్పటికీ బ్రతకాలని ఎంత అకాంక్ష ! మరి బిలూకి వయసెంత ? జీవితమంతా వాడికింకా ముందే వుంది ! కాని నేనే తిరిగి వెడతాను - బిలూ కాదు. బిలూకి వివాహం చేసినట్లయితే బహుశా వాడికి గాంధీజీ సిద్ధాంతం మీద విశ్వాసం ఉండేది ! పెళ్లి అయిన తర్వాత ప్రచండ స్వభావం తగ్గుతుంది. బాధ్యతా జ్ఞానం పెరుగుతుంది. అలా అయినట్లయితే బిలూ ప్రమాదభరితమైన సామ్యవాద పథంలో అడుగుపెట్టేవాడు కాదనుకుంటాను. 'సర్వోదయ్'లో కావాకా తవ్‌వార్ ఆ వ్యాసంలో పరిహాస ధోరణిలో మొత్తానికి సరియైన సంగతే చెప్పారు. కాంగ్రెస్ నాయకుల్లో భార్యలున్నా వారి స్వభావం చాలా మెత్తన. పోతే అవివాహితులు విపత్నీకులైన వారిది కొంచెం కొట్టొచ్చే రకపు స్వభావం. జవహర్‌లాల్, సుభాష్‌బోస్, వల్లభాయ్ పటేల్ - ఎవరూ శాంతమైన స్వభావంతో ఏ విషయాన్ని ఆలోచించలేరు. కాదు సామ్యవాద వర్గంలో చేరకపోయినా

బహుశా బిలూని బ్రతికించుకోగలిగే వాణ్ణి కాదు. ఈ ఆందోళనలో ఎంత మంది చనిపోయారు ! దైనందిన జీవితంలో వారికి రాజకీయాలతో ఎలాంటి సంబంధమూలేదు. మహాత్మాజీ శిష్యుల్లో కూడా ఎంతమంది హింసాత్మక చర్యలు చేశారో - దానికి లెక్క ఉందా ? జనన మరణాలు ఎవరి గుప్పిట్లోనూ ఉండే వస్తువులు కావు.

సరస్వతితో బిలూకి వివాహం చేస్తే బావుండేది ! ఇద్దరూ సుఖపడేవారు. మంచి పిల్ల సర్వసతి. ఆగస్టులో పోలీసులు ఆమెని పట్టుకున్నారు. మూడు నెల్లయాక ఆధారాలేమీ లేకపోవటంతో వదిలేశారు. మళ్లీ జనవరి ఇరవై ఆరో తేదీ సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవం రోజున జైలుకి వచ్చింది. ఆమెతో వివాహమయితే ఇద్దరూ రాజకీయ రంగంలో కార్యకలాపాలతోపాటు సంసారం కూడా చెయ్యగలిగేవారు. లెనిని కూడా వివాహం చేసుకున్నాడు.

కపిలదేవ్ అతని తల్లి నాదగ్గర ప్రస్తావన తీసుకొచ్చారు. వారి వంశంలో కొంచెం గొడవ వుంది. అది లేకపోతే ఈ స్వల్ప శిక్షతమైన భూమిహార్ బ్రాహ్మణ కుటుంబం బెంగాలీ వారింట్లో పిల్ల నివ్వటానికి ఇష్టపడతారా నాకు నిజంగా ఈ విషయంలో ఎలాంటి అభ్యంతరం లేదు. బిలూ తల్లికి ఒప్పుదల కాలేదు. ఇహ బిలూ అభిప్రాయం అడగనే లేదు. ఈ కాలపు కుర్రవాళ్లు - వాడి అభిప్రాయాన్ని మేము ముందుగానే అడగటమే భావ్యంగా ఉంటుంది. కాని బిలూ తల్లికే అంగీకారం కానప్పుడు - అడిగి విషయాన్ని విస్తరింప చెయ్యటం దేనికి ? బిలూ తల్లే నాకు చాలా రోజులు ముందు బిలూలాంటి రాజకీయ కార్యకర్తకి వివాహం మీద కోరిక వుంచుకోవటం ఉచితం కాదని చెప్పింది. కాని సరస్వతితో బాగా నప్పేది. ఈ కాలపు మధ్యతరగతి కుటుంబాల బెంగాలీ పిల్లకంటే సరస్వతి చాలా ప్రయోజకురాలు. ఆరోగ్యం కూడా చాలా మంచిది ఆమెది. చూడటానికి కూడా చక్కగా వుంటుంది. చూస్తూ చూస్తూండగానే చటుక్కున పెద్దదయింది. కపిల్‌దేవ్‌కి... వ్యాజ్యాలు జిల్లా కోర్టులూ వుంటూనే ఉంటాయి. ఈ కోర్టు పని మీద వచ్చి అతను ఆశ్రమంలోనే దిగేవాడు. ప్రతివారం అతను వచ్చేప్పుడు సరస్వతిని కూడా తీసుకుని వచ్చేవాడు. ఈ మధ్య ఆరోజున కూడా గులాబీ రంగు చీరకట్టుకున్న అందమైన అమ్మాయి గులాబ్‌బాగ్ ఉత్సవం చూడటానికి వెడతాను అని చెప్పి యెద్దుబండి ఎక్కి కపిలదేవ్‌తోపాటు ఆశ్రమానికి వచ్చింది. మాయిళ్లలోని పిల్లలయితే ఈ వయసులో ఫ్రాక్‌లు ధరిస్తారు. వంటింటి వసారాలో బిలూ తల్లి ఆమెకి ఫలహారం పెట్టింది. పాల గ్లాస్‌లో కాసిని పాలు చప్పరించి ఏడుస్తూకూచుంది. ఎందుకేడుస్తున్నదీ ఏమయినా చెప్పలేదు. తర్వాత సహదేవ్ వచ్చి కేకలేసి, ఉబ్బించి, బ్రతిమాలి ఏడుపుకి కారణాన్ని

బయటికి లాగాడు. పాలు రుచిగా లేవు ! అంటే ఆమెకి గేదెపాలు త్రాగటం అలవాటు. ఆవుపాలు పల్చగా ఉన్నాయని తాగలేకపోయింది. పెళ్లి కాకపోవటమే మంచిదయింది. అయినట్లయితే-కేవలం ఒక అభాగ్యురాలు సంఖ్య పెంచటం మాత్రమే. నా బరువు పెరిగేది. మరి బంధాలు చుట్టుకునేవి. అదీ కాక నేను మాత్రం యింకెన్నాళ్లు బ్రతుకుతాను? తర్వాత ఇహ నీలూ ఉన్నాడు? నీలూ మళ్లీ ఉండటం ఉండకపోవటమూనా! వాడు ఉన్నా లేనట్లే! వాడి మీద ఆధారపడితే అయినట్లే. చపలచిత్తుడు. బాధ్యతాజ్ఞానహీనుడు. వాడు ఒక్క బిలూ ఎదుటే కాస్త అణిగి ఉంటాడు. వాడు ఇంక ఎవరినయినా మనుషులుగా భావిస్తాడా? ఎవరి మాటయినా వింటాడా? చిన్నప్పటి నుంచీ వాడు అదుపులోలేని వాడే. పెద్దయాక పైగా శాంతంగా గంభీరంగా తయారయ్యాడు. చిన్నప్పుడెంత దుస్సాహసంగా ఉండేవాడు! ప్రతిరోజూ ఏదో ఒక పాడుపని చేస్తూనే ఉండేవాడు.

... అప్పుడొకసారి దుర్గాబాబుగారి ఒక బాతుని కోసి, ఆశ్రమానికి పడమటి వైపున వెదురుతోపుల్లో దాన్ని వండుతున్నాడు. దుర్గాబాబు కంగారుగా వచ్చి ఫిర్యాదు చేశాడు. అతణ్ణి వెంటపెట్టుకుని నీలూని వెతుకుతూ బయలుదేరాను! దుర్గాబాబు పెద్ద కొడుకు మావెంటే ఉన్నాడు. అతనే యింట్లో యీ వార్త చెప్పింది. వెదురుతోపులో ముద్దాయి వస్తువుతో సహా పట్టుపడ్డాడు. వాడితో పాటు- ఆ వీధిలో కుర్రాళ్లు కొందరున్నారు. అన్నిటికంటె ఆశ్చర్యకరమైన సంగతి - దుర్గాబాబు చిన్న కొడుకు నరు కూడా వాళ్ళల్లో వున్నాడు. నీలూని బాతుని కోసిన సంగతి అడగగానే - "అఁ మేమందరం కలిసి బాతుని చంపాము" అన్నాడు. ఏదో ఈ ప్రశ్నకి సిద్ధంగానే ఉన్నట్లు - తర్వాత క్రాసు పరీక్షలో కత్తి తీసుకొచ్చింది నరూ, కోసింది నీలూ. కోయటానికి ముందు నీలూ - కోసేటప్పుడు అందరూ నన్ను తాకుతూ ఉండాలి అని - అందరికీ షరతు పెట్టాడు. వాడు కోశాడు. వాడి వెనకాల నరూ వాళ్లు ఒకరి వెనకాల ఒకరు - పిల్లలు రైలు ఆట ఆడుకునే పద్ధతిలో వీపులు పట్టుకుని నుంచున్నారు - అని బయట పడింది. ...ఇంత కుయుక్తి కూడా తోస్తుంది వాడి మనస్సుకి.

నీలూ బలమైన పొడుగాటి శరీరం, భావుకతా విహీనమైన ముఖం బిలూ ప్రక్కన శోభస్కరంగా ఉండదు. ఈనాడు - చూస్తే నీలూయే బిలూ కంటె పెద్దవాడని అనిపిస్తుంది. వాడికి ఏదితోస్తే అది చేసి తీరుతాడు. అదుపులో పెట్టలేని వాడి సాహసం ముందు - అన్ని రకాలైన అభ్యంతరాలు చాలా తేలికయినవిగా తోస్తాయి. నీలూకి చెప్పాలంటే భయంభయంగా ఉంటుంది. వాడి నోటికి యేదీ అడ్డులేదు. కాని బిలూకి చెప్పటానికి ముందు - నా మాట భావోద్వేగయుక్తమైన వాడి మనస్సుకి ఆఘాతమేమి

కలిగించదు కదా అని నేనే ఆలోచిస్తాను. బిలూ నోరుతెరిచి ఏమీ చెప్పడు - కాని బహుశా వాడి కళ్ల వెంబడి నీళ్లు రావచ్చు! ఇహ నీలూ! నీలూ నా మనస్సుని ఆఘాతపరిచే అవకాశం కనుక దొరికితే విడిచిపెట్టడు. నీలూ కాలేజీలో చదివే ప్రసక్తి మొదట వచ్చినప్పుడు నేను వారించలేదు. కారణమేమంటే - నీలూకి చదవాలని కోరిక ఉంది. దానికి తోడు బిలూకి, బిలూ తల్లికి కూడా వాడు ఇంగ్లీషు చదవాలని ఆకాంక్ష. వాడు కాశీవిద్యాపీఠంలో చదివి సంతుష్టి చెందలేదు. ఇహ వాడి తల్లి విద్యాపీఠం చదువుని చదువుగానే భావించదు - ఇవన్నీ నేను గమనించాను. .. అంతా నిశ్చయమైంది. కాని ఇంతలో నీలూ 'నేను గాంధీ సేవా సదన్ డబ్బుతో చదవను' అనేశాడు. వాడికి ఇంత ఆలోచనలు కూడా వస్తాయి. ఉద్యోగం చేసేప్పుడు కాస్త కూడపెట్టిన డబ్బు ఏదయితే ఉందో - ఆ నిలవలోంచి తీసి తినడం మొదలెట్టడంతో ఇంచుమించు అంతా పూర్తికావచ్చింది. నా డబ్బుతోనే ఆశ్రమాన్ని స్థాపించి పటిష్టం చేశాను. ఇందులోనే చాలా డబ్బు ఖర్చు అయిపోయింది. మూడుసార్లు జరిమానాల క్రింద కూడా సుమారు తొమ్మిది వందలు పోయాయి. చాలా మంది కాంగ్రెస్ పేరుతో నాకు సహాయం చెయ్యటానికి ప్రయత్నించారు. అది కూడా నేను తీసుకోటానికి నిరాకరించాను. ఇతర ఆశ్రమాల్లో యే విధంగా చందాలు పోగుచేస్తారో - అలాంటివన్నీ మా ఆశ్రమంలో మొదటినుంచీ నిషిద్ధం. చందాలు తీసుకుంటే ఆత్మగౌరవాన్ని నిలుపుకోవటం యెంతకష్టమో నిష్పక్షపాతంగా, నిర్భయంగా పనులు చేయగలగటం కూడా అలాగే అసంభవం. ధనాభావంతో నా సంసారం యించుమించు జరుగుబాటు కాని సమయంలో - గాంధీ సేవాసంఘం నుంచి నాకు డెబ్బై ఐదు రూపాయల వంతున మాస భృతి వస్తుంది అని కబురు తెలిసింది. మహాత్మాజీ అన్నీ తెలుసుకున్నారను కుంటాను. ఈ డబ్బు తీసుకోకపోతే నేను ఆశ్రమం ఆదాయం మీదే ఆధారపడి ఉండవలసివచ్చేది. ఆశ్రమం ఆదాయం మాత్రం ఏముంది? రెండు ఎద్దుబళ్లు బాడుగకు తిరుగుతాయి. రెండు నూనెగానుగలు, ఒక గ్రామ కుటీరశిల్ప భాండారం, గుడ్డల సబ్బుతయారీ - ఇహ కొన్ని దినపత్రికల ఏజన్సీ. ఇవే ఆదాయసూత్రాలు. తేనెటీగల పెంపకం, పట్టుపురుగుల పోషణ - మా ఆశ్రమానికి ఎన్నడూ ఆర్థిక లాభాన్ని తెచ్చిపెట్టడం లేదు. అయితే కూరగాయల తోటనుంచి ఆశ్రమంలో ఉండేవారికి సరిపోయే కూరగాయలు వస్తాయి. కాని ఇన్ని చేసినా ఆశ్రమానికి వచ్చే ఆదాయంతో ఆశ్రమంలోని వాలంటీర్లకే తిండి - గుడ్డ గడవటం కష్టం. దానికితోడు నా సంసారం ఖర్చుకూడా ఆశ్రమం సంపాదనలోంచి గడుపుకోవలసివస్తే ఆశ్రమం పాఠ్యాగారం ఎక్కడుంటుంది?

ఇహ జిల్లా కాంగ్రెసు వారపత్రిక ఎలా నడుస్తుంది? జిల్లా కాంగ్రెసు ఇతర ఖర్చులతో మాత్రం ఆశ్రమానికి యేమీ సంబంధంలేదు. ఈ దిగుళ్లు అన్నిటి నుంచీ ఈ గాంధీ సేవాసంఘం ఇచ్చే మాసభృతి నన్ను కాపాడింది. ఈ డబ్బు తీసుకోటంలో అవమానకరమేదైనా ఉంటుందనేది నా మనస్సుకి అనిపించనే లేదు. ఈ డబ్బు నాకు ఏ సంస్థ నుంచైనా యివ్వనీ - ఇది ఏ కోటీశ్వరుడైనా యిచ్చిన విరాళమైతే మాత్రం ఏం - ఇది మహాత్మాజీ ఆశీర్వాదం - తన సేవకునికి అసౌకర్యం కలుగుతోందని ఆలోచించి, ఆయన ఈ ఏర్పాటు చేశారని నాకు తెలుసు. ఇహ నీలూ కాలేజీలో చదవనని కూర్చున్నాడు - కారణం, అలా చేస్తే తాను గాంధీ సేవా సంఘం డబ్బు తీసుకోవలసివస్తుందని! అప్పుడు జయసోయాల్‌జీ సోదరితో బాపూజీ సంభాషణ అందరికీ జ్ఞాపకం ఉంది. ఎవరూ ఒత్తిడి కూడా చెయ్యలేరు. బిలూ, బిలూ తల్లి కూడా నీలూ అభిప్రాయాన్నే సమర్థించటం గమనించాను. నా దృక్పథంతో విషయాన్నెవరూ చూడకపోవటం గ్రహించాను. నాకు నా కుటుంబానికి మధ్య నుండే వ్యత్యాసం ఒకచోట ఇంత గంభీరమని - ఇంతకు ముందు ఊహించనేలేక పోయాను. బిలూ తల్లి సహనశక్తినే, ఆమె ఉత్సాహపూరితమైన అంగీకారమని పొరపాటుపడ్డాను. పిల్లలు ఇతర రాజకీయమార్గాలను అనుసరించటంలో కూడా బహుశా ఈ ఆంతరంగిక సంఘర్షణ ఉండి ఉంటుంది. తర్వాత నీలూ కాలేజీలో చదవటం చూశాను - నా దగ్గిర్నుంచి పైసా కూడా తీసుకోలేదు. కాలేజీ ఖర్చు బిలూ సమకూర్చాడు. బీహార్ ఎర్త్‌కేక్ రిలీఫ్ వర్క్ కాంగ్రెస్ కార్యకర్తల మీద పడింది. ఈ వర్క్ తాలూకు పూర్ణియా జిల్లాకి ఎకౌంటెంట్ బిలూ. అందులో వాడికి నెలకు ముప్పై రూపాయలు మాసభృతివచ్చేది. ఈ డబ్బుని వాడు నీలూ చదువుకి ఖర్చుపెట్టేవాడు. అన్న దగ్గర్నుంచి డబ్బు తీసుకోటానికి నీలూకి అభ్యంతరం లేకపోయింది. - సంకోచమంతా నా డబ్బు తీసుకునేదగ్గరే! ఇంత నిర్దాక్షిణ్యమైన ఆఘాతాన్ని జీవితంలో ఇంకెవరి దగ్గిర నుంచైనా పొందానా అన్నది సందేహం... ఇకపోతే నీలూని చదువులో కాక ఇంకేరంగంలోనయినా వదలండి, వాడు ఆ రంగంలో అందరి కంటె పైస్థానానికి పోగలడని నాకు మనస్సులో పూర్తిగా తెలుసు. ఎంతమంది విద్యార్థులు నా చేతికింద తయారయి బయటికి వెళ్లారు. ఆ మాత్రం గ్రహించలేనా? కాని నీలూ! నీలూ అన్నకి విరుద్ధంగా సాక్ష్యమివ్వటంలోని రహస్యమేమిటో మాత్రం అర్థం చేసుకోలేకపోతున్నా. నీలూ పార్టీ ఆదేశాన్ని జారీచేసి ఉంటే - నేచెప్పేదేమీ లేదు. మహాత్మాజీ ఆదేశం అయితే నేనూ నా సర్వస్వాన్ని త్యాగం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. కాని ఏ రాజకీయపార్టీ అయినా ఇలాంటి

ఆదేశాన్ని యివ్వగలదా? నీలూ, బిలూ ఉభయవర్గాల వారి లక్ష్యం ఒకటే - కార్యక్రమంలో బహుశా కొంచెం తేడా ఉండొచ్చు. దీని ఫలితం ఇంతదూరం లాక్కెడుతుందా? జనబాహుళ్యం అభిప్రాయాల మీద ఆధారపడి ఉండే పార్టీ - ప్రజలకు ఇతర పార్టీల్లోని తప్పులను తెలియచెప్పి భ్రాంతి మార్గంలో పడిపోయిన ప్రజలను తమ వైపుకి త్రిప్పుకోవటం - ముఖ్యకర్తవ్యం కావటం సమంజసం. నీలూ! ఆదేశాన్ని అర్థం చేసుకోవటంలో నువ్వు కచ్చితంగా పొరపాటుపడ్డావ్! ఈ పొరపాటు ఫలితాన్ని అనుభవించక తప్పదు. మీ ఫార్ములాలో నిర్దిష్టమైన యుక్తి నాకు తెలియదు. నిజమే. కాని సరళబుద్ధితోనే తెలుసుకున్న కొంచెం ఒప్పు అవునోకాదో - ఆ సంగతి మీ పార్టీలో నాయక స్థానంలో ఉన్న వారిని అడిగి తెలుసుకో. ఇప్పుడింక అది ఒప్పు కానీ తప్పుకానీ లాభం ఏముంది? అన్యాయం, నష్టం జరగవలసిందేదో జరిగిపోయింది. జీవితమంతా కూర్చున్నా లేచినా అనుక్షణం ఇది నిన్ను గ్రుచ్చుతూనే ఉంటుంది. కాస్తకాస్తగా పశ్చాత్తాపజ్వాల నిన్ను దహింపచేస్తుంది. అప్పటికీ నువ్వు చేసిన దానికి ప్రాయశ్చిత్తం కాజాలదు. ఇదేమిటి? నా బిడ్డను శపిస్తున్నానాయేం? వద్దు నీలూ! భగవంతుడు నీ పొరపాటుని యెప్పటికీ తెలుసుకోనీయకుండా చేయుగాక! నువ్వు నీ పార్టీ ఆదేశాన్ని ఎలా అర్థం చేసుకున్నావో అదే ఒప్పుకానియ్! ఎందుకనంటే నువ్వు దాని మీద భారం వేసే ఇప్పటికీ నిలబడి ఉన్నావ్. నీ మనోబలం యెంత ఎక్కువదైనా కానియ్, నీయుక్తిలోని న్యాయాన్ని గురించి నీకు సందేహం వచ్చిందంటే - నువ్వు క్రుంగిపోతావ్. నీకు నీ అన్నయెంతటి వాడో నాకు తెలుసు.

"మహాశయ్‌జీ!"

కళ్లు పైకెత్తి చూశాను. ఖేదన్‌లాల్‌జీ నా ఎదుట నుంచుని ఉన్నాడు.

"నిద్ర వస్తోందా ఏం?"

కూర్చోక పోతేనేమంచిది. కూర్చుంటే ఇంక ఆపకుండా మాట్లాడుతూ పోతూనే ఉంటాడు. ఎన్ని చెత్త సంగతులైనా మాట్లాడగలడు పెద్దమనిషి. ఆ పెద్దమనిషికి ముగ్గురు కొడుకులు. స్వరాజ్య ప్రసాద్, స్వతంత్ర ప్రసాద్, సంఘటన ప్రసాద్. ఆశ్చర్యకరమైన పేర్లు. నీలూ, బిలూ - నా పిల్లల పేర్లు అతి సామాన్యమైనవి. పెద్ద ఆలోచించి, సంప్రతించి పెట్టిన పేర్లు కావు. బిలూని నాన్న బాలాయీ అని పిలిచేవారు. అదే క్రమంగా బిలూగా నిలిచిపోయింది. నీలూని నాన్న చూడనేలేదనుకుంటా కాదు. నీలూ పుట్టిన వారంలోనే నాన్న చనిపోయారు. ఎంతో ఆలోచించి పేర్లు పెట్టటం కూడా పెద్ద చిక్కే. ఖేదనలాల్‌జీ తన రెండో కొడుకు స్వతంత్ర ప్రసాద్‌కి ఉత్తరం రాశాడు. ఉత్తరంలో

తక్కిన కొడుకుల పేర్లు కూడా ఉన్నాయి. జైలు సి.ఐ.డి. ఆ ఉత్తరాన్ని ఏమయినా సరే పాస్ చెయ్యలేదు. ఏదో కోడ్‌లో ఏదో వార్త పంపుతున్నారని అతని విశ్వాసం. అప్పటినుంచే సి.ఐ.డి.తో అతడికి తగాదా నడుస్తోంది. మంచి మాటలతో తెలియచెపితే సరిపోయేది. అది లేదు. ఇద్దరూ తమ పట్టుదలల్ని నిలుపుకుంటారు. పెద్దమనిషి చిన్న కొడుక్కి ఉత్తరం వ్రాశాడు. పట్టుదలల ఫలితంగా ఆ ఉత్తరం మొన్న తిరిగి వచ్చింది. ఉత్తరంలో - నాకు ఇంతవరకు నా ఉత్తరాలు అందలేదు. అందులో నా జోక్యం యేమీ లేదు. కాని ఈ ఉత్తరాన్ని ఏ గుడ్లగూబ బాబుకూడా అటకాయించలేడు - అని రెండు పంక్తులున్నాయి. ఆ ఉత్తరం కూడా తిరిగి వచ్చింది. దాంతో ఒక చిన్న కాయితమ్ముక్కమీద సి.ఐ.డి. నోట్ ఈ ఖైదీ ఉత్తరంలో తన తండ్రి విషయంలో ఏదో రాశాడు. అది సందేహాస్పదంగా తోచింది. అందుచేత ఈ ఉత్తరం పాస్ చెయ్యలేదు. ఇదేమిటి? ఖేదనలాల్‌జీ లేచి వెళ్ళి పోతున్నారేమిటి? ఇప్పుడే నాకోరిక మీద కంబళిపైన కూర్చున్నారు. మళ్ళీ ఇప్పుడే లేచి వెళ్ళిపోతున్నారు. బహుశా నేనేమీ మాట్లాడలేదని తలచారనుకుంటా. పెద్దమనిషి మనస్సులో ఏమనుకుంటాడో. పెద్దమనిషి వెళ్ళి వైద్యనాథ్ కుర్చీలో కూర్చున్నాడు. వైద్యనాథ్ వర్గం పడుకున్నారక్కడ. ఖేదనలాల్‌జీ, సురజవల్లీబాబు, హరిహర్‌జీ, రామ్‌శరణ్‌జీ కూర్చుని వున్నారు. వీరు వంతులు వేసుకుని, రాత్రి మేల్కొంటున్నారనుకుంటా. అందరూ మేల్కొనే ఉన్నట్లున్నారు. నలుగురేసి చొప్పున వంతులేసుకుని, నా ప్రక్కనున్న సీట్లలోకి వచ్చి కూర్చున్నారు.

వైద్యనాథ్ వర్గంవారు ఇంతకుముందు ఇక్కడికివచ్చి కూర్చున్నది ఇందుకనేనా? వైద్యనాథ్ సదాశివ్‌లోపల ప్రైవేట్‌గా మాట్లాడుకున్నది దీన్ని గురించేనని ఇప్పటికి అర్థమైంది. నేనెక్కడ ఏం చేసేస్తానో అని కాపలా కాస్తున్నారు. నేను వీరు అనుకుంటున్నంత ఉద్విగ్నుణ్ణి కాదని యెవరు చెపుతారు వీరికి? కొడుకు మీద అంత మమకారమే ఉంటే బిలూకీనాడు ఈ స్థితి వచ్చేదేనా? సదాశివ్ మళ్ళీ యెక్కడికెళ్ళాడు? నా మంచంమీదే కూర్చున్నాడు! ఇందుగో కన్పిస్తున్నాడు. నా పక్కమీద ఒరిగాడు. బహుశా మళ్ళీ నిద్రమత్తు వచ్చిందేమో! పాపం. దోమలు అతణ్ణి తినేశాయ్. లేచి దోమతెరయినా వేస్తాను! నేను లేవటంచూసి సురజవల్లీబాబు, హరిహర్‌జీ పరుగెత్తుకొచ్చారు! "ఏమిటి? ఏమయింది? వదలండి, మేము వేస్తాము దోమతెర. మీరు కూర్చోండి" అన్నారు. ఈ కేకలకు సదాశివ్ లేచి కూచున్నాడు. పాపం కంగారు పడినట్లున్నాడు. "ఛీ ఛీ - ఈ గందరగోళమంతకీ కారణం తానే! మళ్ళీ కంబళి మీదికొచ్చి కూచుంటాను"

"కూర్చోండి సురజవల్లీ బాబూ!"

సురజవల్లీబాబు కంబళి మీద నా ప్రక్కన కూచున్నారు. నాకు బాగా నచ్చినవాడు పెద్దమనిషి. చాలా గంభీర స్వభావుడు. పైగా ఆయన ఒక్కగానొక్క కొడుకు పోయిన ఆగస్టు ఆందోళనలో తుపాకీ గుండుకి చనిపోయాడు. పదేళ్ళ కుర్రాడు! తన తండ్రిని అరెస్ట్ చేసి ఠాణాకి తీసుకొచ్చినప్పుడు జనం గుంపులు గుంపులుగా ఠాణావైపుకి 'ప్రొసెషన్'గా వచ్చారు. అతను కూడా తండ్రిని జిల్లా జైలుకి పంపేముందు, ఒక్కసారి కలుసుకుందామని గుంపుతో కలిసి వచ్చాడు. ఇంట్లో నాయనమ్మ ఏడుపు మొదలుపెట్టింది. అమ్మ కిటికీ ప్రక్కన కూర్చుని వుంది. అతనికి చాలా బాగుంది. "జయ్ సురజవల్లీజీకీ జయ్" అందరి నోళ్ళలోనూ తన తండ్రిపేరే. అందరూ తన తండ్రిని పొగడుతున్నారు. బొంబాయిలో మహాత్మాజీ మీటింగ్ జరిగింది. ఇవాళ ప్రొద్దునే మహాత్మాజీ అరెస్టయినారన్నవార్త నాన్న అందరికీ చెప్పారు. ఆ తర్వాతనే నాన్న అరెస్ట్ జరిగింది. క్షణంలో అందరి నోళ్ళలోను నాన్న పేరు సంకీర్తనం అయింది. నాన్న మహాత్మాజీలాగా గొప్పవారయ్యారు. ఆయనకు పోలీసుల మీద కోపం వచ్చింది. దీని మూలంగా వారు నాన్నను ఏదైనా చేస్తారని ఏంతెలుసు ? జైలు పేరు చెపితేనే ఇదివరకు ఆయనకు భయం వేసేది ? కాని నిరుడు తన తండ్రి జైలుకి వెళ్లేప్పుడు నాన్న మెడనిండా ఎన్ని బంతి పూలదండలు. నాయనమ్మ అంతకుముందే "నాన్న - ఇంగ్లీషువారి యుద్ధానికి ఒక్కపైసా యివ్వకూడదు, ఒక్క సోదరుని పంపకూడదు - ఈ ఆందోళన లేవతీస్తారు. వెంటనే పోలీసులు లాటీల పోట్లతో చావబాదుతారు" అని చెప్పింది. కాని దానికి బదులుగా అప్పుడు పోలీసు ఇన్‌స్పెక్టర్ - అంత పెద్ద జడ్జిగారు నాన్నను తన యింటికి ఆహ్వానించి భోజనం పెట్టటం చూశాడు. ఇన్‌స్పెక్టరు భార్య కూడా ఆయన్ని పిలిచి భోజనం చేయించారు. నాన్న కొన్ని నెలల తర్వాత జైలు నుంచి తిరిగి వచ్చేప్పుడు - పెట్టెనిండా ఎన్ని వస్తువులు తీసుకొచ్చారు. సబ్బు, పెన్సిల్, రూళ్ల కాయితాల పుస్తకం ... జైలర్ గడ్డం చేసుకునే బ్లేడ్‌తో కత్తి తయారు చేశారు. ఆ బాక్స్‌లో ఆయన ఫారెన్ టూత్ బ్రష్ చూశారు. తాతయ్య క్షౌరం చేయించుకున్న తర్వాత తలమీద వెంట్రుకలెలా ఉంటాయో సీమ టూత్‌బ్రష్ వెంట్రుకలు కూడా సరీగ్గా అలాగే ఉన్నాయి. దాని మీద పాలలాంటి తెల్లటి పేస్ట్‌వేసి పళ్లుతోముకోవాలి. చెల్లెలు ఎంత అమాయకురాలంటే - ఆ బ్రష్‌ని చెంపలకు రుద్దితేచాలు ఏడ్చేది. చిన్నప్పుడు తాతయ్య కూడా ఇలాగడ్డం రాస్తానని భయపెట్టేవారు ... ఠాణా తీగెల కాంపౌండు చుట్టూ అపరిమితమైన జనం. ఠాణా కప్పు చూడటమే కష్టం ... నాన్నను చూస్తారండి! జనం ఠాణా చుట్టూ వున్న

తీగెలను ఛేదించుకుని కాంపౌండ్‌లో ప్రవేశించారు. జనం త్రోపిడితో అతడు క్రమంగా ముందుకుపోతున్నాడు. సురజవల్లీకీజై! అందరూ ఠాణా వైపు ఎందుకు పరుగెడు తున్నారు? తర్వాత ...

ఆ మర్నాడు రాత్రి సురజవల్లీబాబుని లాకప్ ప్రక్క గుమ్మం తెరచి జైల్లోంచి బయటికి తీసుకెళ్లారు. జిల్లా ఆస్పత్రికి తీసుకెళ్లారని విన్నాను. వారిది అపరిమితమైన జాలి ! చివరిగడియలో చూసే ఏర్పాటు చేశారు. కొన్ని గంటలు శ్మశానంలో కూడా ఉండనిచ్చారు. కుర్రవాడి ఎడమకాలి మోకాలిపైన కోయవలసి వచ్చింది. ఆ తర్వాతనే సివిల్ సర్జన్ అతను బ్రతకడని తెలుసుకున్నాడు. మర్నాడు సాయంత్రం మళ్లీ సురజవల్లీ బాబు మా మధ్యకు వచ్చినప్పుడు ఆయన ఎదుటికి వెళ్లటానికే సంకోచం కలిగింది. ఆ మౌనగంభీర వ్యక్తిని- ఎలా ఊరడించను? ఆ రోజున నేను కూడా యిలాగే ఆయన ప్రక్కన కూర్చున్నాను. "కూర్చోండి" చాలా సేపయింతర్వాత- "కొంచెంసేపు మాత్రం తెలివొచ్చింది. అప్పుడు నా మెడ వాటేసుకుని నాతో, 'అబ్బా ఎంత తీవ్రంగా వచ్చింది జ్వరం?' అన్నాడు. తర్వాత రెండు గంటల్లో అంతాపూర్తి అయిపోయింది" అని ఒక మాట చెప్పారు. ఇదేమిటి! కనుకొలకుల్లోకి నీళ్ళువచ్చినట్లున్నాయ్! కాదు. ఈ నీళ్ళు సురజవల్లీబాబు మీద సానుభూతితో వచ్చాయి. బిలూ సంగతి ఆలోచించటం మూలంగా కాదు. సురజవల్లీబాబు కళ్ళలో కూడా నీళ్ళు చూశాను. ఏడుస్తున్న వ్యక్తిని చూస్తే దగ్గిరున్న వ్యక్తి కళ్ళలో నీళ్ళు అణచుకోవటం కష్టం! ఛీ! ఛీ! నాకీ మాత్రం నిగ్రహంగా ఉండే ఓర్పులేదూ? ఈ మాత్రం సహించగల శక్తి లేదూ? మహాత్మాజీ! నా మనస్సుకి బలాన్ని ప్రసాదించు. ఒక్క సురజవల్లీ బాబుయే నా మనస్సు పరిస్థితి సరీగ్గా అర్థం చేసుకోగలిగారు. ఆయన సానుభూతి...

వరాండాలోంచి ఎవరో యిటువైపే పరుగెత్తుకొస్తున్నారు... వార్డర్ సింగ్‌జీ రొప్పుకుంటూ వచ్చి, కిటికీ యెదుటి నుంచి లాంతరు తీసుకున్నాడు. తర్వాత మెల్లిగా అడుగులు వేసుకుంటూ- గంభీరంగా మరొకవైపుకి వెళ్ళాడు. ఒకటి రెండు నిమిషాల తర్వాత కటకటాల గుమ్మం ఎదుటికి వచ్చి నుంచున్నాడు. జాఫర్ సాహెబ్ అసిస్టెంట్ జైలర్. మాకందరికీ నవ్వుతూ సలాం చేశాడు. తర్వాత ఇంకేమీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. ఇతను వచ్చింది రాత్రి రౌండ్‌లో. ఒక్కొక్కరోజున ఒక్కొక్క అసిస్టెంట్ జైలరు డ్యూటీ ఉంటుంది. ఇందుకే వార్డరు వచ్చి లాంతరు తీసుకెళ్ళాడు.

సరే సురజవల్లీబాబు దహన సంస్కారానికి శ్మశానానికి ఎలా వెళ్ళారో నన్ను కూడా అలా వెళ్ళనిస్తారా? బహుశా వెళ్ళనివ్వరు. వెళ్ళనిస్తే నాకు తప్పకుండా ముందుగానే

తెలియచేసేవారు. తెలియచేస్తే బిలూముఖం చివరిసారిగా ఒక్కసారి చూడగలిగేవాణ్ణి. చూడటానికి మాత్రం ఏముంది? బహుశా వాడివైపు చూడను కూడాలేను అహ(... హా( అందమైన బిలూ గుండ్రటి ముఖం నా హృదయంలో అచ్చుగుద్దినట్లే ఉంది. ఆ ముఖమే మంచిది. సహజమైన ఆ పరిచిత ముఖమే నా హృదయంలో ఉండనీ. ఇంకా యేం చూస్తాను? అయినా రేపు ఒకసారి బయటికి వెళ్ళగలిగితే నీలూని ఒకసారి కలుసుకోవచ్చు. వాణ్ణి కలుసుకోవటం ఇప్పుడు చాలా అవసరం. ఇప్పుడేమిటో వాడి మనఃపరిస్థితి! చివరికి ఏం చెయ్యబోయి ఏం చేస్తాడో- ఇదే నా భయం! ఒకడు ఎటూ వెళ్ళిపోయాడు. ఇంకొకడి అదృష్టంలో ఏముందో భగవాన్ నీకే తెలియాలి! నాకు అవవలసిందేదో అయిపోయింది. దిగులంతా బిలూతల్లిని గురించే! ఆమె తిండి-నీళ్ళు కచ్చితంగా వదిలేసింది! జైల్లోకి ఏ వార్త చేరాలన్నా ఎంత ఆలస్యం పడుతుంది! ఆమెకి అన్ని సంగతులూ తెలిశాయి. నీలూ సాక్ష్యమిచ్చిన సంగతి కూడా బహుశా ఆమెకి తెలిసి ఉంటుంది. ఆమె ఈ అఘాతాన్ని యెలా సహించగలుగుతుంది! రాజకీయ స్నేహరంగం అమె ఇచ్ఛానుసారం ఎన్నుకున్నదికాదు. వరదలో కొట్టుకువచ్చినట్లు వచ్చింది. అంతే! ఆమెకి ఇల్లు పిల్లలు ఉండి స్వయంగా తన చేతిమీదుగా తీర్చిదిద్దుకున్న సుఖమయ సంసారం సహజమైన రంగం. బయటి తుపానుల కల్లోలాలు ఇంటిగోడల మధ్యకు రానివ్వని, యెక్కడా లభించని బ్రహ్మాండమైన జగతిని నాలుగు గోడల మధ్య పరిమితం చేసి, కళ్ళ యెదుట సుస్థిరం చేసేదే ఆమె కోరుకునేది! అక్కడి నుండి ఆమెని నేనొక విధంగా నిర్బంధం చేసే - అస్పష్టలక్ష్యపు ముళ్ళదారిలోకి లాక్కుని వచ్చాను. నోరు తెరిచి పైకి చెప్పకపోయినా - ఆమె దీన్ని యెందుకు సహించాలి? బిలూ తల్లి ఎన్నో సహించింది. కాని సహనానికి కూడా ఒక హద్దు ఉంది. ఆమెని రేపు దహనకార్య సమయంలో వెళ్ళనిస్తారా? వెళ్ళనీయకపోవటమే మేలు! అధికారులు బహుశా ఎవర్నీ వెళ్ళనివ్వరు. బహుశా మిలటరీ లారీలో శవాన్ని తీసుకెడతారు. ఇహ సూపరెంటెండెంట్ ఎంతో మర్యాదగా బ్రాహ్మణ వార్డర్లచేత దహన క్రియ జరిపిస్తారేమో! జైలుకి నాలుగు వైపులా ఇవాళ సాయుధ పోలీసులు పహారా ఉన్నారేమిటి? వాళ్ళు ఇంత వరకు బహుశా ప్రహరీ నాలుగువైపులా తిరుగుతున్నారనుకుంటాను. వృధా శ్రమపడుతున్నారు. ఇంత జాగరూకత అవసరమేమీ లేదు. బయట వాతావరణం ఎలా ఉందో తెలియదు. కాని జైలులోపల తక్కిన రోజుల్లోలాగానే జరిగిపోతోంది... బహుశా ప్రొద్దున్నే జైలు గేట్ దగ్గిర పెద్దగుంపు కల్లోలంకాని, సంచలనంకాని రవంతకూడా లేదు. అంతా చేరవచ్చు. శాసనాన్ని ధిక్కరించి కూడా బహుశా ఎవరైనా సంతాపసభ జరపవచ్చు. ఒకవేళ నగరంలో హర్తాళ్

జరిగితే జరగవచ్చు కాని నాకు వాటిల్లిన నష్టం వాటివల్ల ఏమీ పూర్తికాదు. బిలూ తల్లిని ఓదార్చేవారు కూడా యెవరూలేరు. ఆమె చెల్లెలు బృందావన్‌లో ఉంటోంది. ఆమె సాంసారిక విషయాల్లో ఉదాసీనురాలు... అక్కగారి కొడుకులతో ఆమెకి బాగా పరిచయం కూడా లేదు. బిలూ మేనమామ ప్రభుత్వోద్యోగి... దీనివల్లనే దూరదూరమయి పోతున్న భావం. విజయదశమికి సంప్రదాయంగా వ్రాసే ప్రణామాలు తెలిపే ఉత్తరం కూడా వ్రాయలేదు. దానికి తోడు ఈ సంఘటన! ఇంక తర్వాత ఉద్యోగం మూలంగా మాతో ఆత్మీయతా సంబంధాన్ని ఒప్పుకోనుకూడా ఒప్పుకోడు... నీలూ, బిలూ ఎవరూ మేనమామ యింటికి వెళ్లాలనుకోరు. పెద్దయిన తరువాత ఒకసారి వెళ్లారు. హఠాత్తుగా ఒక రోజున తిరిగిరావటం గమనించాను. ఎందుకు వచ్చేశారో ఏమీ తెలియలేదు. తర్వాత తెలిసింది. వాళ్ల మామయ్య నన్ను గురించి- నేనొక 'పర్‌ఫెక్ట్ వ్యాగ్‌బాండ్' అన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేశారట. వారు నా యీ అవమానాన్ని సహించలేకపోయారు. నిజమేగా!- ఆయన దృష్టిలో నేను వ్యాగ్‌బాండ్‌ని కాక మరేమిటి? సంసార విషయంలో బాధ్యతా జ్ఞానం నాకు లేదు. డబ్బు సంపాదించను. ఊరికే ఆడంబరంగా తిరుగుతుంటాను. ప్రతిదానికీ లెక్కలేసే మనుషులు దీన్ని 'వ్యాగ్‌బాండ్ తనం' అనకపోతే ఇంకా దేన్ని అంటారు. సాధారణంగా వారు మమ్మల్ని పిచ్చివాళ్లగానే భావిస్తారు. కొంచెం ప్రశంసాదృష్టితో గౌరవంగా చూడటం గమనించగానే వెంటనే వ్యాగ్‌బండ్‌లనేస్తారు. విదేశాల్లో వెనకటిరోజుల్లో 'వాగ్రన్సీ' (Vagrancy) శాసనం ఉండేదే- ఆ శాసనం క్రిందకి వస్తాం మేము. ఇక్కడ ఇప్పటికీ మా మీద తేలికగా బి.యల్. కేసు నడిపించవచ్చు. పంథొమ్మిది వందల ఇరవై ఒకటి - ఇరవైరెండు సంవత్సరాల్లో పెద్దపెద్ద కాంగ్రెస్ నాయకులు చాలామందికి బి.ఎల్. కేసులో శిక్షలుపడ్డాయి... కుర్రవాళ్లు ఎంత భావోద్వేగులు! నేనయితే నవ్వి ఎగరకొట్టేసేవాణ్ణి - నీలూ సంగతే చెపుతా - తాను తండ్రిని ఎంత గౌరవం యిచ్చి మాట్లాడతాడో- అది ఇంట్లో అందరికీ తెలుసు. బయటి వారెవరైనా - బంధాలేవీ లేనివాడని అంటే ఇంకేమైనా ఉందా? ఏమయినా - నేనిప్పటికీ ఈమాట మాత్రం ఒప్పుకుంటాను - వాడు నా ముఖం ఎదుట ఇప్పటికీ యేం మాట్లాడడు. నా ముఖం మీదే జవాబు అనేది ఇంతవరకు ఎన్నడూ యివ్వలేదు.

వెడతాను, కొంచెం ముఖం కడుక్కుని వస్తాను. కూర్చుని కూర్చుని నడుము పీక్కుపోయింది. తమ ఆరోగ్యం సంగతి లోకులు ఊరికే ఆలోచిస్తారా? ... అదే జ్ఞాపకం చేస్తుంది. లేవగానే సురజవల్లీబాబు- "ఏవిఁటి? ఎక్కడికి వెడుతున్నారు?" అని అడిగారు. "డ్రమ్ము దగ్గిర కొంచెం ముఖం చేతులు కడుక్కునివస్తాను" అన్నాను.

ఒక ఏరోప్లేన్ ధ్వని వినిపిస్తోంది. వీటి రాకపోకలకు అంతు అనేదిలేదు. యుద్ధంలో వందలకు వందలు తమ మనుషులు చచ్చిపోతున్నవారు - ఒక్క ప్రాణం విలువ ఏం తెలుసుకుంటారు? నా కళ్ళకంటే బిలూ నా కొడుకు. కాని వారి కళ్లకు? యుద్ధం జరిగే రోజుల్లో తక్కిన రోజుల్లోలాగా విచారణ పరిమాణాన్ని నిలబెట్టుకోవటం సాగుతుందా? ఈనాడు సాధారణ నాగరికుడు- రక్త మాంసాలతో పెరిగిన బుద్ధి వివేకం కలిగిన మానవుడు కాదు. ఈనాడు అతని పరిచయం ఐడెంటిటీ కార్డులో- రేషన్ టిక్కెట్ నంబరులో... యుద్ధంలో పాల్గొన్న సైనికుల సంగతి వదిలేయ్. అన్నిచోట్ల స్వాభావిక జీవితాన్ని ప్రజలు మరిచిపోయారు. పూర్వం ఒకటి రెండు ఏరోప్లేన్‌లు వెడుతూంటే ప్రజలు కళ్లుపైకెత్తి చూసేవారు. ఈనాడు మూడు డజన్ల బాంబర్లు ఒక్కసారిగా కలిసి వెళ్లినా యెవరూ చూడనే చూడరు. కలకత్తాలో బాంబులు పడుతున్నప్పుడు- అక్కడ ప్రజలు ఈ విషయాన్ని ఇలాగే ఉదాసీనంగా తీసుకున్నారా? వారు రవ్వంత కూడా విచలితులు కాలేదా? ఇప్పుడు లోకులకు బిలూ సంగతి ఆలోచించే అవకాశం యెక్కడ? లోకులేకనుక ఆలోచించకపోతే, ఇహ గవర్నమెంట్ కేం తలపట్టింది? బిలూ పార్టీవారు కరెక్టుగానే చెప్పారు- ఎవరి హృదయాలకు పరివర్తన కల్గించాలి? హృదయమనేది ఉంటే అది పరివర్తనమవుతుంది. కాని- హింస ఎంత పెరిగితే-అవతలి పక్షంవారి దమన విధానం కూడా అంత పెరుగుతుంది అన్నమాటమాత్రం నిజం. అంత దమన విధానాన్ని సహించగల శక్తి ఈ దేశంలో ప్రజలకు ఉందా? లక్ష్యాన్ని చేరుకోవాలనే ఆకాంక్ష ఎంత తీవ్రమో, దానికోసం దేశం ఎంత త్యాగం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నదీ అన్నదే దానికి కొలతబద్ద అవుతుంది. ఈ సూటి విషయాన్ని బిలూవాళ్లు అర్థం చేసుకోలేదు. దుమికే ముందు తమ శక్తిసామర్థ్యాలను విచారించుకోవాలి.

ముఖం చేతులు కడుక్కుని తువ్వాలుతో ముఖం తుడుచుకున్నాను. ఇదేమిటి? దాస్‌జీ లేచినట్లు కనిపిస్తున్నారే! నేను ముఖం చేతులు కడుక్కోవడం - పుక్కిలించిన సవ్వడికి అతని నిద్ర చెడకొట్టలేదు కదా! లేదు. మూడు కొట్టినట్లుంది. పెద్దమనిషి ప్రతిరోజూ మూడు గంటలకు లేస్తాడు. తర్వాత చలికాలంకాని - వేసవికాలంకానీ అరగంట టబ్‌లో కూర్చుంటారు. చాలా ఖర్చుపెట్టించి జైలు ఫాక్టరీ నుంచి జలచికిత్స తొట్టె తయారు చేయించారు. చాల వరకు ఈజీ చైర్‌లా కనిపిస్తుంది. అందులో కంఠం వరకు నీళ్లలో మునిగి కూర్చుంటాడు. నోటితో ఒక ధ్వనిచేస్తారు. ఝారీ చెంబు కొమ్ములోంచి నీళ్ళు పోస్తున్నప్పుడు వచ్చే ధ్వని లాంటిది. పక్కమీది దుప్పటి వ్రేలాడకట్టి టబ్ చుట్టూ ఒక పరదాలాగా చేశారు. స్నానం చేయటం అయిన తర్వాత శీర్షాసనం

వేస్తారు. అరగంటకుపైగా తలక్రిందివైపుకి, కాళ్ళు పైకీ పెట్టి నిశ్చలంగా నిష్పందంగా ఉంటారు. ఎప్పుడైనా నోట్లోంచి ముక్కుల్లోంచి రక్తం బయటికి రాదుకదా- అని నాకు భయం వేస్తుంది.

నా సీట్‌లోకి తిరిగి వచ్చాను. సురజవల్లీబాబు కూర్చుని ఉన్నారు. బిలూ యిప్పుడు ఏం చేస్తున్నాడో! బహుశా భయంతో, దిగులుతో జర్జరితుడైపోయి, జైలు మధ్య పచార్లు చేస్తున్నాడేమో! నా సంగతి ఒక్కసారి వాడికి జ్ఞాపకం వస్తుందా? నన్ను గురించి బిలూ చివరి గడియలో ఏమనుకున్నాడో అది కనుక తెలుసుకోగలిగితే! నీలూ మీద తప్పు వెయ్యడు. వాణ్ణి క్షమిస్తాడు. ఇది నేను గట్టిగా చెప్పగలను. ఇప్పుడు వాడి మనఃస్థితి ఎలా ఉందో. అది భగవంతుడికే తెలియాలి. ఒకవేళ పిచ్చివాడిలా అయినాడేమో! ఒకవేళ కటకటాలకు తలవేసి కొట్టుకుంటున్నాడేమో! ఒకవేళ చిన్న పిల్లవాడిలాగా వార్డరుని తలుపు తెరవమని బ్రతిమాలుకుంటున్నాడేమో! కాదు, కాదు బిలూ ఎప్పుడైనా యిలా చేస్తాడా? దుర్భరమైన దారుణవ్యథతో వాడి హృదయం పొడిపొడి అయిపోయినా వాడి ముఖంలో ఆ భావం వ్యక్తం కాదు. చివరి క్షణం వరకు వాడి ఆదర్శానికి తగిన గౌరవం నిలబెట్టటానికి చేతనయిన ప్రయత్నమంతా చేస్తాడు. జైలర్‌తో బహుశా ఏదో తమాషా చెయ్యవచ్చు. మెట్ల మీదినుంచి మంచె యెక్కేప్పుడు బహుశా ఆఫీసర్లకి ఇంత సుందరమైన వేకువ, శుక్ర నక్షత్రం సాక్షిగా తనను ఉరితీస్తున్నందుకు ధన్యవాదాలు చెప్పవచ్చు. కాని వాడు ఏమయినాసరే దౌర్బల్యాన్ని వ్యక్తం చేసి, తన పార్టీ పేరుని కళంకితం కానీయడు. నా కొడుకు. నా పెద్దకొడుకు. వాణ్ణి నేను యెరగనా! అందరూ బిలూని ఊరికే ప్రేమిస్తారా? హర్దార్ దుబే, దుబ్‌యిన్ 'బిలూ' అని కలవరిస్తారు. సహదేవ్ తల్లి బిలూ కోసం పిచ్చెత్తిపోతుంది. ఇహ జితేన్ తల్లి - ఆమె కోడలు చెప్పనే అఖ్కర్లేదు. బిలూ కూడా స్నేహం కోసం తపించటంలో తక్కువేమీ కాదు. జితేన్ తల్లి -పెద్దవదినగారు ఇంట్లో మనుషుల్లాంటివారు కొద్దిపరిచయం కల తక్కినచోట్ల కూడా స్నేహ రస సూచన కనిపించిందంటే - అక్కడ బిలూ ఆ స్నేహభావం సుస్థిరం చేసుకోవటానికి ప్రయత్నించేవాడు. హోళీ అయింతర్వాత నమస్కారాలు తెలపటానికి ఎక్కడికో వెళ్లేవాడు. ఇంకెక్కడికో ఆశ్రమం నుండి నిమ్మకాయలు పంపేవాడు. ఎవరి అబ్బాయికో చదువుకునేందుకు ఏర్పాటు చేసేవాడు. ఇలాంటి పనులు వాడికి అంతులేనన్ని. ఇవన్నీ స్నేహాధికారం కలిగినవికావు. ఏ అధికారమూ లేదు. ఆ బంధం కూడా అంత దృఢమయినదేమీకాదు. ఇది కేవలం స్నేహాన్ని పెంపొందించుకోవాలనే నిషా. ఇంట్లో తల్లి అపేక్షతోపాటు - పైన వీటినన్నిటినీ పొందటం

- అందుకనే వాడి స్వభావం అతిమధురం. కాని నీలూకసలు యిలాంటివన్నీ లేనేలేవు. స్నేహాధికారం ఏర్పడేంత తియ్యగా మాట్లాడటం తెలుసా వాడికి? తన ఆలోచనల్లో ఉన్మత్తుడై ఉంటాడు. తన అభిప్రాయమే తిరుగులేని నిజమనుకుని, దాన్ని బలంగా వ్యక్తంచెయ్యాలనే తపనతో ఉంటాడు. స్నేహరుణాన్ని తీర్చుకోవటానికి - చిన్న చిన్న కర్తవ్యాలు నెరవేరుస్తూండాలి. దానికి నీలూ కాలాన్ని నష్టం చెయ్యగలడా? వారిని గురించిన సమాలోచన లెంతసేపు జరుపగలిగితే అంతసేపు అతనికెక్కువ ఆనందం కలుగుతుంది. ఇహ బిలూ అంటేనా - జనాన్ని గారడీ చెయ్యగలడు. నాన్నను కూడా చేశాడు. చెప్పకూడదు, ఆయన స్వర్గానికెళ్లారు, నాన్నకు మొదటినుంచీ కొంచెం కోపమెక్కువ. ఎన్నిసార్లు చూశాను - భోజనానికి కూర్చున్నారు. వంట బాగుండలేదు. ముందుకాస్త కెలికారు. తర్వాత 'రెచెడ్ డైట్' అని ఠక్కున నీళ్ళగ్లాస్ కొట్టి లేచి వెళ్ళిపోయారు. భోజనం చెయ్యకుండా ఆఫీసుకి వెళ్ళిపోయారు. అక్కడ ఇంట్లో అమ్మకూడా రోజంతా భోజనం చెయ్యకుండా కూర్చుంది... టీ బాగుండలేదు. నాన్న అన్నీ ఇంతే - అని కప్పు, సాసరు విసిరిపారేశారు. ఇలా ఎన్నో సంఘటనలు జ్ఞాపకమున్నాయి. వృద్ధాప్యంలో కోపం మరీ యెక్కువైంది. చివరిరోజుల్లో కొంచెం పిచ్చితనపు లక్షణాలు కనిపించాయి. కాళ్లు రెండూ క్రమక్రమంగా చచ్చుపడిపోయాయి. ఆయన ఇంక తప్పనిసరి అయి కాశీ వదిలి పూర్ణియా వచ్చి ఉండవలసివచ్చింది. ఒంట్లో జవసత్వాలు ఎంత క్షీణించిపోతున్నాయో కోపం మాత్రం అంత పెరిగిపోసాగింది. ఈ సమయంలో బిలూ పుట్టాడు. రాత్రింబగళ్లు ఈ పసివాణ్ణి పెట్టుకుని ఉండేవారు. అటు యిటూ నడవగలిగేవారుకాదు. ఈజీ ఛైర్‌లో పడుకుని ఉండేవారు. కాని బాలాయీ (బిలూ)ని కనుచాటు కానిచ్చేవారుకాదు. ఎవరి యిళ్ళలోని పిల్లలైనా తిరగటానికి వస్తే "వాళ్లు దయ్యాలు బాలాయీని గారడీ చెయ్యటానికి వచ్చారు" అనేవారు. వాళ్ళమూలంగా బిలూ తల్లిని ఎన్నో తిట్టేవారు. చివరికి మంచంపట్టిన స్థితిలో బుర్ర పూర్తిగా పాడైపోయింది. మంచం చుట్టూ పక్కమీది నుంచి దొర్లి పడిపోకుండా కొయ్యఫ్రేమ్ చేయించవలసి వచ్చింది. మాట యించుమించు పూర్తిగా పడిపోయింది. కళ్ళుమూసుకునే ఉండేవారు. జ్ఞానశక్తి కూడా బాగా తగ్గిపోయింది. కాని ఇన్నిటిమధ్య కూడా కోపం మాత్రం తగ్గలేదు. బిలూ తల్లిని, నన్ను గోళ్ళతో రక్కి, పీకి వేధించేవారు. అన్నం తినిపించేటప్పుడు వ్రేళ్ళు కొరికి గట్టిగా పట్టేసేవారు. కాని అప్పుడు కూడా బిలూని ఆయన దగ్గిర కూర్చోపెట్టగానే కోపం అంతా నిముషంలో ఎటో ఎగిరిపోయేది! బాగా కోపం వచ్చి ప్రక్కమీద చిన్నపిల్లవాడిలాగా అటు యిటూ దొర్లేవారు. బిలూ చిన్ని లేతచేతులు రెండూ నేను

ఆయన ముఖానికి తాకించేవాణ్ణి. వెంటనే మంత్రానికి కట్టుపడిన పాములాగా చల్లపడేవారు. బహుశా కళ్లు మూసుకుని ఉండేవారేమో! మేము ఎన్ని పిలిచినా కళ్లు తెరిచేవారుకాదు. ఎంత బ్రతిమాలితే అంత అల్లరిపిల్లవాడిలా మొండితనం ఎక్కువయేది. మేము బిలూతో 'బిలూ, తాతయ్యని పిలు' అనేవాళ్లం. ఆశ్చర్యం! ఈ అర్ధచైతన్య స్థితిలో కూడా బిలూ పిలుస్తున్నాడని తెలుసుకునేవారు. వెంటనే బిలూ! ఎక్కడ! అంటూ చేతులతో తడుముతూ వెతకటం మొదలెట్టేవారు. తర్వాత కళ్ళు తెరిచి చూసేవారు. నాన్న పోయేరోజున కూడా చివరి గడియలో నాన్న చెవి దగ్గర ముఖం పెట్టి "నాన్న బాలాయీ పిలుస్తున్నాడు, బాలాయీ! బాలాయీ!" అన్నాను. బిలూ పేరు వినగానే బదులు పలుకుతారని - అప్పటికీ ఇంకా మనస్సులో క్షీణమైన ఆశ! కాని అప్పటికే ఆయన ఏ పిలుపూ వినిపించని స్థితికి వెళ్ళిపోయారు. ఆశ్చర్యమైన తెలివి బిలూది! అప్పటికి వాడి వయస్సు ఎంత! తాను తప్ప తాతయ్యను ఎవరూ వశం చేసుకోలేరు అన్న సంగతి అంత చిన్నవాడు కూడా గ్రహించాడు. తన తాతయ్యని శాంతింపచెయ్యటం కోసమో, తినిపించటం కోసమో తాను ఉండటం అవసరం అన్న సంగతి వాడు తనని పిలిచే గొంతుని పట్టే గ్రహించేవాడు. అప్పుడేదో ఉదాసీనత, కపట గాంభీర్యం చూపించేవాడు. బహుశా తల్లి తనని పొగడాలని, బ్రతిమాలాలని వాడికోరిక అనుకుంటాను. బిలూ తన తాతయ్యని మళ్లీ చూడగలుగుతాడా? నాన్న తన గారాబాల మనుమడు 'బాలాయీ'ని చివరికీ విధంగా తన దగ్గిరకు రప్పించుకున్నాడా?

మనస్సు చాలా కలవరంగా ఉంది. గదిలో ఇంతమంది జనం. అందరూ మేలుకుని ఉన్నారు. గది బయట వార్డరు. గదిలో కబుర్లాడుకుంటున్న ధ్వని సన్నగిల్లింది. కాని పూర్తిగా మాత్రం ఆగిపోలేదు. దాస్‌జీ స్నానం చేస్తున్న సవ్వడి వినిపిస్తోంది. గది కొంచెం చల్లబడింది. బయట కుక్కలు మొరగటం వినిపిస్తోంది. అయినా ఆకాశంలో గాలిలో నాలుగువైపులా యేదో స్తబ్ధత ఆవరించినట్లుంది.

కటకటాల్లోంచి వెలుతురు బయట వరాండాలో పడుతోంది. చీరకట్టుకున్న ఆమె ఎవరు? కాదు,కొన్ని కట్టెపుల్లలు పేర్చి ఉన్నాయి. వాటి మీద వెలుతురుపడి అలా కనిపిస్తోంది. విషన్‌దేవ్‌జీ మెస్సులో కట్టెపుల్లల దగ్గిర్నుంచి కూడబెట్టి ఉంచుతాడు. జైల్లో అందరిలోనూ కనిపిస్తుంది ఆ దాచుకునే ప్రవృత్తి. చిరిగిపోయిన చొక్కాలు, పాత పాంకోళ్ళు అన్నీ కూడబెట్టుకోవాలనుకుంటారు. జైల్లో ఉన్నా ఇలాంటి మనస్తత్వమే. కట్టెల పోగుచూస్తే హఠాత్తుగా ఈ దృష్టి విభ్రమం యెందుకు కలిగింది?... ఆశ్రమంలో

వంటింటి వసారాలో పేళ్ళు వేసిన కట్టెలు, పిడకలు గుట్టలు. గదిలోపల బిలూ తల్లి వంట చేస్తోంది. బిలూ ఎక్కడికో వెళ్లాలి. అంచేత వాడు భోజనానికి కూర్చున్నాడు. ఎంత తొందరతొందరగా తింటాడు - నమలనే నమలడు. రేగిపోయిన నూనెలేని జుట్టు, జైల్లో మాసిపోయిన నీలంచారల బనీను డ్రాయరు వేసుకుని ఉన్నాడు. చిక్కిపాలి పోయాడు.

భగవాన్! గాంధీజీ, మీ పేర్లు స్మరించుకుంటున్నా మనస్సుకి బలం రావటంలేదు. మళ్ళీ చరఖా పెట్టుకు కూర్చుంటాను. ఇదే నాకు మిగిలిన అవలంబనం. గ్రుడ్డివాడి చేతికర్ర, నాకు జపమాల... టిబెట్‌లో 'యరవాడ చరఖా' (సూట్‌కేస్‌లో యిమిడే ఒక రకం రాట్నం)లాగా ఒక వస్తువును త్రిప్పుతూ లోకులు నామజపం చేస్తారు. హఠాత్తుగా సురజవల్లీబాబు మీద చూపుపడింది. పెద్దమనిషి విచారంగా నా ముఖం కేసి చూస్తూ ఉన్నారు. నా ముఖంలో, కళ్లల్లో కచ్చితంగా ఏదో విలక్షణత కనిపిస్తోంది. ఇంత పాడు ఏకులు నూలు ఊరికే పుటుకుపుటుకు తెగిపోతోంది... విదేశాల్లో కొంచెం సుస్తీ చేస్తే జనం ఆత్రంగా ఆత్మీయుల్ని పరిజనాన్ని చూద్దామనుకుంటారు. ఇంట్లో వాళ్ళ ఆపేక్షతో కూడిన శుశ్రూష కోసరం కళవళపడతారు. ఇవాళల్లా పగలు బిలూ ఇంట్లో వాళ్లెవరూ దగ్గరకు రాలేదు. బహుశా వాళ్లకి చెప్పవలసింది ఉందా, పిల్లలకి కొంచెం జబ్బుచేస్తే బిలూ తల్లి తిండి, స్నానం మానేసేది. రాత్రింబగళ్ళు రోగి ప్రక్కనే కూర్చునేది. విసనకర్రతో విసురుతూనే ఉండేది. ఆరోగ్యం దారికి వస్తే పథ్యపానాదులని గురించి ఎంత పరిశీలన! జ్వరం తగ్గిన మర్నాడు కేవలం కాస్త జావ, ఆ మర్నాడు పాలు-రొట్టె, ఆ తర్వాత రోజు గోధుమపిండి రొట్టె, ఆ తర్వాత రోజున అన్నం. జ్వరం వస్తే దానికి వ్యతిక్రమంలేదని నీలూ, బిలూ యిద్దరికీ తెలుసు. కాని నేను వీరినివాళ- చివరి క్షణంలో బిలూ తల్లిదగ్గర ఉండటానికి వీలులేని పరిస్థితికి లాక్కునివచ్చాను. చాలా మృగాలు తమసంతానాన్ని తినేస్తాయ్. నేను ఆ కోవలోనివాణ్ణా? మళ్లీ దారం తెగిపోయింది. చాలా సన్నటి నూలు తీస్తూండటం వల్ల మాటిమాటికీ తెగిపోతోందనుకుంటాను. కాదు ఇంతకంటె ముతక నూలు తీస్తే కార్పెట్ అల్లే నూలు తయారవుతుంది...

నేపాల్‌లో- ఒకరికి బదులు యింకొకరు రాజదండన అనుభవించవచ్చు- అని విన్నాను. నిజమోకాదో తెలియదు. అయినా ధనవంతులు తమకు బదులు నౌకర్లను వాళ్లను జైలుకి పంపిస్తారని విన్నాను. ఇక్కడ కూడా అలాంటి నియమం ఒకటి ఉంటే బిలూకి బదులు నేను వెళ్లినా...

ఒక వ్యక్తి మరొకరి రోగాన్ని తన మీదకు తీసుకున్నాడని - ఇలాంటి కథలు

ఎన్ని విన్నాను. హుమాయూన్ మరణశయ్యమీద బాబరు యిలా చేశాడు. యుద్ధ సమయంలో 'హోస్టేజ్' పెట్టటం- ఒక ప్రాణానికి బదులు మరొక ప్రాణం మీద హక్కు కోరటం తప్ప ఇంకేముంది?

మళ్లీ దారం తెగింది. దూది బహుశా పాతదేమో! ఇన్నిసార్లు దారం తెగితే - చరఖా వడకగలమా? ఈ ప్రత్తితో ఇదివరకూ నూలువడికాను. అప్పుడు తెగలేదు... కాదు, నా కాళ్లు చేతులు వణుకుతున్నాయ్. ఏకుని సరిగ్గా పట్టుకున్నా- అనుకున్నట్టు తియ్యలేకపోతున్నాను. కనుగ్రుడ్లు నాట్యమాడుతున్నాయ్! నూలు సరిగ్గా కనిపించటం లేదు. లాంతరులో నూనె బహుశా అయిపోవచ్చిందనుకుంటాను. కంటిదృష్టి మాత్రం ఇంకా యెన్నాళ్లుంటుంది? వయస్సుకింకా మూలికలున్నాయా ఏం? లేదు వృథాగా నా తప్పును నచ్చచెప్పుకోవటానికి ప్రయత్నిస్తున్నాను. ఇప్పుడు నా మానసిక పరిస్థితిలో చరఖా వడకటం అసంభవం... సొరాబ్-రుస్తుమ్ కథకి మూలంగా చారిత్రిక సత్యమేమీలేదు. అది పూర్తిగా కట్టుకథ. తండ్రి-కొడుకులు ఎప్పుడైనా ఇలా కాగలరా? ఎందుకు కాకూడదు. ప్రపంచంలో అన్నీ సంభవమే. సింహాసనం కోసం తండ్రి-కొడుకుల యుద్ధం - ఇదే సాధారణ చారిత్రక పద్ధతి. నాకు ఏం శిక్ష అవుతోంది! సిక్కుగురువు 'బాందా'కి శిక్షపడింది. తన చేతులతో స్వంత బిడ్డను హత్య చెయ్యవలసివచ్చింది! ఉహ్! ఎంతరక్తం, చర్రున గుండెల్లోంచి బయటికి చిమ్మింది.

"ఏవి(టేదైనా చెప్పారా?" అని అడిగారు సురజవల్లీబాబు. పరధ్యానంగా "లేదు. ఏం చెప్పలేదే" అన్నాను. ఈ చివరి మాటలు ఏదో ధ్యాసలో గట్టిగా అన్నాననుకుంటాను. సురజవల్లీబాబు కొంచెం తటపటాయిస్తూ "చరఖా వడకటం ఒకవేళ కొంచెం యిదిగా ఉంటే- పోనీ ఎందుకు మానెయ్యరాదూ?" అన్నారు.

"లేదు, లేదు బాగానే ఉంది" ఏదో తప్పుచేసి పట్టుపడిపోయినట్లనిపించింది. మనస్సుకి సమాధానం చెప్పలేక మాట తడబడింది. ఎలాగో అలా ఈ చిన్న సంగతి ముగించి, నూలు వడకటం మీద దృష్టినిలపగలిగితే బ్రతికిపోతాను. ఏకు నుండి దారం వస్తున్న వైపే - ఎవరొచ్చినా చూడకుండా ఉండేందుకు- అటే చూస్తూ ఊరుకున్నాను. కళ్ళలోంచి నీళ్లు పొంగివస్తున్నాయి. రాత్రంతా మేలుకుని ఉండటం వల్లనే. వేరే కారణములేదు. రాత్రిళ్లు మేల్కొంటే కళ్లమంటలు పుడతాయి. మహాత్మాజీ! నా మనస్సుకి బలాన్ని ప్రసాదించు. నిగ్రహబంధం ఇంక నిలిచేట్లులేదు. నాకు నేను స్థిరంగా ఉండలేకపోతున్నాను."

"మాష్టరుగారూ! మాష్టరుగారూ! మాష్టరుగారూ! అని సురజవల్లీబాబు పలిచారు.

ఏదో చాలా దూరం నుంచి పిలుస్తున్నట్లు - ఆ పిలుపు చెవులకు వినిపిస్తోంది. నిద్రమత్తుగా ఉన్నప్పుడు - దూరం నుంచి రైలు ధ్వని వినిపించసాగింది. సురజవల్లీ పిలుస్తున్నారని గ్రహించాను. కాని పలకటానికి బుద్ధిపుట్టటం లేదు. సురజవల్లీబాబు వీపుమీద చెయ్యి వేశారు. సానుభూతికరమైన హస్తస్పర్శ తగలగానే ఇంక నిగ్రహించుకో లేకపోయాను. "బిలూ! బిలూ!" చరఖా ఏకు అవతల పారేసి, సురజవల్లీబాబు చెయ్యి నొక్కిపట్టుకున్నాను. ఇద్దరమూ మాట్లాడకుండా ఊరుకున్నాము. పెద్దమనిషి కళ్ళవెంట కూడా నీళ్లొస్తున్నాయి. కుర్చీలోంచి లేచి ఆ నలుగురు కూడా వచ్చారు. ఛీ! ఏమిటిలా చేశాను! జనమందరూ ప్రోగైనారే! గబగబా చెయ్యి తీసుకున్నాను. మళ్లీ చరఖా ముందు కూచోటానికి ప్రయత్నించాను. వృథా ప్రయత్నం. సదాశివ్ మళ్లీ విసనకర్ర ఆడించటం మొదలుపెట్టటం చూశాను. అతను నిద్రపోయాడనుకుంటా. మళ్లీ ఎప్పుడు లేచాడు? స్వస్థతగా ఉన్నవాడికి విసరటం దేనికి? వాళ్లు ఏమనుకుంటున్నారు? నేనిప్పుడే తెలివి తప్పి పడిపోతాననా?

సదాశివతో- "బాగా చలిగాలి వేస్తోంది. ఇంక విసరవలసిన అవసరం లేదు" అన్నాను.

ఎవరి మాట ఎవరు వినిపించుకుంటారు? కొంచెం సేపయ్యాక సురజవల్లీబాబు చాలా మెల్లిగా "కొంచెం గీత చదువుతాను. వింటారా?" అని అడిగారు. ఎంతో ఆదరంతో కూడిన తియ్యని మాట, త్రోసిపుచ్చటానికి లేదు. "చదవండి" అన్నాను.

మళ్లీ చరఖా వడకటానికి కూర్చున్నాను. ఆయన గీత చదవటం మొదలెట్టారు. ఆయన నా ముందు ఎందుకు గీత చదవాలనుకుంటున్నారో నేను గ్రహించాను. నా మనస్సుకి బలాన్ని చేకూర్చటానికి కాదు, సానుభూతితో కాదు, తమ దిగుళ్లు మరిచిపోవటానికి కాదు, శవాన్ని తీసుకెళ్లే మిలిటరీ లారీ ధ్వని, మేజిస్ట్రేట్, డాక్టరుగార్ల కారు ధ్వని నాకు వినిపించకుండా ఉండటానికి. ఇంతకు మునుపు ఎన్నో ఉరితీతలు జరిగాయి. ప్రతి ఉరితీత సమయంలోనూ మేము భయంతో కూడిన ఉత్కంఠంతో ఈ ధ్వని కోసం ఎదురు చూశాము. కారుహారన్ తీవ్రధ్వని అప్పుడు హఠాత్తుగా మా కందరాలను ఆలోడితం చేశాయి. తర్వాత వార్డంతా ఎక్కడా లేని నిస్తబ్ధత! తన గుండెల సవ్వడి కూడా వినిపించేంత నిశ్శబ్దత. అప్పుడిహ కాలం గడిచినట్లు - తెల్లవారనే వారదేమో అన్నట్లుండేది. తర్వాత లారీ, కారు ధ్వనినిబట్టి శవం బయటికివెళ్లింది అని జనం తెలుసుకునేవారు. తర్వాత తొమ్మిది గంటలు కొట్టేవారు ఖైదీలను లేపటానికి. ఉరితీత రోజున అందరూ మేలుకునే ఉంటారు. అయినా నియమ వ్యతిక్రమం జరగటానికి

వీల్లేదు. దాని తర్వాత రెండు గంటలు- 'లెక్కసరిచూసే గంట'- వినిపించేవి. ఆ ధ్వని అందరికీ - రాత్రి ఎంతమంది ఖైదీలను బంధించి ఉంచారో - ప్రొద్దున కూడా సరీగ్గా అంతమందీ ఉన్నారు. - ఒక్కరుకూడా హెచ్చలేదు, ఒకరు తగ్గలేదు అని తెలివిడి చేస్తుంది. అన్ని వార్డులలోని వార్డర్లు - తమ తమ వార్డులలోని ఖైదీల సంఖ్య సెంట్రల్ టవర్‌లో తెలియచేస్తారు. వీటి 'టోటల్' రాత్రి సంఖ్యతో సరిపోగానే ఈ అభావనీయ సంఘటన - రెండు గంటల తర్వాత నాలుగువైపులా ప్రచారం చెయ్యబడుతుంది. జైలర్ దొర జమాదారుకి ఇక అన్ని వార్డుల తలుపులు తెరవమని తాళం చెవియిస్తాడు. చీమల బారులాగా ఖైదీలు లైనుగా బయటికి వస్తారు. "జోడాఫైల్" "జోడాఫైల్!" శిక్షాకాలంలో ఒక రోజు అతనికి తగ్గిపోయింది. నూతన ఉద్యమంలో దుస్సహమైన దురతిక్రమ్యమైన మరొక రోజును చెరిపివెయ్యటానికి అతను ప్రయత్నపూరితుడవుతాడు. ప్రతి గంటా అతనికి ఇరవై నాలుగు గంటలు. ఒకరోజు అవుతుంది. ఒక రోజు జరిగి పోతే, ఇంకా ఎన్ని రోజులు మిగిలి ఉన్నాయి అనేది అతనికి జ్ఞాపకం చేస్తూంటుంది.

వీరు నన్ను మరపించటానికి ప్రయత్నిస్తున్నారు. కాని యిప్పుడు బిలూ సంగతి మరిచిపోవటం సాధ్యమవుతుందా? ఇప్పుడు ప్రయత్నిస్తే పరధ్యానంలో పడవచ్చా? పడగలిగితే బ్రతికిపోగలిగేవాణ్ణి- ఒకసారి ఒక క్షణంలో ఒక్కటి కంటె ఎక్కువ సంగతులు ఆలోచించలేకపోవటం - భగవంతుని అపరిమితమైన కరుణ. బిలూ ఒకవేళ చివరి కొద్ది క్షణాలూ తన మృత్యువు సంగతి కంటే భిన్నమైనదేదయినా ఆలోచించగలిగితే - వాడు మానసికమైన అశాంతి, భయాల నుండి తప్పించుకోగలడు. బహుశా బాధను కూడా తెలుసుకోలేకపోవచ్చు. ఈనాడు ఈ కఠినమైన విపత్సమయంలో నా సిద్ధాంతా లన్నింటికీ నీళ్ళు వదిలి నీకు నా వాంఛను తెలియచెయ్యకుండా ఉండలేకపోతున్నాను భగవాన్! బిలూకి చివరి గడియలో ఏదైనా సంగతి జ్ఞాపకం వచ్చేట్లు చెయ్. ఇతర విషయాన్ని ఆలోచించే సామర్థ్యాన్ని ప్రసాదించు. అంతిమ క్షణానికి ముందునుంచే మృత్యుభయంతో వాడు రవంతరవంతగా చావకుండా ఉండాలి. టెలీపతీ నిజమేనా? నా మనస్సులోని కోరిక, ఆకాంక్ష బిలూ దగ్గిరకు చేరుకుంటోందా? చూడు బిలూ! నీ తండ్రి నీకోసం తన దగ్గిర భగవంతుని దగ్గిర అల్పుడయిపోయాడు.

సురజవల్లీబాబు గీత చదువుతున్నారు. అతి పరిచయమైన గీతలోని శ్లోకాలు విన్నా వినిపించటం లేదు. వినిపించినా అర్థంచేసుకోలేకపోతున్నా. శబ్దతరంగాలు చెవులకు చేరకుంటున్నాయి. కాని మనస్సులోనూ, మెదడులోనూ ప్రతిస్పందనను రేకెత్తించలేకపోతున్నాయి...

బ్రహ్మాండమైన యుద్ధరంగంలో ఎదుట నిలబడి గీతోపదేశాన్ని వినటం ద్వాపరయుగంలో అంటే సంభవమయింది. నేను అర్జునుణ్ణి కాను. మనం గీతాతత్వాన్ని అర్థంచేసుకున్నామా? నాస్తికుడైన బిలూ గీతను త్రిప్పి పంపించాడు కాని వాడే కర్మయోగంలోని మూలమంత్రాన్ని అర్థం చేసుకున్నాడు. కార్యాచరణలో తనను లీనం చేసుకున్నాడు. ఇహ నీలూ - వాడు మాత్రం ఎందులో తక్కువ? వాడి కఠోరమైన కర్తవ్యజ్ఞానం ముందు- స్నేహాన్ని, ప్రేమను, ఆత్మీయతాధికారాన్ని, జనాభిప్రాయాన్ని, అంత ఆదరం కల అన్నను-అన్నీ అతి అల్పమైనవయిపోయాయి. వీళ్లనే పైగా నేను నాస్తికులంటున్నాను. భగవంతుడి మీద విశ్వాసం మన మనస్సులకు బలాన్ని తెచ్చిపెడుతుంది. కాని భగవంతుడి మీద అవిశ్వాసం వారి మనస్సులోకి దౌర్బల్యాన్ని తీసుకురాలేదు. ఎక్కడైతే ఎదుటివాడి పతనమో, అందులోనే తాంత్రిక సాధకుడి సిద్ధి...

"ఆ(!" ఉలిక్కిపడ్డాను. చేతిలోంచి ఏకు పడిపోయింది. చరఖా కిరకిరచప్పుడును, విరామంలేని గీతాపఠన స్వరాన్ని ఛేదించుకుని, తక్కిన ధ్వనులనన్నిటినీ అణచివేసి, మోటారు లారీ హారన్ ధ్వని, తర్వాత మోటారు ఆగిన ధ్వని వినిపించాయి. లారీ నా గుండెల మీది నుంచే వెళ్ళినట్లనిపించింది. - లాగి కనుక పట్టుకోగలిగినట్లయితే - నాలోని యావచ్ఛక్తినీ వినియోగించి - శరీరబలంతో - కంకరరోడ్డు మీద - నన్ను లాక్కుని వెడుతోంది. లారీ చక్రాలు ఆపాను. ఇంత బలం నాలో ఉందా? లారీ ఆగింది. నా హృదయస్పందనంతో స్వరాన్ని కలిపి - క్రుద్ధమైన క్రూర జంతువు గాండ్రింపులాగా కారు యింజన్ ధ్వనిస్తోంది. సదాశివ్ చేత్తో వీపుని నిమురుతున్నాడు. నాలుగువైపులా అందరూ కారు క్రింద యెవరైనా పడితే చుట్టూ జనం వచ్చిమూగినట్లు నిలుచున్నారు. "రండి-అందరం కలిసి కాస్త ప్రార్థన చేద్దాం" అన్నాడు సదాశివ్. అందరూ అక్కడ కూర్చున్నారు. వైద్యనాథ్‌వర్గం, ఫార్వర్డ్ బ్లాక్ గ్రూపు, కిసాన్ సభ యువకుడు, కమ్యూనిస్టుపార్టీ యువకుడు-ఇంక తక్కిన వారందరూ ఉన్నారు. మెహర్‌చంద్‌జీ- "రాష్ట్ర గగన్‌కే దివ్య జ్యోతి" ప్రారంభించారు. ఇవాళ ప్రార్థన విషయంలో యెవరికీ అభ్యంతరం లేదు. ఇందులో వ్యంగ్యంగా చిటికెలువేస్తూ పాడటం లేదు. మెహర్‌చంద్‌జీకి జ్ఞాపకం ఉండని లైను- దాన్ని మొదలవగానే అందరూ పాడారు. అతను జేబులోంచి ఆ కాయితాన్ని బయటికి తీయవలసిన అవసరం లేకపోయింది. అందరూ శక్తినంతనీ ఉపయోగించి బిగ్గరగా అరుస్తున్నారు. ఇన్ని అరుపులు - కేకల మధ్య మేజిస్ట్రేట్, డాక్టరుగార్ల కారు ధ్వని వినిపించదు. ఆ అభిప్రాయంతోనే వీరు ప్రార్థనకు కూర్చున్నారు. మెహర్‌చంద్‌జీ గానం పూర్తి కాగానే, వెంటనే సదాశివ్ "రఘుపతి రాఘవ రాజారాం"

ప్రారంభించారు.

మహాత్మాజీకి ప్రియమైన భజన. ఈ భజన నిత్యనూతనమైన ఎంతమధురస్వరం. బిలూ వర్గం వారికివాళ భజనగానమైనా అభ్యంతరంలేదు. మొదటి పాటంటే పోనీ జాతీయ పతాక విషయం మీదిది. కాని ఈ భజన అలాంటిది కాదు కదా! బిలూ అంతిమ క్షణంలో వాడి ఆత్మశాంతికోసరం, బిలూ తండ్రిని కొంచెం అన్యమనస్కుణ్ణిగా ఉంచాలని ప్రయత్నంతో వీరు తమ ఆశయాలను - సిద్ధాంతాలను మెత్తపరచుకున్నారు. బిలూ వర్గం వీరు ఇది కూడా చెయ్యరా? ఒకవేళ నీలూ - నీలూ అయితే భజనలో పాల్గొనేవాడేనా? ఎన్నటికీ అలా చెయ్యడు. వాడు క్రుంగిపోతాడు - కాని వెనక్కు ముందుకూ లాగడు. నీలూ బిలూ మొదట్లో ఆశ్రమంలో ఈ భజనను ఎంత బాగా పాడేవారు. మహాత్మాజీ ఎదుట కూడా పాడారు. మానసికోద్వేగాన్ని అణచుకోటంకోసం వీరు అస్వాభావికమైనంత బిగ్గరగా పాడుతున్నారు. వీరిప్పుడు పూర్తి చెయ్యకూడదని నిర్ణయించుకున్నారు. సాధ్యమైనంత సేపు పట్టుదలతో పాడారు... ఉరి మంచె మెట్ల మీదినుంచి బిలూ పైకి యెక్కుతున్నాడు. పాపం చెప్పుల్లేని కాళ్ళకు ఎదురుదెబ్బ తగిలింది - ఎంత చిక్కిపోయాడు. మెడ కొంగ మెడలా సన్నబడిపోయింది. ముక్కు నిటారుగా ఉంది. క్రింద చీకటి. త్రాడు జర్క్ అయింది. బిలూ - బిలూ పోతే ఏమవుతుంది! భగవాన్ ! మహాత్మాజీ ! బిలూతల్లికి అఘాతాన్ని తట్టుకోగల శక్తి ప్రసాదించు. నీలూ మనసుకి బలాన్నివ్వు. బిలూకి ఆత్మశాంతి ప్రసాదించు. భజన సాగుతోంది.

రఘుపతి రాఘవ రాజారాం, పతిత పావన సీతారాం
జయరఘునందన జయఘనశ్యామ, జానకీవల్లభ సీతారాం
బిగ్గరగా, యింకా బిగ్గరగా...!

# ఆడవాళ్ల వార్డ్

సరస్వతి వెళ్ళిపోయింది. అయితే తలుపులు మూసేవేళ అయిందనుకుంటున్నాను. ఆ( అందుకనే - ఇదుగో జమాదార్‌ణీ (Female Warder) లూసీ మాటలు వినిపిస్తున్నాయిగా! సరస్వతి కొంచెం నా తల వొత్తింది. హాయిగా వుంది. ఆమె వ్రేళ్ళు చాలా మెత్తనివి. కణతలు రెండూ పైన నొక్కిపట్టి తర్వాత మెల్లి మెల్లిగా వ్రేళ్ళను కనుబొమ్మలమీదినుంచి ముక్కు చివరవరకు పోనిచ్చింది. కణతలు తపతప కొట్టుకోవటం వెంటనే తగ్గింది. తలలో ఏదో పేరుకున్నట్లు - పెద్ద బరువు పెట్టినట్లుంది. అదికూడా కరగి తేలికయినట్లనిపించింది. జమాదార్‌ణీ ఆమెని ఒక్క నిమిషమైన ఎక్కువసేపు కూర్చోనిస్తుందా? అయితే మాతో మాత్రం కొంచెం మర్యాదగా మాట్లాడుతుంది - కాని సరస్వతి 'సి'క్లాస్. వాళ్ళ వార్డ్ వేరు. ఆమెనింత సేపు ఈ వార్డ్‌లో ఉండనిచ్చింది. అంతే చాలు ! అహా ! ఆమె మళ్ళీ జైలు కెందుకు వచ్చిందీ - అదినాకు తెలుసు. అది నాదగ్గిర దాచిపెట్టగలదా? ముందే కనుక నాకది తెలిసివుంటే - సహదేవ్ తల్లి నా దగ్గిర ఈ ప్రస్తావన తెచ్చినప్పుడే ఒప్పుకునేదాన్ని. అలా అయినట్లయితే మా బిలూకి ఈ దశ సంభవించేది కాదేమో! అలా యెందుకిష్టపడతాను. భగవంతుడు నన్నిలాగే పుట్టించాడు. అలా అయితే దేశంలో వాళ్ళనందర్నీ ఎలా కడుపులో పెట్టుకు కూర్చోగలను. "అభాగ్యుడెటువైపు వెడితే అటువైపు సముద్రం యెండిపోతుందిట" నాకు అంతే అయింది. సరస్వతి అదృష్టం ఇలా తగలడింది. పెళ్ళయినా కూడా ఇలాగే తగలడేదేమో! నేను బిలూ అభిప్రాయాన్ని కూడా అడగలేదు. మరీ స్కాలర్‌షిప్‌తో చదువుకున్నపిల్ల. ఈ కాలపు కుర్రాళ్ళు ఎక్కడైనా అది 'లైక్' చేస్తారా? ఈమాట సహదేవ్ తల్లితో కొంచెం ఆభాసగా వ్యక్తం చేశాను. సరస్వతి తల్లి నాదగ్గిరేమీ సమాధానం చెప్పలేదు. అప్పుడేమీ మాట్లాడక నాముఖంకేసి వెలవెలబోతూ చూసింది. కాని దీనికి జవాబు తర్వాత సహదేవ్ నాకు చెప్పకుండా విడిచి పెట్టలేదు - "మేము వ్యవసాయం చేసుకునే చదువు రానివాళ్ళం. మా చెల్లెలు మిడిల్ ప్యాస్ కాకపోతే సరోజినీ నాయుడు, విజయలక్ష్మి

పండిట్‌లాగా విదుషీమణి అవుతుందా? అదే కాక బిలూ బాబు మాత్రం ఏమంత చదువుకున్నాడేమిటి? విద్యాపీఠ్‌'శాస్త్రి' కంటె ఏంకాదుగా" అన్నాడు సహదేవ్. సహదేవ్ ఏదో పశువుల దొంగలాగా కళ్ళు అర్పుతూ చూస్తూ మెదలకుండా ఊరుకుంటాడు. కాని మాటవచ్చినప్పుడు మాత్రం గ్రుచ్చుతూ మాట్లాడతాడు. నా కొడుకు పెళ్ళి - ఇష్టమైన చోటయిస్తాను, కానిచోట ఇవ్వను. దీన్ని గురించి రాద్ధాంతం చెయ్యటం దేనికి? ఇద్దరికీ జత కుదరదు అని నేను యిష్టపడలేదు. హిందూస్థానీ - బెంగాలీలకు పొత్తు కలుస్తుందా? ఎక్కడ వారక్కడ ఉండటమే మంచిది. ఒక చెట్టు బెరడుని మరొక చెట్టుకి అంటిస్తే, ఎక్కడైనా నప్పుతుందా? నేను సరస్వతీ అంటాను, వాళ్లు సరసోయా అంటారు. సరస్వతికి 'సుక్తో' (చేదుచేదుగా ఉండే వ్యంజనం) వండటం తెలుసా? గోకుల్‌పేఠ్ పేరు విన్నదా? బిలూకి కందిపప్పంటే అయిష్టం. వారికి కందిపప్పు తప్ప మరొక పప్పు అంటే అయిష్టం. వారు అలచందపప్పు - ప్రసవించాక పురుటి గదిలో ఉన్నప్పుడు మాత్రమే తింటారు. ఒక రోజున బహు రియాజీకి డాంటా పచ్చడి వండి పెట్టాను. నాకు డాంటాచచ్చడి తినటం అంటే మహాయిష్టం అన్నదామె. డాంటా నోట్లో పెట్టుకుని రసం చీకి పారేస్తారు. నమలాలని తెలియదు. కాని మళ్ళీ బాంగ్లా అని చెప్పుకోవాలని యెంత మోజు! వీరికి ఒక మంచి తీపి వస్తువు తయారు చెయ్యడం తెలుసా? జైల్లో చూశాగా. కాని వారి దేశంలోనే జీవితమంతా గడిపాను. ఇంక తెలుసుకోవాల్సిన కొరతేమీలేదు. తీపివస్తువుల్లో "పూయా" ఒకటే. పూజలు - పండగలు మొదలైనవి ఎన్నివచ్చినా అదే. నీళ్ళలో కాస్త పిండి కలిపి, అందులో కాస్త బెల్లం కలిపి, ఎలాగో అలా కాల్చితే పూయా అయిపోతుందా? రసంలో వెయ్యటం ఉండదు ఏంలేదు. రెండు వస్తువులు కలిపి కూరవండటమంటే వారు బెదిరిపోతారు? అలాంటి వారితో మా బిలూకి షెళ్ళి చెయ్యనా? ఇది ఒక రోజు రెండు రోజులతో పోయేదికాదు. జీవితమంతా వెల్లుల్లి మిరియాలు తిని బెంగాలీకుర్రోడు బ్రతకగలడా? అయినా సరస్వతి నాకు బాగా నచ్చింది. నా కొడుక్కి చేసుకోలేదని ఆమె అంటే ఈర్ష్య అనేది ఏంలేదు. ఆమెని చిన్నప్పట్నించి చూస్తున్నాను. కపిలదేవ్ వాళ్ళతో ఆశ్రమానికి ఎన్నిసార్లు వచ్చి ఎన్ని రోజులుండి వెళ్ళింది. సహదేవ్, సరస్వతి నాకు బిలూ, నీలూ లాంటివాళ్ళే - నా చేతిమీదుగా పెరిగినవాళ్ళని అనొచ్చు. ఎంత మయస్సు? అనాడు కూడా యింత పిల్ల.

... నా వంటింటి వరాండాలో శేఫాలికా మొగ్గలతో అద్దిన ఖద్దరు బృందావనం చీరెకట్టుకుని అల్లరి పిల్ల వెదురుగడ పట్టుకుని గిరగిరా తిరగటం మొదలెట్టింది.

"ఆగు, కళ్ళు మొహం తిరిగి పడిపోతావ్, డోకువస్తుంది" అన్నాను నేను. ఎవరి మాట ఎవరు వినిపించుకుంటారు? "సరసోయాత్‌కీ స్కూల్ - వెరీబాడ్ వెరీబాడ్ వెరీబాడ్ టీచర్‌గుల్" (టీచర్ గుల్ = టీచర్ల బృందం) అని బిలూ బిగ్గరగా పాడుతూ వంటింటి వరాండాలోకి వచ్చి నుంచున్నాడు. అయినా ఆ అమ్మాయ్ తిరగటం ఆగితేనా? ఆమె అలా తిరుగుతూనే బిలూ పాటకు ఎదురు జవాబిచ్చింది.

మ్యావ్ మ్యావ్ మ్యావ్ కూ-

బిల్లీ భాఇయా థ్యాంకూ[1]

బిలూ ఆమె స్వరంలో స్వరం కలిపి, "కుకుర్ భాఇయాకీ ఠ్యాంజ్ ఖా ఊ" (కోడి పుంజు కాలు కరుస్తుందా?) అన్నాడు అప్పటికా తిరగటం ఆగింది. ఇహ నవ్వులతో ఆమె వరాండా అంతా దొర్లింది.

చక్కని అంగపుష్టి ఆ అమ్మాయిది. కాని పనులన్నీ నిర్వహించగలదు. బెంగాలీ గృహస్థుల ఇంటిపిల్ల కాంగ్రెసు ఆశ్రమంలో సంసారం నిర్వహించగలదా? ఆశ్రమం కాదిది - హోటల్. దావాలు వ్యాజ్యాల్లో తిరిగే వాళ్ళందరూ జిల్లా కోర్టులో వాయిదా ఉండి వచ్చి ఆశ్రమంలో దిగుతారు. మీటింగ్‌లు ఉండనే ఉంటాయ్. ఒక వేళలేదు - పాళాలేదు. పగలులేదు - రాత్రిలేదు. వచ్చే జనానికి తెరపి ఉంటేనా? నేను కనుక సంబాళించుకోగలుగుతున్నా మరెవరన్నా అయితే ఏడ్చి మొత్తుకునేవారు - సరస్వతి చేతి మీదుగా భోజనం చేస్తే బిలూకీ ఒక్కపూటకూడా కడుపు నిండదు. బిలూకి నేను వండిన కూరలంటే చాలా యిష్టం. నెమ్మదిగా కూర్చుని అన్నమెంతో కూరకూడా అంత తింటాడు. అలా తినటం మూలంగానేగా ఎముకలు కాస్త పుష్టిగా వున్నాయి. లేకపోతే ఆ తిండి తినే తీరు చూడాలి. పక్షులు ముక్కుతో కెక్కిరించినట్లు నాలుగు మెతుకులు కెలకటం. ఈ సరస్వతీ వాళ్ళకు - వాళ్ళకి అసలు కూరలు తినటం అలవాటు కూడా వుందా? వారిలో లక్షాధికార్లకు తాము భోజనంతో రెండు మూడు రకాల కూరలు తింటాం అని అదే గర్వం. వాడలో వారందరూ దాన్ని గురించి చర్చించుకుంటారు. ఇహ సామాన్య గృహస్థుల యిళ్ళలో - అంచు యెత్తు ఇత్తడి కంచాల్లో ఎర్రబియ్యం అన్నం మధ్య గురిగాచేసి ఇంత కందిపప్పు - కంచం చివర - గంధపు చుక్కల్లాగా కాసిన కూరముక్కలు. సంతోషంతో ఇంత మొహం చేసుకుని తిని లేస్తారు. కపిలదేవ్,

---

1. "దాగుడుమూచి దండాకోర్, పిల్లి వచ్చె ఎలకా దాగె ఎక్కడ దొంగలక్కడే గప్‌చుప్" - అని తెలుగుదేశంలో అదే - ఆటలాంటిది.

సహదేవ్ కుండెడు కుండెడు నీళ్ళు తాగుతారు.

"ఎవరిది? నా కాళ్ళు పట్టుకుని మళ్ళీ లాగుతున్నారు ఎందుకు? ఎవరు? మన్‌చనియా? కాళ్ళకు నూనె రాయమని యెవరు చెప్పారు. ఖచ్చితంగా బహూరియాజీ (కొత్తకోడలు)యే అయివుంటుంది. తామేమో రామాయణం వినటానికి వెళ్ళి కూర్చున్నారు. ఈమెను పంపించారు నన్ను వేధించటానికి. రామాయణ పఠనం చూస్తే మాంచిపట్టులో ఉన్నట్టుంది. బహూరియాజీ చదువుతుంది. తక్కిన పదిహేడు మంది ఆమె కంఠస్వరంతో స్వరం కలుపుతారు. చెవులు గింగుర్లెత్తి పోతాయి. మనలో ఎవరో ఒకరు - రామాయణమో, మహాభారతమో చదివితే తక్కినవాళ్ళందరూ కూచుని వింటారు. మహా అయితే ఒకటి రెండుసార్లు 'ఆహా ! ఓహో!' అంటారు. వీళ్ళదంతా విడ్డూరమే... "ఆఁ అవును మన్‌చనియా! నా కాళ్ళకు నూనెరాయమని ఎవరు చెప్పారు?"

"సరసోయాతీ (సరస్వతి)జీ వెళ్లేప్పుడు - 'ఈమధ్య కొన్నాళ్ళనుంచీ పైత్యం ఎక్కువ అవటంమూలంగా అమ్మగారికి  కాళ్ళు, చేతులు మంటలెడుతున్నాయి. అరచేతులకి కాళ్ళకి కాస్త నూనె రాయ'మని చెప్పారు. మీరండీ - అమ్మగారూ! విసుక్కుంటారేమోననుకుని ఇంతవరకు రాయలేదు నేను... నేను గుమ్మం క్రిందనే కూర్చుని వున్నాను. ఇప్పుడు జమాదార్‌ణీవచ్చి - 'ఇహ నిద్రపోయే ఏర్పాట్లు జరుగుతున్నాయి. అమ్మగారి సేవ చేయటానికి - నీకు 'గల్‌కట్టి'కీ డ్యూటీ పడింది. ఇప్పుడేవచ్చి గుమ్మం దగ్గిర కూర్చున్నావేమిటి? సగం రాత్రి వరకు నువ్వు మేలుకు వుండు. తక్కిన సగం రాత్రి గల్‌కట్టి మేలుకుని వుంటుంది' అని ఆదేశించి - టకటకా వెళ్ళిపోయారు. సర్కార్‌వారు జైల్లో పెట్టారు. ఇక్కడ మీరేది చెపితే అదిచేస్తాను. చాలా పాపాలు చేశాను. లేకపోతే బ్రాహ్మణ పిల్లనై పుట్టి ఇతర్ల కాళ్ళు పట్టే పని చెయ్యాల్సి వస్తుందా? మళ్ళీ వారి హుకుం ప్రకారం మీ కాళ్ళు పట్టటానికి వచ్చాను. మళ్ళీ మీరేమిటి అమ్మగారూ, కోపం..."

ముప్పయి ఏళ్ళుంటాయి మన్‌చనియాకి. ఆమె 'సి'క్లాస్ సాధారణ ఖైదీ. బ్రాహ్మణ ఇంటి బాల వితంతువు. కొద్ది రోజుల క్రితం ఒక బిడ్డను కన్నది. అప్పుడే పుట్టిన పసికందు మృత శరీరం వెదురు పొదల మధ్య కుండలో దొరికింది. పిల్లవాడి మెడమీద వ్రేళ్ళ గుర్తులున్నాయి. వెన్నముద్దలా మెత్తగా ఉన్న మెడమీద నెత్తురు పేరుకుపోయి నీలివర్ణంగా మారింది. ఎదురుగా వుంది చిన్న రక్తపు ముద్ద. అందుకనే మన్‌చనియాకు పదేళ్ళు, మన్‌చనియా తల్లికి రెండేళ్ళు శిక్ష పడింది. బాగా జరిగింది. జరగవలసిందే ! నువ్వు తల్లివయినావ్ - నీ కడుపున బిడ్డ పుట్టాడు. ఆ బిడ్డ యింకా

గట్టిగా ఏడవటం కూడా నేర్వలేదు. ఆ బిడ్డని తల్లివై ఉండి నువ్వింత పనిచేస్తావా? నీలాంటి తల్లిని కాళ్లలోనూ తలలోనూ మేకులు కొట్టి ఊకనిప్పులో పడేసి చంపాలి... అహ( ఆమె ఏమయినా ఈ పని తనంతటతాను చెయ్యలేదు. ఆమె అప్పుడు స్పృహలేని స్థితిలో వుందనుకుంటాను. చేసింది ఆమె తల్లి. ఆ పాపిష్టిది ఒక రాక్షసి. అలాంటి ఆమెకి మాత్రం శిక్ష పడింది రెండేళ్ళు. వీరి న్యాయశాస్త్రానికి కోర్టులకి - సరియైన తీర్పు అనేది వుందా? అది ఉంటే మా బిలూకి ఇలాంటి శిక్ష పడేదేనా? వాడెవర్నయినా ఖూనీ చేశాడా? ఎవర్నయినా చంపబోయాడా? కాంగ్రెసు పనిచేశాడు. అందుకు జైలు వెయ్యి. జరిమానా విధించు. దానికి ఉరివెయ్యటమా? భగవాన్! ఇంత అన్యాయాన్ని ఎలా సహించటం?

"అమ్మగారు! అరచేతులకి కాస్త నూనెరాయనా?"

"అబ్బా ఇంక వేధించకు. మాడుమీద కొడితే కుక్కకు పిచ్చెక్కిందని ఏమీ చెయ్యలేక నాబాధతో నేను చస్తున్నాను. ఇక్కడ అందరూ కలిసేమో నా నోటికి కళ్ళెం వేస్తున్నారు. నన్నిహ ఊరికే పట్టి లాగకండి. కాస్త ప్రశాంతంగా ఒంటరిగా ఉండనివ్వండి. ఇరవై నాలుగు గంటలూ ముప్పై ఆరుమంది నా చుట్టూ మూగి సభ తీర్చి కూర్చుంటారు. నన్నేదో తులసి చెట్టుకింద దింపినట్లుంది. రామాయణ పఠనం ప్రారంభమవటం చూసి, ఏదో అనుకున్నాను. అది పోనియ్ - ఒక్క క్షణం నిశ్చింతగా ఉండొచ్చుకదా అనుకున్నా. అదేంలేదు. మళ్ళీ ఈమె వచ్చి మొదలెట్టింది."

"అమ్మగారూ ! ఇవాళ ప్రొద్దున మీరు తెలివి తప్పి పడిపోయినప్పుడు డాక్టరుగారు వచ్చారు. మీరు మూడు రోజులనుంచి ఉపవాసాలు చేస్తున్నారు. రేపు కూడా కనుక యేమీ తినకపోతే బలవంతంగా తినిపిస్తారట! ఇంజక్షన్ ఇస్తారుట. ముక్కులో గొట్టం పెట్టి, కోడిగుడ్లు తినిపిస్తామని చెప్పారు."

"అవునే అవును ఇప్పుడు నేను తినటమే ముఖ్యమైందా? అరె నేను తినకపోతే - నన్ను తినిపించటం ఎవరికి సాధ్యం."

"మీకు తెలియదు అమ్మగారూ వీళ్ళ సంగతి! నర్మదా చెల్లికి ప్రక్క చుట్ట పెట్టే సంచివుంది చూడండి, మంచంతోనహా బెల్ట్‌లతో కట్టే ఏర్పాటుంది. కొందరు జమాదారిణులు కలసి బలవంతంగా మిమ్మల్ని ఈ మంచంమీద పడుకోపెడతారు. తర్వాత ప్రక్కకట్టినట్లు ఈ మంచానికి కట్టేస్తారు."

"అరె ! నేను మ్రింగకపోతే నన్ను మ్రింగించలేరుకాని, ఇంక ఊరికే వాగకు" పట్టుదలను - మరపించటానికి లేదు. మన్‌చనియా తన ధోరణిలో వాగుతూనే వుంది.

"అదే హారిన్ మఘా ఇయా డోమిన్[1] ఉందే! ఆమె ముక్కులో గాయం వుంది. తెలుసా అమ్మగారూ ! అప్పుడప్పుడు నెత్తురు వస్తూంటుంది. క్రిందటి సంవత్సరం మీరు రావటానికిముందు నిరశన వ్రతం చేసింది. ఆమెకి పాయ్‌ఖానా శుభ్రం చేసే పని యిచ్చారని. ఆమె తాము రాజా హరిశ్చంద్రుడి వంశం వాళ్ళమంటుంది. తమ జాతిలో వాళ్ళకెంతో పేరు ప్రతిష్టలు. వాళ్ళు ఎప్పుడైనా మైల శుభ్రం చేస్తారా? వాళ్ళ జాతి శవాన్ని తాకరు. మురుగు కాల్వలు శుభ్రం చేసేవారితో వాళ్ళు కలిసి కూర్చుని తినరు. జైళ్ళలో మొదట్నుంచి ఈ శుభ్రం చేసే పనులు చేసేది సాంతాలీనులు[2] అని కూడా చెప్పింది. తర్వాత కొన్నాళ్ళు ఆమెకి కోడిగ్రుడ్డు షర్బత్ త్రాగటానికిచ్చేవారు. కాని ఇస్తే ఏమయినట్లు? వాళ్ళ సంస్కారం మంచిది. కోడిగ్రుడ్డు అన్న సంగతి డాక్టర్లు చెప్పకపోయినా ఆమె వాంతి చేసుకోవటం మొదలెట్టింది. తర్వాత సర్కారువారు ఓటమిని ఒప్పుకోవలసి వచ్చింది. దొర ఆమెని పాయ్‌ఖానా శుభ్రం చేసే పనినుంచి తప్పించమని హుకుం యిచ్చారు. మహాత్మాజీ సర్కారుని ఏమీ చెయ్యలేరు. కాని వాళ్ళు సర్కారుని కొద్దిరోజుల్లోనే చల్లబరచారు. 'కలట్టర్' దొర వచ్చి 'సూపరెంట్' దొరని ఎంత కేకలేశారు. చమాయిన్[3] జమాదారిణి నాకీ కథంతా చెప్పింది. ఒక ఆపద తీరిపోయింది. కాని అప్పటినుంచీ ఆమె ముక్కులోంచి నెత్తురు పడుతూంటుంది. ఉరిలో వ్రేలాడేప్పుడు ముక్కులోంచి మొహంలోంచి నెత్తురు వస్తుందా ఏం? మరచనియాని అడగాలి. ఆమె గొంతు పిసికినప్పుడు ఆ పసివాడి ముక్కులోంచి మొహంలోంచి నెత్తురు వచ్చిందేమో! వద్దు తల్లినై ఉండి ఇంకొక తల్లిని ఇలాంటివన్నీ అడగవచ్చా? ఆమె ఒకవేళ తన చేతులతోనే ఈ పాపకార్యం చేసిందంటే - ఆ సమయంలో ఆ పసి ముఖంకేసి చూడగలిగిందా?

...దుర్గ పసిపిల్లవాడికి ఏం జరిగింది? నా ఒడిలోనే వాడి ప్రాణం పోయింది. జ్వరంతో తీసుకుని తీసుకుని - వాడి మొహంలో నరాలు వెళ్లుకొచ్చాయి. పొట్ట

---

1. మఘా ఇయా డోమ్ పెళ్లాం. డోమ్, అంటే ఎరికెలు, ఏనాదులు, చెంచులు తెగకు చెందిన జాతి. వీళ్లు ఒకచోట స్థిరంగా ఉండక సంచారం చేస్తుంటారు. బీహార్‌లో వీరు క్రిమినల్ ట్రైబ్స్‌లో చేర్చబడినవాళ్ళు.

2. సాజ ఉతాలీ... సామంత - పాల శబ్ద వికృతి. ఒక ఆదిమజాతి అటవిక జాతుల్లో తెగ.

3. చామార్ పెళ్లాం. చామార్ అంటే చెప్పులు కుట్టేజాతి.

అతుక్కుపోయింది. హఠాత్తుగా దుర్గ తల్లి కబురు పంపింది. నేను కూరగిన్నె దింపేసి వాళ్ళ యింటికి పరుగెత్తాను. దుర్గ తల్లి అసలు నెలతక్కువ పుటకమనిషి. ఒట్టి పిరికిది. ప్రతిదానికీ ఊరికే భయపడి చస్తుంది. అరుపులతో, మొత్తుకోళ్ళతో - ఏడ్చి ఏడ్చి వీధి వీధంతా ఒక కొలిక్కి తీసుకువచ్చింది. కాని ఆ పసివాడికి అప్పటికి దేవుడి పిలుపు వచ్చింది. వాడి దగ్గర రెండు నిమిషాలు గాబరాపడకుండా కూర్చోవలసింది. అదేంలేదు. అది నావల్ల కాదు అక్కా. నాకు చాలా భయమేస్తోంది అన్నది.

వెళ్లి చూశాను. దుర్గ భయంతో కొయ్యబారిపోయి, కుర్రవాడి ప్రక్కన కూర్చుని ఉంది. ఇప్పుడో ఇంకాస్సేపటికో అన్నట్టుంది వాడి స్థితి. దగ్గరకెళ్లి కుర్రవాణ్ణి ఒళ్లోకి తీసుకుని కూర్చున్నాను. గొంతులో గురక ప్రారంభమైంది. తెల్ల గ్రుడ్లు పడటం కనిపిస్తోంది. పిల్లవాడు అతికష్టంతో శ్వాస తీసుకొనటానికి ప్రయత్నిస్తున్నాడు. కాళ్లు చేతులు, ముఖం నీలి రంగుకి మారిపోతున్నాయి. ఇంతచిన్నవాడికి బ్రతకాలని యెంత ప్రయత్నం! తర్వాత నా ఒళ్ళోనే అన్నీ పూర్తి అయిపోయాయి. కాని అన్నిటికంటె ఆశ్చర్యం చివరిదశలో మొహంలోంచి, ముక్కులోంచి నెత్తురు వచ్చి నా చీరె అవి తడిసి ముద్దయినాయి. ఇలాంటిది ఎన్నడూ చూడలేదు. దుర్గ తల్లి అప్పుడు ఏడుస్తూ తలబాదుకుంటుంది. దుర్గ కొయ్యబారిపోయి కూర్చుని ఉంది. ఆమెని టేపీ తల్లి "ఏమే దుర్గా! పిల్లవాడు ప్రొద్దు బొప్పాయి, తాల్ మిస్రీ తిన్నాడటే!" అని గ్రుచ్చి గ్రుచ్చి అడుగుతోంది...

... బిలూ పుట్టినప్పుడు అంచక్కగా ఎంతో బొద్దుగా ఒడినిండా ఉండేవాడు. హెడ్‌మాస్టరుగారి భార్య పురుటి గదికి చూడటానికి వచ్చింది. రుక్మిణీ దాది పరిగెత్తుకెళ్లి ఇంత కాటుక తెచ్చి పిల్లవాడి బుగ్గకి పెట్టింది. "నీకు తెలియదమ్మా ఈ మాస్టరుగారి పెళ్లాం సంగతి - ఈమె దయ్యంలాంటిది. ఈమె విషపు చూపు దేనిమీద పడితే అది మాడి మసి అయిపోతుంది. బుగ్గను కాటుక పెట్టకపోతే పిల్లాడు రోజురోజుకీ చిక్కి ద్రాడులా అయిపోతాడు చూస్తూ ఉండండి" అన్నది. ముసలిదాది అప్పుడు నన్ను ఇరవై నాలుగుగంటలూ - ఇది చెయ్యి, అది చెయ్యకు అని శాసించేది. కూర్చున్నా లేచినా హెచ్చరించేది. అవును బాబూ! చెప్పినంతా అయింది. బిలూ విజయదశమినాడు పుట్టాడు. హెడ్‌మాస్టరుగారి పెళ్లాం పూజా శలవులయిం తర్వాత వచ్చింది. ఆమె ముందు వాళ్ల పల్లెటూరిలోనే ఉండేది. అప్పుడే హెడ్మాస్టరుగారు మొదటిసారిగా సంసారాన్ని తీసుకువచ్చారు. మాస్టరుగారి పెళ్లాం బిలూ వయసు ఇరవైరోజులంటే నమ్మేదేకాదు. బిలూ చేతి గుప్పిళ్లకేసి, కాళ్లకేసి చూస్తూ ఉండేది. రుక్మిణి గొణుక్కుంటూ చేతలమీద కాళ్ల మీద బొంతకప్పేది...

తర్వాత బిలూకప్పుడు డబుల్ న్యుమోనియా వచ్చినప్పటినుంచి చిక్కిపోతూ వచ్చాడు. అప్పుడు వాడి వయస్సు రెండేళ్లన్నర ఉంటుంది. మామగారు అప్పుడు మంచాన పడ్డారు. వారి కాళ్లు క్రమక్రమంగా చచ్చుపడుతూ వచ్చాయి. అప్పుడే బిలూకి జబ్బు చేసింది... కార్తీకానికి రెండేళ్లు. మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం, చైత్రం - రెండేళ్ల అయిదునెలలు. వెధవది అంత నెలలు రోజులు లెక్క నాకు గుర్తూ ఉండదు. ఆ ఆలోచనే లేదు. టేపీ తల్లి కనుక ఉంటే నా లెక్కలో తప్పకుండా తప్పు ఎత్తి చూపుతుంది. ఆమె యెదుట ఏం మాట్లాడటానికైనా ఆస్కారం ఉందా? ఒక్కమాటకూడా పడదు. మొదటిరోజున బిలూ నుదురు కాలిపోతూండటం చూసి నేను ఊరికే కంగారు పడిపోతున్నా. రాత్రి తెల్లవార్లూ పిల్లవాడు ఎంత ఏడుపు. ఎంత కాళ్లు చేతులు కొట్టుకోవటం. ప్రక్కన మామగారు గదిలోంచి కేకలు, తిట్లు. పిల్లవాణ్ణి ఏమీ సముదాయించలేకపోయాను. ఆయనేమో రేపు ప్రొద్దున్నే హరగోవింద డాక్టర్‌కి చూపించ వచ్చులే అన్నారు. బిలూ తాతగారు ఒకటే కోపం, కంగారు. వారి తిట్లు మూలంగా చివరికి డాక్టరుకి కబురు చెయ్యటం జరిగింది. డాక్టరుగారు ఆ రాత్రి రాలేనని చెప్పి పంపారు. అది విని మామగారు మండిపడ్డారు. గవర్నమెంట్‌కి రిపోర్టుచేసి అతను డాక్టరీ చెయ్యటంనే రద్దుచేయిస్తాను. రాత్రి ఒంటిగంటదాకా సీతాపతి దుకాణంలో చదరంగ మాడుతూంటాడు. కాని రోగి చచ్చిపోతున్నా రాత్రి ఆ రోగిని చూడటానికి రాడన్నమాట. ఇప్పుడు చలీలేదు, వర్షమూ లేదు. వీళ్లందరూ ఖూనీకోర్లు, డాక్టర్లుకాదు- దొంగలు, బందిపోట్లు. మామగారప్పుడు ఇంకా మంచంలోంచి లేవటంలేదు. రిపోర్టు వ్రాయటానికి వారిదగ్గర లాంతరు, కళ్లజోడు, కాయితం, కలం తీసుకెళ్లి పెట్టి వారిని మెదలకుండా కూర్చునేట్లు చేసి వచ్చాను. స్కూల్ దర్వాన్ నన్‌కూని మళ్లీ డాక్టరుగారి దగ్గరకు పంపాను. అలీబక్ష్ 'శాంఫనీ' నన్‌కూ ఆ రాత్రి తానే నడుపుకెళ్లి డాక్టరుగార్ని తీసుకువచ్చాడు... ఇప్పటికీ నన్‌కూ కర్ర ఊతం చేసుకుని అమ్మగారిని చూడటానికని మధ్యమధ్య ఆశ్రమానికి వస్తూంటాడు... హరగోవింద్ డాక్టర్ ముఖం చిట్లించుకోవటం చూడగానే పిల్లవాడి జబ్బు - ప్రమాదకరమైనదని గ్రహించాను నేను. తర్వాత కొన్నాళ్లు యముడితో పోరాటం సాగింది. ఒక రోజున అయిపోయినట్లే అనుకున్నాం. ఆరోజునే మొదటిసారిగా చూశాను కస్తూరి గుణం. కాళ్లు చేతులు చల్లగా మంచుముద్దలా అయిపోయాయి. డాక్టర్ హరగోవింద్ నాడి చూసి, ముఖం చిట్లించుకుని కూర్చున్నారు. ఏం శక్తి ఔషధానిది! చూస్తూ చూస్తుండగానే ముచ్చెమటలుపోసి కాళ్లు చేతులు నీళ్లు కారసాగాయి. తలగడ, ప్రక్క తడిసిపోయాయి. అలుకుగుడ్డలా చుట్టుకుపోయిన వేలెడంత పిల్లవాణ్ణి తుడిచి

లేవదీయటం ఎలా? వాడి రొమ్ములమీద, వీపుమీద - మందు పూతలు ఒకటి. ప్రొద్దున డాక్టరుగారు నాతో "నీ బిడ్డకి పునర్జన్మ నిచ్చానమ్మా"! అన్నారు. ఆయన అన్నమాటలో అతిశయోక్తి ఏమీలేదు. ధన్యవాదాలు - ధన్వంతరి డాక్టర్ హరిగోవిందబాబుకి! కాని ఈ కస్తూరి వేసిన తర్వాత నెల్లాళ్లవరకు కుర్రవాడి శరీరం వేడి తగ్గలేదు. రాత్రింబగళ్లు తపనపడేవాడు. రాత్రంతా పంకా లాగే ఏర్పాటుచేశాం. తర్వాత మెల్లిమెల్లిగా కుర్రవాడు కోలుకున్నాడు. కాని ఆ జబ్బు పడటంతో మళ్లీ ఇంక ఎన్నడైనా మామూలు ఒళ్లుచేసి మనిషి అవగలిగాడా? శరీరానికి కండపట్టనేలేదు. రోజూ ఏదో సుస్తీ ఉంటూనే ఉండేది. భాగ్యవంతుల యిల్లుకనుక అయితే పెట్టెలో ద్రాక్షపళ్ళులాగా గారాబంగా పుష్టిగా తయారయేవాడు. కాని ఏ అదృష్టంతో పుట్టాడో - ఆ గారాబం, ఆదరణ, ఆ తిండి సుఖం ఒక్కరోజుకూడా పిల్లవాడికి దొరకలేదు. హరిగోవిందబాబు ఎందుకప్పుడు వాణ్ణి బ్రతికించాడు! ఎందుకింత పెద్దవాణ్ణి కానిచ్చాడు! భగవాన్! వాణ్ణి తీసుకోవాలనే నీకు కోరిక ఉంటే అప్పుడే ఎందుకు తీసుకోలేదు? ఎందుకు నా లోభాన్ని పెంచావ్. ఇంత రాక్షసంగా తీసుకెళ్లటానికెందుకు నిర్ణయించావ్? నేనంత పాపమేంచేశాను! భగవాన్ నా పాపానికి నాకే శిక్ష అయినా విధించగలవాడివి, నా పాపానికి వాడికెందుకు శిక్షవేశావ్? అప్పుడుపోతే - బహుశా నీలూ పుట్టటంతో వాణ్ణి మరిచిపోగలిగేదాన్నేమో! ఒకడూ ఒక బిడ్డేకాదు. వాడికి వెయ్యిరకాల రూపాలు. వాడి లక్షరకాల హావభావాలు, మాటలు - తలపుకు వస్తున్నాయి. ఒక్కకొడుకు - వెయ్యిమంది కొడుకులతో సమానం. ఎన్ని స్మృతులు. ఎన్నెన్ని చిన్న చిన్న సంఘటనలు, ఎంత గారాబం, పెంకితనం, ఏడుపు, నవ్వు యెన్ని దృశ్యాలు ఇరవైనాలుగు గంటలూ కళ్లముందు మెదులుతున్నాయో లెక్క ఉందా? ఈ జ్ఞాపకం వచ్చేవాటినన్నిటినీ గట్టిగా పట్టుకుని పడి ఉందామనిపిస్తోంది. సాధ్యమైతే గుండెలమధ్యనే దాచుకుంటాను. బిలూనే నేనేదో గుండెలకు హత్తుకున్నట్లు, వాణ్ణి తాకుతూనే ఉన్నట్లు, శరీరం నిమురుతున్నట్లు, కావిలించుకుని ఉన్నట్లు అనిపిస్తోంది. ఏమైనాసరే విడిచిపెట్టను. తల్లి గుండెల మీదినుంచి - పిల్లవాణ్ణి లాగి విడిపించి తీసుకుని వెళ్లటం ఎవరికి సాధ్యం?

బిగ్గరగా అరుస్తూ వీరు రామాయణానికి హారతి మొదలెట్టారు. అయితే ఇంక రామాయణ పఠనం పూర్తి అవుతుంది. వీరు హారతి అనరు ఆర్తి అంటారు. ఈ సమయంలో ఎంత అరుస్తారు, జైలుకి వచ్చినప్పటి నుంచీ నిత్యమూ ముప్ఫయి రోజులు వినివిని విసుగెత్తిపోయాను.

హారతిగానం జరుగుతుంది. అన్నిమాటలూ బోధపడవు.

అరత శ్రీరామాయణ - అ జీకి
కీరతి - కవిత - లలిత - అ సియపీకి॥
గా ఉత - అ బ్రహ్మాదిక - అ మునినారద - అ
వాల్మీక విజ్ఞాన విసారద - అ
శువా సనకాది శేషా అరుసారద - అ
బరని పబన - సుతా కీరతిని - ఇ.ఇ. కీ ॥
కీరతినీకి రామా కీరతినీ - ఈ ఈ కి॥
గా ఉత - అ వేద - అ పురాణ - అ అష్టాదశ - అ
ఛయోశాస్త్ర - అ సబ - అ గ్రన్థ - అ నహకో రస - అ
మునిజన - అ ధన - అ సన్తనహకో సరబస - అ
సార - అ అంస - అ సమ్మతి సబహీ - ఈ కీ - ఈ
సామ్మతి సాబహీ కీ రామా, సామ్మతి సాబహీ - ఈ కీ - ఈ॥
అరత-అ శ్రీరామాయణ అ-జీకి కీరతి కవిత - అ
లలిత - అ సియపీకీ
గా ఉత - అన్తత - అ సమ్భూ భవా - ఆ - నీ
అరుబహ - అ సమ్భ - అ - వ - అ ముని బిజ్ఞా - నీ - ఈ
చ్నా - యా - స - అ ఆ ఆ - ఆ -ది కబి బర్ణబఖా - ఆ - నీ
కాగా భూఖణ్డి గరుడాలే హీ - ఈకీ - ఈ॥
అరత - అ శ్రీరామాయణ అజీ-కి కీర అ-తి
కవిత - అ లలిత - అ సియ పీకీ"

తర్వాత క్రొత్త స్వరం ప్రారంభమయింది -

"ఆజ - అ కథా - ఆ ఇత్నీ భ ఈ సురహూ వీర - ఆ హనుమాన్
రామ - ఆ లక్ష్మణ - ఆ సియా జానకీ - సదా - ఆ కరహు కల్యాణ"

ఈసారింక ఇల్లెగరకొడుతూ అరుపులు ప్రారంభమైనాయి.

"అయోధ్యారామ లాల్లాకీ జయ్! బృందాబన్ బిహారీలాల్‌కీ జయ్!
ఉమాపతి మహాదేబ్‌కీ జై! రమాపతి రామచంద్రాజీకీ జయ్!
ప్నాబా నా సుతా హనుమాన్‌కీ జయ్! మహాత్మాగాంధీకీ జయ్!
సర్బ - అ సన్తాన - కీ జై! జయ్ జయ్ హో ఓ ఓ ఓ ఓ..."

అందరూ రెండు చేతులతో చప్పట్లుకొట్టి నమస్కరించారు. ఇంక అందరూ లేచారు.

లూసీ జమాదారిణీ, చమ యిన్ జమాదారిణీ అందరూ రామాయణ పఠనం జరిగే చోట బయట వరండాలో కిటికీ దగ్గర - చేతులు జోడించుకుని కూర్చుంటారు.

లూసీ సా ఉతాల్ క్రిస్టియన్. కాని భగవన్నామ సమయంలో జాతి చెప్పుకోవటం ఉందా ఏం? చాలా భక్తి ఆమెకి. "ఆరత శ్రీ రామాయణజీకి, కీరత కవిత లలిత సియపీకి". ఈ పల్లవి ఆమెకి నోటికి వచ్చేసింది. 'జయ్' అనేప్పుడు ఈ పల్లవి పాడినప్పుడల్లా ఆమె కూడా బయటినుంచి, బిగ్గరగా అనకుండా మానేదికాదు. గొంతు గరుత్మంతుడి గొంతు. ఆమె అసలు పేరు సంధ్యాదేవి. రామాయణ పఠనమప్పుడు ఆమె గొంతు, అందరి గొంతుల్ని అణచి పైకి లేచేది. ఆరతిలో 'గరుడాకీ హికీ' మాట ఉన్నచోట - ఆ మాట రాగానే ఆమె గొంతు సప్తమస్థాయికి లేచేది. దానికితోడు ఆమె ముక్కుకూడా గరుత్మంతుడి పెదిమల్లా ఉంటుంది. అందుకని అందరూ ఆమెని ఎగతాళిగా 'గరుడజీ' అని పిలవటం మొదలెట్టారు. ఇప్పుడు ఇహ అందరూ ఆమె అసలుపేరు మరిచిపోవటం జరిగింది. జమాదారిణీలు కూడా ఆమెని గరుడజీ అని పిలిచేవారు. మొదట్లో ఆమె కోపం తెచ్చుకునేది. ఇప్పుడు అలవాటైపోయింది. ఒకరోజున లూసీ జమాదారిణీ గుట్టల గోదాం నుంచి గరుడజీ పేరుతో చీరె తీసుకువచ్చింది. ఆ రోజున ఎంత గొడవయింది! జైల్లో వస్తువులు తీసుకున్న తర్వాత పేరు దస్కతుచేసే పుస్తకం తీసి చూస్తే 'గరుడజీ- ఒక చీరె' అని వ్రాసి ఉంది. ఇంకెక్కడికిపోతుంది. గౌరవ మహిళామణి ఏడ్చి - మొత్తుకుని అన్నం తినటంమానేసి కూర్చుంది. జమాదారిణీ తనను అవమానం చేసిందని. జైలరుదొరకి ఉత్తరం వ్రాసి పంపించింది. అంతేకాకుండా లూసీ తక్కిన ఆడఖైదీలకు బీడీలు - అవీ అమ్ముతూ ఉంటుందని కూడా వ్రాసింది. లూసీ చాలా కంగారు పడిపోయింది. జైలరుదొర వచ్చి లూసీని గరుడజీ దగ్గర క్షమాపణ అడిగించాడు. ఆ తర్వాత ఆమె కోపం తగ్గింది. కాని ఆమెపేరు మాత్రం మారలేదు.

బిలూ చిన్నప్పుడు మాకు రామాయణం, మహాభారతం ఎన్నోసార్లు చదివి వినిపించాడు. మార్నింగ్ స్కూల్ సమయంలో వేసవి శలవుల సమయంలో మధ్యాహ్నం ఎండమాడి పోతున్నప్పుడు - టేపీ తల్లి, దుర్గ తల్లి, జితేన్ తల్లి, అక్క ఆశ్రమానికి వచ్చేవారు - బిలూ రామాయణం, మహాభారతం వినటానికి. బిలూకి రామాయణం చదవటం యిష్టం ఉండేదికాదు. వాడికి మహాభారతం చదవాలని ఉండేది కోరిక. కాని జితేన్ తల్లి, అక్క రాగానే ఒరేయ్ బీరేంద్రగారి అబ్బాయ్! మేము పుణ్యాత్ములం కాదని నీకు చెప్పాముగా! మేము కాశీ రామదాస్ (బెంగాలీలో మహాభారతం వ్రాసిన మహాకవి)ని విని తలచుకోలేదు. రామాయణం తీసుకురా. రామాయణం ఒక ప్రత్యేకమైన రకం. ఇది

మరొకరకం" అని మొదలెట్టేవారు. బిలూ, "ఉండు పెద్దమ్మా! ఇది కాస్త పూర్తిచెయ్యనీ" అనేవాడు. బిలూ - తల, శరీరం ఊపుతూ చదువుకు పోతూండేవాడు.. కాందే యాజ్ఞసేనీ తితిలొ అబనీ, నొయనేర్ నీర్ ఝురే" (శోకించెను యాజ్ఞసేని. తడిసిపోయె అవని భాష్పవారి ఝురులతో) బిలూ కళ్ల వెంబడి నీళ్లొచ్చాయి. ఈ ఘట్టం ఎప్పుడు చదివితే అప్పుడు వాడి కళ్ల వెంబడి నీళ్లొస్తాయి. వెంటనే టేపీ తల్లి ఆహా! విజయదశమినాడు పుట్టాడు కదా! అందుకని వర్షాకాలపు స్వభావం వచ్చింది అంటుంది. నిజంగా చదువుతూంటే ఎన్నిచోట్ల వాడికి కళ్లవెంట నీళ్లొచ్చేవో చెప్పలేని మేము ముసలివాళ్లం. పిల్లల తల్లులం. షష్ఠీ - మంగళవారం వ్రతాలుంటాం. ధర్మ విషయ గ్రంథాలు చదువుతూంటే, కన్నీళ్లు గుండెలమీది నుంచి పొర్లిపోవాల్సింది. అదిలేదు. ఈ పాడుకళ్లలో నీళ్లొస్తాయా? బిలూ చాటుగా ముఖం ప్రక్కకు తిప్పుకుని కళ్లనీళ్లు తుడుచుకొనటానికి ప్రయత్నించేవాడు. నీలూ రవంతదూరంలో బోర్లగా పడుకొని అంతా చూస్తుండేవాడు. వెంటనే - "అమ్మా! చూడు అన్నయ్య ఏం చేస్తున్నాడో!" అనేవాడు. జితేన్ తల్లి అక్క వాణ్ణి బెదిరించి ఆపేవాళ్లు. "మూలనున్న చిల్లికుండ నాకన్నీ తెలుసునంది అన్నట్లు నువ్వేమిటి? ఆగరా" అనేవాళ్లు. కాని నీలూని ఆపగలరా? వాడు నవ్వులతో, అరుపులతో ఇల్లెగరకొట్టేవాడు. మహాభారతం పుస్తకం నన్కూ బైండు చేయించి, స్కూలు పుస్తకాలు రిజిష్టర్లు సరఫరా చేసే అతని దగ్గర్నుంచి తీసుకొచ్చి యిచ్చాడు. అందులో మొదటిపేజీలో బిలూ చేతితో వ్రాసిన రెండు లైన్లు ఉన్నాయ్. "స్వయంగా యజమాని నుంచి అమ్మ - ఇట్లు బిలూ..." ఎంత మ్లేచ్ఛ పాండిత్యం ప్రబలింది మహాభారతం మీద! దుర్గతల్లి - "ఇహ బిలూకి పిలకపెట్టించు. మహాభారతం చదువుతున్నప్పుడు చక్కగా ఆడుతూంటుంది. రేయ్ సంక్రాంతి బ్రాహ్మడా ఊగి ఊగి మరీ పడిపోతావ్ జాగ్రత్త!" అనేది. బిలూ సిగ్గుతో వారి ముఖాలకేసి చూడగలిగేవాడు కాడు. నీలూ - ఇటు అరవటం మొదలెట్టేవాడు - "పిలక పట్టుకుని లాగి కొట్టానంటే - వర్ధమాన్‌లో పోయి పడతావ్..." జతేన్ తల్లి, అక్కకూడా - "అవును చెల్లీ! బిలూకింక వడుగుచేసెయ్" అనేవాళ్లు.

అయితే బిలూకింత పెద్దలన్నా, దేవతలన్నా ఉన్న భక్తి అంతా పెద్దవాడవటంతో హఠాత్తుగా హారతి కర్పూరంలా హరించిపోయింది. బిలూ అంతే, నీలూ కూడా అంతే కొన్నాళ్లు అసలు ఉపనయనం కాకపోతే జన్మంతా వృధా అయిపోతూంది అని బాధపడటం కూడా జరిగింది. సమయం అసమయం పాటించకుండా బిలూ - ఈ ప్రస్తావన తెచ్చి, "ఉపనయనం చెయ్యకపోవటంలో మీ ఉద్దేశం? ఉపనయనం

తొమ్మిదోయేటనే అవటం సముచితం. ఈ సంవత్సరంలో ఇంక ఒక్కటే మంచిరోజు ఉంది" అన్నాడు. ఉపనయనం అయిన తర్వాతకూడా గమనిస్తూ వచ్చాను. నియమంగా సంధ్యావందనం, గాయత్రి, పూజ, ఏకాదశి ఉపవాసాలు చేస్తుండేవాడు. చాలారోజులు భోజనం చేసేప్పుడు మాట్లాడేవాడుకాదు. బజార్లో కొన్న తినుబండారాలు తినేవాడుకాదు. ఎక్కడికి పడితే అక్కడికి భోజనానికి వెళ్ళేవాడుకాదు. ఎంత నిష్ఠ! ఎంత ఆచారం! చిన్నప్పట్నుంచీ వాడికి పూజలు, అర్చనలవైపు మొగ్గు. ఎన్నో శ్లోకాలు, స్తోత్రాలు వాడి నోటికివచ్చు. నాలుగేళ్లప్పుడు శ్రీకృష్ణాష్టోత్తర శతనామావళి, 'దేవీ సురేశ్వరీ భగవతి గంగే' గడగడ అప్పచెప్పగలిగేవాడు. అందాకా ఎందుకు - ఈ మధ్య పెద్దయ్యాక - ఉపనయనానికి ముందు సంవత్సరం - నేను వంటింట్లో ఉన్నాను. వాళ్ళు అన్నదమ్ములిద్దరూ పడకగదిలో పక్క ఒత్తుతున్నారు. ప్రక్కన బాలీసు తీసుకుని దుర్యోధనుడి ఊరుభంగం చేస్తున్నారు. ఈ లోపున హఠాత్తుగా నీలూ కేకలు విన్నాను - "అమ్మా! అమ్మా! త్వరగారా" మళ్లీ ఏమయింది? కాళ్ళు చేతులు విరిగాయా యేం? తేలు, పాము ఏమీ రాలేదుకదా! భయంతో గుండెలు దడదడలాడి చచ్చాను. పొయ్యిమీది కూర పొయ్యిమీదే ఉంది. పడుతూ, లేస్తూ వెళ్లి చూద్దునుకదా। నీలూ కదలకుండా ప్రక్కమీద కూర్చుని ఉన్నాడు. మంగలివాడి దగ్గర క్షౌరం చేయించుకొనేప్పుడు ఎలా తలవంచుకుని కూచుంటారో సరిగ్గా అలా కూచున్నాడు. బిలూ నీలూని గట్టిగా కావిలించుకుని పట్టుకుని కూచున్నాడు. ఇద్దరూ భయంతో బిగుసుకుపోయారు. బిలూ ఒక చెయ్యి గుప్పిటలాపెట్టి మోకాలిమీద ఏదో నొక్కి పట్టుకున్నాడు. నేను వెళ్లగానే చూశాను. నీలూ చేతికి పూర్ణేశ్వరి దేవి తాయెత్తు, రుద్రాక్ష, చాకుతో చెక్కిన చిన్న వేరు ముక్క కట్టి ఉండేవి. దారం తెగిపోయింది. తాయెత్తు చేతికి కట్టిలేకపోతే అడుగుకూడా కదలకూడదు. కదిలితే నీలూకి అమంగళం జరుగుతుంది అని వాళ్ళకీ తెలుసు. "అమ్మా! చప్పున ఒక దారం సరిచేసి తీసుకురా" అన్నారు. తర్వాత మళ్లీ తాయెత్తు కట్టబడింది. ఆ తర్వాత మహారధులిద్దరూ మంచం మీది నుంచి దిగారు.

ఆసారి మహాత్మాజీ పర్యటన సమయంలో సరిగ్గా మానసాహీ వంతెన మీదకు మాకారు ఎక్కింది. ఎదురుగా ఒళ్లంతా మట్టికొట్టుకున్న ఇద్దరు గోచీలు పెట్టుకున్న పిల్లలు కనిపించారు. హఠాత్తుగా మోటారుకారుని చూసి భయపడిపోయారు. ఏం చెయ్యాలో తోచక కొంచెం అటు ఇటూ పరుగెత్తటానికి ప్రయత్నించారు. తర్వాత ఇద్దరూ ఒకర్నొకరు కావిలించుకుని, దారిమధ్యలో పడిపోయారు. భగవంతుడి దయవల్ల వాళ్లు రక్షింపబడ్డారు. కాని కారుదిగి వాళ్లను లేవతీయటానికి వెళ్లేసరికి వాళ్లు భయంతో నీలంగా

మారిపోయారు. ఏమాత్రం కళ్లుతెరచి చూడలేదు. బిలూ, నీలూ అన్నదమ్ములిద్దరి సంగతి గుర్తుకొచ్చి అప్పుడు నా కళ్ళనిండా నీళ్లు తిరిగాయి. వాళ్లను యింటికి తీసుకెళ్లి దిగబెట్టాక మనస్సు కాస్త శాంతించింది. కాస్త అయితే ఇంకేం జరిగిపోయేదో కదా! ఆ తరువాత యెప్పుడైనా కానీ బిలూ - నీలూల సంగతి ఒక్కసారిగా తలపుకివస్తే - ఈ నిస్సహాయులైన మట్టికొట్టుకున్న పిల్లల రూపాలు కళ్లమందు మెదులుతూంటాయ్... భగవాన్! బిలూ-నీలూలకు నీమీద యింత విశ్వాసం ఉండేది, ఆ విశ్వాసాన్ని యెందుకు లాక్కున్నావ్? బిలూ మొట్టమొదటిసారిగా ఆశ్రమంలో సాంధ్యకీర్తన సమయంలో రానిరోజున వాడికి తలనొప్పిగా ఏమైనా ఉందేమో అనుకున్నాను. అడిగితే ఒంట్లో బాగానే ఉందన్నాడు. ఒంటిమీద చెయ్యివేసి చూశాను జ్వరం-గిరం ఏంలేదు. అయితే ఏమయింది? తర్వాత తెలుసుకున్నప్పుడు - గుండెలు కొట్టుకున్నాను. బిలూయే ఇలా అయితే ఇంక ప్రపంచంలో అన్నీ సంభవమే. ఇది నీలూ జంధ్యం తీసిపారెయ్యటమంత-ఎగరగొట్టి పారెయ్యవలసిన సంగతికాదు. నీలూ అంటే యుక్తా యుక్త జ్ఞానం లేనివాడు. వాడి ఖయాళీయే వాడిది. వాడి బుర్ర వేడెక్కటం చూస్తే నాలో నేను నవ్వుకుంటాను. వారు బెదిరించటానికి వస్తారు. "రేయ్! నేను నీ కడుపున పుట్టలేదురా! నువ్వు నా కడుపున పుట్టావ్. నీ గుట్టుమట్లు నాకు తెలియకపోతే ఎవరికి తెలుస్తాయి? ఇవాళ కోపం తెచ్చుకుంటావ్. కాని మళ్లీ తెల్లారేసరికి నీ కోపం కాస్తా చల్లారిపోతుంది. చిన్నప్పట్నుంచీ నీ పెంకితనం చూస్తున్నాను. చిన్నప్పుడు మరమరాలకొట్లో పారేసిన కాగితం మీద కాలుపడినా, నీలు కళ్లకి అద్దుకునేవాడు. పొరపాటున పంచాంగాన్ని ఉల్లంఘించి మొహం ముడుచుకునే వాడివి నాదగ్గర కొచ్చి వాడి పాపాలు చెపుతావ్." తెలియకచేస్తే పాపంకాదని నాచేత చెప్పించాలని అనుకునేవాడు. ఒకరోజున నేను వంటింట్లో పని పూర్తిచేసుకుని, రాత్రి సోడావేసి.

ఈ సమయంలో "అమ్మా! చూడు నీలూ చేస్తున్నపని" అని పిలిచాడు. పిల్లల పరీక్షలయిపోయాయి. చదువు గిదువు బెడదేంలేదు. వెళ్లిచూస్తే ఫ్రేమ్ కట్టించిన సరస్వతీదేవి పటం క్రిందపెట్టి దానిమీద నీలూ యింట్లో ఉన్న చెప్పులన్నీ తెచ్చి పెట్టాడు. నేను తెల్లబోయాను. నీలూ ఎప్పుడైనా ఇలాంటి పని చెయ్యగలుగుతాడా? వాడు పరీక్షల కెళ్ళేప్పుడు ప్రతిరోజూ నాకు నమస్కరించటానికి ముందు సరస్వతి పటానికి నమస్కరించేవాడు. ఈ పటానికి ప్రతియేడూ సరస్వతీ పూజ రోజున పూజ జరిగేది. ఇప్పటికీ గంధపు బొట్లున్నాయ్. "ఓరి దయ్యమా? నీకు ఈ దుర్బుద్ధి ఎందుకు పుట్టింది?" "ఛాడివాళ లెక్కల్లో తప్పాడు. కోపంతో ఈ పనిచేస్తున్నాడు" అని బిలూ

చెప్పాడు. "ఎంత ముక్కోపి బిడ్డబాబూ! లెక్కల్లో తప్పితే ఈ అఘాయిత్యం చెయ్యటం దేనికి? చదవలేదు, చెయ్యలేదు, సంవత్సరం పొడుగునా ఆటలాడుతూ తిరిగావ్ లెక్కల్లో తప్పవూ? వాడి దగ్గర కూర్చుని కాస్త లెక్కలూ అవీ చెప్పించుకో అని ఎన్నిసార్లు చెప్పాను!" అన్నాను. "చదివే కనుక ప్యాస్ అవాలంటే - సరస్వతీదేవిని ముఖస్తుతి చెయ్యటం దేనికి? చదవని కుర్రవాణ్ణే ప్యాస్ చేయించలేకపోతే ఇంక దేవత ఏముంది?" అని జవాబు చెప్పాడు. పిల్లవాడు ముడుచుకుపోయి, మూలకెళ్లి కూర్చుందాం రండి అన్నాడు. బిలూ అప్పడిహ ఆ చెప్పలన్నీ తీసేసి, గంగనీళ్లు చల్లి పటాన్ని మళ్లీ గోడకి తగిలించాడు. నేను అయిదు పైసలు సరస్వతి పటానికి తాకించి ఈ అప్రాజ్ఞుడికి కోపం తగ్గితే పూజ చేయిస్తానని మ్రొక్కుకున్నాను. నీలూ ఈ ఖయ్యాళీ పనులు పట్టించుకోవలసినవి కావు కాని బిలూ కీర్తనలకి రాకపోవటం, దేవ - ద్విజుల మీద భక్తి తుడిచి వేసుకోవటం నాకు నిజంగా దిగులు పుట్టించాయి. బిలూకి దేవుడిమీద విశ్వాసం ఉంది. చిన్నప్పుడు లక్ష్మీ పూజ రోజున వాడి ఆటబొమ్మలమీద నాచేత లక్ష్మీపాదాల పారాణి రాయించేవాడు. లేకపోతే చాలా బొమ్మలెలా వస్తాయి? అలాంటి బిలూ - నా కళ్లముందరే ఇలా అయ్యాడా? నేను ఇరవైనాలుగు గంటలూ భగవంతుడి దగ్గర "బిలూని నువ్వేమిటిలా చేశావ్?" అని మొరపెట్టుకునేదాన్ని. వాడి తండ్రి చెవిన ఈ సంగతి పడకుండా ఉండటం కోసం ప్రయత్నించేదాన్ని. కాని ఆ కొడుకు కీర్తనకు రావటంలేదు. ఈ సంగతి ఎన్నాళ్లని దాచి ఉంచగలం? నేను చాటుగా బిలూ త్రాగే మంచినీళ్లలో పూర్ణేశ్వరీదేవి చరణామృతాన్ని కలిపేదాన్ని. "మాతా పూర్ణేశ్వరీ! నాబిడ్డ అపరాధాన్ని పట్టించుకోవద్దు" అని ప్రార్థించేదాన్ని... ఆయన అదేం మనిషి! మీరు వాళ్ల తండ్రి. వాళ్లేదయినా పొరపాట్లు, తప్పలు చేసినప్పడు మీరు కాస్త నచ్చచెప్పవచ్చు కదా! మీరు నచ్చచెప్పటం ముందు వాళ్ల బడాయిలేవీ చెల్లవు. కాని అయన నోరు విప్పి ఏమీ చెప్పేవారుకాదు. పిల్లల మంచి చెడులు దిద్దటం నా ఒక్కదాని బాధ్యత అయినట్లు.. ఆయన అదోరకం మనిషి.

... అమ్మో! మళ్లీ అందరూ వచ్చారు వేధించటానికి. ఇప్పుడు జనాన్ని చూస్తే నా ఒళ్లు మండుతుంది. ఈ సంగతి వీళ్లకెలా చెప్పను? ఎలా బోధించను...

కామ్లాదేవి వచ్చి నా నాడి నొక్కిపట్టుకుంది. ఆమెకి నాడి చూడటం ఎంత తెలుసో నాకది పూర్తిగా తెలుసు. భర్త డిస్ట్రిక్ట్ బోర్డ్ డాక్టరు. ప్రతి పనిలో, మాటలో ఆమె తనకి కూడా కాస్త డాక్టరీ తెలుసు అన్న భావాన్ని చూపించేది. వృథాగా ఈ గర్వం దేనికి? వారు కూడా మాష్టరు. నేను ఎప్పుడూ ఒక్క రోజునకూడా - వారి భార్యను కదా అని నేనూ పండితురాలినేనని భావించలేదు.

"ఇప్పుడెలా ఉంది?" అని కామ్లాదేవి అడిగింది. కోపంతో నాకు నఖశిఖ పర్యంతం మండిపోతోంది. నాకోసం మీరెంత కంగారుగా ఉన్నారో తెలుసు. అయినా మళ్లీ ఈ ఆడంబరం దేనికి? ఒళ్లు మండిపోతున్న కోపంతో "మీరే మనుకుంటున్నారో దానికింకా వ్యవధి చాలా ఉంది. అందర్నీ ఇక్కడ వదిలి ఉంచేసి, నామటుకు నేను హాయిగా స్వర్గానికి వెళ్లేంత అదృష్టంతో పుట్టానా నేను! మొత్తం కుటుంబాన్నంతా మ్రింగి కాని నేను భూమ్మీద నుంచి పోను" అన్నాను.

కామ్లాదేవికి కోపం వచ్చేసింది. ఆమె చెయ్యి వేరయింది. నా చెయ్యి టప్‌మని పక్కమీద పడింది. చెయ్యి విపరీతంగా లాగటం మొదలెట్టింది. ఉష్! చచ్చిపోతున్నా, ఎంత బాధగా ఉంది చెయ్యి! తలమీద, ఎడమచెవి వెనక ప్రక్క, తల లోపల మొద్దుబారి పోతున్నట్లు అనిపించసాగింది. తలగడ మీదనుంచి తల పైకి ఎత్తేసరికి మెడ ఒక వైపు వ్రేల్లాడి పోతున్నట్లయి మళ్లీ తలగడ మీద పడిపోయింది. చెవుల్లో జుం జుం మని తుమ్మెద రొదలాగా ఇరవైనాలుగు గంటలూ ఒకటే ధ్వని... మా బాగా అన్నాను కామ్లాదేవిని. ఆ పెద్దరికపు బడాయిలు రామాయణం జట్టు వారిలో ఫలింపచేసుకో - వారు మీ మాటలన్నీ ఊరికే వినటమేకాదు. ఆశ్చర్యపోతారు. వారిలో కొంతమంది కసలు ఏమీ తెలియవు, కొందరికి అర్థంకావు. ఆ రోజున అనసూయాజీకి టీ చేసి యిచ్చాను "జలుబు చేసింది. కాస్త అల్లం ఉప్పువేసి టీ చేసి యిస్తారా?" అన్నది. తీసుకోవటం తన లోటాతోనే తీసుకుంది టీ. తర్వాత లోటా నోటికి తాకనీయకుండా పైకియెత్తి టీ గడ గడా నోట్లో పోసుకుంది. ఎక్కడికి పోతుంది? నాలిక పెదిమలు కాలిపోయాయి. చేసి ఇచ్చిన టీ సరిగ్గా త్రాగటం చేతకాదు. పైగా పెద్ద అన్నీ తెలిసినట్టు బడాయి. ఆ జట్టులో అందరూ ఒకటే. మరొక ఆమె సరళాదేవి - ఆమెకి కూడా కాస్తయినా బుద్ధి-శుద్ధి ఉంటేనా! ఆమె పుట్టిల్లు రూపోలీ ఠాణాకు చెందిన బుడ్‌హియాథన్ కట్టా గ్రామం... ఊరు చాలా పెద్దదిట. ఎంత పెద్దదో ఆ రోజున వివరించి చెబుతూ - ఊళ్ళోకి జడ్జిగారి ఉత్తర్వులు, పోలీసు సబ్ ఇన్‌స్పెక్టర్, శానిటరీ ఇన్‌స్పెక్టరు రోజూ వస్తూ పోతూంటారుట. ఇంత వృద్ధిలోకి వస్తున్న గ్రామంలో - గ్రామంలో కుక్కలు కూడా ఇవన్నీ చూసి అలవాటుపడ్డాయి. హాఫ్ ప్యాంట్ వేసుకున్న వ్యక్తులు చూస్తే వారు పిలవనుకూడా పిలవరా? నమస్కారాలు మీ ఊరుకి. నమస్కారాలు మీ బుద్ధికి. ఇలాంటి వాటి అన్నిటిలో కామ్లాదేవి పెద్దరికపు బడాయిలు పోతుంది. ముఠా యేర్పాటు చేస్తుంది. కామ్లాదేవి అసెంబ్లీ మెంబరుకదా! ఇంగ్లీషురాదు, చెయ్యి ఎలా యెత్తాలో తప్ప. అక్కడ తక్కిన వ్యవహారాలు ఎలా జరపాలో అదీ

తెలియదు. ఆరోజున నర్మదా బహిన్ నాతో - కామ్లాదేవి! బీహారులో చదువుకున్న స్త్రీలెవరూ కాంగ్రెసులోకి రాకుండా ఉండాలని కోరుతుంది. వారు కనుకవస్తే తన అడుగు వెనకపడుతుంది కదా! అందుకని ఈ అమాయకురాంద్రనందర్నీ పోగుచేస్తూంటుంది - అని చెప్పింది. బహుశా నిజమే అయి ఉంటుంది. ఆమె విదేశీ టిన్‌మిల్క్‌ను "దొరసాని పాలు" అంటుంది. టిన్నుల్లో వచ్చే వెన్నని యిక్కడ ఎవర్నీ తిననీయదు. అందులో కోడిగుడ్డు కలిపారు అంటుంది. లేకపోతే వెన్న ఎప్పుడైనా పసుపుపచ్చగా వస్తుందా? ఆమెతో ఎవరు వృథా వాదన చెయ్యగలరు?

... ఇదేమిటి? కామ్లాదేవి ఎక్కెక్కి యేడుస్తోంది. ఛీ! నేనెంత పనిచేశాను! లేచి కూర్చుని కామ్లాదేవి చెయ్యి పట్టుకున్నాను...

"కామ్లా, నేను మీ అమ్మ వయసుదాన్ని. పొరపాటైపోయింది. మనస్సులో యేమీ అనుకోకు. ఇప్పుడు నేను నేనుగా ఉన్నానా? ఇప్పుడు నా మనస్సు సరిగ్గాలేదు. ఒకటి అనబోయి ఒకటి అనేశాను" ఆమె తల నిమిరాను. ఆమె కన్నీళ్లు తుడుచుకుని, ముఖంలో నవ్వు తెచ్చుకోటానికి ప్రయత్నించింది.

"నన్ను క్షమించవా?" అని అడిగాను.

"ఏమిటండీ ఆ మాటలు? ఇంక మీరు పడుకోండి."

అని బలవంతంగా నన్ను పక్కమీద పడుకోపెట్టింది. నామీద సానుభూతి, అపేక్ష - ఆమె ముఖంలో కళ్లలో స్పష్టంగా వెల్లడవుతోంది. సరిగ్గా కూతురు తల్లికి సేవ చేస్తున్నట్లనిపించింది. నాకు కూతుళ్లు లేరుకదా - నాకు ఉన్నదల్లా బిలూ - నీలూ యిద్దరే. ఒక్కకూతురుకూడా ఉంటే! కూతురుండాలనే కోరిక కొడుకుల వల్ల తీరుతుందా? కూతురు సంగతి తలపుకి వచ్చినప్పుడల్లా బిలూ నా కూతురు, నీలూ నా కొడుకు అనిపిస్తుంది. బిలూ స్వభావం ఆడపిల్లల స్వభావంలా మెత్తన. వాడి పనులు సానుభూతితో నిండి ఉంటాయి. ఆడవాళ్లలాగా వాడికి సహించే ఓర్పు ఉంది. అలాగే వాడికళ్లలో కొంచెం నీళ్లు వస్తాయి. ఇదే చూడరాదూ, కామ్లాదేవినంత కటువైన మాటలన్నానా - వాడు రవంత కోపం తెచ్చుకున్నాడా? వాడు నన్ను ఎదురుతిరిగి అనగలడు. వాడి నోరేం తక్కువకాదు. ఆరోజున ఆహారవస్తువుల గోదాము అసిస్టెంట్ జైలర్‌ను ఏడిపించి విడిచిపెట్టాడు... ఈ గదిలో అందరూ నన్ను యెంత అపేక్షగా చూస్తారు. నా కోసం యెంత దిగులు పడతారు! నాకు ఎంత సేవచేస్తారు! ఇహ నేను వారి నోటికి కళ్లెంవేసి, మంచిచెడు అన్నీ అనేస్తాను. నేనిలా ఉండేదాన్నికాదు. నాకు జీవితంలో ఎవరితోనూ తగవురాలేదు. జైల్లో ఏమిటో నా స్వభావం మారిపోయింది.

ఇప్పుడింక నా నోటికి, మనస్సుకి హద్దు అనేది లేదు... కామ్లా నాకు విసురుతోంది.

"చెరుకు షర్బత్ కొంచెం తాగరాదూ? కాస్త ఇస్తాను" అన్నదామె. "వద్దు" - కొంచెం తీయగా మాట్లాడానుగా! మళ్లీ నెత్తినెక్కి కూర్చుంది. వీళ్లను పెట్టుకుని ఏమిటి చెయ్యటమో తోచలేదు. ఆకలేస్తే నేనే మింగుతాను. అప్పుడు ఎవరి ముఖప్రీతి మాటలూ అవసరంలేదు. మొన్న డాక్టరు-ఇరవై నాలుగు గంటలూ నాపక్క ప్రక్కన ఏదో ఒక తినుబండారం పెట్టి ఉంచమని, ఎప్పుడు తినాలని బుద్ధిపుడుతుందో చెప్పలేము అని చెప్పి వెళ్లాడని లూసీ జమాదారిణి చెప్పింది. వీళ్ల ధోరణి చూస్తూంటే నవ్వూ వస్తుంది. ఏడుపూ వస్తుంది. ఇదేమయినా హారిన్ మఘాయి యాడోమిన్ నిరశన వ్రతమా యేం? మేము బ్రాహ్మణ కుటుంబాల్లో వ్రతాలు - నోములు చేసే ఆడవాళ్లం. ఒకటి రెండురోజులు ఉపవాసాలు మా శరీరాలకు పడతాయి.

ఢంగ్ ఢంగ్‌మని వార్డరు గంట కొట్టాడు. ఇంత రాత్రి మళ్లీ ఎవరొచ్చారు? గది తలుపు తాళంవేసి, జమాదారిణి గోడప్రక్క జైలర్‌సాబ్ దగ్గిర తాళంచెవి పెడుతుంది. మా వార్డు బయట గేట్ ఇరవై నాలుగు గంటలూ - లోపలినుంచి గడియ వేసే ఉంటుంది. ఎవరితోనయినా ఏదైనా చెప్పాలంటే బయటినుంచి త్రాడులాగితే లోపల గంట మ్రోగుతుంది. అదిగో లూసీ ఎవరితోనో ఏదో మాట్లాడుతుంది. మళ్లీ గొడవ - గిడవ యేదైనా జరిగిందాయేం? లూసి మాత్రం తక్కువదా? రోజల్లా ఊరికే పనిలేకుండా బయట బయటనే తిరుగుతుంది. దేశంలోని వార్డర్లందరితోనూ మాట్లాడుతుంది. అది చూసి, 'నీకు కొంచెం కూర వండి యిస్తాను. బిలూకి యిచ్చిరాగలవా?' అని అడిగాను. వెంటనే కళ్లూ - ముఖం యింతింతచేసుకుని అమ్మో! అదెలా వీలవుతుంది? సెల్‌లోకి ఏ వస్తువైనా పంపటానికి ఆస్కారం ఉందా? అక్కడ ఇరవై నాలుగుగంటలూ గట్టి పహరా ఏర్పాటుంది. అక్కడకెడితే ఇంక నా ఉద్యోగం ఉంటుందా? అన్నది. అరే! నా ధర్మపుత్రుడు యుధిష్ఠరుడే. ఎన్నాళ్లో అయింది బిడ్డ తిండితిని. ఇప్పుడు చెపుతావా దయ్యమా! నువ్వు వార్డర్ల భయంతో వణకిపోతున్నావా ఏం? రాత్రింబగళ్లు వాళ్లతో కబుర్లు నవ్వులు సాగిస్తూనే ఉంటావుగా! ఏదో ఒక్కపని సంగతి చెబితే దానికి ఎనభై సాకులా? అరె! నువ్వూ పిల్లలు గల తల్లివి. నువ్వే నామాట గ్రహించనప్పుడు మరెవరైనా గ్రహించకపోతే వాళ్లను తప్పు ఎలా పడతాం. భగవంతుడు నీకు నా అదృష్టంలాంటిది పట్టకుండా చెయ్యాలనే కోరుకుంటాను. కాని ఒకవేళ కనుక వచ్చేట్టయితే అప్పుడు తెలుసుకుంటావ్. మొన్న మళ్లీ ముప్పయి రెండు పళ్లూ బయటపెట్టుకుని నా దగ్గిరకొచ్చి, మీ బిడ్డకివాళ వేరుగా వండి, ఉర్లగడ్డలకూర తినటానికి యిచ్చాను అని

చెప్పింది. నిజంగా విలువైన మాటే. ఎంత గొప్ప విలువైన వస్తువు యిచ్చింది. ప్రభుత్వం ఏకంగా భాండారం ఎత్తేసి, దానసత్రం పెట్టారా! ఆ మాట చెప్పటానికి వచ్చి మళ్లీ ఆమె ఆనందంతో విగళితురాలయింది...

గుమ్మం బయట నుంచి లూసీ కేకేసింది "కామ్లాదేవీ!" "ఏవి(టే? ఎవరొచ్చారే?" "రాత్రి డాక్టరుబాబు బెంగాలీ అమ్మగారెలా ఉంది? అని అడిగారు. మరీ హడావిడి అదీ ఏమైనా చేస్తే హాస్పిటల్‌లో తనకి కబురు చెయ్యమన్నారు. తెలివితప్పి పడిపోతే ఆకుపచ్చసీసా వాసన చూపించమన్నారు. మన్‌చనియా గలకట్టిలకు చెప్పి ఉంచు. ఇద్దరూ కలిసి పడుకుని నిద్రపోతున్నారాయేం?"

ఎంత సానుభూతి! డాక్టరెలాంటివాడో - అలాంటిదే లూసీ జమాదారిణీకూడా. మిమ్మల్ని నేను ఎరగనా? మిమ్మల్నందర్ని నేను అణువణువునా పూర్తిగా ఎరుగుదును. మీరు పైన ఒకరకం, మనసులో ఒకరకం. పైనుంచి క్రిందివరకు అందరూ ఒకటే. సబ్ ఇన్‌స్పెక్టర్ని చూడరాదూ! బిలూ నాన్నగారిని అరెస్టు చేసినరోజున - జిల్లా కాంగ్రెసు ఆఫీసు కూడా తాళాలు వేశారు. నాతో మాత్రం - "అమ్మా! మీరు మీ యింట్లోనే ఉండొచ్చు. దాన్ని గవర్నమెంట్ దఖలు పరచుకోలేదు. జిల్లా కాంగ్రెసు ఆఫీసు మాత్రం జప్తు చేయబడింది" అని చెప్పాడు. అమ్మో మూడు నాలుగు రోజుల తర్వాత వచ్చి నన్ను అరెస్ట్‌చేసి ఠాణాకి తీసుకెళ్ళారు. "మాష్టరుగారిలాగే మిమ్మల్నికూడ కస్టడీలో ఉంచుతారు" అని చెప్పాడు. ఠాణాకు తీసుకుని వచ్చాక ఎంత మర్యాద! ఇన్‌స్పెక్టర్ క్వార్టర్స్‌లో ఇన్‌స్పెక్టరు భార్య నాకు జపానికి, పూజకి ఏర్పాటు చేసింది. భార్య - భర్త యిద్దరూ అమ్మ! అమ్మ! అంటూ యెంత ఇదయారు. చాలా ఉత్తమురాలైన భార్య. బిడ్డను ఒళ్లోపెట్టుకుని, "మాబిడ్డ పదికాలాలపాటు బ్రతికి బట్టకట్టాలని మీరు ఆశీర్వదించండి. దేశంలోని తిట్లూ - శాపనార్థాలు అన్నీ చుట్టుకునే నౌకరీ. మీరు నిండు మనస్సుతో దీవించండి... వీడి తర్వాత యిద్దరు బిడ్డలు ఒడి జారిపోయారు." అన్నది. 'షష్టీ షష్టీ' ఆపద నామీదుగా పోనియ్ - (బెంగాల్‌లో బిడ్డల శుభాన్ని కాంక్షిస్తూ - తల్లులు సంప్రదాయంగా అనుకునే మాట షష్టీ - అంటే షష్టీదేవత) నాకు పిల్లా పాపాలేరూ! మంచి వారెవరైనా శాపమిస్తారా? ఆ బిడ్డ మీ వంశంపేరు ప్రతిష్టలను ప్రకాశవంతం చేస్తాడు. ఇక్కడుండే బరహమ్‌ఖాన్ తెలుసుగా! పూర్ణేశ్వరి మందిరం దగ్గర చాలా శక్తిగల దైవం. అక్కడ చెట్టుకి మీ పేరుతో రాయి (ముడుపు) కట్టించు.. అన్నాను. పోనియ్ ఆ పర్వం పూర్తి అయిపోయింది. జైలుకి వచ్చాక ఇన్‌స్పెక్టరు సర్కార్ వారు జప్తుచేసిన జిల్లా కాంగ్రెసు ఆఫీసునుంచి గవర్నమెంట్‌ను త్రోసివేసి - నేను అక్కడ

అనధికార ప్రవేశం చేశాను అని రిపోర్టు చేశాడట! అందుకని నామీద కేసు నడపబడుతుందిట! అచ్ఛా చూడు - ఏం పని అది! ఆకాశంలో చంద్ర సూర్యులుండ గానే ఇంత పచ్చి అబద్ధమా! ఇన్‌స్పెక్టరుగారు స్వయంగానే నాతో "మా యింట్లో ఉంటే మాకేం నష్టంలేదు. అటు గవర్నమెంట్ దఖలు చేసుకోలేదు. మళ్ళీ చూడండి తానే నాలుగయిదు కల్పించి కేసు బనాయించాడు...

జైల్లో డాక్టరుకూడా ఈ ఇన్‌స్పెక్టర్‌లాంటివాడే. ఖైదీకి ఎర్రనీళ్ళు, పచ్చనీళ్ళు పోసి నయం చెయ్యటం తర్వాత వారిని ఉరి త్రాటిలో ఊగించటానికి సరిగ్గా ముసల్మాను కోడిని పోషించినట్లే. మళ్ళీ అమ్మ అని పిలుస్తూ వస్తాడు. ఎవరైనా అమ్మ అని పిలిస్తే మనస్సు ఎంతగా కరిగిపోతుందంటే అప్పుడిహ నిజాల్ని నిర్మొహమాటంగా అడిగేసి, శరీరంలోని ఉత్తేజనను పోగొట్టుకునే అవకాశంకూడా ఉండదు. నేను దేశంలో అందరికీ అమ్మనే. జిల్లా కాంగ్రెసు కార్యకర్తలందరికీ అమ్మనే. నాకు లోకంలో వారందరూ బిడ్డలే. కాని మనస్సు బిలూ, నీలూల మీదనే ఉంటుంది. వీళ్ళిద్దరికీ తప్ప మరొక బిడ్డలెవరికీ అమ్మని కావాలని కోరుకోను. వీళ్ళిద్దరినే నేను ప్రాణప్రదంగా ప్రేమించలేకపోయాను. కాకపోతే నా బిలూ ఇంత ప్రేమకోసం వెంపరలాడతాడా? కాకపోతే జితేన్ తల్లిని, అక్కనీ అమ్మ అని పిలిచేవాడేనా? లేకపోతే నీలూ వాడు, పెద్దమ్మ పెద్దమ్మ అని అంత ఇదవుతాడా? బిలూని నీలూని పూర్తిగా నావాళ్ళని చేసుకోవాలని, వాళ్ళమీద ఎవరికీ ఎలాంటి హక్కులేకుండా ఉండాలని నాకోరిక. కాని నేను వాళ్ళను గట్టిగా కావిలించుకుని పట్టుకుంటే ఏమయినట్టు? దేశంలో అందరికీ వాళ్ళు కావాలి. అందరికీ వాళ్లమీదే ఆకర్షణ. నేను వాళ్ళను పట్టుకుని ఉంచగలనా? ఉత్తనే బిలూ చాలా అభిమానం కలవాడు. వాణ్ణి "ఏరా" అని చనువుగా పిలవకపోతే చాలు కళ్ళు చెమ్మగిల్లుతాయ్! ఆయన ఒకనాడు మధ్యాహ్నం భోజనంచేస్తూ పెదబాబు ఇంట్లో ఉన్నట్లులేడే! ఇంకా రాలేదనుకుంటాను అన్నారు. బిలూ యింట్లోనే ఉన్నాడు. ఈ మాటవిని వాడు అభిమానంతో కంట తడి పెట్టుకున్నాడు. నీలూ అయినట్లయితే సంతోషంతో కేకలు పెడుతూ ఇల్లెగర కొట్టేవాడే.. అక్కా! నీకు జితేన్, ధీరేన్, హేబలూ, బేలా, కోడళ్ళు, మనుమలు, మనుమరాళ్లు అందరూ ఉన్నారు. నీది వృద్ధిలోకి వస్తున్న కలకల్లాడుతున్న సంసారం. ఏవిధమైన లోటూ లేదు నీకు. నువ్వు బిలూని నాదగ్గిర్నుంచి లాక్కోవటం ఎందుకు? ఎందుకు నాకు పరాయివాణ్ణి చేస్తావ్? నా బిడ్డలో రవంతభాగం కూడా నేనెవ్వరికీ ఇవ్వను. నాకు సంసారం, బిలూ, నీలూ తప్ప ఏమీలేదు. నాకు యిల్లులేదు, వాకిలి లేదు. తలదాచుకునేందుకు రవంత చోటుకూడాలేదు. డబ్బా -

దస్కంలేదు. అస్తి, ఐశ్వర్యంలేవు. నేను బిడ్డల మొహాలు చూసుకునే అన్ని కష్టాలూ మరిచిపోతున్నా. అదే నువ్వు ఓర్చలేవా. భగవాన్! బిడ్డల్ని మరపించే మంత్రంతో అందరూ నా బిడ్డను పరాయివాణ్ణి చేశారు... జితేన్ తల్లిని అక్కని చూస్తే పైకి మంచివాళ్లలాగానే అనిపిస్తారు. కాని మనస్సులు మాత్రం ఏమిటో జిలేబీ మెలికలు. ఇంకొక యింట్లో వాళ్లెవరైనా ఒక వస్తువు చేయించుకుంటే దాన్ని పరిశీలనగా చూస్తు రకరకాలుగా పెట్టి చూస్తారు.

అన్ని సంగతులూ వారికవసరం. బంగారంలో ఏదో కల్తీ కలిసినట్లు కనిపిస్తోందే! ఎంత తరుగు తీసేశాడు! ఎవరిచేత చేయించారు. ఎన్నికాసులు ఎత్తు? మజూరీ తక్కువ యిస్తే చేత ఎందుకు బావుంటుంది? బిలూ, నీలూల దగ్గిర్నుంచి మా సంసారంలో సంగతులన్నీ అడిగి తెలుసుకోవాలని చూస్తుంది. మీ అమ్మ నూనెతో మసాలాలు వేయిస్తుందా. నేతితో వేయిస్తుందా? మీ అమ్మ బాగా నూనెలో వంకాయలు వేయిస్తుందా లేక మామూలుగా పోపులో వేస్తుందా? ఇలాంటి సంగతులన్నీ చిన్నప్పుడు నీలూని బిలూని అడిగేది. సరే కాని ఈ సంగతులు నీకేం అవసరం చెప్పు? బిలూ అంటే గుంభన. ఎప్పుడూ యేమీ చెప్పడు. కాని నీలూ మళ్లీ నా దగ్గిరకొచ్చి ఈ సంగతులన్నీ అనుకరిస్తూ చెప్పేవాడు. సరిగ్గా అక్క గొంతులాంటి గొంతు, చేష్టలు, తీరు... అనుకరించేవాడు. వింటూంటే పొట్ట చెక్కలయ్యే నవ్వొచ్చేది. కాని అక్కకిది న్యాయమేనా? మాది లేని సంసారం. మీరు ఆత్మీయులు. వీటిని గురించి ఆలోచనలు చర్చ అవసరం ఏముంది? మళ్లీ యిటు - అక్క మాకు చాలా చేసేది. ఆ మాట నేను కాదనను. ఏదయినా సుస్తీచేసినా, జబ్బుచేసినా కనిపెట్టి ఉండటం - ఏదో పండగ పబ్బం సాకుతో పిలిచి భోజనాలు పెట్టడం వీటికి లెక్కలేదు. నీలూ ఇప్పటికీ అక్కడే ఉంటున్నాడు. ఎంతో మనస్ఫూర్తిగానే చేస్తుంది. కాని, వాళ్ళకి చాలా చేశాను అని పదిమందికి చెప్పకుండా విడిచిపెట్టదు. అక్క స్వభావమే అంత. గంభీరతనేది కాస్త కూడా లేదు. ఒట్టి భోళా మనిషి. బిలూని వీరేంద్రగారబ్బాయ్ అనేది. నీలూని 'మాఛ్ పాత్రీ' అని, ఇహ వాళ్ళనాన్నను 'గడ్డం' అని అనేది. పాడుపులు మాని మామూలుగా పేరుపెట్టి పిలిస్తే ఏం పోతుంది? మనిషి మొహం చూస్తే మా కాలంలో నాటి దీపపుబుడ్డిలా ఉంటుంది. పుచ్చకాయ గింజల్లాగ నల్లటిపళ్లు, గుప్పెడు జరదా బుగ్గనుపెట్టుకుని ఇరవైనాల్గు గంటలూ నములుతూ ఉమ్మలేస్తూంటుంది. బ్రాహ్మణ పురోహితులింటి బిడ్డ. నైవేద్యం అన్నం, అరటికాయలు తిని పెరిగినది చిన్నప్పుడు... పురోహితుడికి వచ్చే, యెఱ్ఱ అంచుబట్టలు తప్ప పన్నెండేళ్ల వరకు మరొక గుడ్డ కట్టి యెరగదు. కలవారింటి పెళ్ళి

అయిందికదా అని వేరు అయిపోయింది. అదికాదు, ఇప్పుడు గర్వంతో కాలు నేలమీద మోపదు. నీకు భగవంతుడిచ్చాడు ఉన్నది నీకు. అలా అని లేనివాళ్ళను కూడా కాస్త మనుష్యులేనని భావించు. నేనయినా మరీ లేని యింట్లో పుట్టినదాన్నికాను. మరీ లేని వారిచేతుల్లోనూ పడలేదు. కాని నా కర్మఫలం బంగారం గుప్పిట పట్టుకున్నా మట్టి అవుతుంది... అవును అక్కా! బిలూ నిన్ను పెద్దమ్మా అని పిలిస్తే అది నీ మనస్సుకి తృప్తిగా లేదెందుకని? కాదు అక్కా! నిజం చెపుతున్నా, నీమీద నాకు రవంతకూడా కోపంలేదు. మీరున్నారు కనుకనే బిలూ-నీలూల జీవితంలో కొన్ని కోరికలు, సరదాలు తీరగలిగాయి. వారు జైలుకి వెళ్లినప్పుడు వాళ్లకు నుంచోడానికి చోటులేకపోయింది. అప్పుడు నువ్వే వాళ్లకి ఉండటానికి చోటు యిచ్చావు. బిలూ పోతే నీకు నాకంటె తక్కువ దుఃఖం కలుగుతుందా! అది నాకు మాత్రం తెలియదూ? అంతఃకరణశుద్ధిగా బిలూని నీకు కనుక యివ్వగలిగితే నువ్వు బిలూని బ్రతికించగలవా? నా బిలూ బ్రతకాలి. ఇహ వాణ్ణి నీ చేతుల్లో పెట్టటానికి లోభిత్వం చూపను. ఇప్పుడు నీకూ బిలూ స్మృతులు కొన్ని మిగులుతాయి, నాకు అంతే. వాటిని తలపుకు తెచ్చుకుంటూ నెమరేసుకుంటూనే ఇప్పుడు జీవితాన్ని వెళ్లపుచ్చాలి. కాదు అక్కా! నీ దయనీ, నీ మమకారాన్నీ నేనెన్నటికీ మరచిపోలేను. నా బిడ్డలికి చేపలు తినటమంటే యెంతో యిష్టం. కాని ఆశ్రమంలో చేపలు వండటానికి వీల్లేదు. మేము ముసలివాళ్లం. గాంధీజీ సిద్ధాంతం ప్రకారం ఇరవై యేళ్లనుంచి మత్స్య మాంసాలు తినటం మానేశాం. కాని పిల్లలమీద యెలా నిర్బంధపెట్టను? నువ్వు నా మనస్సులోని అభిప్రాయాన్ని గ్రహించావ్. రోజూ బిలూని నీలూని పిలిచి చేపలు తినిపించేదానివి. నన్ను మీ యింట్లో చేపలు తినిపించటానికి ఎంత బలవంతం చేసేదానివి. అక్కా! నీ మమకారం నాకు పూర్తిగా తెలుసు. నీకు నేను జన్మజన్మలకీ ఋణపడి ఉంటాను. నిన్ను నిందిస్తే నా నాలిక తెగిపడిపోదూ? ఇవాళ నా మనస్సు నరిగ్గాలేదు అక్కా! ప్రపంచమంతా నాకు వెగటు విషమయిపోయింది. మంచిమాట మనస్సులోకి యెలా వస్తుంది? నువ్వూ బిలూ తల్లివే. నీకు నా మనస్సులోని పరిస్థితి వివరంగా చెప్పక్కర్లేదు. బిలూకి నీవంటే ఎంత ప్రేమ, ఎంత భక్తి! బిలూ ఎవరినైనా ఒకసారి అమ్మ అని పిలిస్తే ఇవాల్టి రోజున వారిమీద కోపం తెచ్చుకోగలనా? బిలూ అమ్మ అని పిలవటంలోని మర్మం నాకు తెలుసు. పిలుపుకాదు, పిలుపు విని మనస్సంతా వాడి వైపుకి పరిగెత్తుతుంది. బిడ్డలు కాదు ఒకొక్కడు ఒక శత్రువు. పిల్లల్ని గురించి ఇంత ఆలోచిస్తున్నాను. అందులో సగం సేపయినా భగవంతుణ్ణి తలచుకుంటే తప్పకుండా భగవంతుణ్ణి పొందకలిగే దాన్ని.

కాని ఎంత గట్టిగా వాటేసుకున్నా జారిపోతున్నాడు. వజ్ర కాఠిన్యం సడలిపోయింది. లేకపోతే ఈ బిలూ వరాండాలో పీఠం వేసుకుని కూర్చుని చదువుకుంటూంటే నేను కనుక వాడి వెనకనుంచి అడుగులు సవ్వడికాకుండా నిశ్శబ్దంగా వెళ్లినా కనుక్కో గలిగేవాడు. "అమ్మా! అమ్మవాసన వస్తోంది" అనేవాడు. నిజంగానే పసికట్టేవాడు. చిన్నవాడుగా ఉన్నప్పుడు నేను స్నానంచేసి వెళ్లగానే నన్ను గట్టిగా వాటేసుకునేవాడు. "నువ్వు స్నానంచేసి రాగానే నీ ఒంటిని అమ్మవాసన వేస్తుంది" అనేవాడు. "ఓరి అల్లరి పిల్లాడా! నువ్వు లాగుచొక్కా వేసుకుని నన్ను ముట్టుకోకు. దేముడి మందిరంలో, వంటింట్లో నా మడి పనులన్నీ అలాగే ఉన్నాయి" అనే దాన్ని నేను. కాని వింటాడా కుర్రాడు "పట్టుబట్ట ముట్టుకుంటే మైలపడుతుందా?" అనేవాడు. ఇహ నీలూ ఉన్నాడు సైతానే! వాడు యెన్నో నాళ్లనుంచి యెన్నెన్నో సంగతులు దాచిపెట్టి ఉంచేవాడు. వాటినన్నిటినీ జ్ఞాపకం చేస్తూ నన్ను వెంటాడుతూ "అమ్మా! నీకు నాకంటె అన్నయ్యంటే ఎక్కువ అపేక్ష" అనేవాడు. "ఓరి పిచ్చివాడా! అలా ఎప్పుడన్నా జరుగుతుందా? తల్లి ఎప్పుడైనా ఒక కొడుకుని యెక్కువ, ఒక కొడుకుని తక్కువగా ప్రేమిస్తుందా? భగవంతుని నియమమే అలాంటిదికాదు" అనేదాన్ని. వెంటనే నీలూ "సరే కాని అమ్మా! పూర్ణియాకి బకాసురుడే వచ్చాడనుకో. అతడు కేవలం పిల్లల మాంసమే తింటాడు. ఇంకే మాంసమూ తినడు. ప్రతి యింటి నుంచి అతనికి ఒక కుర్రవాణ్ణి పంపించవలసిన యేర్పాటు జరిగింది. ఇవాళ నీ యింటి వంతు. ఇలాంటి పరిస్థితిలో నువ్వు బకాసురుడి దగ్గిరకు అన్నయ్యను పంపుతావా? నన్ను పంపుతావా చెప్పు" అనేవాడు "ఫో ఫో! పిచ్చివాగుడు వాగకు. అన్నీ అర్థం పర్థంలేని మాటలు మాట్లాడతావ్. నీకిలాంటి ఆలోచనలన్నీ ఎక్కడనుంచి వస్తాయో నాకర్థం కాకుండా ఉంది. ఎవర్ని పంపుతానేమిటి? ఎవర్నీ పంపను" అనేదాన్ని. నీలూ వెంటనే ఆ తెలిసింది, తెలిసింది అని ఇల్లు యెగర కొడతాడు. "ఏమిటి తెలిసింది బూడిద! మీరు అమ్మ మనస్సు తెలుసుకుంటే ఇంక నాకు విచారమెందుకు?" అన్నాను. లేకపోతే నీలూ నాకు ఒకరోజున అమ్మ ప్రేమ స్వార్థంతో కూడుకున్నది అంటూ ఒక కథ చెప్పాడు. "ఒక పిల్లి తనకూనను ఒక బూర్లె మూకుడుమీద కూచోపెట్టి కింద నుంచి పొయ్యిలో నిప్పు అంటించటం జరిగింది. ఇహ పిల్లి ఎటూ పారిపోవటానికి వీల్లేని పరిస్థితి యేర్పడింది. అప్పుడు పిల్లి మెల్లి మెల్లిగా వెళ్లి, తనకూన వీపుమీద కూర్చుంది. అందరు తల్లులూ ఇంతేనట. తమ ఒంటికి గ్రుచ్చుకోనంతవరకు తల్లి బిడ్డ బిడ్డ అని ఆరాటపడుతుంది. ఈ కాలపు పిల్లలు ఇలాంటివన్నీ ఎక్కడ నేర్చుకుంటారో తెలియదు. ఈ రోజుల్లో కాలేజీల్లో ఇవన్నీ చెపుతారాయేం! బిలూ

యెప్పుడూ ఇలాంటి మాటలు మాట్లాడడు. ఈ కథ విన్న తర్వాత నీలూతో ఈ విషయంలో వాదించటానిక్కూడా అసహ్యం వేసింది. కాని నీలూ అన్న ఈ మాట నా మనస్సులో గ్రుచ్చుకుంది. ఇంకొక రోజున వాడు మరొక సంగతి చెప్పాడు. ఆ మాట కూడా యెప్పటికీ మరచిపోను. అదికూడా తల్లి స్వార్థపరతను గురించి చెప్పిన మాటే. పెద్ద భూకంపం వచ్చిన తర్వాత చాలా రోజులదాకా ఒకటి అర చిన్న చిన్న భూకంపాలు వస్తూంటాయి. ఒకరోజున రాత్రి ఇలాంటి అదురు వచ్చింది. జితేన్ పెళ్లాం నిద్రలోంచి చటుక్కున లేచి, పిల్లవాణ్ణి యింట్లో వదిలేసి పరిగెత్తుకుంటూ బయటికి వచ్చింది. ఇంక యెక్కడికి వెడుతుంది? ఆ సంగతి పట్టుకుని ఇంట్లో వాళ్లందరూ పాపం ఆ అమాయకురాల్ని పీక్కుని తిన్నారు. ఇంకా నీలూ దగ్గర ఉన్న నిల్వలో ఇంకో కథ జమ అయి వుంది. నాకు విన్పించటానికి. ఆఁ అవును బాబూ! తల్లులు స్వార్థపరులే. వెయ్యిసార్లకీ స్వార్థపరులు. పిల్లల ప్రేమ మాత్రం పూర్తిగా నిస్వార్థమైనది. కాస్తకూడా కల్తీ లేదు. సరేనా? ఇది వినటమే నీకు సంతోషమైతే అలాగే. చిన్నప్పట్నుంచీ నీలూ నన్ను తక్కువ వేధించేవాడనా? బిలూ- నీలూ కలిసే పెరిగారు. కాని నీలూ ఈ అల్లరితనం ఎక్కడినుంచి నేర్చుకున్నాడా అని ఆలోచిస్తూంటా. ఎన్నిసార్లు ఏడిపించి విడిచిపెట్టాడు. మధ్యాహ్నం నాకు కొంచెం నిద్ర మత్తు వచ్చిందనుకుంటాను. ఎక్కడినుంచో 'దోపాటీ' (Balsam) పువ్వులు బాగా పండిన కాయలు తెచ్చి నాముఖం ఎదుట టప్‌టప్‌మని కొట్టటం మొదలెట్టాడు. గింజలన్నీ చెదిరి చెవుల్లో ముక్కుల్లో దూరాయి. కంగారుగా లేచి కూర్చున్నాను. తిడితే పట్టించుకోనే పట్టించుకోడు. పకపక నవ్వుతాడు. వాడికి పెద్ద - చిన్న విచక్షణ లేనే లేదు. వాడి ఖయాలీయే వాడిది. ఒకరోజున ఏం చేశాడని- పెద్ద అయిన తర్వాతనే నల్లుల్ని చంపి చంపి, ఆ నెత్తురుతో సైన్‌బోర్డ్‌లాగా "అహింసా పరమోధర్మః" అని వ్రాశాడు. ఎవర్ని వెటకారం చేస్తూ ఈ వ్రాయటమో నాకు తెలుసు. మళ్ళీ వారి చెవిని పడుతుందేమోనని అనుకుని నేను ఆ వ్రాసిందసలు చూడనట్లు వ్యవహరించాను. ఒరేయ్ నీలూ! ఒకనాడు - అమ్మ, నాన్నా లేనప్పుడు - అప్పుడు తెలుస్తుంది అమ్మ నాన్నల విలువ! పళ్లు ఉండగా పళ్ల విలువ తెలుస్తుందా? వాళ్ల నాన్న మనస్సుని నొప్పించటానికి నీలూ యేం చేసేవాడని! సరిగ్గా ఆశ్రమం సరిహద్దుల వెలుపల రెండు అంగుళాల దూరంలో మాంసం వండుకుని తినేవాడు. ఆశ్రమం ఆవరణలో మేకల్ని తినటం నిషేధం కాని ఇక్కడకాదు అనేవాడు. ఒరేయ్ నీలూ మహాత్మాజీ మేకపాలు త్రాగుతారు కనుకనే ఆశ్రమంలో మాంసం తినటం నిషేధం అనుకున్నావా? ఆశ్రమంలో యే యే మాంసం తినటమైనా నిషేధం అని

నీకూ తెలుసు, నాకూ తెలుసు. అలాంటప్పుడు వారికి గ్రుచ్చుకునేట్లు యెందుకిలా మాట్లాడతావ్? నీకు మాంసం తినటం యిష్టం. మీకు వండిపెట్టలేకపోయినందుకు నాకు మాత్రం విచారం కాదనుకున్నావా? కాని ఆశ్రమం నియమం ఏం చెయ్యను? బిలూ ఎన్నాళ్లు అక్క యింటికి వెళ్లి కూచుని చేపలు తినటం చూశాను! నీలూకి చేప అంటే ఎంత యిష్టమంటే 'రేవా' చేపముళ్లుకూడా నమిలి తింటాడు. బిలూ ఇంక చేపలు తినటం మానేస్తానని యెన్నాళ్లనుంచో చెబుతున్నాడు. కాని నేను, అక్క చెప్పి వాడిని మాననియ్యలేదు. అయినా మొహం ఇలాగే ఉంది... అక్కడికీ అక్క యింట్లో నాలుగయిదు రోజుల కొకసారి ఒకటి, అరచేప కడుపులో పడుతూనే ఉండేది. చిన్నప్పుడు మా ఊళ్లో మేము చేపలు లేకుండా ఒక్కపూట అయినా ఎలా భోజనం చేస్తారు? అనేది ఊహించ లేకపోయేవాళ్ళం. మా పిల్లల్ని ఈ స్థితికి మేమే తీసుకొచ్చాం. వారు వంగదేశంలో ఉండనూ లేదు. అక్కడి సంగతులు, ఆచార వ్యవహారాలు ఏమీ ఎరగనూ ఎరగరు. వీళ్లకు ఈత కొట్టటం చేతకాదు. 'వన్నా' [1] 'హిజల్'[2] 'గాబ్'[3] ఈ చెట్లపేర్లన్నీ తెలియవు. ఒకరోజున పిల్లల దగ్గిర "ఢప్ కీర్తనం"[4] సంగతి చెప్పాను. నీలూ 'ఢప్' మాట వినగానే పొట్టచెక్కలయేలా నవ్వాడు. ఇంత వికారమైన మాటకూడా ఎప్పుడూ వినలేదు అన్నాడు. బిలూని ఒకరోజున ఆ గదిలోంచి 'తిజేల్'[5] తీసుకురమ్మన్నాను. 'తిజేల్' అంటే ఏవిఁటమ్మా అని అడిగాడు. మా దేశంలో పసిపిల్లలకు కూడా ఈ మాట తెలుసు. వీళ్లకా మాట తెలియదు. పన్నెండు నెలలూ పదమూడు పార్వణలంటే వీళ్లకి తెలుసా? బిలూ మళ్లీ ఇవన్నీ గ్రుచ్చి గ్రుచ్చి అడిగేవాడు. అవన్నీ తెలుసుకోవాలని వాడి కోరిక. అమ్మ 'దోల్'[6] అని ఏ పూజని అంటారు? చైత్ర పూర్ణిమ పండుగరోజున చిన్నప్పుడు మీరేం చేసేవాళ్లు? 'గాజన్-గాన్'[7] స్వరం ఎలా ఉంటుంది? మీ ఊళ్ళో వైష్ణవ

---

1. వరద.
2. ఒక వృక్షం పేరు.
3. లొద్దుగ చెట్టు.
4. ఒకవిధమైన కీర్తన గానం.
5. వెడల్పు మూతి ఉండే వంటగిన్నె.
6. దోలికా ఉత్సవం. ఫాల్గుణ శుద్ధ ఏకాదశి మొదలు బహుళ పంచమివరకు జరుగుతుంది.
7. మనసాదేవి ఉత్సవగీతం.

భిక్షవులుండేవారా? దేశంలో సంగతులన్నీ వాడికి కావాలి. ఎప్పుడో జ్ఞాపకం లేదు. బిలూ చిన్నవాడై ఉన్నప్పుడు వాడి దగ్గర మా ఊళ్లో నిఖిల చౌదరి పిశాచాలను సిద్ధింపచేసుకోవటానికి శ్మశానానికి వెళ్లి అక్కడే చచ్చిపోయిన కథ చెప్పాను. ఆరోజున కూడా అది కథగా చెప్పాడు. "ఈ కథలన్నీ విని ఏం చేస్తావ్?" అని బిలూని అడిగితే "నీ చిన్నతనాన్ని బట్టీపడతాను". అంటాడు. నా చిన్నతనాన్ని బట్టీ పడతావుట్రా? ఇంత తియ్యగా మాట్లాడగలడు వాడు. వినగానే మనసు ఆనందంతో నిండిపోతుంది. కాని నీలూకి వీటన్నిటి గొడవేలేదు. వాడికి ఈ కబుర్లన్నీ వినే తీరిక ఓర్పు ఎక్కడ? పగలు రాత్రి ఊరికే తిరుగుతాడు. మధ్యమధ్య ఒకసారి డబడబలాడుతూ యింటికి వచ్చి పడతాడు. చొక్కా విప్పి విసిరిపారేస్తాడు. "అమ్మా! బనీనుకి సబ్బు పట్టించు" అని హుకుం జారీ చేస్తాడు. తలకింత నూనెపట్టించుకుని, ఒంటిమీద రెండు చెంబులు నీళ్లు కుమ్మరించుకున్నదే వ్యవధానంగా వంటింట్లోకి వస్తాడు. "ఇంకా అన్నం వడ్డించలేదూ" అంటూ. ఎప్పుడనగా అన్నం వడ్డించి నేను, బిలూ వాడికోసం పెట్టుకుని కూర్చున్నామో వాడికా ధ్యాసే ఉండదు. ఇహ బిలూ తన గుడ్డలు తానే ఉతుక్కుంటాడు. ఎన్నాళ్లు వాడి గుడ్డలు చొక్కాలకు కూడా సబ్బు పట్టించి ఉతికాడో- వాడికీ వీడికీ పోలికా?

"ఇప్పుడెలా ఉన్నారు?" నైనాదేవి వ్రేలితో నన్ను పొడిచి అడిగింది.

వీళ్లు నాకు ఊపిరిపీల్చుకునే వ్యవధి కూడా యివ్వరా ఏం? బిలూ సంగతులు ఆలోచిస్తూ రెండు నిమిషాలు ఒంటరిగా కూర్చుని వాణ్ణి కాస్త దగ్గిరగా పొందాలని ప్రయత్నిద్దామంటే వీలుంటేనా? ఏమి నా శ్రేయోభిలాషులారా! ఇప్పుడే వెంట వెంటనే గ్రామఫోన్ రికార్డులాగా పది ప్రశ్నలడుగుతారు. ఒక ప్రశ్న అయిపోగానే తర్వాత ప్రశ్నకోసరం తయారు కావాలి. ఆ సమయంలో కొంపకు నిప్పు అంటుకున్నా సరే, నైనాదేవి ఆ కట్టకట్టిన ప్రశ్నలన్నీ అడగటం విడిచిపెట్టదు. వాళ్ల సానుభూతి చూచి చచ్చిపోతున్నా. సమాధానం చెప్పాను. "ఆఁ ఆఁ చాలా బాగున్నాను. ఒంట్లో వికారంలేదు. తలనొప్పి తగ్గిపోయింది. ఉక్కపోయటం లేదు. కడుపులో మంట రావటంలేదు. నోరు చేదుగా ఉండటం తగ్గిపోయింది. కంబళీ, దుప్పటి దులిపివెయ్యాల్సిన అవసరంలేదు. సరేనా? ఇహ తనని గురించి దిగులు పెట్టుకో అక్కర్లేదు. ఇహ మెల్లిగా మీ మీ పక్కలమీది కెళ్లి పడుకోండి" నైనాదేవి నా సమాధానం విని తెల్లబోయింది. నాకేమైనా మతి చెడిందా అని ఆలోచిస్తోందా ఏం? ఒక్కమాట అయినా మాట్లాడకుండా ఆమె తన పక్కవైపుకి వెళ్లిపోయింది. ఆమె ఎవరి నోటి ధూకుడునూ సహించి ఊరుకునే

రకంకాదు. ఆమె నా మాటలమీద ఒక రగడ చేసి తీరుతుంది. అది ఇవాళ కావచ్చు. రేపు కావచ్చు. కొద్ది రోజుల క్రిందట ఆమె తల్లి ఇంటర్వ్యూకి వచ్చింది. ఆమె ఏం చేసిందని! సబ్బులు, పెన్సిళ్లు, పుస్తకాలు, వెన్న, కిస్‌మిస్ ఇలాంటివి ఇంకా ఎన్నో జైల్లో తనకు వచ్చిన చిన్న చిన్న వస్తువుల్ని తల్లి చేతికిచ్చి యింటికి పంపిద్దామని, వాటిని తీసుకుని బయటిగేట్ దగ్గరకొచ్చింది. అక్కడ ఆమెని సి.ఐ.డి. జమాదారు పట్టుకున్నారు. మొదట్లో వారితో పోట్లాడింది. "ఇవన్నీ నా స్వంత వస్తువులు, బయటికెందుకు పంపకూడదు" అని దబాయించింది. అప్పుడు సి.ఐ.డి. "మా మీద లా పాయింట్లన్నీ విసరబోతే వీటినన్నిటినీ తీసుకువెళ్లనివ్వను. ఏదో మంచిగా మమ్మల్ని బ్రతిమాలితే, ఈ వస్తువులన్నీ మీ యింటికి అవసరమనేట్లయితే అప్పుడు మీ అమ్మని ఈ వస్తువులన్నీ తీసుకువెళ్లనివ్వగలను" అన్నాడు. అప్పుడు నైనాదేవి అందుకు ఒప్పుకుంది. గేట్‌లో జమాదారుని కిస్‌మిస్ తినిపించటం జరిగింది. చూస్తుండగానే ఎంత అవమానం అయింది. ఈ అవమానం ఆమె ఒక్కతెదేనా? దీంతో మా అందరి ముఖాలు వెల్లవేసినట్లయినాయి! జమాదారిణి వచ్చి జరిగిన సంగతంతా మా వార్డులో అందరికీ చెప్పేసింది. బహూరియాజీ కొంచెం నోటి తొందరమనిషి. ఆమె ఎప్పుడైతే నైనాదేవిని అడిగిందో ఇంకెక్కడికిపోతుంది. ఒక్కసారిగా నిప్పు అంటుకుంది. అది ఇహ అరుపులు, కేకలు, ఎంతరగడ అయింది! బహూరియాజీని ఎడా పెడా కొట్టింది. ఇక్కడ కాస్త మెత్తటిచోటు దొరికిందికదా! సి.ఐ.డి. దగ్గిర ఈ పౌరుషమంతా ఎక్కడ? తర్వాత పదిహేనురోజుల వరకు బహూరియాజీ ముఠాతో కుక్కల పోట్లాట జరిగింది. ఆమె ఒక్కతే వందమంది పెట్టు. మాటల్లో ఎంత విషం! ఎంత విసురు! అందుకే దున్న కొమ్ములు రెండయినా పోట్లాడేటప్పుడు ఒకటే అంటారు. ఆమె ఒక్కతే అందరితో పోట్లాడి చల్లారిపోయేటట్లు చేసింది. మళ్లీ నా వెంట పడింది, ఏం చేస్తుందో ఏం తెలుసు! చేస్తే చేస్తుంది, చెయ్యతలచింది చెయ్యనీ. చావుకంటె మించిన తిట్టు ఉందా? భగవంతుడు నాకు కలిగించిన దుఃఖం కంటె ఎక్కువ నాకేం చేస్తుంది? అన్నిటికీ ఒక హద్దు అనేది ఉంది. లోకుల దుఃఖానికి మాత్రం హద్దులేదా? ... ఇలా బిలూ సంగతులు ఆలోచిస్తూంటే నా రక్తం నీళ్ళయిపోతోంది. అది అలా ఉండగా చమాయిన్ జమాదారిణి ఒక రోజున నాతో "బెంగాలీ అమ్మగారూ! మీ కొడుక్కి పడిన శిక్ష సర్కారువారు వారి బుద్ధిపూర్వకంగా వెయ్యలేదట! మీ రెండోకొడుకు సాక్ష్యం చెప్పి శిక్ష వేయించాడట!" అని చెప్పింది. ఏమిటిలా చెప్పింది? నేను వినగానే వణకిపోయాను. "ఎవరు చెప్పారు నీకు?" అని అడిగాను. "నైనాదేవి ఒక రోజున నాతో ఇలాంటి మాట విన్నాను అని

చెప్పింది. బయట వార్డర్లనడిగి అసలేం జరిగింది తెలుసుకోవచ్చుగా! నేను బయట అడిగి నైనాదేవి చెప్పింది నిజమే అని తెలుసుకున్నాను. నైనాదేవి మీతో చెప్పవద్దన్నది అమ్మగారూ! కాని నేను మీ యింటి విషయం అందరికీ తెలుస్తుంది. అందరూ మాట్లాడుకుంటారు. మీకు మాత్రం తెలియదు. అలా ఉండవచ్చా? నాకూ ధర్మమనేది ఉంది. అవునుగాని అమ్మగారూ! మీ కొడుకులిద్దరి మధ్య తగవు ఏదైనా ఉన్నదాయేం? మా అన్నలిద్దరూ కూడా ఒకసారి ఒక పనస చెట్టు దగ్గిర పేచీతో తలలు పగల కొట్టుకున్నారు. దాంతో ఇహ పోలీసుస్టేషన్ - పోలీసులు! గుప్పిళ్ల కొద్దీ డబ్బు ఖర్చయింది. పదిహేడు రూపాయలు తీసుకుని తర్వాత సబినస్పెక్టరుగారు కేసు ఎత్తేశాడు. మీకేవిఁటి అమ్మగారు చాలా పొలాలు-పశువులవీ ఉన్నాయా? ఆ కొడుకు కాంగ్రెసులో పేరు ఎక్కించుకోలేదనుకుంటాను. భగవంతుడెలాంటివారి కడుపున ఎలాంటివారిని పుట్టిస్తాడో చెప్పలేము" అన్నది. వినేసరికి నా గుండె లార్చుకుపోయాయి. "నువ్వు అన్ని అబద్ధాలు ప్రచారం చేస్తున్నావ్. నీమీద నేను రిపోర్టు చేస్తాను" అన్నాను నేను. "అమ్మగారూ! నేను చెప్పటం మంచిదనుకునే మీతో చెప్పాను. అబద్ధమయితే అవచ్చు. నేను విన్నదేదో మీతో చెప్పాను. ఒక్కమాట కూడా నేను కల్పించలేదు. రిపోర్టు మాత్రం చెయ్యవద్దమ్మా మీరు. నాభర్త మూడేళ్ల నుంచీ పక్షవాతంతో పడి ఉన్నారు. నా సంపాదనతోనే పిల్లలకి రెండుపూటలా యింత పెట్టగలుగుతున్నాను" అన్నది. "సరే అయిందేమో అయింది. వెళ్లు కాని ఖబడ్దార్ ఇలాంటి సంగతులెప్పుడూ నా ముందర చెప్పకు" అన్నాను నేను. ఆమె వెళ్లిపోయింది. కాని అప్పటినుంచి నా మనస్సులో ఆందోళన రేగింది. ఇంత అబద్ధాలుకూడా చెప్పుకుంటారా లోకులు.

లాగూ తొడుక్కుని ఉన్న అన్న బిలూ - బుల్లి తమ్ముడు నీలూని బుగ్గలు పుణుకుతూ "నీ-లూ-! ని-ల్లూ. పీ-లూ - పి-ల్లూ" అని ముద్దులాడినవాడు.

ఆ నీలూ బిలూకి విరుద్ధంగా సాక్ష్యమిస్తాడా? ఇది నేను చచ్చినా నమ్మలేను. నీలూ - పొగరుబోతు. చెప్పినా తెలుసుకో లేనివాడు. తిక్కమనిషి అన్నీ నిజమే. కాని వాడికి అన్న అంటే ప్రాణం! నీలూ ఎన్నడైనా ఇంతపని చెయ్యగలుగుతాడా? ఆనాటి నుంచి ఆ ఆలోచన ఎప్పుడు వచ్చినా నా గుండెల్లో నెత్తురు గడ్డకట్టుకుపోయేది. ఒకవేళ ఇది నిజమయి ఉంటుందా! ఆనాడు జైలుగేట్ దగ్గిర వాడితో ఇంటర్వ్యూ ఉంది. సూపరింటెండెంట్ ఎంతో గౌరవంతో మధ్యమధ్య మమ్మల్ని కలుసుకోనిస్తూండే వారు. ఆ రోజున వాడికీ సంగతి ఏమైనా తెలుసునేమో ఒకసారి అడిగి చూద్దా మనిపించింది. తర్వాత మళ్లీ వద్దు, ఇలాంటి మాట అడగవచ్చునా? వాడొకవేళ నీలూకి

విరుద్ధంగా ఇలాంటి మాట నువ్వుకూడా నమ్ముతున్నావా? అని అడిగితే?... పోనీ ఒకవేళ అది నిజమే అనుకుందాం. వాడి ముఖం అలా చూడగానే వాడి మనస్సులో ఏం తుఫాను రేగుతోందో నేను గ్రహించగలను. నా మనస్సులో ఏం జరుగుతుందో నాకు తెలుసు. దాన్ని బట్టే వాడి మనస్సు పరిస్థితి కొంచెం ఊహించగలను. పైగా వాడు నా ముఖంకేసి చూడలేకపోవటం గమనించాను. చివరికి రకరకాలుగా ఆలోచించి, ఇంక అడగలేదు. నోట్లో మాట నోట్లోనే ఉండిపోయింది. "అయితే ఇహ లేవండి, టైమయిపోయింది" అన్నాడు సి.ఐ.డి... అటు తిరిగి యిటు తిరిగి మళ్ళీ ఆ మాటే గుర్తుకొచ్చేది - నీలూ ఎప్పుడైనా ఇలాంటి పని చెయ్యగలుగుతాడా? వాడికి అన్న అంటే పిచ్చి. చిన్నప్పటి నుంచి అన్న ఏం చేస్తే అది తానూ చెయ్యాలనుకునేవాడు. నీలూని నేను బిలూకంటె వేరుగా భావించలేను. నీలూ ముక్కోపి. వాడు బయట యెప్పుడెక్కడేం అఘాయిత్యం చేస్తాడో అని దిగులుపడుతూంటాను. కాని మళ్ళీ ఎప్పుడూ, వాడి అన్న ఉన్నాడుగా వాడు అదుపులో పెడతాడులే అని మనస్సుకి భరోసా కలుగుతూంటుంది.. వాడు జైలుకి వెళ్ళినప్పుడు కూడా ఇదే భరోసా ఉంది మనస్సుకి. చిన్నప్పుడు నీలూని ఎవరైనా ఏదయినా అంటే "చూడన్నయ్యా!" అని అన్నదగ్గిర ఫిర్యాదు చేసేవాడు.

ఆ చిన్నప్పుడు బిలూ-నీలూ హెడ్‌మాష్టర్‌గారి క్వార్టర్స్‌లో మామిడి చెట్టుక్రింద ఆడుకుంటున్నారు. హామిద్ దఫ్తరీ గేట్‌లోపలికి వచ్చాడు. వస్తూనే దూరంనుంచి వంగి సలాంచేసి, "ఆదాబ్ నిలూ బాబూ! మీకో ముసలి దొరసానినిచ్చి పెళ్లిచేస్తాను. నిన్న నాతో ఒక ముసలి దొరసాని నిల్లూబాబుని తప్ప ఎవర్నీ చేసుకోను అని చెప్పింది" అన్నాడు.

"అన్నయ్యా చూడు నన్ను అన్నీ అంటున్నాడు."

"నిజం కాదురా అది. నిన్ను ఊరికే ఉడికిస్తున్నాడు. ముసలి దొరసాని మళ్ళీ పెళ్ళి చేసుకుంటుందేమిటి?" అని బిలూ నీలూని సమాధానపరచబోయాడు.

"ఊహుఁ అతడెందుకనాలి నన్ను?"

"ముసలి దొరసానికి కాస్తకాస్త మీసాలున్నాయి. ముందు నన్నే పెళ్లి చేసుకుంటాను అన్నది. గడ్డం లేనివాళ్లను నేను పెళ్లిచేసుకోను అన్నాను. అప్పుడామె అయితే నాకు నిల్లూ బాబుతో పెళ్లిచెయ్యి అన్నది" అన్నాడు దఫ్తరీ.

"చూడు అన్నయ్యా."

నీలూ ఏడవటం మొదలెట్టాడు. బిలూ వాణ్ణి సముదాయిస్తూ నా దగ్గిరకు తీసుకువచ్చాడు. "పిచ్చివాడివి యెక్కడో, ఉడికిస్తే ఏడుస్తారా? అలా అయితే ఏడ్చిన

కొద్దీ ఉడికిస్తారు" తర్వాత బిలూ నాతో మాట్లాడుతూ - "నీలూకేమీ తెలియదు. నేను సమాధానపరుస్తున్న కొద్దీ మరింత ఏడవటం మొదలెట్టాడు" అన్నాడు. "నువ్వు వాడి అన్నవి. వాడికి నువ్వు నచ్చచెప్పకపోతే ఎవరు చెపుతారు చెప్పు" అన్నాను నేను. బిలూ పొంగిపోయాడు. అన్నగారిగా బాధ్యత తక్కువది కాదుగా! బిలూ నీలూని కనిపెడుతూనే ఉండేవాడు. కొన్నాళ్లు నీలూకి గన్నేరు కాయలతో ఆడుకోవాలని సరదా వేసింది. దాన్ని ఈ దేశంలో 'కనైల్' అనే ఏదో ఆట అంటారు. నేను బిలూతో "బిలూ చూడు బాబూ! నీలూ మీద కాస్త ఒక కన్నువేసి ఉంచు. నాకు భయమేస్తోంది. నీలూ ఎప్పుడు గన్నేరుకాయలూ అవీ తింటాడో. గన్నేరుకాయలు విషం తెలుసా?" అన్నాను. బిలూ పెద్ద తెలిసినవాడిలాగా "అది నాకు చెప్పక్కర్లేదు. మొన్న ఒకరోజున నీలూ వరండాలో గన్నేరు కాయలూ అవీ కుప్పపోసి, గన్నేరు కాయలు తింటానంటూ పట్టుపట్టాడు. వాళ్లు ఈ గన్నేరు కాయలంటే హిందుస్తానీ బాదంకాయలన్నారు. నేనే వాళ్లని తిననీయలేదు" అని చెప్పాడు. నిజంగానే చిన్నప్పుడు బిలూ నీలూని ఒక్కక్షణం కూడా కనుబాటు కానిచ్చేవాడు కాదు. అప్పుడు వాడెంత చిన్నవాడు! నీలూ చొక్కాలకు గుండీలు పెట్టటం, వాడి బూట్లు తాళ్లు ముడివేయటం ఇలాంటివన్నీ బిలూ స్వయంగా చేసేవాడు. ఆ నీలూ ఎన్నడైనా బిలూకి విరుద్ధంగా సాక్ష్యం చెపుతాడా? ఒకవేళ అలా చెప్పటానికే వెడితే వాడంతట వాడు బుద్ధిపూర్వకంగా వెళ్లి ఉండడు. పోలీసులు జులుం చేయటం వల్ల వెడితే వెళ్లి ఉండొచ్చు. ఆ ఇన్‌స్పెక్టరు యెన్నయినా చెయ్యగలడు. బహుశా నీలూ మీద ఎన్నో అత్యాచారాలు చేసి ఉండొచ్చు. బహుశా జడ్జిగారి ఎదుట బిలూకి విరుద్ధంగా చెప్పేటప్పుడు వాడి గుండెలు పగిలిపోయుంటాయి. కళ్ల వెంబడి నీళ్లు వచ్చి ఉంటాయి. కాని బహుశా చెప్పక తప్పనిసరి అయి ఉంటుంది. కాదు నీలూ సాక్ష్యం యిచ్చాడనటం ఇది విశ్వసించతగిన మాటేనా? చమాయిన్ జామాదారిణీ ఎవరిదగ్గర ఏమి విన్నదో!... దానికింక చిలవలు పలవలు కల్పించి ఉంటుంది. నీలూ ఒకవేళ అలాచేసి ఉంటే ఆ కొడుకు ముఖం నేనింక చూస్తానా? కళ్లు రెండూ ఎక్కడికి తీసుకెడితే అక్కడికి వెళ్లిపోతాను. నా మనస్సుకి ఇలా జరిగి ఉండదు అనిపిస్తోంది. తల్లి మనస్సు ఎప్పుడైనా పొరపాటు చెపుతుందా?

అప్పుడు కపిలదేవ్ పెళ్లి సమయంలో బిలూ నీలూ వాళ్లింటికి వెళ్ళారు. వాళ్లు అక్కడికి వెళ్లటం నాకిష్టంలేదు. అప్పుడు వాళ్లింకా చిన్నవాళ్లు. వెళ్లి అక్కడేమయినా జబ్బుపడితే, వాళ్ళ యింటి ఆచార వ్యవహారాలు తెలియవు. ఏం చెయ్యటానికేది చేస్తారో! కాని 'దహిభాత్' గ్రామం నుంచి వచ్చిన మంగలి వక్కలు, పసుపుకొమ్ములతో

తాంబూలం వాళ్ళ చేతుల్లో పెట్టి వెళ్లాడు. ఆరోజు నుంచి వాళ్లు పెళ్లికి వెడతామని పట్టుపట్టి కూర్చున్నారు. కపిలదేవ్ తండ్రి అప్పటికి బ్రతికి ఉన్నాడు. ఆయన ఒక రోజునవచ్చి పిల్లల్ని ఎడ్లబండిలో యెక్కించుకుని తీసుకుని వెళ్లారు. అక్కడికి వెళ్లి వారం పదిరోజుల కంటె ఎక్కువ ఉండలేదు. కాని ఆ ఊరు నాగరికత యెలాంటిదో! ఆ కొద్ది రోజుల్లోనే అడ్డమైన పాటలూ నేర్చుకుని వచ్చారు... మెల్లాలో ఒకవైపున బిలూ, ఒకవైపున నీలూ కూర్చున్నారు. ఇద్దరి యెదుటా ఒక్కొక్కపాత బిస్కట్ల టిన్నులు చేతుల్లో చిన్న కర్రముక్కలు ఉన్నాయి. ఆ కర్రముక్కలతో టిన్నులు వాయిస్తున్నారు. బిలూ "ఈసారింక అన్నయ్యా, బక్‌డీల్ సాంబ్ టంగ్ టా-ఆర్ బాజాచోనా, తవాయిలే తాకా దుమ్‌మక్ యీ[1] లావా టా ఓనా" అన్నాడు. ఇద్దరూ వాయిస్తున్నారు. బిలూ పాడు తున్నాడు. కపిలదేవ్ పాంచ్‌బయా, ఛార్‌మా[2] చుమౌనా[3] బిలూ వరుడి పక్షం. ఇంక మెల్లాలో మరొక వైపునుంచి కన్యాపక్షం వాడైన నీలూ ఎదురు జవాబు యిచ్చాడు. బాజాతే జా ఊ. ధాయీ! ధాయీ! కపిలదేవ్‌కీ ఛర్ మాసాఈ[4] అని పాడాడు. ఇద్దర్నీ బాగా తిట్టాను.

గట్టిగా కేకలేశాను వాళ్లను. ఇలాంటి అలగారకం పాడు పాటలన్నీ మర్యాదస్తు లిళ్లలో వాళ్లు పాడతారా ఎక్కడైనా? బిలూ కంగారుపడ్డాడు! నీలూ - దహిభాత్‌లో సహదేవ్ ఇంట్లో మగపిల్లలు ఆడపిల్లలు అందరూ పాడుతారు ఈ పాట. వారు మర్యాదస్తులు కాదంటావా? అన్నాడు. నాకు తెలుసు. నీలూని ఏపని అయితే చెయ్యవద్దని వారిస్తామో వాడు ఆపనే మరింతగా చేస్తాడు. బిలూ ఏమో నా మాటలు అర్థం చేసుకున్నాడు. ఇప్పుడు వాడు ఆగాక నీలూ ఒక్కడూ ఎంతసేపని వాయిస్తాడు? వాడు కేవలం ఒకరు చేసిన దానికి నకలుమాత్రం చేస్తాడు. బిలూ ఆగిన తర్వాత నీలూ పెద్ద బడాయిగా "తాకాయికో తవాదుమ్. మకయికో లావా"అని నాకు వినిపిస్తూ

---

1. మొక్కజొన్న చేను.
2. ఆరు.
3. బీహార్ ప్రాంతంలో ఆచారంగా ఉన్న 'నిక్కా' (ముస్లింల వివాహం) లాంటి ఒక విధమైన పెళ్లి సంప్రదాయం. దీనికి పెద్ద తంతు అదీ అవసరంలేదు. సాధారణంగా నిమ్న జాతుల్లో వితంతువులకు ఈ పద్ధతిని పెళ్లిళ్లు అవుతాయి. ఉన్నత సమాజం ఈ వివాహాన్ని మంచిదిగా లెక్కలోకి తీసుకోరు.
4. భర్త.

పాడసాగాడు. తర్వాత మెల్లిగా అంతా చల్లబడింది. తర్వాత వాడు అన్నగారిని మెల్లిగా - "అన్నయ్యా! ఆ పాట నిజంగా చెడ్డ పాటా" అని అడగ్గటం గదిలోంచి విన్నాను. అన్నయ్య చెడ్డది అంటే చెడ్డదవుతుంది. అన్నయ్య చెప్పిందే వేదవాక్యం. నేను ఇంతసేపు చెప్పిందీ, వద్దు అన్నదీ, కేకలేసిందీ - వాడికి లెక్కలోదేకాదు.

ఇప్పుడు పెద్దవాళ్లయింతర్వాత ఎన్నోసార్లు చూశాను. అన్న-తమ్ముడు ఇద్దరూ గదిలో కూర్చుని మాట్లాడుకుంటూ ఉంటారు. నేను ఏదయినా చెప్పటానికో కాసేపు మాట్లాడటానికో వెడతాను. వెంటనే నీలూ 'వాట్-లాట్' అంటూ ఇంగ్లీషులో అన్నతో ఏమిటేమిటో మాట్లాడి పకపకానవ్వుతాడు. నన్ను గురించి ఏదో చెప్పాడని నాకు తెలుసు. కాని ఎగతాళిగా అనుకుంటాను. అయితే పెద్దవాళ్లను ఇంగ్లీషులో ఏమయినా అంటే తప్పు కాదన్నమాట! ఆహా! ఏమి శిక్షణ ఇది! "అమ్మా! కోపం తెచ్చుకోవద్దు. కోపం తెచ్చుకోవలసిన మాట ఏమీ అనలేదు నీలూ. ఎందుకు నీలూ, అమ్మని ఊరికే రెచ్చకొడతావ్!" అన్నాడు బిలూ.

"నేను మీ దగ్గిర్నుంచి కోరేదేముంటుంది? రెండు తియ్యని మాటలు మాట్లాడే ఉపకారమయినా చెయ్యలేవా? రోజు మొత్తంలో నువ్వు నాతో ఎన్నిసార్లు మాట్లాడతావ్? అవీ అయినా నిర్లక్ష్యంగా మాట్లాడితేనేకాని కాదా? మళ్లీ నవ్వుతున్నావా? సిగ్గులేదు. చిన్నప్పట్నుంచీ చూస్తున్నాను ఎప్పుడూ ఒకటే రకం. "అంగారశతధౌతేన మలినశ్చన ముంచతి"[1] నీలూ మళ్లీ నవ్వాడు తప్పు అన్నాను అనుకుంటాను.

"జమాదారిన్! జమాదారిన్! ఏయ్ మన్‌చనియా! బెంగాలీ అమ్మగారు నిద్రపోతున్నారా ఏం?"

ఎక్కడ జమాదారిణి! ఎక్కడ మన్‌చనియా! జమాదారిణి వరండాలో పడుకుని నిద్రపోతోంది. మన్‌చనియాయేమో నా ప్రక్కన కూర్చుని కునికిపాట్లతో తూలుతుంది. నర్మదాబహిన్ మాటకు ఎవరు జవాబు చెపుతారు? అసలు జవాబు చెప్పకపోవటమే మంచిది. లేకపోతే మన్‌చనియా మళ్లీ కాసేపు బహుశా నన్ను వేధిస్తుంది. నర్మదా బహిన్‌ది అహమ్మదాబాద్. బాగా శ్రీమంతులబిడ్డ. విదేశాలకు వెళ్లివచ్చింది. హావభావాలు, దుస్తులు తప్ప మిగతా అన్నిటిలో దొరసానిలా ఉంటుంది. మహాత్మాజీకి ఆదరపాత్రులైన శిష్యులలో ఆమె ఒకతె. తెల్లటి శరీరచ్ఛాయ. ఖద్దరు చీరెలు కడుతుంది. జెమ్‌షెడ్‌పూర్‌లో కార్మికుల సేవ చేయటానికి బీహార్ వచ్చింది. అక్కడ అరెస్ట్ అయింది.

---

1. బొగ్గుని నూరుసార్లు కడిగినా సహజమైనదాని నలుపుపోనే పోదు...

మా వార్డ్‌కి ఎదురుగానే ఉన్నది ఒక చిన్నయిల్లు. మొదట్లో అది పురుటిగదిగానూ, ఎవరికైనా అంటువ్యాధి వస్తే వారిని తక్కినవారినుంచి దూరంగా విడిగా ఉంచేందుకు ఈ చిన్న యింటిని ఉపయోగించేవారు. నర్మదాబహిన్ ఇంగ్లీషులో మాట్లాడుతుంది. అంచేత సూపరెంటెండెంట్‌తో ఆమెకి బాగా పరిచయం. ఆయనతో చెప్పి ఈ ఇంట్లోకి వచ్చింది. అందులో ఒక్కతే ఉంటుంది. గొప్ప యింటి బిడ్డ. ఇక్కడ మా అందరితో కలిసి ఉండటం ఆమెకి కొంచెం అసౌకర్యంగా ఉండేది. ఆ యిల్లు చక్కగా అలంకరించింది. ఎన్ని పరదాలు! ఎన్ని టేబిల్ క్లాత్‌లూ! నాలుగువైపులా పూలతోట వేసింది! రాత్రింబగళ్లు ఆ తోటలో చిన్న చిన్న పనులు చేస్తూంటుంది. రోజూ ఎన్నోపూలు నాకు ఇచ్చి వెడుతుంది. ఇప్పటికీ తలంపి దిక్కున ఉంది ఆమె యిచ్చిన గాజు పూలకుండి. అందులో రకరకాల పువ్వులు. పూలు చూడటానికి కాగితపు పూలులా ఉండేవి. కాస్తకూడా వాసన ఉండేవి కావు. బిలూ ఉంటే తప్పకుండా పేరు చెప్పేవాడు. ఆశ్రమంలో బిలూ ఎన్ని పూలచెట్లు నాటాడో అంతు ఉందా? ఏ క్రొత్త రకం పువ్వు పూసినా నాకు ఆ పువ్వు పేరేమిటో చెప్పి తీరాల్సిందే! నాకు ఆ పాడు యింగ్లీషు పేర్లన్నీ జ్ఞాపకముంటాయా? నర్మదా బహిన్‌కి బిలూలాగా పూలంటే - ఆసక్తి కనుక - ఆమె అంటే నాకు యిష్టం. కాని ఆమె నాకు యిన్ని పూలు యిస్తుంది - నాకు పువ్వుల సారం ఏం తెలుసు? ఇది కేవలం అడవిలో ముత్యాలు చల్లటమే. బిలూకి కనుక సెల్‌లోకి రోజూ కాసిని పూలు పంపగలిగితే అప్పుడు నీ యింగ్లీషు జోరు ఏమిటో తెలుసుకునేదాన్ని. నర్మదా బహిన్ దొరతో చెపితే - దొర తప్పకుండా ప్రతిరోజూ సెల్‌లోకి పూలు పంపటానికి అనుమతి ఇచ్చేవాడు. అది అనుకునే నర్మదా బహిన్‌కి ఒకరోజున బిలూకి పూలంటే ఎంత ఆసక్తో చెప్పాను. అది ఆమె మనస్సులో ఎందుకు చేసుకుంటుంది. విదేశాలకు వెడితే ధాన్యం, బియ్యాన్ని గురించి చదువుకుందా? విద్య అనేది వేరు. బుద్ధి అనేది వేరు. ఆ రోజునుంచి ఒక్క రాశిపూలు నాకిక్కడ యిచ్చి వెడుతుంది. దొర దగ్గిర చెప్పేప్పుడు తనకి యూరోపియన్ డైట్ కావాలన్న సంగతి కూడా చెప్పిందిగా! దొర నర్మదాబహిన్ కోసం రోజూ తన యింటి నుంచి ముక్కలు కోసిన నాన్‌రొట్టె పంపించేవాడు. నా మనస్సులోని సంగతి ఆమెకి స్పష్టంగా చెప్పటానికి కూడా సంకోచం కలిగేది. ఆ అమ్మాయి పెద్ద లెక్చరిస్తుంది. హరికథలు చెప్పేవాడిలాగా ఎప్పుడు పడితే అప్పుడు పగటివేళ వచ్చి మాకు సత్యం, అహింసల సంగతి బోధిస్తుంటుంది. హిందీ మాలాగానే మాట్లాడుతుంది. వచ్చీరాని పాడిపాడి హిందీలో ఏం చెపుతుందో వాటిలో సగం మాటలు అర్థం కానేకావు. కాని మధ్యమధ్య సత్యం,

అహింస, బాపూజీ అన్నమాటలు చెవిని పడుతూంటాయ్. ఇవన్నీ కనుక లెక్చర్ ఇవ్వవలసివస్తే హరికథకుడిలాగా ఇవన్నీ తియ్యగా చెప్పటం కూడా నేర్చుకోవాలి. గాంధీజీ ఆశ్రమంలో ఈ లెక్చర్లన్నీ నేర్పుతారా ఏం? లేదు - బిలూ ఒకసారి సబర్మతీకి వెళ్లాడు. వాడా సంగతి యెప్పుడూ చెప్పలేదు. అవునూ, ఇంతమంది జనం ఉండగా నర్మదా బహిన్ నాకే ఈ సంగతులన్నీ ఎక్కువ చెపుతుంది ఎందుకని? ఆమె ఏమనుకుంటోంది! నేనేం నిజం చెప్పనా? లేక ఇతరుల నగలూ అవీ చూసి అసూయతో చచ్చిపోతానా? అరె ఆ సంగతులన్నీ ఎందుకు చెప్పటం? ఇప్పటికి ఇరవై ఏళ్ల నుంచి అవన్నీ విని విని చెవులు దిమ్మెక్కిపోయాయి. ఎన్ని ఉపన్యాసాలు విన్నాను. నర్మదా బహిన్ నాకేదో కొత్త సంగతులు చెపుతున్నాననుకుంటోంది. ఆ మొదట్లో క్రొత్తగా ఆశ్రయమయినప్పుడు వారు నాకే సంగతులన్నీ బోధపరచటానికి ప్రయత్నించేవారు. అప్పుడు నా మనస్సు బిలూ, నీలూ, సంసారం మీద పడి ఉండేది. ఆ సంగతులన్నీ తెలుసుకోవాలని నాకు కోరికాలేదు. అర్థమూ చేసుకోలేను. ఈ చెవితో వినేదాన్ని, ఆ చెవిలోంచి బయటికి వెళ్లిపోయేవి. నాకు కలిగిన లాభాల్లో ఒక్కటే - వీటి ద్వారా వారికి మరింత దగ్గర కాగలిగాను. వారు మొదటినుంచీ కొంచెం గంభీర స్వభావులు. వారితో ఎప్పుడైనా మనస్సుని విప్పి మాట్లాడగలిగానా? మనస్సు విప్పి మాట్లాడట మేమిటి- భయంతో చచ్చిపోయేదాన్ని. మాకు ఇతరులందరిలాగా కాదు. భర్తతో మాట్లాడుతూంటే మనస్సుకి ఏది తోస్తే అది చెప్పకపోవటం, నవ్వువస్తే అపుకోవటం, ఎప్పుడూ ఇది యెలా బయట పెట్టటం - ఇదెలా బయటపెట్టటం అనే భావం ఇందులో ఉన్న దుఃఖం - ఆ దుఃఖాన్ని అనుభవించిన వారికే తెలుస్తుంది. వారే నాకు నేర్పటం మొదలెట్టారు. చరఖా సంగతి వస్తే, మహాత్మాజీ సంగతి వస్తే, దేశం సంగతి వస్తే హిందుస్తానీయుల ఎదుట ఏం మాట్లాడాలి! ఈ దేశంలో యెవరూ చరఖా నా భర్తలా పవిత్రమయినది, చరఖా మా నాడీ అంటే అర్థం చేసుకోలేరు. ఇక్కడ మరొక రకంగా చెప్పాలి. అందుకని వారు హిందీలో ఎన్నో పదాలు నేర్చుకున్నారు. వారు ఎన్నోచోట్ల రోజూ లెక్చర్లు ఇచ్చేవారు. వారికి ఈ పదాలు పాటలూ అవసరం. ఎప్పుడు జరిగిన సంగతోపాడు మరిచికూడా పోయాను. భర్తకి మళ్లీ రెండో పెళ్లి చేసుకోవాలని బుద్ధి పుట్టింది. భార్యకి తెలిసింది. "మీకు కోరిక కలిగితే పెళ్లిచేసేసుకోండి. నన్ను గురించి బెంగపెట్టుకోవలసిన అవసరంలేదు. నాకు చరఖా ఆధారం ఉంది" అన్నది. ఇలాంటి కథలెన్నో వారు నేర్చుకున్నారు. నేను కూడా బహుశా వారిలాగా లెక్చర్లు యిస్తూ తిరుగుతానని అనుకున్నారు. తర్వాత ఇవన్నీ నావల్లకాదని, కేవలం బూడిదలో ఆజ్యం

పోయటమైందని యెప్పుడైతే తెలుసుకున్నారో అప్పుడిహ చుక్కాని వదిలేశారు. నేనుకూడా వదిలేసి బ్రతికిపోయాను. మీరు అన్నీ వదిలేసి ఈరంగంలోకి వచ్చారు. మంచి పని చేశారు. నేను అందుకు వారించలేదు. నేను జీవితమంతా కష్టమనుభవించాలి. దానికి కూడా నేను సిద్ధమే. జైలుకి రమ్మన్నారు. జైలుకీ వచ్చాను. అలా అని జనం గుంపు మధ్య నిలబడి 'ప్యారా భాఇయోం' (ప్రియమైన సోదరులారా) అది నావల్లకాదు. మీ ఆశ్రమంలో సంసారం నడపటం, పిల్లల్ని పెంచి పెద్దవాళ్లను చెయ్యటం అది కూడా ఒకపనే...

రామ్‌గడ్ కాంగ్రెసుకి ముందు మీ మాటవిని 'రాభన్‌గామా'కి వెళ్ళి ఎంత యిరకాటంలో పడ్డాను! వెంటనే కొంతమంది స్వేచ్ఛా సేవికల్ని పంపమని పాట్నానుంచి ఉత్తరం వచ్చింది. గట్టి 'రిమైండర్'! వెంటనే వారికి ట్రైనింగ్ యివ్వాలి. లేకపోతే కాంగ్రెసు సమావేశం నాటికి వారు తయారుకాలేరు. మహారాష్ట్ర నుంచి ఒక గౌరవ మహిళ వచ్చి రామ్‌గడ్‌లో ఉన్నారు! స్వేచ్ఛా సేవికలకు ట్రైనింగ్ ఇవ్వటానికి. రాష్ట్ర గౌరవం పోయింది, మర్యాద పోయింది! జిల్లా గౌరవం యింక నిలిచేట్లు లేదు. జైలుకి వెళ్లటంలాగా చెప్పబోతే జిల్లాకి అయిదుగురు - నేను, హరదారేదుబేయిన్, బహురియాజీ, బుడ్‌హియా థాన్ కట్టా సరళాదేవి, చోపడా ఖాదజున్నిసా - ఆమెకీ కళ్లలో పువ్వులు వెయ్యటంతో కొన్నేళ్ల నుంచి యింట్లోంచి బయటికి వెళ్లటంలేదు. సరస్వతి మాత్రం ఈసారి వచ్చింది... అప్పుడు నాకు "కోడహా రాణాకి చెందిన కాంగ్రెసు వారి ఇంటింటికీ వెళ్లు. వారిని ఒత్తిడి చేసి వారి యిళ్లలోని ఆడపిల్లలచేత 'స్వయం సేవికా ప్రతిజ్ఞాపత్రం' మీద సంతకాలు చేయించుకుని రావాలి. మగవాళ్లు వెడితే కాదు. నువ్వెళ్లాలి..." అని హుకుం వచ్చింది. ఎవరు వెడతారో వారు ఏదో విధంగా డబ్బు ఖర్చులేకుండా కాంగ్రెసు చూడవచ్చు. ఎలాంటి వయసు పరిమితీలేదు. ఎక్కువ వయసైన గౌరవ కుటుంబాల్లో స్త్రీలయితే వారికి చాలా తేలికపనులు - ఇతర స్వేచ్ఛా సేవికల పిల్లల్ని సముదాయించటం, భాండారం తాళాలు జాగ్రత్త చెయ్యటం, లేదా ఇలాంటివి ఇంకేమైనా పనులు. వారు వెళ్లేప్పుడు ఇలాంటి చిన్న చిన్న ఉపదేశాలిచ్చి వెళ్లారు. వాలంటీరు మిస్రి నన్ను ఎడ్లబండిమీద 'రాభన్‌గావా' తీసుకొచ్చాడు. మధ్యాహ్నం వీధిలోని ఆడపిల్లలందరూ ఝూ-జీ గారి యింటి మెల్లాలో ప్రోగయినారు. నేను వారితో మాట్లాడుతున్నాను, కాంగ్రెసు స్వేచ్ఛ సేవికల సంగతి. అందరూ నన్ను యెన్నోరకాల ప్రశ్నలడిగారు. చెప్పలేసుకోకపోతే జరుగుతుందా లేదా గుర్రంమీద ఎక్కిపోలేదా? సిందూరం ధరించటం, ఆదివారాలు చెయ్యటం నిషేధించటం - ఇంకా యెన్నో అనవసరమైన ప్రశ్నలు. తర్వాత కొందరు

రాజీపడ్డారు. మగవాళ్లు అభ్యంతరపెట్టకుండా ఉంటే అన్న షరతు మీద. మళ్లీ ఇంటి యజమానుల దగ్గరకు పరుగెత్తాను. అందరితో కొంచెం ముఖ పరిచయాలు మొదటి నుంచీ ఉన్నాయి. కొన్నాళ్లు వారందరూ ఆశ్రమంలోకి వెళ్లి ఉన్నారు. వారుకూడా మొదట్లో నీళ్లు నమిలారు. తర్వాత ఒకరు రాజీ అవటంతో వెంటనే అందరూ రాజీపడ్డారు. నేను ప్రతిజ్ఞా పాలన పత్రాలు తీసుకురావటానికి మళ్లీ యింట్లోకి వెళ్లాను. వాటిమీద సంతకాలు చేయించుకు రావటానికి సిరా వచ్చింది, కలం వచ్చింది. కొంతమంది సంతకాలు, వేలిముద్రలు అయిపోయాయి. ఝా-జీ కూతురు శకుంతల ఫారంమీద సంతకం పెట్టటానికి ముందు ఆ పత్రాన్ని బిగ్గరగా చదివాడు. 'మైఁ దేశ్‌కే వాస్తే హరతరహ్‌కీ కుర్‌బానీ కే తైయార్ హూఁ" నేను దేశం కోసం సకలవిధ త్యాగాలకీ సిద్ధంగా ఉన్నాను... అఁ... కుర్‌బానీ ఏవిటి? ఇది సరిగ్గా తెలియలేదే! అవును, బెంగాలీ అమ్మగారూ! దేశంకోసం అన్నివిధాలైన 'కుర్‌బానీ' చేస్తాను. ఈ మాట వ్రాయించుకోవటం మీకు న్యాయమేనా? మొదట్లో అందరూ మెత్తబడ్డారు. బేల్‌గరామియా అమ్మమ్మ కొంచెం కోపం తెచ్చుకుని నాతో "మాకా మహాత్మాజీ - బాపూజీ తెలియవు, ఏమిటి మీరిలా చెయ్యటం? మీకు ముసల్మానులు కావాలని ఉంటే అవండి. మా జాతిని పట్టుకు లాగటందేనికి? ఈ పనికోసం మీరు ఆశ్రమం నుంచి ఇంతదూరంగా ఎగిరి వచ్చారా? ఛీ! సిగ్గుకూడా వెయ్యటంలేదూ? గురువులు సాక్షాత్తూ భగవతి... మాజాతి పోగొట్టటానికి దస్కతులు తీసుకుని ప్రమాణాలు తీసుకెళ్లటానికి వచ్చారా?" అన్నది. దాంతో అందరూ కలసి నామీద పడ్డారు. నాకూ ఈమాటకు సరైన సమాధానం దొరకలేదు. నిజంగానే 'కుర్‌బానీ' అనేమాట ఇందులో వ్రాయటం దేనికి? ఇక్కడకు వచ్చేముందు ఆయన అన్ని సంగతులూ చెప్పారు. ఈ సంగతి నాకు వివరంగా ఎందుకు చెప్పలేదు? బహుశా హిందువుల ప్రతిజ్ఞా పత్రాలకు బదులు ముసల్మానుల ప్రతిజ్ఞా పత్రాలు వచ్చాయేమో! అప్పుడింక భయంతో నాకు ఒళ్లంతా చెమటలు పోయసాగింది. వారితో 'నాకు హిందీ రాదు. బహుశా కాగితాలు తారుమారయి ఉంటాయ్' అని వివరించాను. అప్పటికీ వారి కోపం తగ్గితేనా? తర్వాత బయట ఝా-జీ గారిదగ్గరకెళ్లి "మరొకరోజు వస్తాను, వేరే ప్రతిజ్ఞా పత్రాలు తీసుకుని" అని చెప్పాను. ఝా-జీ ప్రతిజ్ఞా పత్రం చదివి విరగబడి నవ్వారు. "ఇందులో సరిగ్గానే వ్రాసి ఉంది. హిందీలో కుర్‌బానీ అంటే త్యాగం" అన్నారు. చూశారా? ఎంత పని జరిగిందో? యెక్కడ కుర్‌బానీ? ఎక్కడ త్యాగం! వెధవది నాకదంతా ఏం తెలుసు? పోనీ నాకు అంటే తెలియదు, మెల్లాలో అంతమంది ఆడ-మగ ఉన్నారు. వాళ్లలో ఎవరికీ ఆ మాటకి అర్థం తెలియదా?

అలాంటప్పుడు ఇలాంటి మాట వ్రాయవలసిన అవసరమేమొచ్చింది? ఎవరికోసం వ్రాయబడిందో వారికే తెలియకపోవటం. అయినా వ్రాయాలి. వంగి వంగి నమస్కారాలతో ఆ రోజు పని పూర్తి అయింది. నేను ఆశ్రమానికి తిరిగి వచ్చి "ఇవిగో మీ కాగితాలు! మీ పని పాదాలకు శతకోటి నమస్కారాలు. నేను మళ్లీ ఏ కాంగ్రెసు పనిమీదయినా బయటికి వెడితేనా!" అన్నాను. నీలూ దీన్ని గురించి నన్నెంత ఎగతాళి చేశాడు!

సఖావతీజీ కొడుకు "బ్యాంగాజీ! బ్యాంగాజీ!" అని అరుస్తున్నాడు. నన్ను 'బ్యాంగాజీ!' అని పిలుస్తాడు. నాకు చాలా మాలిమి. రాత్రింబగళ్లు నా చుట్టూ తిరుగుతాడు. నా ఒళ్లో కూచోవాలని ఎత్తు - బాగా అల్లరిచేస్తూ చెప్పిన మాట విననప్పుడు వాళ్ల అమ్మ వాణ్ణి నా దగ్గిర యిచ్చి వెడుతుంది. నా ఒళ్లోకి వచ్చి కూర్చుని శాంతపడతాడు. పిల్లవాణ్ణి వెంట తీసుకురావలసింది. మన్‌చనియా ఎప్పుడో నిద్రపోయింది. ఇప్పట్లో యింక లేవదు. ఇప్పుడు డ్యూటీ గల్‌కట్టిది. ఆమె కూడా విసనకర్ర తీసుకుని నా ప్రక్కన కూర్చుని నిద్రమత్తులో తూలుతోంది, చూశాను. పగలంతా పప్పులవీ బాగుచేసే సెక్షన్‌లో పనిచేస్తుంది. ఇప్పుడు రాత్రంతా మేల్కొని ఉండగలదా? జైలుకి వస్తున్నాంకదా అని నిద్రనీ వాటినీ ఇంట్లో వదిలేసి రాలేదుగా! నేరం మాత్రం యేం చేసింది? నిర్భాగ్యుడైన భర్త అత్యాచారాలతో నానా బాధలూ పడి ఆత్మహత్య చేసుకోబోయింది. మంగలి కత్తితో తనగొంతు తానే ఎలా కోసుకుందో! తలచుకుంటేనే ఒళ్లు కంపించిపోతుంది. ఇప్పటికీ గొంతుకేసి చూడటానికి వీల్లేదు. గాయంలేదు. కాని గొంతు నరాలు తెగిపోయి, ఇంతమేర రంధ్రం పడింది. లోపల నరాలు కన్పిస్తుంటాయి. ఈ కోసుకొన్న చోటుని ఇరవైనాలుగు గంటలూ పైన గుడ్డతో కప్పి ఉంచుతుంది. లేకపోతే మాట్లాడేప్పుడు పుస్ పుస్‌మని అందులోంచి గాలి పైకి వస్తుంది. భోజనం చేసేప్పుడు అందులోంచి తినే వస్తువులు బయటికి వస్తాయి అంటుంది. ఇలా పైన గుడ్డచుట్టి ఉంటే నీళ్లు త్రాగేప్పుడు పైన గుడ్డ కాస్త తడుస్తూంటుంది. చూడండి దౌర్భాగ్యురాలి అదృష్టం! చస్తే తానూ 'బతికిపోయేది' భర్త కోపమూ చల్లపడేది. చావనూలేదు, ఏం లేదు. మధ్యలో ఆత్మహత్య చేసుకోటానికి ప్రయత్నించినందుకు ఒక ఏడాది జైలుశిక్ష పడింది. ఏమిటో వీరి చట్టం! తమ ప్రాణాలమీద కూడా అధికారం లేదు. చావాలని కోరుకోని వారికేమో ఉరివేస్తారు. చావబోయిన వారినేమో తీసుకువచ్చి జైల్లో పడేస్తారు. పిల్లవాడు కాపాడమని అరుస్తున్నాడు. వాడు గొంతు చించుకుని చచ్చిపోతున్నాడు. వాళ్ల అమ్మ మూర్ఖత్వాన్ని, ఏమనాలి! పాపం! కుర్రాడు ఇవాళ రోజంతా నా దగ్గిరకు రాలేకపోయాడు. సఖావతీజీ కొడుకుతో - బాంగాజీ దగ్గరకు వెడతావా యేం లాడ్లీ?

బాంగాజీకి ఇవాళ జబ్బు చేసింది. రేపు ప్రొద్దున్న వెళ్లు. జబ్బుచేస్తే ఆమె దగ్గరకెడతారా ? అంటోంది. పిల్లవాడు కాసేపు ఊరుకుని, ఆమాట అర్థం చేసుకోటానికి ప్రయత్నించా డనుకుంటాను. తర్వాత మళ్లీ "బాంగాజీ!" అంటూ వాడి ఏడుపు మొదలైంది. సుఖావతీజీ కొడుకుమీద కోపగించుకుంది. "ఇదుగోచూడు, అక్కడ గల్‌కట్టి దగ్గరకు తీసుకెడతాను" పిల్లవాడు మెదలకుండా ఊరుకున్నాడు. భయం మూలంగా అనుకుంటాను. మళ్లీ 'బాంగాజీ!' అంటూ ఒకటే అరవటం మొదలెట్టాడు. మారాం. ఎంత మొండిపట్టు బాబూ పిల్లవాడికి! ఇంతపిల్లవాడికంత మొండితనం... ఠపీమని పిల్లవాణ్ణి పట్టుకుని నాలుగు కొట్టింది. తల్లికి కాస్తకూడా దయ, జాలీ అనేవే లేవు. 'గల్‌కట్టీ! గల్‌కట్టీ చప్పున లాడ్‌లీనిక్కడికి తీసుకురా. గల్‌కట్టీ బొంగురు కంఠంతో "ఆ పిల్లాడు నా చేతుల్లోకి వస్తాడా యేం" అని బదులు చెప్పింది. గల్‌కట్టీ ఎంత బద్ధకస్తురాలు! నిద్రవస్తోంది, లేవబుద్ధి కావటంలేదు. ఏదో సాకు చెప్పేసింది. నేను గల్‌కట్టీని పిలవటంవిని బహురియాజీ, కామ్లా అందరూ వచ్చి "ఎందుకు పిలిచారు? మంచినీళ్లు కావాలాయేం?" అని అడిగారు. బాప్‌రే! వెధవచావు - ఎందుకు పిలిచాను గల్‌కట్టిని వీళ్లందరూ ఇక్కడే మెదలకుండా కూర్చున్నారు అని నాకేంతెలుసు! నిజంగానే గల్‌కట్టీని చూసి, పిల్లవాడు భయంతో కొయ్యబారిపోయాడు. లూసీ జమాదారిణి దగ్గిర్నుంచి బట్టలుతికే సబ్బుకి బదులు మా వార్డ్‌లో అందరూ మధ్య మధ్య బీడీలు తీసుకుంటారు. గల్‌కట్టీకి ఆ బీడీలిచ్చి, అందరూ కలసి తెగిన రంధ్రంలోంచి పొగెలా వస్తుందో తమాషా చూస్తారు. గల్‌కట్టీకి నాలుగు బీడీలిస్తే ఒక్కసారి గొంతుపైన కట్టుకున్న గుడ్డ తీసి పొగరావటం చూపిస్తుంది. లాడ్‌లీ ఇదంతాచూసి, భయంతో నీలంగా అయిపోతాడు. నన్ను కావిలించుకుని పట్టుకుంటాడు. అరె! చిన్న పిల్లాడు! చాలామంది పెద్దవాళ్లే ఈ దృశ్యం చూస్తే మూర్ఛవచ్చి పడిపోతారు!

నా దగ్గిర్నుంచి ఏమీ బదులు రాకపోవటంతో బహురియాజీ తూలుతున్న గల్‌కట్టీని కదిలించివేసి "బెంగాలీ అమ్మగారు పిలవటంలేదుటే?" అని అడిగారు. "అమ్మగారు లాడ్‌లీని తీసుకురమ్మని చెప్పారు."

"అలా చెప్పు నేనే తీసుకువస్తాను వాణ్ణి. ఇదిగో గల్‌కట్టీ, నువ్వు ఈ గుమ్మంలోకెళ్లి కూచో కాసేపు. నువ్వుంటే పిల్లవాడు ఇక్కడ కూడా అరుస్తాడు! లాడ్‌లీ నిద్రపోయాక మళ్లీ యిక్కడికొచ్చి కూర్చుందువుగాని..."

గల్‌కట్టీ నిట్టూర్పు విడిచి బ్రతికిపోయింది. బహురియాజీ పిల్లవాణ్ణి తీసుకువచ్చి నాకు యిచ్చింది. లాడ్‌లీ ఒక్కసారి నా మెడ వాటేసుకున్నాడు. పడుకుంటావా, పడుకో,

నేను కాస్త విసురుతాను. అర్ధరాత్రి వేళ మంచి పిల్లలు మేలుకు కూర్చుంటారా? నా మాట ఎంచక్కగా వింటాడు లాడ్‌లీ! ఏడుపు ఏమయిపోయిందో, ఆ పంతం ఎక్కడికి పోయిందో! లాడ్‌లీ నా గుండెలకతుక్కుని పడుకున్నాడు. నేను వాడిచేతిలో పడుకుని ఉన్న నర్మదా బహిన్ ఇచ్చిన పువ్వును పెట్టి, రేపు ప్రొద్దున అన్ని పూలు యిస్తాను. అన్నాను. వాడి చేతిలో పువ్వు జారవిడిచేశాడు. వాడికిప్పుడు పూలు అక్కర్లేదు. ఏమీ అక్కర్లేదు. వాడు ఏం కావాలనుకున్నాడో దాన్ని పొందాడు. కాస్త విసరకపోతే మళ్లీ దోమలు పీకేస్తాయి. విసనకర్ర వెతుక్కోటంచూసి, బహురియాజీ కాస్త దగ్గిరకొచ్చి కూర్చుంది విసరటానికి. ఇంతవరకుదాకా ధైర్యం చాల్లేదు - మళ్లీ నేనెక్కడ కోపగించు కుంటానో అని... అవునూ. ఈ పిల్లవాడు నన్నింత ప్రేమిస్తున్నాడని - సఖావతీజీకి నామీద కోపం వస్తుందా? మనసులో ఏమీ రాలేదు. అయితే మరి నేను జితేన్ తల్లిమీద, అక్కమీద కోపం తెచ్చుకున్నాను? నా కంటె సఖావతీజీ మనసు చాలా మంచిదని చెప్పాలి. నర్మదా బహిన్ ఊరికే నామీద అహింసా సూక్తులు చల్లుతుందా? బహురియాజీ కూడా లాడ్‌లీని చాలా ప్రేమిస్తూంది. ఆమె చిన్నకూతురు లజ్జాతో లాడ్‌లీకి బాగా స్నేహంగా! లజ్జా వయస్సు అయిదేళ్లు. కాని ఆ పిల్ల తల్లిని విడిచిపెట్టి ఉండలేదు. అరెస్టయిన తర్వాత బహురియాజీ - లజ్జాను తన పినతల్లి దగ్గర ఉంచుదామనుకున్నది. కాని ఆ పిల్ల ఏమయినా తల్లి కొంగు విడిచిపెట్టలేదు. పెద్ద చిక్కు వచ్చి పడింది! ఇటు చూస్తే మూడేళ్లు దాటిన పిల్లల్ని వెంట తీసుకుని జైల్లోకి రావటానికి వీల్లేదు. ఇన్‌స్పెక్టరు కూడా పిల్లను ఉంచి రమ్మన్నాడు. అప్పుడు బహురియాజీ గత్యంతరం లేక ఇన్‌స్పెక్టరుతో తగవు పెట్టుకుంది. "ఈ పిల్ల వయస్సు మూడేళ్లకంటె ఎక్కువని ఎవరు చెప్పారు? కొలిచి చూసుకోండి. అడుగున్నర యెత్తు పిల్లకి అయిదేళ్ల వయస్సుంటుందా ఎక్కడైనా? దాన్ని వెంట తీసుకురానివ్వకపోతే మీరు నన్ను ఎలా పట్టుకెళ్లగలరో చూస్తాను. ఇప్పుడే స్వరాజ్యం వాలంటీర్ల జేత నిన్ను అరెస్టు చేయిస్తాను" అన్నది. ఇన్‌స్పెక్టరు ఆ చిక్కులన్నీ తెచ్చుకోటం దేనికి అనుకున్నాడు. లజ్జాతో సహా తీసుకొచ్చి జైల్లో పెట్టాడు. రాత్రింబగళ్లు - లజ్జా - లాడ్‌లీ కలిసి ఆడుకునేవాళ్లు. ఆడుకోవటం ఏమిటి? లజ్జా లాడ్‌లీని చంకనెత్తుకుని భుజాన యెక్కించుకుని తిరుగుతూంటుంది. ఇక్కడ ఇంక వేరే సావాసగాళ్ళు యెవరూ లేరు. కలిస్తే మరో వార్డులోని అలగా జాతులవాళ్ల చెడ్డ పిల్లలతో కలిసి తిరగాలి. పైగా వాళ్లకి రకరకాల పాడు జబ్బులు! ఇరవై నాల్గు గంటలూ వాళ్లలో వాళ్లు తిట్టుకుంటూంటారు. వాళ్లతో మన పిల్లల్ని కలిసి తిరగనివ్వగలమా? అందుకే మనమందరం పిల్లల్ని ఎనిమిది ఝాములూ కనిపెట్టుకుని ఉంటాం. పాపం! ఆ పిల్ల

కొద్దిరోజులు రక్త విరేచనాల మూలంగా చనిపోయింది. తల్లి ప్రాణం కదా! బహురియాజీకి పాపం ఎంత దుఃఖం! ఎంత శోకం వచ్చింది! పాపం రొమ్ములు బాదుకుంటూ - నేను దాన్ని వెంటపెట్టుకుని రాకపోతే బహుశా దానికీ దశే పట్టేదికాదు అని ఏడ్చింది. లాడ్‌లీ కూడా లజ్జా చనిపోయినప్పట్నుంచీ రోజు రోజుకీ ఏమిటో చిక్కిపోతూ వచ్చాడు. జైల్లో పిల్లవాడికి అర్థశేరు చొప్పున పాలు వస్తాయి. అవీ నీళ్లపాలు... వెన్న తీసేసిన గేదెపాలలో కాంట్రాక్టరు నీళ్లు కలిపి, తీసుకొస్తాడు. తర్వాత గేట్‌లో, గోడవున్‌లో, వార్డ్‌లో ఎన్నిచోట్లలోకి పాలు వస్తాయో అన్నిచోట్లలో వార్డరు, మేట్, పహరాలు, ఖైదీలు అందరూ వాటిలోంచి ఒకొకగ్లాసు పాలు తీసుకుని పచ్చివే గడగడా త్రాగేస్తారు. ఇది చట్టబద్ధమైన నియమమే. ఇందులో దొంగచాటు ఏమీలేదు. కేవలం బాధ్య బాధకత మాత్రం ఒకటుంది. ఎవరైతే గ్లాసుపాలు తీసుకుంటారో వారు శ్రమపడి పాలడ్రమ్ములో సరిగ్గా గ్లాసెడేసి నీళ్లు మాత్రం పోయాలి. ఆ పాలు యిక్కడకు చేరే సరికి అవి త్రాగి పిల్లలు బ్రతకటం కష్టమైనంత యిదిగా తయారవుతాయి. చిన్నపిల్లలకు జైల్లో నుంచి గుడ్డలు చొక్కాలు, తినే వస్తువులు యివ్వరు. పాలుకాక తక్కిన వస్తువులు తినటం అలవాటు పడినవాళ్లు ఇంకా తల్లుల వెంట రావాల్సిన అవసరం ఏమిటి? అని ఆలోచిస్తా రనిపిస్తుంది. తిరుగులేని దివ్యమైన స్పష్టమయిన సమాధానం!

పాపం! పిల్లవాడి పొట్ట అంటుకుపోయింది! ఎందుకనో! తల్లి రాత్రి ఏమీ తినిపించలేదా! నా కోసం తెచ్చిపెట్టిన ఆహారం తలంపి దిక్కున అలాగే ఉంది. కాస్త పెట్టనాయేం? వద్దు వద్దు. మళ్లీ అవన్నీ తింటే ఏదైనా జబ్బు చెయ్యచ్చు. అప్పుడు వాడి తల్లి ఆ జబ్బు నయం చేయించటానికి సతమతం కావలసివస్తుంది. ఎంత మెత్తని ఒళ్లు. బిలూ చిన్నప్పుడు ఇలాగే చంక కరుచుకుని నిద్రపోయేవాడు. వాడు మామగారి ఒళ్లో కూచునేవాడు. ఆ ఫొటో తీసినప్పుడు వాడు సరిగ్గా యింతే ఉండేవాడు. వాడు ఏమైనా ఊరికే కూర్చునే వాడుకాదు. దూరం నుంచి నేను ఒక చెరుకు ముక్క చూపించాను. అదిచూసి వాడు సంతోషంతో పొంగిపోతూన్న సమయంలో - మరది నితాయీ ఆ ఫొటో తీశాడు. అది ఈనాటి సంగతా? జబ్బు చేసేం తర్వాత ఎంత సన్నబడిపోయాడు! ఇరవై నాలుగు గంటలూ ఏదో తినాలని ఉండేది. అయినా అందు కోసం నోరుతెరచి గునుస్తూ ఏడుస్తూ కూర్చునే అలవాటు వాడికెప్పుడూలేదు.

నేను వాణ్ణి బల్లమీద కూర్చోపెట్టి వంటింట్లోకో, స్టోర్‌రూములోకో వెళ్ళాను. అక్కడ ఏదో పని తగిలి ఉండిపోవలసివచ్చింది. కాసేపయాక వచ్చి చూస్తే పిల్లవాడి రెండు కళ్ళవెంబడి నీళ్ళు కాల్వలు కడుతున్నాయి. కింది పెదివి మాత్రం కొంచెం

బయటికి వచ్చింది. కొంచెం వణికిపోతున్నాడు. నన్ను చూడగానే వాడికెంత అభిమానం! ఎంత అభిమానం! "నేను రావటం ఆలస్యమయిందని ఏడుస్తున్నావా? నేను చచ్చిపోను. నేను చచ్చిపోను! నా బిలూ ఎంత బుద్ధిమంతుడు!" అని వాడి తల గుండెలకు హత్తుకున్నాను. దాంతో బిడ్డ శాంతించాడు. మధ్య మధ్య కాస్త ఎగశ్వాస సవ్వడి. ఇప్పటికీ ఆ ఎగశ్వాస యేదో ఉండి ఉండి మెడకి సోకుతున్నట్లే ఉంటుంది. లాడ్‌లీ! నువ్వు ఆ చిన్నప్పటి నా బిలూవా? నీ మెత్తమెత్తటి ఒంటికి ఒక్కసారి అలాంటి గగుర్పాటు కలిగించనా? వద్దు, వీళ్ళందరూ చూస్తున్నారు. మళ్ళీ ఏమనుకుంటారో! బిలూని ఇప్పుడు కనుక ఒక్కసారి పొందగలిగితే, ఒక్కసారి గుండెల మీదికి లాక్కుంటాను. ఏమాత్రం సేపయినా కానీ - హృదయం కాస్త చల్లబడుతుంది. ఇద్దరం ఒక్కసారి ఏడిస్తే మనస్సుకి కాస్త శాంతి కూడా కలుగుతుంది. చివరి సమయంలో దగ్గిర ఉండే అవకాశాన్నయినా కలిగించలేదు భగవంతుడు! నాలుగువైపులా చుట్టూ ఇనుప కటకటాలూ, తాళాలూ, యుద్ధంలో ఇనుము చాలా అవసరం అని విన్నాను. యుద్ధ సమయంలో ఎక్కడో చర్చి గంటలు కరిగించి ఫిరంగులు తయారుచేశారుట అని బిలూ కథ చెప్పాడు. వారికీ జైల్లోని ఈ కుప్పలు కుప్పలు ఇనుము మీద దృష్టిపడలేదా? ఇన్ని ఈ పాడుగుండె నిట్టూర్పులు యముడి సింహాసనాన్నయినా కదిలించి వెయ్యగలవు.

"బహురియాజీ! నిజంచెప్పు భగవంతుడు నాకు అన్యాయం చెయ్యాలా?"

బహురియాజీ నా ముఖంకేసి చూస్తూ ఉంది. ఈ ప్రశ్నకి ఆమె సిద్ధంగా లేదు. ఆమె నా మాటకు సమాధానం చెప్పలేదు. ఒకసారి నైనాదేవి ముఖంకేసి చూసి, ఏదో సైగ చేసింది. తర్వాత నా జుట్టులోంచి మెల్లిమెల్లిగా వ్రేళ్ళుపోనివ్వసాగింది. గట్టిగా విసరసాగింది. నిన్ను హఠాత్తుగా ప్రశ్నించటమైతే ప్రశ్నించాను. కాని సమాధానాన్ని కోరనూలేదు, ఆశించనూ లేదు.

లాడ్‌లీ ఎప్పుడో నిద్రపోయాడు. ఇంత పిల్లవాడు, కాని పెద్దవాళ్ళలాగా గుర్రుపెడుతున్నాడు. పాపం! ఒక ప్రక్కకి ఒత్తిగిలిపడుకున్నాడు. వెండి బిళ్ళలు జరిగి జరిగి పొట్టమీది ముడతల్లోకి వచ్చాయి. మొలను మొలత్రాటికి ఇన్ని వెండిబిళ్ళలు వ్రేలాడకట్టి పెడుతుంది. సఖావతీజీ అది ఏదో పెద్ద అందంగా ఉంటుందనుకుంటుంది. నేను ఎన్నోసార్లు ఇది జైలు, ఇక్కడ వెయ్యి రకాల స్వభావాలు గలవాళ్ళు వుంటారు. వెండిమీద ఆశతో ఎవరెప్పుడేం చేస్తారో - అప్పుడిహ ఎంత ఏడ్చినా లాభముండదు - అని చెప్పాను. సఖావతీజీ ఎక్కడ వింటుంది? ఈ మొలత్రాటిలో యే మంత్ర తంత్ర శక్తులున్నాయో ఎవరికి తెలుసు?

బిలూ చిన్నపిల్ల వాడప్పుడు - వాడి నుదుడిమీదకున్న జుట్టును - జడ వేసి ముడివేసేదాన్ని. చిక్కిపోయి ఉండేవాడుగా! అన్నం తినగానే పొట్ట వినాయకుడి పొట్టలా ఉబ్బేది. వాణ్ణి మురిపించటానికి "చాలు, ఇహ అయిపోయింది. ఇంక లేవాలి... బా..బా..రే!" అనేదాన్ని. వెంటనే తన పొట్ట చూపిస్తూ "వాతాపి జీర్ణం" చెప్పు అనేవాడు. ఎప్పుడో ఒకసారి వాడి పొట్టనిమురుతూ "జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణం... మా బాబు మామూలుగా అయిపోవాలి. మా బిలూ బాబు కింక జబ్బు చేయదు" అన్నాను. ఆ మాట జ్ఞాపకం పెట్టుకున్నాడు. అన్నంతిన్న తర్వాత రోజూ వాడి పొట్ట నిమురుతూ 'వాతాపిజీర్ణం' చెప్పాల్సిందే! తర్వాత పీటమీది నుంచి లేచేప్పుడు - మోకాళ్ళమీద చేతులు మోపి 'అబ్బా!' అనేవాడు. ఏదో ముసలివాడిలాంటి భావం... వాడికేదో, లేవటానికి నిజంగానే కష్టమయేది.

ఎన్నో రోజుల ఎన్నెన్నో చిన్న చిన్న సంఘటనలు ఒకటి తర్వాత ఒకటి జ్ఞాపకం వస్తున్నాయి. బిలూ! నిన్ను యింత కష్టపడి పెంచి పెద్దవాణ్ణి చేశాను! ఇలా మోసం చేసి వెళ్ళిపోతావా? నా దుఃఖం సంగతి తలచుకుని, చివరి సమయంలో నువ్వు మాత్రం విచారించకు. నీ యింతటి కష్టాన్ని నేనేమీ తేలికచెయ్యలేకపోయాను. ఇప్పుడు వాడి మనస్సు యెంత ఇదిగా ఉంటుందో. అది నాకు తెలియదూ? దానికితోడు నా సంగతి జ్ఞాపకం చేసుకోవటంతో ఒకవేళ నీ గుండెల బరువు యెక్కువయేట్లయితే - నా దుఃఖానికి అంతు ఉండదు. నువ్విప్పుడు నీ తల్లి నిన్నూ ఎప్పుడూ ప్రేమించలేదనే అనుకో.

నైనాదేవి బహురియాజీతో మాట్లాడుతోంది. కంఠస్వరం కొంచెం కాకమీద ఉంది. "అలా అయితే భగవంతుణ్ణి ఇందులోకి లాగటం ఎందుకు బాబూ! శిక్ష విధించింది సర్కారువారు. కాని అమె తప్పుమాత్రం దేవుడిమీద వేస్తోంది. వెనుకటి కథ ఒకటుందిగా! "ఒక బ్రాహ్మడికొక గుర్రం వున్నది. ఆ బ్రాహ్మడి పొరుగున ఒక చాకలి ఉన్నాడు. ఆ బ్రాహ్మడు పూజ మొదలుపెట్టేసరికి చాకలివాని గాడిద వికృతంగా ఓండ్రపెడుతూ అరిచేది. బ్రాహ్మడు అందుకు మండిపడి భగవంతుని దగ్గిర మొరపెట్టుకున్నాడు. "హే భగవాన్ చూడు ఈ గాడిద నిన్ను పూజ చెయ్యనియ్యటంలేదు. నిన్ను ప్రార్థించటం మొదలుపెట్టగానే అది అడ్డువస్తోంది. దాన్ని చంపెయ్యి నువ్వు"... కొన్నాళ్ళయింతర్వాత - బ్రాహ్మడి గుర్రం జబ్బుచేసి చచ్చిపోయింది. అప్పుడా బ్రాహ్మడు - భగవంతునితో భగవాన్! ఇన్నాళ్ళనుంచి, భగవంతుడిగిరి చేస్తున్నావ్. ఇప్పటికీ గుర్రమేదో, గాడిద యేదో తెలియదా? ఇదీ అలాంటిదే! భగవంతుడికీ దీనికీ ఏం సంబంధం? ముక్కు

మూయకుండానే ఊపిరి తీసుకోవటం బంద్ చేయించవచ్చు. కాని చెవుల్లో వ్రేళ్ళు పెట్టుకోకుండా వినటం బంద్ చెయ్యటం ఎందుకని? ఇప్పుడు చెవుల్లో వ్రేళ్ళు పెట్టుకోవటం కూడా బావుండదు. అందరూ చూస్తున్నారు. ఆ విషముఖిని నేను ఎరగనూ! ఆ బహురియాజీతో ఇంకా ఎన్నో మాట్లాడుతోంది. కొంచెంసేపటి క్రితం అతడితో కొంచెం తీక్ష్ణంగా మాట్లాడానుగా - ఆ విషమే యిక్కడ దులిపింది. అప్పుడే తెలుసు నాకు. ఆమె వదిలేసి మాట్లాడే ఆడదా? ఒక్కరాత్రి కూడా ఓర్పు వహించలేకపోయింది. ఇవాళ రాత్రికయినా నన్ను క్షమించలేకపోయింది. నువ్వా పిల్లలతల్లివే! ఏం రకం మాటలవి. తలాలేదు, తోకాలేదు. ఎక్కడో విన్న కథ! పెద్ద పాండిత్యం వెళ్ళబోశానని అనుకుంది. ఇదేమిటి నైనాదేవి ఇంతలోనే మెదలకుండా ఊరుకుంది. బహుశా బహురియాజీ దగ్గిర ఆర్డరు పొందలేదనుకుంటా...

కేవలం బిలూ - నీలూల చిన్నప్పటి సంగతులే జ్ఞాపకం వస్తాయి ఎందుకని? బహుశా వాళ్ళు నాకు ఆ చిన్నప్పటిలాగానే ఉన్నారనేమో!

ఇద్దరూ ప్రక్కమీద పడుకున్నారు. నేను పనులన్నీ ముగించుకుని గదిలోకి వచ్చి "క్యా బచ్‌కన్ చటకన్ ఘూమత్ హో? ఏం బచ్‌కన్ చట్‌కన్ నిద్రపోతున్నారా?" అని అడిగాను. బిలూ బచ్‌కన్, నీలూ చట్‌కన్. వెంటనే ఇద్దరూ ఫక్కున నవ్వారు. నీలూ - "అమ్మకి ఎన్నిసార్లు చెప్పాను. హిందీలో 'ఘూమ్‌త్ హో' ఘూమాచ్ఛే (నిద్రపోతున్నారా?) అని కాదు. దాని అర్థం తిరుగుతున్నారా అని... అదీ జ్ఞాపకంలేదు అమ్మకి" అన్నాడు. "అమాయకుడివెక్కడో? అమ్మ అన్ని తెలిసి, కావాలనే మనల్ని నవ్వించటానికి అన్నది" అంటాడు బిలూ... ఇంతంత పిల్లలు. ఇద్దరూ ఎంత గంభీర పండితుల్లాగా ఆలోచిస్తారు? ఈ సమయంలో వాళ్ళు గాంధీజీ మార్గానికి రాకుండా ఉన్నట్లయితే! రావటం రాకపోవటం భారం వారిమీద ఉందా? అది యజమాని కోరి చేసినపని. ఇప్పుడు కనుక బిలూ నాన్నగారొకసారి దగ్గిరకొస్తే - బాగా అడిగేస్తాను. 'ఆఁ చూడండి తండ్రి అయి ఉండి పిల్లల్ని ఏ దారిలోకి తీసుకొచ్చారో. జీవితమంతా నాకు ఒకరకంగా వెళ్ళింది. ఒక్క రోజుకూడా మనశ్శాంతి పొందలేకపోయాను. పిల్లల్ని ఒక్కరోజు కూడా నవ్వులతో సరదాగా స్వేచ్ఛగా ఉండనివ్వలేకపోయాను. జీవితమంతా ప్రొద్దున్నుంచి రాత్రివరకు రెక్కలు ముక్కలయేలా పనిచేస్తూ వచ్చాను. అది యిందుకేనా? పిల్లలు చిన్నవాళ్ళుగా ఉన్నప్పుడు - వీళ్ళను ఎంతో పైకి తీసుకురావాలనుకున్నాను. పెద్దవాళ్ళయింతర్వాత ఎవరి దారి వారు చూసుకుంటారు. మగపిల్లలు దిగులెందుకు? ఆ తర్వాత పెళ్ళాడి సంసారాలు చేస్తారు. ఆ మాట ఆలోచించినా మనస్సుకి శాంతి! కాని

జరిగిందేమిటి? పెద్దపిల్లవాణ్ణి చదివించనేలేదు. చదివిన దానికి కూడా ఇటువైపే మనస్సు. ఈసారి జైల్లోంచి బయటికి రానీయండి. ఇంక నీలూని ఈ దారినే ఉండనిస్తానా? తమ్ముడిదగ్గిర లాటీదెబ్బలు, చీపురుదెబ్బలు తినవలసివస్తే దానికైనా ఒప్పుకుంటా. కాని నీలూని మాత్రం అక్కడికి పంపించేస్తాను. ఏదో ఒక సంపాదన ఏర్పాటనేది అతడు తప్పకుండా చేస్తాడు. నన్ను పెళ్ళిచేసుకుని తీసుకొచ్చారు. నేను మీ ఆశ్రమం హోటల్లోని దాసీలకంటె అధమస్తురాలినై ఎప్పటికీ నడిపిస్తూ ఉంటాను. అలా అని నా బిడ్డని ఇంక వీటిమధ్య ఉంచటమా? నోరుమూసుకుని ఎన్నో సహించాను. కాని ఇంక కాదు. నా సహనపు విలువ తీవ్రమైన వేగంతో చివరివరకు పోయి పరిసమాప్తమయింది. మీ ఉత్సాహం, సరదా - గాంధీజీకి సేవచెయ్యటం. నా సంగతి, పిల్లల సంగతి ఎప్పుడైనా ఆలోచించారా? ఒకొక్క రోజున ఒకొక్కటి విలాసం (Fancy) మీకు. కొన్నాళ్ళు సెనగలు తింటూ ఉన్నారు. కొన్నాళ్ళు రోజా 'బేథుయా' (ఒక విధమైన కూర) కూర కావలసివచ్చింది. కొన్నాళ్ళు ఒట్టి రామ్ములక్కాయల హర్బత్. 'కాంచాపటల్' (ఒక విధమైన కాయ. బెంగాల్ బీహార్‌లలోనే దొరుకుతుంది సాధారణంగా) తినటం మూలంగా అప్పుడెంత సుస్తీ చేసింది! రామ్ములక్కాయ తినేప్పుడు కొయ్యకుండా కాయకాయగా ఇవ్వమని ఆజ్ఞాపించారు ఒకసారి. కొరుక్కుని తినటమే మంచిదని గాంధీజీ చెప్పారుట. ముక్కలు కోయటం అనవసరంగా సమయం వృధాకావటం. గాంధీజీ ఆశ్రమంలో ఈ నియమం సాగింది. అదీ యిదీ ఏం లేదు. ఒకరోజున ఈ నియమం యింక సాగటానికి లేదు అని హుకుం అయింది. సేవాగ్రామ్ ఆశ్రమంలో రామ్ములక్కాయ తినే నియమం మారిపోయింది. మహాదేవ్ దేశాయ్ - గాంధీజీలాగా రామ్ములక్కాయ పండు పండుగా తినటం మంచిదికాదు, దాని మూలంగా రసం చింది గుడ్డలమీద పడుతుంది - అని పత్రికలో వ్రాశారు. ఇంక దానికి ఎదురుచెప్పటానికి లేదు. దాంతో యింక మనం కూడా అలాగే చెయ్యాలి. ఇన్నాళ్ళు కొరికేప్పుడు కళ్ళు మూసుకున్నామాయేం? బడాయికాని! పగలల్లా అన్నంకాక అయిదు వస్తువులు తినాలి. లెక్కపెట్టి అయిదు. ఆరోది తింటే కొంప మునిగిపోతుంది. జీవితమంతా ఇలా లెక్కప్రకారం జరుపుకోగలమా? ఆవునెయ్యి అంటే పోనీ తినను - ఈ దేశంలో ఆవునెయ్యి దొరుకుతుందాయేం? అడుగడుక్కీ బాధ! ఆయన ఒక్కరే కేవలం ఈ గాంధీజీ మార్గంలోకి వచ్చారాయేం? అంతకు ముందు ఏవి(టి? తాళంచెవి వారిదగ్గిర ఉంటుంది. స్కూల్‌కి వెళ్ళేప్పుడు ఒక్క రూపాయి బజారు ఖర్చుకి నా చేతికిచ్చారు. నా దగ్గిర తాళం చెవి ఉంటే - ఉన్న డబ్బంతా నా పొట్టన పెట్టుకుంటానాయేం? లేకపోతే

మీ భాండారమంతా కొల్లకొట్టి మా పుట్టింటికి పంపుతానా? ఏమనుకుంటారో ఎవరికి తెలుసు? ఆ మాట నేను ఎన్నడూ అడగలేదు. తెలుసుకోవాలన్న ప్రవృత్తి లేదు. చిన్నకులాలవాళ్ళ ఎదుట ఒకనాడు యెంత అవమానం జరిగింది! తెలకులవాడి పెళ్ళాం ప్రొద్దున్నే స్కూల్ క్వార్టర్స్‌లోకి నూనె తీసుకొచ్చింది. దుకాణంలో నూనె బాగుండలేదు. అందుకని ఆమెని మెల్లాలోకి పిలిచి, ఆమె దగ్గిర ఒక రూపాయి నూనె తీసుకున్నాను. బయటి గదిలో బాబుగారి దగ్గిర రూపాయి తీసుకోమన్నాను. అమ్మో! కాసేపయాక ఆమె తిరిగి వచ్చి నామీద యెంత ఎగిరిపడింది! నూనె తిరిగి ఇచ్చెయ్. నా బేరం సమయం ఊరికే పాడుచేశారు. బాబుగారు నూనె ఎవరు తీసుకోమన్నారు? అన్నారు. అవమానంతో తల తీసేసినట్లయింది. ఆ సంగతులన్నీ ఒకదాని కొకటి గ్రుచ్చినట్లున్నాయి మనస్సులో. మీరు దేశం స్వాతంత్ర్యంకోసం అన్నీ వదిలేశారు, నిజమే! కాని నాకు మాత్రం రవంత కూడా స్వాతంత్ర్యం యివ్వలేదు. పిల్లలు పెద్దవాళ్ళయింతర్వాత ఈ సంగతి వాళ్ళతో చెపుదామని ఎన్నోసార్లు అనుకున్నాను. కాని చెపుదాం చెపుదామనుకుంటూనే చెప్పలేదు. పిల్లల దగ్గిర యిలాంటి సంగతులు చెప్పవచ్చునా? మీరు చెప్పిన మాటకి ఎన్నడూ కు(క్ క(క్ మనలేదు. కేవలం పిల్లల ముఖాలు చూసే ఇన్నాళ్ళూ ఊరుకున్నాను. నావరకు ఏమయిందో అయిపోయింది. దాని గురించి యేమీ దిగులుపడటంలేదు. కాని మీమూలంగా నాబిడ్డకిలా అయింది. నా సంసారం ముక్కచెక్కలయింది. మీమూలంగా నాతోడబుట్టిన అన్నయ్య వాళ్ళింట్లో ఎంతోమంది బయటి పిల్లలెందరో ఉండి చదువుకుంటారు - తన మేనల్లుళ్ళ సంగతి పట్టించుకోలేదు. వీరేన్ తల్లి వచ్చి ఒక రోజున ఎన్ని మాటలు అని వెళ్ళింది! ఎంత బెదిరించి వెళ్ళింది! బెంగాలీ అన్న కారణంతో ఆమె కొడుకు డిస్ట్రిక్ట్ బోర్డ్‌లో ఉద్యోగాన్ని కాంగ్రెస్ తీసేసిందిట! నా ముఖంమీదే చెప్పివెళ్ళింది. మాష్టారుగారా! మన్నా? యన్.ఏ. పశువు. బెంగాలీల ముఖాల్ని సున్నం పూసి, పెత్తనం సాగించటానికి ఉంది కాంగ్రెస్... ఇప్పుడు ఎటుచూసినా నాకు కటిక చీకటి అయింది.

గాంధీజీ! మీరు నాకేమిటిలా చేశారు? మీరు మమ్మల్ని పూర్తిగా వీధిలో బికారుల్ని చేశారు. అక్షరాలా బికారుల్ని. మీరు నెలచివరలో చెయ్యి ఎత్తి యేదో కొంచెం యిస్తున్నారు కనుక మేము నాలుగు మెతుకులు తినగలుగుతున్నాం. నా దేవతల్ని దైవాన్ని వదిలి మీ పూజ చేశాను. మీ మూలంగా ఆత్మీయుల్ని చుట్టాల్ని పక్కాల్ని, స్నేహితుల్ని అందర్నీ వదిలాను. నవ్వు మరిచిపోయాను. దానికి ప్రత్యామ్నాయంగా మీరు చాలా యిచ్చారు. మీరు చూపించే దారిలో భార్యాభర్తల మధ్య మనస్సులు కలియవు. తండ్రి కొడుకుల

మధ్య అపేక్ష అనురాగాల సంపర్కం ఉండదు. అన్న-తమ్ముడు శత్రువులవుతారు. గృహవిచ్ఛేదంతో సంసారం ఛిన్నాభిన్నమవుతుంది. నా ఇష్టమంత్రాన్ని వదిలి సంజెవేళ మీపేరు జపించాను. కొన్నేళ్ళ మా ఆశ్రమంలో యే చోటులో మీరు కూర్చున్నారో - అక్కడ రోజూ సంజెవేళ దీపారాధన వెలిగించి పెడుతూంటాను. ఒక్కరోజు కూడా చరఖా వడకటం మానలేదు. అది ఇందుకేనా? పాకీవాణ్ణి హరిజనుడన్నాను. గోచిపెట్టుకునేవాళ్ళ పిల్లవాడికి బిలూ నీలూలతో కలిపి వంటింటి వసారాలో కూచోపెట్టి తినిపించాను. ఇరుగు పొరుగు అందరూ నవ్వారు. కాని దాని ఫలితం ఏమయింది? దుర్గ తల్లి సరీగ్గానే చెప్పింది. "స్వదేశీ పనిచెయ్యాలనుకుంటే చెయ్. కాని ఇవన్నీ చెయ్యకు. దేవుడికీ దేవతలకీ ఆగ్రహం తెప్పించబోవటం మంచిదికాదు" అన్నది. అప్పుడు మీ ముఖం చూసే, వాళ్ళ మాటలు వినిపించుకోలేదు. ఇవాళ బాగా గ్రహించాను. ఇవాళ దుర్గతల్లి, ఖేందీతల్లి, జితేన్‌తల్లి, అక్క ఉంటే వారి కంఠాన్ని కావలించుకుని ఏడ్చి అయినా మనస్సు కాస్త తేలికచేసుకునేదాన్ని... మహాత్మాజీ కాదు - పాడు! ఇదేమిటి? సన్యాసిలాంటి మొహమా యేం? ఉస్... ఏంచేశాను ఇన్నాళ్ళు! ప్రపంచంలో అందరూ కలిసి ఏం చేశారు నాకు! ఒళ్ళుమంటతో నా మాంసాన్ని నేనే పీక్కుతినాలనిపిస్తోంది. తల పగలగొట్టుకుని చావాలనిపిస్తోంది. ఇంక వద్దు. చరఖాని విసిరిపుచ్చుకుని పారేస్తాను. విసిరికొట్టి ముక్కలు ముక్కలు చేస్తాను దాన్ని. టేబిల్‌మీద పెట్టానుకదూ...! చరఖా తీసుకోవటం కోసం విసురుగా లేవబోయి చతికిలపడ్డాను. లేవగలనా? తల్లో యెడమ వైపున యేదో మణుగు బరువుపెట్టినట్లుంది. తలను ఎవరో బాలీసుకి చేరవేసినట్లున్నారు. బహురియాజీ, కామ్లాదేవి - "ఆ‌(. ఆ‌(" అని విస్తుపోతూ లేచారు.

"లేచారెందుకు బాంగాలీమా? ఏమిటి వెతుకుతున్నారు. నాలుగువైపులా చూస్తున్నారు దేనికి? పడుకోండి. తల మీద కొంచెం నీళ్ళు చల్లనా?"

అందరూ కలిసి బలవంతంగా నన్ను పక్కమీద పడుకోపెట్టారు. దేన్ని వెతుకుతున్నానో అది యింక వాళ్ళ దగ్గిర చెప్పలేదు. అది చెపితే నాకు మతిచెడిందని అనుకుంటారు. ఇప్పటికే ఏమనుకుంటున్నారో ఏం తెలుసు? తలకి ఉడుకులాం రాచారు. గదిలో వాళ్ళందరూ ఒక్కొక్కరే వచ్చి నా పక్కచుట్టూ చేరారు. గల్‌కట్టి కొలిమిలా ఉన్న గొంతుతో లూసీ జమాదారిణీని పిలిచి యేవి(టో చెపుతోంది. బహుశా నా సంగతే అనుకుంటాను. ఆమె మళ్ళీ అరిచి హాస్పిటల్‌కి కబురుచేసి అనర్థం తెచ్చిపెట్టదుకదా! సఖావతీజీ - నా ప్రక్కన నిద్రపోతున్న లాడ్‌లీని మెల్లిగా లేవతీసి యెత్తుకుంది. ఆమె తన పిల్లవాణ్ణి నేనేమైనా చేస్తానని అనుకుందాయేం? తీసుకోమ్మా తీసుకో. మంచిదని

తోచిందే చెయ్యి. నువ్వు వాడి తల్లివి! వాడి మంచి నీకు తెలిసినంతగా నాకు తెలుస్తుందా? అందరూ మెదలకుండా నాచుట్టూ చేరి కూర్చున్నారు. సూది కిందపడినా సవ్వడి వినిపించేట్లుంది. చేతిలో విసనకర్ర మాత్రం అటూ యిటూ ఊగటంవల్ల కాస్త గరగర సవ్వడి అవుతోంది. ఒక పేడపురుగు ఎగురుతోంది... 'గఁయ్'మని ధ్వని అవుతోంది. టప్మని నేలమీద పడింది. మళ్ళీ ఎగురుతోంది. మళ్ళీ ఏదో తగిలి కిందపడింది. ఇంకా లేవలేదు. ఇంకా లేవలేదు. ఇంకా కూడా లేవలేదు. ఈసారి లేవగానే వెంటనే ఒకటి రెండు మూడు అని పది వరకు లెక్కపెట్టాలి. పది లెక్కపెట్టేలోపలే ఒకవేళ పడిపోయిందంటే బిలూ బ్రతకడు. ఒకవేళ పురుగు పడిపోయేలోపలే పది వరకు లెక్కపెట్టగలిగానంటే - భగవంతుడెలాగో అలా బిలూని బ్రతికించి తీరుతాడు. చాలా త్వరగా - సాధ్యమైనంత గబగబా లెక్కపెట్టాలి. అదిగో ఎగురుతోంది. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు, ఆరు, యేడు - ఉష్! పురుగు పడిపోయింది. ఏవిఁటిలా చేశావ్ భగవంతుడా! ఏ రవంత ఆశ అయితే ఉందో దాన్ని కూడా చెరిపి నీ పగ తీర్చుకున్నావా? ఛా! మనస్సులో కల్పించుకున్న ఖయ్యాళీకి తల తోకా ఉంటాయా? నేనే కట్టుకున్నాను. నేనే పడగొట్టుకున్నాను. పురుగుని గురించి నేను ఊహించుకున్నవన్నీ ఎన్నటికీ నిజం కావు. అంతా భగవంతుడి చేతిలో ఉంది. ఆ భగవంతునికిన్నాళ్ళూ నేను ఎంత అపచారం చేశాను! తల్లీ, పూర్ణేశ్వరీ! నా తప్పుల్నీ దోషాల్నీ క్షమించు, నీ దయవల్లనే నా భిలూ పుట్టాడు. నీ పేరే బిలూ పేరుకి జోడించాను. పూర్ణ - అని. ఇంట్లో అందరూ నీ మందిరంలోని మహాప్రసాదాన్ని తినటం మానేశారనే నువ్వు నామీద ఆగ్రహించావా? బిలూకి జబ్బు చేసినప్పుడు మ్రొక్కుకున్న మ్రొక్కుని పూర్ణేశ్వరీ ఆలయంలో పూజ చేయించి చెల్లించుకున్నానుగా! జ్ఞాపకం రావటంలేదా? మరిచి పోయావాయేం? చూశావా? చూడు. ఒక్క చిన్న పొరపాటువల్ల ఎంత పని జరిగిందో! తల్లీ పూర్ణేశ్వరీ! నువ్వు ఈ సంగతి ముందే నాకు జ్ఞాపకం వచ్చేట్లు చెయ్యవా? కాదు. కచ్చితంగా చేయించాను. అయితే ఇలా ఎందుకు అయింది? తల్లీ నువ్వు ప్రత్యక్ష దైవానివి. బిలూ ఒకరకంగా నీబిడ్డే. వాణ్ణి ఈసారికి బ్రతికించు. ఇంక నేను నీపట్ల ఎలాంటి అపచారాన్నీ చెయ్యను. ఇంక నేను గాంధీజీని నీకంటె ఎక్కువగా భావించను. బర్హమ్ ఖాన్లో - బిలూ పుట్టినప్పుడు చెట్టుకి వ్రేలాడకట్టిన ఇటిక విప్పతీశామా? ఆఁ. అప్పుడు నేను, జితేన్ తల్లి, అక్క - వెళ్లాముగా! అదే నా కాలిబొటన వ్రేలు చెంబుపడి చితికిపోయినప్పుడు. అప్పుడే పొరపాటు చేశాను. ఏ ఇటిక విప్పతీయటానికి ఏ ఇటిక విప్పతీశానో! అవునవును. అన్ని ఇటికల్లో ఏ ఇటికో గుర్తుపట్టటానికి వీలుందా?

ఆ సరస్వతివాళ్ళ యింటిదగ్గరే, రావిచెట్టుక్రింద దిబ్బమీద సిందూరంతో నిండిన రాతి విగ్రహం. ఆమె "డిహ్‌వార్" దహిభాత్ గ్రామంలోని గ్రామదేవత. ఆమె "డిహి" (ఊరిపొలిమేరలు) పహరా యిస్తూంటుందిట! అక్కడ అందరూ మట్టిగుర్రాలకు పూజ చేస్తారు. ఆ తల్లి దయ ఎలాంటిదో సరస్వతి తల్లి నాకు చెప్పింది. కలరాకాని, కరువుకాని వచ్చినప్పుడు ఆరు బారల ఎత్తుగల డిహ్‌వార్ దేవత గుర్రం మీదెక్కి గ్రామానికి పహరా యిస్తుందిట. ఊర్లో చౌకీదారు అర్థరాత్రులప్పుడు ఎన్నోసార్లు చూశాడట. సరస్వతి తల్లి ఎదుట నేనేమీ అనలేదు. కాని నాలో నేను నవ్వుకున్నాను. ఆరు బారల యెత్తు దేవతకి మూరెడు యెత్తు గుర్రం... అది సంభవమా? డిహ్‌వార్ దేవత తప్పకుండా అప్పుడు నా మనస్సులోని మాటను గ్రహించి ఉంటుంది. అందుకని ఆగ్రహించి నాకీ దుర్దశ కలిగించింది. ఒకవేళ వాళ్ళ ఊరిపిల్ల సరస్వతిని బిలూ కిచ్చి పెళ్ళి చేయలేదని ఆమె నాకీ దుస్థితి కలిగించిందేమో! డిహ్‌వార్ ఈనాడు నా బిలూని బ్రతికించు. తర్వాత నీ యిష్టంవచ్చినట్టు చెయ్యి. తర్వాత నువ్వు ప్రసన్నురాలివయేట్లు - అన్నీ చేస్తాను. మీరు కోపగిస్తే మాలాంటి సామాన్యులకు రోజు లెలా గడుస్తాయి?

అదిగో, అదిగో, మోటారు హారన్ ధ్వని వినిపిస్తోంది. ఆ( అయితే నా బిలూ... ఆ ఆకుపచ్చ స్పిరిట్ సీసా ముక్కుదగ్గిర పెట్టుకున్నట్టుంది...

# నీలూ

జైలుగేట్ ముందు పోర్టికో క్రిందికి వార్డర్ నేహాల్‌సింగ్‌తో కలిసివచ్చి నుంచున్నాను. గేట్ బయట సాయుధ పహరా. గేట్‌లోపల పెద్ద పెద్ద లైట్లతో చాలా వెలుతురుగా వుంది. లోపల లైట్ క్రింద సుబేదారు సాహబ్ డెస్క్ ప్రక్కన ఎత్తయిన స్టూల్‌మీద కూర్చుని ఉన్నారు. నేహాల్‌సింగ్ చెప్పిన ప్రకారం పోర్టికో యెదుట - పిట్టగోడమీద కూర్చున్నాను.

"బాబూ! కంబళి-గింబళి వెంట ఏమీ తెచ్చుకోలేదా యేం?"

"లేదు" అన్నాను.

అతనే స్వయంగా గేట్‌లోపలి సుబేదార్ దగ్గర్నుంచి కటకటాలగుండా మూడు నాలుగు కంబళ్లు సంపాయించి తీసుకొచ్చాడు. వాటిని గోడమీద ఒత్తుగా పరచి, బాధ్యత తీరిపోయిన భావంతో ఒకసారి దాని దుమ్ముదులపటానికి ప్రయత్నించాడు.

"బాబూ! కూర్చోండి" అన్నాడు నాతో.

తర్వాత గేట్‌లోని సాయుధుడు సుబేదార్ సాహబ్‌తో మెల్లిగా - ఇతడు తెల్లవారగట్ల ఉరి తీయబోయే అతని తమ్ముడు. రాత్రంతా ఇక్కడే కూర్చుంటాను అంటున్నాడు. ఇతణ్ణేమీ బాధపెట్టకండి అని క్లుప్తంగా తెలియచెప్పాడు. సుబేదారు ఆ మాటలను సరి అయిన దృష్టితో తీసుకోలేదు. జైలులోపలి యజమాని హెడ్‌వార్డరు. పోతే గేట్ బయట అన్నిటికీ శాసనకర్త సుబేదార్. అసలు ఆ పదవి పేరు గేట్‌వార్డర్. యుద్ధంలోకి వెళ్ళివచ్చినవా డవటంవల్ల అతడి పేరు సుబేదార్ సాహబ్ అయింది. జైలులోపలకెవరు వస్తున్నారో జైల్లోంచి ఎవరు వెడుతున్నారో - వారిదగ్గరున్న డబ్బు, సామాన్లు సోదా, బజారులో కొనటం, కంట్రాక్టర్లు - వీటికన్నిటికీ సర్వాధికారి సుబేదార్ సాహబ్. మహామాన్యుడైన ఈ సుబేదార్ దగ్గిర ఒక సామాన్యుడైన వార్డరు - యీ అసంగతమైన విన్నపం యెందుకు చేస్తున్నాడు? కచ్చితంగా యిందులో నిగూఢమైన నిజం ఏదో ఉంది.

అందుకనే సుబేదారు "నీకెంత యిచ్చాడు?" అని అడిగాడు.

నేహాల్‌సింగ్ కొన్నాళ్ళు ఈమధ్య నా డబ్బు తింటున్నాడు. ప్రతిరోజూ నా దగ్గిరకొచ్చి, "ఇవాళ మీ అన్నయ్యకే ఈ వస్తువులు తినటానికి యిచ్చాను. బజారు నుంచి కొనుక్కుని తీసుకెళ్ళాను. జైల్లోకి చాటుగా తీసుకెళ్ళి యివ్వటమంటే సామాన్యమైన సంగతా?" అంటూ - ఒక జాబితా యిచ్చేవాడు. సుబేదారు ఏదో పెద్దపులి. ప్రతి ఒక వస్తువు తీసుకెళ్ళటానికీ అతడికి ఒకొక రూపాయి యివ్వాలి. అతడికి యాభై రెండు రూపాయలు జీతం వస్తుంది. కాని దానికి నాలుగు రెట్లు పైన సంపాదిస్తాడు. సొంతం మిలిటరీ తత్వం. ఒకసారి యుద్ధంలోకి వెళ్ళివచ్చాడుగా! ఇలా రకరకాల అవాంతర విషయాలు చెప్పిన తర్వాత, చిన్న నవ్వు నవ్వుతూ "దొరవారే తల్లితండ్రులు. తమలాంటివారి మీద భరోసాతోనే పిల్లా-జెల్లాని వదిలి, పొట్ట చేతపట్టుకుని ఈ దూరదేశం వచ్చాను" అనేవాడు. ఇలా కబుర్లు చెపుతూనే నా దగ్గిర్నుంచి డబ్బు గుంజుతాడు.

సుబేదారు, నేహాల్‌సింగ్ - యిద్దరికీ - నేనిక్కడ కనుక ఉండాలంటే, కొద్దో గొప్పో ఖర్చు చెయ్యటం అవసరం అని వారి కోరిక. లేకపోతే వారింత గట్టిగా యెందుకు మాట్లాడతారు? వాళ్ళు బుద్ధిపూర్వకంగా నాకు వినిపించేట్లు మాట్లాడుకుంటున్నారు. సుబేదారు అడిగిన మాటకు - ఇచ్చేదేముంటుంది? ధర్మం అనేదింకా వుంది. పిల్లలమీద ఒట్టువేసి చెపుతున్నాను. ఏమీ ఇవ్వలేదు. దొర అతడికి శవాన్ని తీసుకెళ్ళటానికి ఉత్తర్వు యిచ్చారు" అని జవాబు చెప్పాడు నేహాల్‌సింగ్.

"శవాన్ని తీసుకెళ్ళటానికి ఉత్తర్వు యిస్తే యిచ్చారు. ఇక్కడ ఉండటానికి ఉత్తర్వు యివ్వలేదుగా! ఇక్కడ బయటివారిని ఉండనిచ్చే బాధ్యతను నేను తీసుకోలేను."

సుబేదారు గర్జిస్తూ యింకా ఏదో మాట్లాడబోతున్నాడు. నేను నేహాల్‌సింగ్‌ని పిలిచి, అతడి చేతికి ఒక రూపాయి యిచ్చాను. సుబేదార్ సాహెబ్ చూశాడు. ఇంక ఈ విషయంలో యెదురేమీ మాట్లాడలేదు. భాగాలవీ తర్వాత పంచుకుంటారు.

సుబేదారు సాయుధుడైన గస్తీవాణ్ణి పిలిచి, "ఈ బాబుని ఎవరూ వేధించకండి. డ్యూటీ వంతుమారేప్పుడు - ప్రతిసారీ తర్వాత డ్యూటీలోకి వచ్చేవాళ్ళకీ సంగతి చెప్పాలి" అని చెప్పాడు.

నేహాల్‌సింగ్ వెళ్ళేప్పుడు - "నమస్కారం" అని నోటితో అనేసి వెళ్ళిపోయాడు. ఈ దేశంలో 'నమస్కారం' అనేమాటకి రీతి రివాజు లేదు. దానికి బదులుగా పాత్రాపాత్ర విచక్షణ లేకుండా నమస్కారం అనే మాట వ్యవహరిస్తారు. మాకు కూడా ఇక్కడే ఉంటూ

ఉండటంవల్ల - ఈ మాట - ఇంకా ఇలాంటి యెన్నో మాటలు మాట్లాడటం అలవాటయిపోయింది.

... శిశిర్ ఉత్తరంలోని మాటలు యిప్పటికీ జ్ఞాపకమున్నాయి. శిశిర్ జైలునుంచి మాకంటె ముందే విడుదలయినాడు. మేము జైల్లో ఎప్పుడూ - జైలునుంచి బయటికి వెళ్ళినవారు, తర్వాత ఇంక జైల్లో వున్నవారి సంగతులేవీ తెలుసుకోరు - అని చర్చించుకునేవాళ్ళం. నిజానికి అన్ని రంగాల్లోనూ తరుచు యిదే కనిపిస్తుంది. నెలలకు నెలలు, సంవత్సరాలకు సంవత్సరాలు జైలులోపల మ్రగ్గిపోతూండేవారు, ప్రబలమైన జీవితశక్తి అంతా నియమబంధనాలతో నిస్సారం కావింపబడినవారు. చీనారమణి పాదాల్లాగా జీవితం స్వేచ్ఛగా వికసించే అవకాశాలు లభింపనివారు - వారికి బయటికి వార్తలు పంపేందుకెన్నో అవసరాలు క్రమంగా పేరుకుపోయి ఉంటాయి. ఇలాంటి అవసరాలు ప్రభుత్వ నిబంధనల మధ్య తీర్చుకునే సౌకర్యాలు లేవు. అందుచేత అంధకారబంధురమైన యక్షపురికి - కొంచెం వెలుగునిచ్చే కిటికీ - క్రొత్త రాజకీయ ఖైదీ జైలుకి రావటం. ఎన్నో కార్యకలాపాలుండే బయటి ప్రపంచపు తీయని బంధాలనెన్నో విచ్ఛిన్నంచేసి, తీసుకురాబడిన రాజకీయ ఖైదీతో - అప్పుడు విడుదలయే రాజకీయ ఖైదీద్వారా తాత్కాలిక సంబంధం పెట్టుకోవటానికి విఫల ప్రయత్నం చెయ్యాలి. జైలుయంత్రానికి 'సేఫ్టీవాల్వ్' క్రొత్తగా విడుదలయే రాజకీయ ఖైదీ. అతడు - జైల్లోని అంతులేని వైఫల్యాలు, ఫలితంలేని అపారమైన ఆక్రోశాలు, అణచుకోలేని ఆకాంక్షలు - ఎన్నెన్నో కన్నీటి గాథలు - తాత్కాలికంగా బయటికి తీసుకుపోయే రవాణా సాధనం. జైలు నుంచి బయటికి వెళ్ళే సమయంలో ఎన్నో వ్రాయవలసిన సంగతులు, ఇంటర్వ్యూ చెయ్యవలసిన విషయాలు, ఎన్నో పనులు చేసిపెడతామని చేసే ప్రతిజ్ఞలు, కోరి, బలవంతంగా పైనవేసుకునే కార్యకలాపాలు, వెళ్ళే రోజున పూలదండలు, వీడ్కోలు సత్కారాలు, నమస్కారాలు, సలాములు, ఆలింగనాలు, అడగకుండా చేసే అనవసర ప్రసంగాలు, గేట్‌దాకా ఊరేగింపులాగా సాగనంపటాలు - ఇవన్నీ జైల్లో గతానుగతికంగా జరిగే వాటిలో అంశాలే అయినా - అంతఃకరణలకు లోటులేదు... ఇంక తర్వాత ఏమిటి? ఆ తర్వాత ఏం జరగబోయేదీ కళ్ళు మూసుకుని చెప్పవచ్చు. తపాలా శాఖ అధికారులు - దేశంలో సుమారు ఎంతమంది వచ్చే సంవత్సరం చిరునామాలు వ్రాయకుండా తపాలా పెట్టెల్లో ఉత్తరాలు పడేస్తారో అంచనావేసి చెప్పగలరు. అలాగే రాజకీయ ఖైదీలు కూడా - విడుదలయిన ఖైదీ - గేట్ దాటి బయటికి వెళ్ళగానే, జైలులోపల ఉన్నవారి సంగతి మరచిపోతారని చెప్పగలరు. మాలెక్క తప్పు అని

ఋజువుచెయ్యటానికి శిశిర్ జైలు బయటినుంచి అన్నయ్యకు ఉత్తరం వ్రాశాడు. అన్నయ్య ఉత్తరంలో కొన్ని పంక్తులు 'అండర్‌లైన్' చేశాడు. ఇప్పటికీ జ్ఞాపకం ఉన్నాయి. "లోకులు ఎక్కువ భాగం ఎలాంటివారో - నన్ను వారి కోవలో పడెయ్యకు. జైలునుంచి పరుగెత్తుకొచ్చిన వారం రోజులలోగానే ఉత్తరం రాస్తున్నాను. ఫలానా, ఫలానా వారికి నా నమస్కారాలు తెలియచెయ్యి."

... హరదార్ దుబేజీ భార్య వృద్ధురాలు. ఆమె కూడా నాకు నమస్కారం చేస్తుంది. అన్నయ్యనేమో 'ధర్మతనయు' డంటుంది. పేదరాలు - కాని ఆ రోజున కలుసుకున్నప్పుడు ధర్మతనయుడి మీది కేసులో ప్రతివాదన చేయించటానికి, కొంగున ఉన్న ముడి విప్పి మూడు రూపాయలు తీసియిచ్చింది. అప్పుడామె కళ్లలో నీళ్ళు తిరిగాయి. దుబేజీకి తెలియకుండా చాటుగా యిచ్చిందనుకుంటాను. ఎందుకనో తెలియదు.

దుబేజీ తానే - కేసు నడుస్తున్నప్పుడు, భయంతో సంకోచంతో - ఒకవేళ డబ్బు కనుక అవసరమైతే - అది తాను ఏర్పాటుచెయ్యగలనన్నాడు. భగవంతుడి ఆగ్రహంవల్లనే నన్ను నా భార్యను పోలీసులు పట్టుకోలేదు. కాకపోతే - నేనే ఊరేగింపులో పాల్గొన్నాను. నా చేతిలోనే అందరి దగ్గిరకంటె పెద్ద త్రివర్ణ పతాకం ఉన్నది. నన్ను జైలు బయట ఉంచటమే భగవంతుడి ఇచ్ఛ అయితే - అప్పుడు కాంగ్రెస్ సభ్యుడని బిలూబాబు కేసు ప్రతివాదం చేసి, నా కర్తవ్యాన్ని నిర్వర్తించటం సముచితం. అప్పుడు నేను డబ్బు తీసుకోవటాన్ని అంగీకరించలేదు. దుబేజీ - నా వ్యవహారాన్ని - నాకు అన్నయ్య కేసు 'డిఫెన్సు' చెయ్యతలచుకోలేదని, అర్థం తీశాడు. నేను ఒప్పుకోలేదు. ఎందుకనంటే పెద్దమ్మ, కేసు ఖర్చులకోసంగా ఎక్కడినుంచో తెలియదు - మూడు వందలు నాచేతికిచ్చింది. పెద్దమ్మ వకీలు హరేన్‌బాబుకి ఇచ్చిరమ్మని మాత్రం అన్నది. డబ్బు యిచ్చేప్పుడు - ఆమె ముఖంలోని భావం సరిగ్గా దుబేజీ భార్య ముఖంలో కనిపించిన భావమే. ఆ తర్వాత నుంచీ దుబేజీయే వకీలు యింటికి రాకపోకలు సాగించాడు.

గుర్రంమీద ఉన్నాడు దుబేజీ. ఎర్రగుర్రం కొంచెం కుంటుతూ నడుస్తోంది. దుబేజీ గుర్రంమీద జీనుతీసేసి గుర్రాన్ని హరేన్‌బాబుగారి గేట్ ప్రక్క యూకలిప్టస్ చెట్టుకి కట్టివేశాడు. దుబేజీ చాలా డబ్బు ఖర్చుపెట్టారనుకుంటాను. నేను మాత్రం పెద్దమ్మ యిచ్చిన డబ్బు కూడా హరేన్‌బాబుకి ఇచ్చాను.

ఆయన నాన్న స్నేహితుడు. కాని పెద్దమ్మ డబ్బు వచ్చినా మళ్ళీ దుబేజీ యిచ్చిన డబ్బు తీసుకోవటానికి తటపటాయించలేదు...

తర్వాత దుబేజీ భార్య - తన సంగతి చెప్పేసింది. "మావారు - బిలూబాబు

కేసులో విచారణ అంతా చేయించారు; చిల్లపెంకుల్లా డబ్బు ఖర్చుపెట్టారు. కాని ఫలితం ఏమయింది? అసలు పోలీసులు ఎవరివైపో - వారిదే కేసు గెలుపు. నీమాట పోలీసులు వింటారు. కలెక్టరు దొర మిమ్మల్ని సలహా అడగందే ఏమీ చెయ్యరని వినికిడి. మీ వర్గంలోనివాడైన నోఖేలాల్ చూడరాదూ? శారదా బజారులోని దుకాణదార్ల నందర్నీ వేధించి చంపుతూంటాడు. కాని ఇన్‌స్పెక్టరు అతడి గుప్పెట్లో ఉన్నాడు. సర్కారువారు మీ పార్టీలో వాళ్ళకందరికీ జీతాలిస్తారని అంటారు". దుబేజీ భార్య చాటుగా డబ్బు యివ్వటంలోని అర్థం అప్పుడు తెలుసుకున్నాను. బిలూబాబు ఆమె ధర్మతనయుడు. అతడికోసం తన సరళబుద్ధికి అవసరము తోచినదంతా చెయ్యటంలో వెనకా ముందాడలేదు. వారు నేను పోలీసు మనిషినని అనుకుంటారు. వారి తప్పు యేముంది? వారు అంతకంటె యేమాలోచించగలరు? దేశంలోని వారందరూ అదే అనుకుంటున్నారు. సరళహృదయురాలైన దుబేజీ భార్య పూర్వపరిచయపు చనువుతో నా ముఖంమీదే ఆ మాట స్పష్టంగా అనేసింది. ఆమె ఇచ్చిన మూడు రూపాయలూ విసిరి మొహానకొడదామనిపించింది. కాని పైకి మాత్రం - "కేసులో తీర్పు వచ్చేసింది. ఇంక డబ్బు ఎందుకు?" అన్నాను. ఇప్పుడిహ కలెక్టరుకాని, గవర్నరుకాని ఏమీ చెయ్యలేరు. అంటే ఆమె విశ్వసించకపోవటం గమనించాను. తర్వాత ఆశాభంగం వ్యక్తమవుతున్న ముఖంకేసి చూసేసరికి డబ్బు తీసుకోవటమే ఉచితమని తోచింది. "సరే ఇయ్యి డబ్బు" అన్నాను. ఒక సంతానంలేని రమణి పరసంతాన వాత్సల్యపు ఉద్వేగం ముందు నా యుక్తి, సిద్ధాంతం తలవంచుకున్నాయి. కాని కేసులో సాక్ష్యం యిచ్చేప్పుడు నా రాజకీయపు Principleని కొంచెం మెత్తపరచుకుంటే ఏం నష్టం వచ్చేది? అప్పుడు నేనేదో సామాన్య మనిషిగా లేను. అప్పుడు జనాభిప్రాయానికి విరుద్ధంగా, పరిచితులు అపరిచితులకు వ్యతిరేకంగా, నేనొంటరిగా తల యెత్తుకుని నిలబడవలసిన విషయం. నిందించేవారికి, విరోధులకు నా Principle దృఢత్వాన్ని చూపించే విషయం. రాజకీయపు అభిప్రాయాల సంగతి వదిలేసినా, అక్కడ నా వ్యక్తిగతమైన దృఢ సంకల్పపు ప్రశ్న వచ్చి పడిందనుకుంటూ. నన్ను ఒత్తిడిచేసి, నా అభిప్రాయాన్ని మార్చాలనుకుంటే - నేనంత తేలికైన రాజకీయాభిప్రాయాలు పెట్టుకునే వాణ్ణికాను. లోకులు నా అంతరాంతరాల్లో ఉన్న విషయాన్ని గ్రహించారా?

దుబేజీ భార్య నన్ను గురించి ఎలా అర్థంచేసుకున్నదో. సాధారణ జనం బహుశా అంతకంటె నామీద చెడు అభిప్రాయాన్ని కలిగి ఉండవచ్చు. బహుశా ఏమిటి? నిశ్చయంగానే కలిగి ఉన్నారు. దీనికి ప్రత్యక్ష ప్రమాణం రోజూ చూస్తూనే వున్నాను. ఆ

రోజున ఫుట్‌బాల్ మైదానం ప్రక్కన సిగరెట్లు కాల్చుకుంటూ కూర్చున్న విద్యార్థి బృందం, నేను సైకిల్‌మీద ప్రక్కనుంచి వెడుతున్నప్పుడు, బిగ్గరగా దగ్గుతూ హేళనగా వికృత ధ్వనులు చెయ్యటం విన్నాను. మా వీధిలోని యువతీ యువకులు - నాకేసి ఆశ్చర్యంగా, ఏదో కనిపెట్టాలనే తృష్ణతో చూస్తూండటం గమనించాను. బాల్యమిత్రుడు సోరిన్ పల్కరించకుండా ప్రక్కనుంచి తప్పుకుని పోవటానికి సంకోచించలేదు. చంపుతామని బెదిరిస్తూ వచ్చిన ఆకాశరామన్న ఉత్తరాన్ని అందుకున్నాను. ఎంత అసంగతమైన ఉత్తరం. ఉత్తరం మొదట్లో నేనెంత ఉన్నతాశయాలు గల తండ్రి కొడుకునో గుర్తుచేసి, చివర పంక్తుల్లో నేను ఆ తండ్రి కొడుకునేనా అన్న సంశయాన్ని వ్యక్తంచేశారు. పెద్దమ్మ ననీదీ కూడా - మరీ అవసరమైన సంగతులు తప్ప తక్కినవేమీ మాట్లాడరు. ఒక డిస్ట్రిక్ట్ బోర్డు మెంబరు మరొక మెంబరుతో - అన్నదమ్ములిద్దరూ సహదేవ్ చెల్లెలి ప్రేమలో పడ్డారని, అందుకని నేను అసూయతో అన్నయ్యకి వ్యతిరేకంగా సాక్ష్యమిచ్చానని, లేకపోతే ఉరిశిక్ష పడే కేసులో ఎవరైనా అన్నగారికి వ్యతిరేకంగా సాక్ష్యమివ్వగలరా అని చెప్పటం విన్నాను. సరస్వతి విషయంలో నాకెప్పుడూ ఇలాంటి భావన రానేలేదు. ఇహ అన్నయ్యవైపునుంచి కూడా. అన్నయ్య ఆమెని ప్రేమిస్తున్న సూచనలు నాకేమీ కనిపించనేలేదు. కాని లోకం నోరు ఎవరు మూయగలరు?

... జైల్లో - అన్నయ్య కేసు నడుస్తున్నప్పుడు - నేను సాక్ష్యమిచ్చే రోజున జైలు బయట ఎంత గుంపు! జైలులోపల కేసు జరుగుతోంది. ఇలాంటి హానికరమైన ముద్దాయిని ఎలా బహిరంగమైన కోర్టులో విచారణ చెయ్యగలరు? కొందరు చౌకీదార్లు, దఫాదార్లు, కానిస్టేబుల్స్, సబ్ ఇన్‌స్పెక్టర్, సాక్షులతో కలిసి గేట్‌లో పోలీసు వ్యాన్‌లోంచి దిగాను. జనంవైపు చూడలేకపోయాను. కాని వారి ఆరోపణాదృష్టులను, బెదిరింపు చూపులను గ్రహించాను. నేను జనం క్షోభను లెక్కచేసేవాణ్ణి కాను అన్న భావాన్ని చూపించటానికి ఒకసారి వారికేసి విసురుగా తల యెత్తి చూశాను. బహుశా మనస్సు చంచలంగా ఉండటం వల్లననుకుంటా - ఏ నిర్దిష్ట వ్యక్తి ముఖంకేసి పరిశీలనగా చూడగల శక్తి లేదు నాకు. ఆ రోజున జైలువార్డర్లు నాకేసి 'జూ'లో క్రూరమృగాన్ని చూసినట్లు చూశారు. జడ్జీగారు ప్రశంసాదృష్టితో చూశారు. జైల్లో ఒక్క పాత ఖైదీల కళ్ళలో మాత్రమే ఉదాసీన భావాన్ని చూశాను. ఇంకెవరి కళ్ళలోనూ అలాంటి భావాన్ని చూడలేదు. జైల్లో రాజకీయ ఖైదీలను అప్పుడు కలుసుకోలేదు. కలుసుకుంటే వారి దృష్టి వైఖరి యెంత క్రూరంగా ఉండేదో ఊహించగలను.

ఈ కేసులో అన్నయ్యతోపాటు ఇంకా ఇద్దరు ముద్దాయిలున్నారు. సూరజ్‌దేవ్

- హరిశ్చంద్రలు. నేను సాక్ష్యం యివ్వటానికి లేవగానే హరిశ్చంద్ర ముద్దాయి బోనులోంచి 'ఛీఛీఛీ' అని బిగ్గరగా అరిచాడు. దాంతో నేను అతనివైపు తిరిగి చూశాను. అతడి కళ్ళలోంచి అసహ్యత వ్యక్తమవుతోంది. అతడి తీక్ష్ణకంఠస్వరంలోని తీవ్ర నిరసన, నిష్ఫలమైన ఆక్రోశం కంటె యెక్కువ అసహ్యత అది... ఒకసారి ఆశ్రమంలో విషంలేని పాముని పటకారుతో పట్టుకుని అన్నయ్య దగ్గిరకు తీసుకెళ్ళాను. అన్నయ్య తోటలో పనిచేస్తున్నాడు. పాము తెల్లటి పొట్టకేసి హఠాత్తుగా చూడటంతో అన్నయ్య ముఖంలో, కళ్ళలో యే భావం వ్యక్తమయిందో - సూరజ్‌దేవ్ ముఖంలో అదే భావాన్ని చూశాను. తీవ్రమైన యేవగింపుతో అతడు నావైపునుంచి దృష్టి మరల్చుకోవాలనుకున్నాడు. ఇహ అన్నయ్య - బోనులో ఒక కంబళి మీద - ఒక యెర్ర అట్ట పుస్తకం మీద దృష్టిపెట్టుకుని కూర్చుని ఉన్నాడు. ఆ ముఖంలో యే భావమూ వెల్లడికావటంలేదు. అది అతడి నిజమైన ఏకాగ్రత కాదని, బుద్ధిపూర్వకంగా ఊరికే చూస్తూండటమేనని నాకనిపించింది. ఎందుకనంటే - అలా అయితే అన్నయ్య హరిశ్చంద్రని ఏదైనా మాట్లాడటానికి తప్పకుండా వారించేవాడు. తర్వాత గవర్నమెంటు ప్లీడరు - జడ్జిగారి దగ్గిర హరిశ్చంద్రని ఫిర్యాదు, జడ్జిగారి కోపం, హరేన్‌బాబువైపు చూసి, కోపాన్ని వ్యక్తంచేయటం, హరేన్‌బాబు ఉద్వేగం - ఆ ఉద్వేగాన్ని ఒకసారి దగ్గి, అణచుకోవాలని పడే ప్రయాస, అసిస్టెంట్ జైలర్ - ఆన్ డ్యూటీ, సబిన్‌స్పెక్టరు చాంచల్యం కోర్టు రూమ్ కాకపోయినట్లయితే వారు యిప్పుడే తడాఖా చూపించేవాళ్ళమన్న సూచనతో ఇద్దరూ ఒకరికేసి ఒకరు చూసుకోవటం - ఆ దృశ్యం అంతా కళ్ళముందు మెదులుతోంది. హరిశ్చంద్ర ఉడికిపోతున్నాడు. "ఏం చేస్తారు? ఉరికంటె మించినదేదైనా వేస్తారా యేం?" అంటున్నాడు. వార్డర్లు, పోలీసులు ముద్దాయి బోనుచుట్టూ నిలబడి ఉన్నారు. హరిశ్చంద్ర వాళ్ళమధ్య నుంచే నన్ను తీవ్ర కంఠంతో 'కుక్క ఎక్కడో!' అన్నాడు. జడ్జిగారు కళ్ళజోడు తుడుచుకుంటున్నాడు. పేష్కార్ పరుగెత్తుకొచ్చి హరిశ్చంద్రని యేదో అనబోయాడు. అన్నయ్య, హరిశ్చంద్రల కళ్లు-కళ్లూ కలుసుకున్నాయి. అన్నయ్య ప్రార్థనా పూర్వక దృష్టి 'హరిశ్చంద్ర! ఇహ అగు ఒక సీను అయిపోయిందంతా' - అని చెపుతున్నట్లుంది. హరిశ్చంద్ర ఆగిపోయాడు. మళ్ళీ విచారణ మొదలైంది.

కంకరరోడ్డుమీద నుంచి ఒక్కసారిగా యెన్నో బూట్ల చప్పుడు వస్తోంది. చీకట్లో రాస్తావైపు యేమీ కనిపించటంలేదు. దూరంగా వార్డర్ల పొడుగాటి బ్యారక్స్ వరాండాలో నల్లటి షేడ్స్ ఉన్న దీపాలు మాత్రం కనిపిస్తున్నాయి. బ్యారక్స్‌లో డోలక్ కంజరాలతో కలసిన కీర్తన జరుగుతోంది. దాని మోత చెవులకు వినిపిస్తోంది. ఆ ధ్వని అలా

తెలివస్తోందనటానికి వీల్లేదు. కర్ణపటాహాన్ని బ్రద్దలుకొడుతోంది. కాని ఆ మోతను కూడా అణచివేస్తూ క్రమంగా దగ్గిరకువస్తున్న బూట్ల ధ్వనులు జైలుగేట్ దగ్గిరకు చేరుకున్నాయి. చూస్తే ఒక జట్టు వార్డర్లు వచ్చారు. ఎక్కువమంది కాళ్ళకు పసుపురంగు కాబూలీ శాండల్స్. ఇద్దరి కాళ్ళకు చాలా పాతకాలపు బూట్లున్నాయి. యుద్ధం మూలంగా బూట్లు, జోళ్ళు దొరకటం లేదనుకుంటాను.

జైలు గేట్ రెండో అంతస్తులో ఒక వార్డరు పదకొండు గంటలు కొట్టాడు. ఒకసారి టంగ్‌టంగ్‌మని రెండేసివంతున అయిదుసార్లు, తర్వాత ఒకసారి. ఇంతలోనే రెండుగంటలు గడిచిపోయాయి. పది ఎప్పుడు కొట్టిందీ తెలుసుకోనేలేకపోయాను. గేట్ ఎదుట వార్డర్ల జట్టు - నన్ను పరిశీలనగా చూస్తున్నారు. మళ్ళీ ఇలాంటి వాడెక్కడి నుంచి వచ్చాడా అని! ఒకరు నా దగ్గిర అగ్గిపెట్టె ఉందా? అని అడిగారు. "లేదు" అన్నాను నేను. ఇంతలో లోపలి వార్డర్ గేట్ తాళంతీశాడు. వార్డర్లు కోలాహలం చేస్తూ లోపల దూరారు. పుస్తకంలో పేర్లు రాయటమయింది.

గేట్ వార్డర్ నవ్వుతూ, నవ్వుతూ - "నిషిద్ధమైన వస్తువు యేదీ లోపలకు తీసుకెళ్ళటం లేదుకదా?" అని అడిగాడు.

"హుజూర్ సెర్చ్ చెయ్యవచ్చు" అన్నారు మరొకరు.

"తర్వాత మా యింటికి వెళ్ళి స్నానం చెయ్యవచ్చు. అంతకంటె ఏముంది? మీ సంగతి నాకు తెలుసు. మీరు యూనిఫారం జేబుల్లో యేమీ పెట్టుకోరుగా?" అని సమాధానమిచ్చాడు సుబేదారు.

రిజిష్టరులో పేరు వ్రాయబడింది. జైలులోపలి లోహద్వారం తెరుచుకుంది. పూర్తిగాకాదు. ద్వారంలోని ఒకవైపు తలుపులో ఉన్న చిన్నద్వారం తెరుచుకుంది. జైలులోపల అంతా కారుచీకటి. ఒక్కరొక్కరే - ఒకరు తప్ప తక్కిన వారందరూ క్రొత్త వార్డు ప్యాసేజ్‌లోని పెద్ద బల్బుల వెలుతురులో నుంచి, జైలులోపలి చీకట్లో కలిసిపోయారు. గేట్‌లోని జమాదారు తలుపులు మూసి, తాళం వేశాడు. పెద్ద రింగులో వందలకొలది తాళంచెవులు. తాళం వేసిన తర్వాత ఒక్కసారి పరధ్యానంగా తాళాన్ని టక్కున లాగి సరీగ్గా పడిందా లేదా అని చూశాడు. లాగి చూడటం ఏదో reflexaction లాగా తోచింది. తర్వాత నావైపు గేట్ యెదుటికి వచ్చి నుంచున్నాడు. గేట్ బయట తుపాకీ పట్టుకుని ఉన్న సెంట్రీ మారిపోయాడు. ఇంతకు ముందున్న అతడు గంభీరస్వభావుడు. ఇతడు మరొకరకం. లోపలి జమాదారు బయటి సెంట్రీని కవిరి అడిగాడు. అతడు గుసగుసలాడుతూ మాట్లాడటం మొదలుపెట్టాడు. బహుశా నా

సంగతే అనుకుంటా. గేట్‌లోపల ఉండిపోయిన క్రొత్త జట్టులోని వార్డరు సుబేదార్ సాహబ్‌తో మాట్లాడుతున్నాడు. సుబేదారుగారికోసరం పుస్తకంతో విసురుకుంటూ ఎత్తయిన స్టూల్‌మీద కూర్చున్నాడు. బహుశా - ఇచ్చిపుచ్చుకునే వ్యాపారం అయి ఉంటుంది. లేకపోతే, జైలుగోడౌన్‌లో నుంచి ఏ వస్తువైనా దొంగతనంగా బయటికి చేరవేసే సంగతి కావచ్చు. ఏ వస్తువయినా దొంగిలించి బయటకు చేరవెయ్యటం ఒక్కరి ద్వారా సాధ్యంకాదు. జైలులోపలి శాసన యంత్రం ఎలాంటిదంటే - గొలుసులోని గొళ్లాలన్నీ ఒకదాని కొకటి అతుక్కోనంతవరకు దొంగతనం ఆలోచన సఫలం కాజాలదు. తిను. కాని కలసిమెలసి తిను. చిన్నవాడినైనా నిర్లక్ష్యం చేసేందుకు వీల్లేదు.

కలక్టరేట్ టవర్‌క్లాక్ టంగ్‌టంగ్‌మని పదకొండు కొట్టింది. అన్నిచోట్లా జైలు గడియారాలు పదిహేను నిమిషాలు ఫాస్ట్‌గా ఉండటం చూశాను. జైలుముందు రాస్తా. దాని అంచునే జైలు ఉద్యోగుల క్వార్టర్స్. తెరలు వేసి ఉన్న కిటికీలలోపల్నుంచి ఎక్కడిదో అస్పష్టమైన వెలుతురు కనిపిస్తోంది. వాటి మధ్య ఒకచోట చీకట్లో నాలుగు పలకల వెలుగు మెరుపు హఠాత్తుగా కనిపించింది. ఒక క్వార్టరు గుమ్మం తెరిచి ఉంది. ఆ వెలుగు కాంతి సూటిగా బయటికి వచ్చి పడుతోంది. ఒక వెలుతురుతో కూడిన ట్రిపీజయం. గుమ్మంవైపు హాండ్ చిన్నది. రైల్వేలైన్ సమాంతరాళ రేఖలు రెండు - దిగంతంవైపు ఎలా దగ్గిరకు రావాలని ప్రయత్నిస్తాయో అలా ఉంది. ఒక ఆకారం గుమ్మంలోంచి బయటికి వచ్చింది. మరొక సిల్హౌట్ గుమ్మందాకా వచ్చి కాసేపు ఆగింది. రెండో ఆకారం తలుపులు మూసింది. వారి యిళ్ళలోని వెలుతురు - జైలుతాలూకు కారుచీకటిని పోగొట్టటాని కెందుకు ప్రయత్నిస్తుంది? గుమ్మం ఆ వెలుతురును తన సరిహద్దులమధ్య చోటులో ఉంచగల యంత్రం మాత్రమే. లుంగి కట్టుకుని ఉన్న డాక్టరుబాబు - గేట్ దగ్గిరకు చేరుకున్నారు. అతడి ఒంటిమీద బనియన్ ఉంది. తాంబూలం నములుతున్నారు... బుగ్గను తాంబూలం పెట్టుకుంటే నిజంగా కాన్సర్ వస్తుందా? బుజంమీద షర్ట్, ఖాకీ హాఫ్ ప్యాంట్. ఇంకా ఒకటి రెండు చొక్కాలు ఉన్నట్లున్నాయ్. నడిచేప్పుడు కాళ్ళు రెండూ చాచి ముందుకు వేస్తున్నాడు. సెంట్రీ టక్కున ఎటెన్షన్‌గా నిలబడ్డాడు. వీరి కాబూలీ స్లిప్పర్ ఎన్నాళ్ళని ఉంటుంది? సెంట్రీ సలాం చేశాడు. లోపలి వార్డర్ అదాబ్ (ముస్లిం సంప్రదాయపు నమస్కారం) చేసి గేట్ తాళం తీశాడు. డాక్టరుబాబు ప్రతినమస్కారం సూచనగా తల ఆడించి లోపలికి వెళ్లారు. గేట్ తాళం వేయబడింది. సుబేదార్ సాహబ్ స్టూల్‌మీద కూర్చుని ఉండే డాక్టరుబాబుని "బుజంమీద దుస్తులు దేనికి?" అని అడిగాడు.

"డ్యూటీ అయితే హాస్పిటల్‌లోనే. కాని ఏం చెప్పగలం. తెల్లవారకట్ల డాక్టరు సాహెబ్, జడ్జీ సాహెబ్ అందరూ వస్తారు. అప్పుడేదైనా అవసరం కావచ్చు. అప్పుడు లుంగికట్టుకుని ఉండి, దొరగారి ఎదుటికి వెళ్ళలేనుగా! నిజానికి ఉరి తీసేప్పుడు డ్యూటీ డాక్టర్ సాహెబ్‌ది. నాది కాదు. కాని అవసరమనేది చెప్పలేముకదా? అబ్బ! ఎంత ఉక్కగా ఉంది!" అన్నాడు డాక్టరుబాబు.

డాక్టరుబాబు మాటల్లో కొంచెం బుజ్జగింపు, నచ్చచెప్పే తీరు ఉన్నాయి. డాక్టరుబాబు సుబేదారుతో ఎంతో మర్యాద యిచ్చి మాట్లాడటం చూశాను. దానికి కారణం, సుబేదారుకి కోపం వస్తే జైల్లోని నిఖార్సయిన ఆవుపాలు దొరక్క పిల్లా-జెల్లా ఎండిపోవలసి వస్తుంది. హాస్పిటల్ 'కోటా' మాంసంలో చిన్న భాగం కూడా డాక్టరుబాబు యింటికి చేరదు. కిరోసిన్ బహుశా మూటకట్టిన డబ్బు ఖర్చుపెట్టి బజారులో కొనుక్కోవలసివస్తుంది. ఇవిగాక ఇంకా ఎన్నో రకాల వస్తువులు, వాటినన్నిటినీ తమ జీతంలో భాగంగా భావిస్తారు. బహుశా రేపటినుంచే బంద్ అయిపోవచ్చు. హాస్పిటల్‌లోని దోమతెరలు, పక్కదుప్పట్లు, బూరుగుదూది, పంచదార, పాతబియ్యం లాంటి ఎన్ని వస్తువులు వీరికి అవసరం. తెల్లవారకట్ల బయట కమాండ్‌లో పనిచేసే గాంగ్-లోని వారిలో ఒకరు రోజూ గేట్‌లోంచి బయటికి వెళ్ళేప్పుడు పూలసజ్జతో డాక్టరుబాబు భార్యకి పూలు తీసుకెళ్ళి యిస్తారు. ఆ పూలతోపాటు దోరవెలక్కాయలు, గజనిమ్మపళ్ళు - పిల్లలు రోజూ వెలక్కాయలు కుమ్ములో కాల్చుకుని తింటారుగా! - అవీ యిస్తారు. ఇహ డాక్టరుబాబు కూడా జైల్లో నౌకరీ చేసిచేసి, చికిత్సా శాస్త్రాన్ని మరిచిపోయారు. ప్రతిరోజూ గతానుగతికమైన పనులు - లెక్కలు, పేర్లు, ఫైల్స్, ఆఫీసు కాయితాల దస్తరాలు, బరువు చూడటం, రిటర్న్ పంపటం, దొరగారితో ఫైల్స్ మోసుకుంటూ తిరగటం, హాస్పిటల్ 'మేట్' దగ్గిర్నుంచి అందరి మనస్సుల్నీ ఆకట్టుకుని నడచుకోవటం - వీటి మధ్య డాక్టరీ చెయ్యటానికి అవకాశమెక్కడ? అప్పుడొకసారి జైల్లో డాక్టరుబాబు నాచేత ఒక 'రిటర్న్' వ్రాయించారు. డాక్టరుగారి పేరు నరేన్‌బాబు అనుకుంటాను. రిటర్న్‌లోని అనేక విషయాల్లో ఒక spleenic index ఉంది. దాన్ని ఎలా లెక్కకట్టాలో నాకు తెలియదు. డాక్టరుబాబుని అడిగాను. అతనికి కూడా తెలియకపోవటం గమనించాను. "ఇప్పుడలా ఉంచు. నేను గత సంవత్సరం రిటర్న్ చూసి, ఉజ్జాయింపుగా వేస్తానులే..." అన్నారు.

జైలు గేట్ లోపలకు రాగానే కుడివైపున గోడకు ఒక బ్లాక్ బోర్డు - స్టేషన్‌లో టైంటేబిల్ అతికించి ఉండే నాలుగు పలకల బోర్డులాంటిది - కనిపిస్తుంది. దానిమీద

ఈ జైల్లో ఎంతమంది ఖైదీలకు స్థానముందీ, ప్రస్తుతం ఎంతమంది ఖైదీలున్నదీ - వారిలో అండర్‌ట్రెయిల్స్ ఎంతమందో వ్రాసి ఉంటుంది. అన్నిటికంటె క్రింద ప్రస్తుతం డ్యూటీలో వున్న డాక్టరు పేరు వ్రాసి వుంటుంది.

డాక్టరుబాబు సీమ సున్నం ముక్కతీసుకుని, బోర్డుమీద తన పేరు వ్రాశారు. ఆ ప్రక్కనే రాత్రి తొమ్మిది గంటల నుంచి డ్యూటీ చేస్తున్నట్లు వ్రాశారు. తర్వాత డాక్టరుబాబు చిన్న నవ్వు నవ్వుతూ - "ఆఫీసు గదిలో ఫాన్ ఉంది. మీకిక్కడ ఫాన్‌లేదు" అన్నారు.

సుబేదార్ సాహబ్ - 'అదృష్టం' అంటూ తన నుదిటికేసి చూపించాడు. నుదురు మధ్య బాగా ఎత్తుగా ఉన్న నరం ఇంత దూరంనుంచి కూడా కనిపిస్తుంది.

జితేన్‌దా ఉపనయన మప్పుడు - పెద్దమ్మ పక్కమీద పడుకుని ఒక పేదసాలెవాడి కథ వింటున్నాను. సాలెవాని నుదుటిమీద రాజతిలకపు శుభచిహ్నం ఉంది. తర్వాత కొన్నాళ్ళు ఎవర్ని చూసినా అతడి నుదురును బాగా పరిశీలనగా చూశాను. నేను అన్నయ్య వేలితో రాచి రాచి, చర్మాన్ని యించుమించు తీసేశాం. నుదుటిమీద నరీగ్గా బొట్టుపెట్టినట్లు మచ్చపడింది. అమ్మ తిట్లమూలంగా, వీధిలోవారి హేళనమూలంగా మేము కొన్నాళ్ళు యింట్లోనుంచి బయటికి వెళ్ళలేకపోయాం.

గుమ్మం తెరుచుకుంది. డాక్టరుబాబు లోపలకు వెళ్ళారు. లోపల తెరచి ఉన్న ద్వారంలోనుంచి ఎన్నో బూట్ల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. జైలులోపల నుంచి చాలామంది 'మార్చ్' చేస్తూ గేట్‌వైపుకి వస్తున్నారనుకుంటాను. మళ్ళీ ద్వారం మూసుకుంది. కాని కొన్ని క్షణాలలోపల ద్వారం మధ్య ఆరంగుళాల పరిమాణం గల కిటికీ తెరుచుకుంది. ఒకరు లోపలినుంచి 'భోజ్‌పురి' భాషలో ద్వారం తెరవమని చెప్పాడు. మళ్ళీ ద్వారం తాళం తెరుచుకుంది. వార్డర్లకు తాళం వెయ్యటానికి తీయటానికి విరామం అనేది లేదు. దీనికి వాళ్ళు అలసిపోనుకూడా అలసిపోరు. అప్పుడే డాక్టరుబాబు లోపలికెళ్ళేప్పుడు తలుపులు తెరిచారు. ఆ సమయంలోనే యెవరో వస్తున్న అడుగుల సవ్వడి విన్పించింది. ఆ సమయం కొద్దిక్షణాలు తలుపులు తెరచి ఉంచితే సరిపోయేది. అలా చేస్తే రెండుసార్లు శ్రమపడవలసిన అవసరం ఉండేదికాదు. ఇక్కడ వారు యంత్రచాలితవత్‌గా పనులు చెయ్యటం - జైలు నిబంధనల మూలంగానా? తమ అలవాటు మూలంగానా? తలుపులు తెరిచే నిబంధన విలక్షణమైనది. జైలు గేట్‌కి మధ్య రెండు చిన్న గేట్‌లున్నాయి. ఒకటి నేను కూర్చున్న చోటుకెదురుగా ఉంది. ఇంకొకటి ఈ గేట్ నుంచి పది పదిహేను గజాలలోపుగా ఉంటుంది. రెండు గేట్‌లకు మధ్య 'ప్యాసేజ్' పెద్ద హాలులా ఉంటుంది.

జైలులోపల కార్యస్థానం - సెంట్రల్ టవర్ జైలు బయట కార్యస్థానం ఈ ప్యాసేజ్. నాలుగు ఎద్దుబళ్ళు జైలు లోపలకు యిటికెలు తీసుకెడతాయి. వార్డర్ యెదురుగా ఉన్న ద్వారం తెరిచి, మొదట రెండు బళ్ళను ఈ హాలుదగ్గిరకు వెళ్ళనిస్తాడు. తర్వాత మూసేస్తాడు. తర్వాత లోపలి ద్వారం తెరుచుకుంటుంది. రెండు బళ్ళను పోనిస్తారు. లోపలి ద్వారం మూసేస్తారు. మళ్ళీ వస్తారు. ఎదురుగా ఉన్న ద్వారం తెరిచి మిగిలిన రెండు బళ్ళను పోనిస్తారు. ఒకసారి రెండు గేట్‌లు తెరిచి, నాలుగు బళ్ళను పోనిస్తే ఏం ప్రళయం వస్తుందా!...

లోపల వార్డర్ల జట్టు కోలాహలం చేస్తున్నారు. ఒక వార్డర్‌ను ఉరి ఖైదీ సెల్‌లో డ్యూటీ ఎవరిదో అడగనాయేం? అతడి దగ్గిర్నుంచి అన్నయ్య ఇప్పుడేం చేస్తున్నాడో తెలుసుకోవచ్చు. అహఁ. వద్దు. మళ్ళీ ఏమనుకుంటాడో! బహుశా వెటకారంగా జవాబు చెప్పచ్చు. బహుశా అతను నే సాక్ష్యమిచ్చిన సంగతి తెలుసుకుని...

అందరూ బ్యారక్‌కి తిరిగి వెళ్ళటానికి తొందరపడుతున్నారు. రాత్రి చాలా ప్రొద్దుపోయింది. ఒక రిజిష్టర్‌లో పేరు వ్రాయటమయింది. ఒక వార్డర్ ఎత్తుగా ఉన్న డెస్క్‌క్రింద నుంచి చెయ్యిపోనిచ్చి, సుబేదార్‌కేదో యిచ్చాడు. ఇతరు లెవరూ చూడకూడదని ఉద్దేశం. ఒక్కరొక్కరే అందరూ బయటికి వస్తున్నారు. వారిలో తెల్లగా వున్న పిన్నవయస్కుడైన వార్డర్‌ను సుబేదారు దగ్గిరకు పిలిచి, అతడి తలపాగ ఊడతీయమన్నాడు. సుబేదార్ అతడి నడుము, హాఫ్ ప్యాంట్ మొదలైనవి సెర్చ్ చేస్తున్నాడు. సెర్చ్ చేస్తే ఏం దొరకలేదు. వార్డరు బయటికి వెళ్ళే సమయంలో కోపంతో బుసలుకొడుతున్నాడు. "ఇతడి అక్కస్సంతా నామీదే. నేను హెడ్ వార్డర్ గ్రూప్‌లోవాడినని సుబేదార్ విశ్వాసం. వారిలో వారికి తగవు. మమ్మల్ని పట్టుకుని లాగటం. ఉండు, జైలర్‌సాబ్‌తో చెప్పి, దీనికి తగిన యిది నేను చెయ్యలేకపోతే దానితో నా నౌకరీ ఉండనీ, పోనీ, నేనేం లెక్కచెయ్యను."

తర్వాత ఒక అశ్లీలమైన తిట్టు తిడుతూ - "నౌకరీని గురించి ఏదో అన్నావుకదూ-"

కీర్తన గానం అరుపులు విరామం లేకుండా వినిపిస్తున్నాయి. ఒక్క మాట కూడా తెలియటంలేదు. మధ్య మధ్య 'రామ్ హో రామా!' అన్న దొక్కటే తెలుస్తోంది. చిన్నప్పుడొక కవిత చదివాను. అందులో ఒక లైన్ ఉంది. "దర్వాన్ రామాహై" కవిత జ్ఞాపకం రావటంలేదు. దాని మొదటి లైన్ - "భోర్‌హూలో - ఖుకూమణీ! జాగో!" (వేకువవేళయింది. అమ్మాయీ మేలుకో) ఈమాదిరిదేదో...

...జితేన్‌దా పెద్దమ్మ పెద్దకొడుకు. పెద్దమ్మ పెట్టెలో నుంచి డబ్బులు దొంగిలించి,

ఎన్నో కథల పుస్తకాలు తెప్పించాడు. కలకత్తా నుంచి పార్శిల్ వచ్చాకనే యింట్లో అందరికీ తెలిసిపోయేది. జతేన్ యింట్లోంచి పారిపోయివచ్చి, మా ఆశ్రమంలో రెండు రోజులున్నాడు. పెద్దమ్మ 'అతణ్ణింక యింట్లో అడుగుపెట్టనివ్వను' అన్నది. ఆ పార్శిల్‌లోంచి రెండు పుస్తకాలు పెద్దమ్మ మా అన్నయ్యకీ నాకూ యిచ్చింది. వాటిలో ఒక దాంట్లో ఈ కవిత ఉంది. జితేన్‌దా ఎన్నిసార్లు డబ్బు దొంగిలించి పార్శిల్ తెప్పించాడో అంతులేదు. బ్యాడ్‌మింటన్ సెట్, క్యారంబోర్డు, ఫుట్‌బాల్ డంపు, ఎన్ని పార్శిల్స్ తెప్పించాడో వాటికి లెక్క ఉందా? ఒక్కొక్క ఆటమీద ఉత్సాహం కొన్నాళ్ళుండేది. కాని ఏ ఆటకూడా ఒక్క మోస్తరుగానైనా ఆడలేడు...అలాంటి జితేన్‌దా ఈనాడు ఎంత గంభీర వ్యక్తి అయినాడు! కంట్రాక్టుల్లో ఎంత డబ్బు సంపాదించాడు! మమ్మల్ని - అంటే రాజకీయరంగంలో పేద కార్యకర్తలను, ఎంత జాలిగా నిర్లక్ష్యంగా చూస్తాడు. మేము కనుక ప్రయత్నిస్తే, అతడికంటె ఎక్కువ డబ్బు సంపాయించగలం అని అతడికెవరు నచ్చచెప్పగలరు! Nothing succeeds like success...

లోపలి ద్వారంలోని చిన్న కిటికీ తలుపు ప్రక్కకు తెరుచుకుంది. ఎవరో వార్డరుకేదో చెప్పినట్లున్నారు. చీకట్లో అతడి ముఖం ఏమీ కన్పించటంలేదు. ఆలీబాబా గుహ...చిచింగ్ పాంక్! ఆలీబాబా గుహ రాసులకు రాసులు ధనరత్నాలు తప్ప ఏమివ్వగలదు? కాని ఈ గేట్ తెరిస్తే ఎంతమంది జీవచ్ఛవాల్లాంటి వ్యక్తులు! మళ్ళీ నిజంగానే బ్రతకగలరు! ...జైలు అంతా గోడలుకావు. దాని మధ్యలో చాలా ఖాళీ జాగా వుంది. అక్కడ బహిరంగమైన గాలి వాతావరణం పొందవచ్చు. కనీసం సాధారణమైన గృహస్థుల యింటి ముందుండే మెల్లాకంటె - జైల్లోని మెల్లా చాలా పెద్దది. కాని దానివల్ల ఏమిటి లాభం? జైలులోపల పూలతోట, నిమేర్ ఎవెన్యూ, నీడలుగల వెలగచెట్లు, రావిచెట్లు, మర్రిచెట్లు ఉంటే ఏమయినట్లు? వాతావరణమంతా విషాదపూరితం. నిర్జీవం... కల్మషభరితం... ఆ ప్రదేశమంతా యేదో దిగులు దిగులుగా ఉంటుంది! ఆ వివర్‌లజ్, లెడ్‌బేటర్, కానన్‌డయల్ వీరు physical phenomena గురించి సరిగ్గా చెప్పారా? గంభీరమైన ఆలోచనలు - మానసికమైన కల్లోలమప్పుడు మనం ఆలోచనలనన్నిటినీ ఇక్కడ వదిలెయ్యగలమా? మన ఆలోచనలేం ఉల్లిపాయలాంటివా? దాని నుంచి ఒకొక్కపొరే - ఒకటి మందపుది ఒకటి సన్నటిది ఒలిచి పారెయ్యటానికి! నిజంగా ఏ పాత యింటిలోపలికి వెళ్లాలన్నా యిందుకేనా మన ఒళ్ళు జలదరించేది?

లోపల నుంచి వచ్చిన అతడు హాస్పిటల్ కాంపౌండరు. పెద్దమనిషి మంచి విలాసపురుషుడు. చేతిలో ఒక హరికెన్ లాంతరు. పాముల భయమాయేం? అసలు

అతడు జైల్లోకి వచ్చేప్పుడు ఖాళీ లాంతరుని తీసుకుని వస్తాడు. ఇంటికి తిరిగి వెళ్ళేప్పుడు లాంతరు నిండా కిరోసిన్ నింపుకుని వెడతాడు. ఆ(. అందరికీ తెలుసు. అందరూ ఎరుగుదురు. కాని ఎవరూ ఏమీ అనరు. ఇలాంటి చిన్న చిన్న రాబళ్ళను - వారు పైన పొందే వాటినిగా భావించరు. ఇవేవో వారి నౌకరీ జీతంలో అంశాలయినట్లు - బహుశా జీతం ఇరవై అయిదు రూపాయలుంటుంది. కాని గుడ్డలు, బూట్లు మొదలైనవాటికి అంత డబ్బు ఎలా ఖర్చుచేస్తారు? డాక్టరుగారితో ఈ రాబడిలో తప్పకుండా భాగం ఉండి ఉంటుంది.

"ఏవి(టి కాంపౌండరుగారికివాళ ఆలస్యమయినట్లుంది?" సుబేదారు సానుభూతి స్వరంతో అడిగాడు.

"అవును. సుబేదార్ సాబ్! ఈ జైల్లో ఉద్యోగంలో చేరి ఎంత బుద్ధితక్కువ పనిచేశాను. ఒక్క నిమిషం సెలవు లేదు. అప్పుడనగా చీకటితో వచ్చాను. ఇప్పుడు రాత్రి పన్నెండయింది. మధ్యాహ్నం ఇంటికెళ్ళి కాస్త తిండితిని వచ్చాను. సిన్హేశ్వరబాబు తొమ్మిదింటికి హాస్పిటల్ డ్యూటీకి రావలసింది. ఇప్పుడొచ్చాడు. రాత్రి పన్నెండింటికి హాయిగా తిని తాంబూలం నములుతూ-"

తర్వాత ఒక అశ్లీలమైన తిట్టు తిట్టాడు - తన అదృష్టాన్నో, సిన్హేశ్వరబాబునో, అప్పుడే చొక్కాలో దూరిన పురుగునో - ఎవర్ని తిట్టిందీ సరీగ్గా తెలియలా. ఇంతకు ముందే జైలులోపలకు వెళ్ళిన డాక్టరుబాబు పేరు సిన్హేశ్వరబాబు అన్నంతవరకు మాత్రం తెలిసింది. చొక్కాలో దూరిన పురుగు బయటికి తీసుకుంటున్నాడు. ఇప్పుడా ముఖ కవళిక చూస్తే నవ్వొస్తుంది.

కాంపౌండరుబాబు తన కష్టసుఖాల సంగతి చెప్పకుపోతున్నాడు. "మిత్రా సాహబ్ నైట్‌డ్యూటీ ఉన్నా ఒకరకంగా మంచిది. అతను వచ్చిన రోజున తొమ్మిదింటికే వస్తాడు. లేకపోతే అసలు రానేరాడు."

ఇద్దరూ కళ్ళతో ఏవో సైగలు చేసుకుని నవ్వుకున్నారు. మళ్ళీ కబుర్లు మొదలయినాయి.

"అవన్నీ జైలర్ సాహబ్‌కు కూడా తెలుసు. జైలర్ సాబ్ ఎన్నిసార్లు రాత్రిళ్ళు రౌండ్స్‌కి వచ్చినపుడు హాస్పిటల్‌కి వెళ్ళి డాక్టరు గది ఖాళీగా ఉండటం చూశారు. ఆయన తన కళ్ళతో చూడకపోయినా జైల్లో ఏ సంగతీ తెలుసుకోకుండా ఉండరు. వెనక సాబ్ ఉండగా ఒక రోజున పట్టుబడి "ఏం చెయ్యగలం? హాస్పిటల్‌లో ఆ వార్డులో డ్యూటీలో వున్న డాక్టరు పడుకునే గదికి తలుపులు లేవు. రాత్రి ఒకవేళ

ఎవరైనా వచ్చి కొడతారేమో అన్న భయంతో అక్కడ పడుకోవటంలేదు" అని సమాధానం చెప్పాడు. ఆ సాబ్ కూడా కుయుక్తిపరుడు. "రాత్రిళ్ళు ఖైదీలు బంధించి ఉంటారు. ఎవరు కొడతారు?" అని అడిగాడు. రాత్రిళ్ళు వార్డర్ల డ్యూటీ కేటాయించిన మేట్స్‌ని బంధించి ఉంచరు. ఈ సంఘటనకు సరిగ్గా ముందే జైల్లో 'మ్యూటినీ' జరిగింది. అంచేత సాహబ్ ఇంక ఎక్కువ ఏమీ మాట్లాడలేకపోయారు. కాని ఇప్పుడు? మజఫర్‌పూర్ జైల్లో కొందరు పొలిటికల్ ప్రిజనర్స్ పారిపోయినప్పటినుంచీ మేట్స్‌కి రాత్రిళ్ళు డ్యూటీ బంద్ చేయబడింది. మేట్సే వారికి పారిపోవటానికి సాయపడ్డారని వినికిడి... ఇప్పుడు వెనుకటి సాకులు చెల్లవు. ఇప్పుడు మళ్ళీ ఏదైనా క్రొత్త సాకు చూపించాలనుకుంటా. అచ్ఛా మిత్రమా! ఒక సిగరెట్ ఇయ్యి చూస్తా. చాలా అలసిపోయాను. ఎముకలన్నీ విరిగిపోయినట్లున్నాయ్."

సుబేదార్ సాబ్ సిగరెట్ బయటికి తీశాడు. కాంపౌండర్ సాబ్ వెలిగించాడు. తర్వాత చాలా సన్నని గొంతుతో ఏవో మాటలు జరిగాయి. కాంపౌండర్ సాబ్ లాంతరు వత్తి హెచ్చించి, లాంతరు తీసుకుని పట్టుకున్నాడు. సగం కాలిన సిగరెట్‌ని గట్టిగా దమ్ములాగి సుబేదార్ చేతికిచ్చారు. గేట్‌లోంచి బయటికి వెళ్ళేప్పుడు "దాన్ని గురించి ఏమీ దిగులుపడవద్దు. నేనే వెళ్ళి యిస్తాను" అన్నాడు. ఇంతసేపు ఏ సంగతులు మాట్లాడుకున్నది? ఏమిటి వెళ్ళి ఇచ్చేది? ఇంజక్షన్ కాదుకదా! సుబేదార్ సాబ్ కాంపౌండర్ బాబు - ఇద్దరి మధ్య ఎంతో ఆత్మీయత ఉండటం గమనించాను. గేట్ బయటికివచ్చి కాంపౌండర్ బాబు సుబేదార్‌ని - "నువ్వు ఇవాళ యిక్కడే పడుకుంటావా?" అని అడిగాడు.

"ఆఁ ఆఫీసు గదిలో పక్క వేసుకుని ఉంచాను. ఇహ పడుకోవటానికి వెడతాను". కాంపౌండర్‌బాబు తలమీద వెనక జుట్టు ఎంత పొడుగు. చాలావరకు తెల్లబడిపోయింది. అతను ఎంతమంది ఖైదీలను ఉరి తీయటం చూశాడో! తెల్లవారకట్ల ఉరిని గురించిన సంగతి యేదీ అతని మనస్సులోకే రాలేదు. కాంపౌండర్లు అందరూ వెనకాల జుట్టు పొడుగ్గా పెట్టుకుంటారా?"

... ఆ హరీష్ కాంపౌండర్! నెత్తిన సగం క్రాఫ్ జుట్టు. అతను మాధవబాబు గారింటికోసరం మందు తయారుచేస్తున్నాడు. అనుమాన రోగ లక్షణాలుకల మాధవ బాబు సరిగ్గా వెనకాలే నుంచుని ఉన్నాడు, కొలత సరిగ్గా ఉందా లేదా అని చూడటానికి. కొంతసేపయేసరికి అతను విసుగెత్తి ఓర్చుకోల్పోయి, టక్కున హరీశ్ జుట్టు గుప్పిటితో పట్టుకుని తల ఊగించాడు. "జుట్టు పొట్టిగా కత్తిరించుకోలేవూ? వెనుకనుంచి నువ్వు

మందు తయారుచెయ్యటం ఏమీ కనిపించటంలేదు" అన్నాడు. నేను వెళ్ళి అన్నయ్యతోనూ, అమ్మతోనూ ఈ కథ చెప్పాను. అందరూ కలసి ఒకటే నవ్వులు! అమ్మ నవ్వు ఆపుకోవటానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ "అమ్మో! అన్నీ నీకళ్ళే పడతాయాయేం?" అన్నది. అమ్మ నవ్వితే ఆమె కళ్ళవెంట నీళ్ళొస్తాయి. ఇహ అన్నయ్య నవ్వినప్పుడు నవ్వదే వినిపించదు. ఎడమవైపు బుగ్గను సొట్టపడుతుంది. ఆశ్చర్యం! రెండు బుగ్గల్నీ కాదు, ఒక బుగ్గనే సొట్ట కనిపిస్తుంది. నవ్వేప్పుడు కళ్ళు రెండూ అర్ధనిమీలితాలవుతాయి. అన్నయ్య నవ్వు మొహం కళ్ళముందు మెదిలింది.

దీపంకాంతి క్రమంగా దూరంగా వెళ్ళిపోతోంది. దీపం అటు యిటు ఊగుతోంది. కాంపౌండరుబాబు లాంతరు, కాంపౌండరుబాబు యింత ఊగిసలాడుతూ నడుస్తాడా? గొరిల్లాలు ఇలాగే నడుస్తారు. దగ్గిర ఉన్నప్పుడు ఇంత గమనించలేదు. అంత దూరం వెడుతున్నాడు దేనికి? గవర్నమెంట్ క్వార్టర్స్‌లో కిళ్లీ దొరకదనుకుంటా. దూరంనుంచి హరికెన్ లాంతరు వత్తికి పెద్ద లైటు వత్తికి తేడా తెలియటంలేదు.

రాణీపాత్రాలో ఒక 'కిసాన్' కేసు దర్యాప్తు చేసి, తిరిగి వచ్చేప్పుడు నేను, అన్నయ్య, సహదేవ్ పూర్తిగా అలసిపోయాము. చీకటిరాత్రిలో మిణుకుమనే వెలుతురు చూసి, రాత్రి గడపటానికి అక్కడికే వెళ్ళేందుకు నిర్ణయించుకున్నాం. మిణుగురుపురుగుల కాంతిలాంటి వెలుతురు - క్రమంగా దగ్గిరగా వెళ్ళి చూస్తే పొగబారిన లాంతరుదీపం. లాంతరు పాతది, తుప్పుపట్టింది. 'మహాత్మా' కోసరం మంచం, కంబళి, తలగడాలు వచ్చాయి. వాలంటీరు సహదేవ్ కోసం ఒక చాప వసారాలో వేశారు. మంచం ఇంటి బయట - పాకలో వేశారు. చుట్టూ గోడకాని, దడికానిలేవు. ఈ దేశంలో వాటిని 'గాలి గుడులు' అంటారు. కంబళిమీద మురికిగా ఉన్న దుప్పటి, నూనె మరకల తలగడా చూసేసరికి నా ఒళ్ళు జలదరించింది. బహుశా ఎన్ని రోగాల బీజాణువులు అందులో వున్నాయో! నేను మంచం మీదినుంచి వాటిని తీసేసి, ఒట్టి కంబళిమీద కూర్చున్నాను. కంబళిమీద మురికి కంటికి కనిపించదు కనుక కాస్త మనస్సుకి తృప్తి. పెరుగు వడ్డించిన వ్యక్తికి కళ్ళకలక వుంది. అన్నయ్య ఆ పెరుగు తిని హాయిగా నిశ్చింతగా తలగడ వున్న పక్కమీద పడుకుని నిద్రపోయాడు... అదృష్టపు ఆభాస - అన్నయ్యలో మొదటినుంచీ గమనిస్తున్నా. అతడికి ప్రక్కనున్న వారితో కలిసిపోయి వ్యవహరించే ఓర్పు అద్భుతం. ఈ సంగతి ఏమైనా కదిలించి అడిగితే - 'ఒకవేళ మూలసిద్ధాంతానికి ఎలాంటి ఆఘాతం తగలనట్లయితే నీ సౌజన్యాన్ని బలి యిచ్చుకోవటంవల్ల ప్రయోజనమేముంది?' అంటాడు. ఆత్మకేంద్రికమైన అతడి మనస్సు ఆలోచనల మధ్య మునిగిపోయి

ఉండాలనే కోరుతుంది. అన్ని ప్రశ్నల్నీ అతడు తన ధోరణిలోనే ఆలోచిస్తాడు. తనలో తాను అన్ని విషయాలను తరచి తరచి విమర్శించుకుంటాడు. ఎలాంటి సూక్ష్మ విషయాన్నయినా నాకంటె బాగా అవగాహన చేసుకోగలడు. కాని వ్యావహారిక రంగంలో వ్యక్తిగత జీవితంలో - అతడి ఆచరణ హేతువుకు అనుగుణంగా ఉండదు. నాకు వింటేనే కోపంతో ఒళ్ళుమండిపోయే మాటకు - బహుశా చిరునవ్వుతో చిన్న సమాధానం చెప్పేసి సహించగలడు. సాక్షాత్తూ నీలకంఠుడు. అతడికి సాహసానికి లోటులేదు. ఉపయుక్తమైన ఏ పనినయినా భయంవేసి వదిలేసి ఊరుకోవటమనేది నేనింతవర కెప్పుడూ చూడలేదు. కాని అతడి రక్తమేమిటో ఉడుకెత్తదు. చురుకైన బుద్ధి, తీవ్రమైన అనుభవం ఉన్నప్పటికీ - ఉధృతమైన ఉద్వేగం, ప్రచండమైన ఉద్రేకం అతడిలో కనిపించవు. ఏదో జారుడు నేలమీదినుంచి ఎంతో జాగ్రత్తగా అడుగులు నొక్కి నొక్కి వేసుకుంటూ నడిచినట్లు - ప్రతి అడుగూ తూచివేస్తాడు.

... థ్రిలేగెడ్ రేసుల సమయంలో అన్నయ్య ఎంత జడత్వంలో అడుగుపెట్టాడు! వెనక ఒకసారి కుమార్ సాహబ్‌గారి మేలాలో పిల్లల స్పోర్ట్సులో - నేను అన్నయ్య థ్రిలేగెడ్ రేసుకి వెళ్లాం. మేము చాలా వెనకపడిపోయాం. సఫలీకృతులం కాలేకపోయాం. ఈ 'అయిటమ్' పూర్తి అయిపోగానే - కోపంతో దుఃఖంతో - "నిన్ను వెంటపెట్టుకుని పరుగెత్తటం మెడకోడోలు కట్టుకుని పరుగెత్తటం ఒకటే-" అన్నాను అన్నయ్యతో. "నేను ముందే చెప్పాను - నువ్వు స్పోర్ట్సులో ప్రతిదాంట్లోనూ ఫస్టునే వస్తావని. నన్ను పట్టుకుని అనవసరంగా బలవంతంచేసి లాక్కువచ్చావ్. "పాన్నాని జోడీ చేసుకుంటే గెలిచేవాడివే" అన్నాడు అన్నయ్య. అతడు ఇంత సిగ్గుపడటం, కళవళపడటం నేనెప్పుడూ చూడలేదు. పంథొమ్మిది వందల నలభై మూడు - పంథొమ్మిది వందల ఇరవై రెండు ఇరవై ఒక్క సంవత్సరాల క్రిందటి సంఘటన అన్నయ్య ముఖం చెమటతో తడిసిపోయి, శ్రమమూలంగా వాడిపోయి ఉంది. ఇటూ అటూ రేగిన జుట్టు దుమ్ముకొట్టుకుపోయి ఉంది. అన్నయ్య రొప్పుతూ రోజుతూ ధోవతి కుచ్చెళ్ళతో కాళ్ళ దుమ్ము దులుపు కుంటున్నాడు. నా మనస్సు చాలా పాడై ఉంది. వేరు వేరు పోటీల్లో వచ్చిన ప్రైజులను అమ్మకు చూపించి సంతోషించలేదు. వాటిని అన్నయ్యే స్వయంగా అమ్మకు చూపించాడు. మర్నాడు మళ్ళీ వాటినన్నింటినీ - స్నేహితులకీ - బంధువులకూ చూపించాడు. అమ్మతో 'రోజారివో దొర చేసిన ఘనకార్యం నీలూ దగ్గిర విను. నేను సరీగ్గా చెప్పలేను' అన్నాడు. అన్నయ్య నా మనస్సులోని భావం గ్రహించాడని తెలుసుకున్నాను. అతడి తీక్షణమైన సమవేదనా దృష్టి మనస్సులోని అంతరాంతరాలను

కూడా గ్రహిస్తుంది. అన్నయ్య నా మనస్సు తేలికపరచటానికి ప్రయత్నిస్తున్నాడు. నా కఠిన ప్రవర్తనకు - నేను ప్రాయశ్చిత్తం చేసుకోవటం సముచితం...రోజారివో దొర చేసిన పని చెప్పటం జరిగింది. రోజారివో దొర కుమార సాహెబ్‌గారి మేనేజరు. ఆటల పోటీలు అతడి ఆధ్వర్యంలోనే జరిగాయి. నూరు గజాల పరుగులో ఖోకన్‌దాతో ఎవరూ నెగ్గలేరు. అతడి అసలు పేరు క్రీంవార రంజనదత్త. అతడు ఫస్ట్ వచ్చాడు. నేను సెకండ్ వచ్చాను. పిల్లల స్పోర్ట్సులో చొక్కాలకు నంబర్లు వెయ్యలేదు. గంతవ్యస్థానానికి చేరుకున్న తర్వాత రోజారివో దొర, అందర్నీ అడిగి కాయితంమీద పేర్లు వ్రాశాడు. ఖోకన్‌దాని పేరు అడిగాడు. నాలుగువైపులా జనం గుంపు కోలాహలం. ప్రతి పోటీ అయిపోగానే ఇలా జరుగుతూంటుంది. ఖోకన్‌దా పేరు చెప్పాడు. దొర రెండు మూడుసార్లు అడిగినప్పటికీ అతడిపేరు సరీగ్గా తెలుసుకోలేకపోయాడల్లేవుంది. అతడి తర్వాత నా పేరు వ్రాసు కున్నాడు. నా తర్వాత యిద్దరి పేర్లు వ్రాశాడు. ప్రైజ్ లిచ్చే సమయంలో చూస్తే నాకు ఫస్ట్ ప్రైజ్ యిచ్చాడు. ఖోకన్‌దా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అతడి పేరు లేదు. జితేన్‌దా అతణ్ణి పరిహాసం చేస్తూ 'క్రీంకార రంజనదత్త అన్న పేరు దొర వ్రాయగలడా? అమ్మ నాన్నా పెట్టిన పేరు మూలంగా నీ ప్రైజు నష్టమయింది. ఇంక రేపు ప్రొద్దునే కుమార సాహెబ్ దగ్గరకి వెళ్ళు' అన్నాడు. అమ్మ ఈ కథంతా విని నవ్వుతుందనుకున్నాను. కాని ఫలితం ఉల్టా అయింది. నా ప్రైజ్ టీపాట్ మర్నాడు ఖోకన్‌దాకి ఇచ్చిరావలసివచ్చింది. నా ప్రైజ్ మాత్రం మైదానంలో దొంగిలింపబడింది. రోజారివో దొరను చూస్తే ఇప్పటికీ నా యీ విచారకర విషయం తలపుకి వస్తుంది.

అన్నయ్య ఇంకెప్పుడూ నాతో పార్ట్నర్ అయి ఆడటానికి ఇష్టపడలేదు. ఏదో ఒక వంక చెప్పి తప్పించుకోవటానికి ప్రయత్నించేవాడు. అన్నయ్యకి ఆటలమీద అంత ఆసక్తి ఎప్పుడూ లేదు. ఒక్క బ్యాడ్‌మింటన్ తప్ప యే ఆటా బాగా ఆడలేడు. కాని ఇందులో కూడా ఏ మ్యాచ్‌లోనూ అతడు నాతో పార్ట్నర్ అయి ఆడలేదు. ప్రీతి, సౌజన్యం, నమ్రతల పట్ల అతడికి అపరిమితమైన నిబ్బరం ఉంది. ఒక విషయాన్ని పట్టి అతడి లోతు తెలుసుకోలేరు. ఇంత సన్నిహితంగా ఉన్నా, స్వతంత్రుడుగా, సంబంధం లేనివాడిలా ఉంటాడు. అతడి ఈ అభిమానాన్ని ఇరవై ఒక్క సంవత్సరాలనుంచి శతవిధాల ప్రయత్నించినా భంగపరచలేకపోయాను.

బ్యారక్స్‌లో సంకీర్తన యింకా జరుగుతోంది. కోలాహలంగా ఉంది. మాంచి పట్టున పడినట్లుంది. ఇప్పుడింక సీయారామా। (శ్రీరామా!) నామసంకీర్తన జరగటంలా ఇప్పుడింక విరామం లేకుండా! 'నారాయణ... నారాయణ... నా-రా-యణా!' మాత్రమే

వినిపిస్తోంది. ఇలాంటి నామసంకీర్తన అవగానే సాధారణంగా సంకీర్తన పూర్తి అవుతుంది. తెల్లదొర సూపరెంటెండెంట్ తన క్వార్టర్స్ దగ్గిర ఈ వికటమైన అరుపులను ఎలా సహిస్తున్నాడు? వార్డర్లను రెచ్చకొట్ట తలచుకోలేదనుకుంటా. వారి మనఃపూర్వకమైన సహకారం లేకుండా జైల్లో శాసనాలు ఒక్క క్షణం కూడా సాగవు.

ఎన్నాళ్ళనాటి సంఘటన! జడ్జి స్ప్రలర్ దొర సన్నగా చిరచిరలాడుతూండేవాడు. సగం సగం పిచ్చిధోరణిగల వ్యక్తి. ప్రతి రోజూ వ్యాయామం కోసమని గొడ్డలి తీసుకుని పేళ్ళు వేసేవాడు. జర్మన్ సమ్రాట్ కైజర్‌కి కూడా ఈ జబ్బు ఉండేది. నాజీ జడ్జి ఫజ్‌లేమియా కొయ్యదుంగలు సంపాయించటానికి సతమతమయేవాడు. వకీలు బజ్‌రంగ్ ప్రసాద్‌గారి కూతురి పెళ్ళిలో ఈ స్ప్రలర్ దొర ఎంత రగడ చేశాడు! రాత్రి పెళ్ళి బాజాలు జోరుగా సాగుతున్నాయి. అప్పుడు హఠాత్తుగా వాటివల్ల తన శాంతికి భంగం కలుగుతోందన్న ఊహ తోచింది. వెంటనే ఒక కర్ర - 'బుల్స్ ఐ' లాంతరు తీసుకుని, బజ్‌రంగ్‌బాబుగారింటికి వెళ్ళి ప్రత్యక్షమయాడు. అక్కడ ఏం మాట్లాడకుండా కర్రతో డోలు చర్మానికి తూటు పొడిచాడు. మర్నాడు బజ్‌రంగ్‌బాబు కోర్టులో జడ్జీ దొరగారిమీద కేసు విచారణకు పెట్టించాడు. కొన్నాళ్ళ తర్వాత ఆ కేసు ప్రతిపక్షానికి అనుకూలంగా పరిష్కారం అయింది. ఉద్రేకం కొంచెం చల్లారాక వకీలుగారు - వకాల్తా చేసి సంపాదించుకుని తినవలసివచ్చినప్పుడు - జడ్జీగారితో తగాదా పెట్టుకుని యేం లాభం? అని గ్రహించారు. ఆత్మీయుల ఎదుట, బంధువుల ఎదుట జరగవలసిన అవమానమేదో జరిగిపోయింది. తగవు అనేది ఎంత పెంచితే అంత పెరుగుతుంది.

మన దేశంలో ప్రజలను ఏం తప్పుపట్టగలను? అన్ని దేశాల్లోని ప్రజలూ ఒకటే! దొరలు కూడా మనలాగా టైం సర్వర్లు! ఈ కాంగ్రెసు మినిస్ట్రీ సమయంలో - జిల్లా మేజిస్ట్రేట్ వార్సన్ దొర కోరి, అర్థించి మా ఆశ్రమానికి వచ్చి అన్నం పప్పు అవీ తిన్నారు. మిసెస్ వార్సన్ చేతితో అన్నం తినేప్పుడు అన్నం ముద్దను సరిగ్గా నోటిదగ్గిరకు తెచ్చుకోలేకపోయింది. చేతిలోని అన్నాన్ని చెమ్చాతో తిన్నట్లు సరీగ్గా చెమ్చాతో లాగానే నోట్లో పెట్టుకోబోయింది. నోటినిండా ముఖంనిండా అన్నం చెదిరిపడింది. వార్సన్ దొర ఏదో నెపంపెట్టుకుని అప్పుడప్పుడు చూడటానికి వచ్చేవారు. ఖద్దరన్నా, గాంధీ టోపీ అన్నా ఎంత గౌరవం చూపేవారు!

దొరగారి కూతురు ఒక ముంగిసను పెంచింది. "ఇంట్లో ముంగిస చాలా వేధిస్తోంది. మీరు ఆశ్రమంలో ఉంచుకునేట్లయితే ఇస్తాం" అని అన్నయ్యకు ఆ ముంగిసను అప్పగించారు. తర్వాత ఈ ముంగిసను చూడాలనే సాకుతో, భార్యను

కూతుర్ని తీసుకుని కలెక్టర్ సమయా సమయాలు లేకుండా ఎప్పుడుపడితే అప్పుడు వచ్చిపడేవారు. ఆయన కూతురుకి 'రికి'ని చూడాలని ఉందిట! తర్వాత రికితో చిన్నపిల్లలాగా ఎంత అపేక్ష ఒలకపోయటం - ఎంత అరుపులు.

ఆలోచనా సూత్రాన్ని విచ్ఛిన్నం చేస్తూ చీకటిని స్తబ్ధతను చీల్చుకుంటూ వాతావరణాన్ని కంపింపచేస్తూ పన్నెండు మ్రోగింది. డాక్టరు క్వార్టర్స్‌లోని ఒక కుక్క బౌ బౌ అని మొరిగింది. దాని సుఖనిద్రకు భంగం కలిగినట్లుంది! 'హొ-ఓ-హై' ఈ వికృతమైన అరుపులతోపాటు కంజరీ ధ్వనులు, డోలక్ మోతలతో కూడిన వార్డర్ల కీర్తనం బంద్ అయింది. వీరు గడియారం పెట్టుకుని పన్నెండింటిదాకా కీర్తనం చేస్తారా? ముందుగానే సరీగ్గా టైమయినట్లు ఎలా తెలుస్తుంది? కాకీ హాఫ్ షర్టుల క్రింది రెండు చేతులు అర్థగజం వ్యాసంగల కంజరిని వాయిస్తున్నాయి. ఎడంచేతి మణికట్టుకి ఒక చవకబారు రిస్ట్‌వాచి, దాని పైభాగంలో నీలం ఎరుపు రంగుల స్త్రీ ఆకృతి గల పచ్చబొట్టు.

నాన్న కీర్తనం సరీగ్గా యెనిమిదింటికి పూర్తి అవుతుంది. "రఘుపతి రాఘవ రాజారాం. పతిత పావన సీతారాం" మహాత్మాజీకి ప్రియమైన భజనకీర్తన అన్నిటికంటె చిట్టచివరికి పాడతారు. ఆశ్రమంలో ఉన్న కాంగ్రెస్ కార్యకర్తలందరూ కీర్తనలో పాల్గొంటారు. దీనివల్ల నాన్న చాలా సంతోషిస్తారని అందరూ అనుకుంటారు. నిజంగానే నాన్నకి కీర్తనలంటేగల మోజు జైల్లో వారందరూ ఎరుగుదురు. కీర్తనకు మీటింగ్ గదిలోనే కూర్చుంటారు. సిమెంట్ నేల, మట్టి గోడలు, వెదురు ఆకుల పైకప్పు - గోడలు అమ్మ తన చేత్తో నిగనిగలాడేలా అలికినవి. మధ్య చిన్న కిటికీ. దానికి తలుపు లేదు. గోడలనిండా మధ్య మధ్య రాజకీయ నాయకుల ఫోటోలు. ఒకవైపున రెండు కాంగ్రెసు జెండాలు క్రాస్ ఆకృతిలో గోడకి అమర్చి వున్నాయి. దాని పైభాగంలో ఎర్రగుడ్డమీద తెల్లరంగుతో నాగరి లిపిలో 'స్వాగతం' అని వ్రాసి వుంది. క్రింద గాంధీజీ పెద్ద ఫోటో. గదిలో తూర్పు పడమర మూలలు కొంచెం అశుభ్రంగా ఉన్నాయి. కాస్టిక్ సోడా, ఇనుప గంగాళం - ఇక గుడ్డలుతికే సబ్బు తయారుచేసే తక్కిన సరంజామాతో నిండిన కొయ్యచక్రాలతో గల పెద్ద పెట్టె ఉంది యిటువైపున. ఈ పెట్టెను 'పూల్ కాహార్ నందలాల్ తివారీ' కాంగ్రెస్ కమిటీకి ఇచ్చారు. ఒకమూల ప్రత్తిని బాగుచేసే సాధనం నిలబెట్టి ఉంది. దూలానికి ఒక ధనుస్సు వ్రేలాడదీసి ఉంది. పగలు ఏకులు తయారుచేయటానికి ప్రత్తి బాగుచేసేప్పుడు - దీనితో ఆ సాధనాన్ని జతచేసి కట్టాలి. ఆశ్రమం కీర్తనం ప్రారంభమయింది. "దేశేర్ ఖేలే గాంధీజీకే చిన్‌లీ నారే జాన్‌కీనా..." (దేశపుత్రులు గాంధీజిని గుర్తించలేదు, అర్థంచేసుకోలేదు) నాన్న స్వయంగా వ్రాసిన

గేయం. అమ్మ ధూపదాన్ తీసుకుని మీటింగ్ గదిలోకి వెళ్ళింది. గాంధీజీ ఫోటోముందు ఒక పూలమాల ఉంచి, దాని ముందు ధూపదాన్ పెట్టింది. తర్వాత ఒకవైపున విడిగా చేతులు జోడించుకుని కూర్చుంది. నాన్న లాంతరు తగ్గించి పాట మొదలెట్టారు. సహదేవ్ మొదలైనవారందరూ వికృతమైన ఉచ్చారణతో ఈ బెంగాలీ పాట పాడుతున్నారు. మొదటి పాట పూర్తి అయింది. అమ్మ సాష్టాంగంగా నమస్కరించి లేచింది. ఇంతమంది జనానికి భోజనాల ఏర్పాటు ఆమే చెయ్యాలి. సంకీర్తనంలో కూచుంటే వంట చేసేదెవరు? నేను అన్నయ్య చిన్నప్పుడు కీర్తనంలో కూర్చునేవాళ్ళం. ఉపనయనం అయిన తర్వాత కూడా కొన్నేళ్ళు కూర్చునాము. అన్నయ్య కీర్తనం మానేసిన తర్వాత కొద్దిరోజులకు నేను కూడా కీర్తనంలో పాల్గొనటం మానేశాను. దాన్ని గురించి అమ్మకి ఎంత విచారం? "మీరు రాకపోతే ఆమె దుఃఖిస్తుంది. మీ మనస్సుకిష్టం లేకపోయినా, ఆమె కోసమైనా కూర్చోరాదూ?" అన్నయ్య సమాధానం ఏమీ యివ్వలేదు. అన్నయ్య యింట్లో కీర్తన చేసేవాడుకాదు. కాని కాంగ్రెసు కార్యక్రమం అమలుపరచటానికి గ్రామాలకు వెళ్ళినప్పుడు - పెద్ద పెద్ద గ్రామాల్లో గ్రామవాసులు మాకు వినోదం కోసరం కీర్తనలు యేర్పాటుచేసేవారు. నాన్నకోసం ఇలా చెయ్యటం వారి కలవాటు. అందుకని మాష్టరుగారి కొడుకులకు కూడా ఈ మర్యాద చేసేవారు. కాని ఈ కీర్తనకు అన్నయ్య ఎప్పుడూ విసుగు వ్యక్తం చెయ్యలేదు. నేను అశాంతి వ్యక్తంచేస్తే సైగలతో ఓర్పు వహించమని చెప్పాడు.

బాయిసీతానా ఖాగ్‌హా సంతలో మీటింగ్ ఉంది. ఇంతవరకు జనం ఎవరూ రాలేదు. సహదేవ్ కాంగ్రెస్ జెండాను నేలలో పాతి ఇంక్విలాబ్ జిందాబాద్, గాంధీజీకి జయ్ అని ఎన్నిసార్లు అన్నాడు. డప్పులు వాయించటం, గంట మ్రోగించటం మొదలైనవి ఊళ్ళో జనాన్ని పోగుచెయ్యటానికి - ఎన్ని ఉపాయాలున్నాయో అన్నీ చేయటం జరిగింది. కానీ యింకా జనం మాత్రం రాలేదు. అప్పుడు స్థానికుడైన కాంగ్రెస్ కార్యకర్త రామదత్త మండల్ - గొల్లవారి భజన పార్టీని పిలిపించి రప్పించాడు. వెంట - ఒక సింగిల్ రీడ్ హార్మోనియం. పది నిమిషాల్లోపల సంతలో ఉన్న జనం అందరూ యిక్కడికి విరుచుకుపడ్డారు. తర్వాత మేము గబగబా ఉపన్యాసాలు ముగించాం. జనం సంతపనుల్లో హడావిడిగా ఉన్నారు. దాదా మందుల కాన్వాసింగ్ ఉపన్యాసానికి - మహాత్మాజీ శిష్యుల ఉపన్యాసానికి వ్యత్యాసం ఏమిటో వారు తెలుసుకోలేరు. సంతకు వచ్చారు. అన్ని రకాల తమాషాల మధ్య మహాత్మాజీ తమాషా కూడా వారు రెండు నిమిషాలు చూస్తారు. వారిలో కొందరు మహాత్మాజీ దర్శనం ఉప్పు సత్యాగ్రహానికి

ముందే చేశారు. వాళ్ళు మళ్ళీ ఈ కొత్త శిష్యుల నోటినుండి క్రొత్త విషయాలు ఏం వింటారు? వారు చెప్పేదేమిటో పదిహేను అణాల వంతు అర్థమే కాదు. మా పశువులు బీళ్ళలో మేసే ఏర్పాటు చెయ్యండి. శిస్తులు తగ్గించండి. తహశీల్‌దార్‌గారి గొడ్లు అందరి చేలల్లోపడి పంట మేస్తున్నాయ్. దాన్ని బంద్ చెయ్యండి. అప్పుడు తెలుస్తుంది. అదేంలేదు, కేవలం మెంబరు చందా తీసుకోవటానికి యెత్తు. మినిస్ట్రీ గద్దెమీద కూర్చుని శిస్తు బాకీలను శాసనం చేశారు. సంతలో ఉపన్యాసాలు చెప్పి వెళ్ళారు. ఎవరికీ నాలుగణాలకంటె ఎక్కువ దరఖాస్తుకి ఖర్చు కాదని...దానికి ఇరవై రెట్లు ఖర్చు అవుతోంది. సగంమంది దరఖాస్తులు డిస్మిస్ అయిపోయాయి. మహాత్మాజీ శిష్యుడు పుణ్యదేవజీ దగ్గర - దర్యాప్తు చేయించటానికి దరఖాస్తులిచ్చాం. అయన కూడా దరఖాస్తుకి ఎనిమిదణాల వంతున పరిశ్రమ ఫీజు తీసుకున్నారు. ఒక్క మాష్టరుగా రున్నారు కనుక ఈ జిల్లాలో మహాత్మాజీ పని కొంత అయింది. లేకపోతే వీరిలో సగం మంది మోసగాళ్ళు. నిజంగానే కాంగ్రెస్ పూర్తిగా ధనిక భూస్వాముల చేతుల్లో ఉంది. జమీందార్ల పీడనం నుంచి తాము విముక్తులు కావాలని కోరుకుంటారు. కాని వారు తమ పరిమితమైన రంగంలో కౌలుదార్లను, కౌలుదార్లు పేదవారైన వ్యవసాయ కూలీలను పీడించటం నిలుపుచేయటాన్ని వాంఛించారు. కాంగ్రెస్ మినిస్ట్రీ సమయంలో పేదరైతుల కోసరం చేసిన శాసనాలన్నిటినీ - కుటిలమైన యెత్తులతో వ్యర్థం చేశారు. సహదేవ్‌లాంటి కాంగ్రెస్ కార్యకర్తకూడా కౌలుదార్ల శాశ్వత హక్కును అరికట్టటానికి బందోబస్తు అబద్ధపు పత్రాన్ని తయారుచేయించాడు.

... దహిభాత్ గ్రామంలోని ఆ ప్రౌఢస్త్రీ - కాంగ్రెస్ ఆఫీసుకి తరుచు వస్తూ వుంది. గండరోగం గల ఆమె - వస్తూనే ఏడుస్తూ కూర్చుంటుంది. అన్నయ్యతో 'నువ్వు తప్ప దీనికి తగిన ఏర్పాటు ఎవరూ చెయ్యలేరు. ఆకాశంలో చంద్ర సూర్యులుండగానే నామీద ఈ జులుం! సహదేవ్ అన్న కపిలదేవ్ నాకున్న భూమి-పుట్రా అంతా లాక్కోవాలని చూస్తున్నాడు. భూమి మొత్తం యాభై బిఘాలు -అతని యింటికి దగ్గిరభూమికదా. [1]మాంధాతా పొగాకు పండే అద్భుతమైన భూమి. అందుకని ఆ భూమిమీద అతడి కన్ను. నా భర్త 'తేలీ'[2] జవాన్‌లాంటి కొడుకు ఆయన ఉండగానే చనిపోయాడు. అప్పుడు కోడలు గర్భిణి. సంవత్సరంలోపల నా భర్త కూడా కాలం చేశారు. తర్వాత

1. ఒక రకం పొగాకుకి ప్రాంతీయమైన పేరు.
2. బెంగాల్‌లో ఒక జాతి పేరు.

కోడలూ పోయింది. ఏడాది తిరగకముందే వేలెడంత మనవడికి గాలి సోకింది.[1] వాడు ఇరవైనాలుగ్గంటలూ దాయి ఒళ్లోనే వుండేవాడు. ఎన్నిమందులు, ఎంత వైద్యం చేయించాను. బాధకు తట్టుకోలేదని, సూది మందు (ఇంజక్షన్) ఇప్పించతలచుకోలేదు. ఇప్పిస్తే ఒకవేళ బ్రతికేవాడేమో! వాణ్ణింక బ్రతికించుకోలేకపోయాను. ఆ వాడలోని గోరే-గోపా కొడుకు తర్వాత కొద్దిరోజులకే చనిపోయాడు. అప్పుడు కపిలదేవే పంచాయతీ జరిపి 'ముందు తన యిల్లు మట్టం చేసుకుంది. ఇప్పుడు గోరేలాల్ కొడుకు మీద ప్రయోగం చేసి వాణ్ణి చంపింది' అని నామీద ఆరోపణ చేశాడు. అసలు ఒట్టి 'బేవకూఫ్'. నేను భర్తను, కొడుకును, కోడల్ని, మనుమణ్ణి అందర్నీ పొట్టను పెట్టుకుని కూర్చున్నదాన్ని. నాపొట్టలో యింకా చోటెక్కడుంది. ఈ మాత్రం తెలుసుకోలేకపోయాడు. తర్వాత నన్ను ఊళ్లోంచి వెళ్లకొట్టించటానికి ఆరోజున రాత్రి రాధూ, శనిచరా, ఛేదీ వీళ్లందరూ కపిలదేవ్ మాటమీద నా యిల్లు తగలబెట్టి బూడిదచేశారు. పిడికెడు ధాన్యం కూడా దక్కించుకోలేక పోయాను. కాని నేను మాత్రం నా యిల్లు విడిచిపెట్టలేదు. మళ్లీ కపిలదేవ్ భూమి లాక్కోవటానికి కోర్టులో నామీద డిక్రీ పొందాడుట అని విన్నాను. నేనేం పసిదాన్నా ఈ మాట నమ్మటానికి. భూమి ఉన్నది దహిభాత్ గ్రామంలో డిక్రీ ఏమో 'పూర్ణియా'లో పొందాడట. ఇది ఎక్కడన్నా జరుగుతుందా? అని ఇలా ఎన్నో సంగతులు చెప్తూకు పోతోంది. మధ్యమధ్య తలకొట్టుకుంటూ వెక్కివెక్కి ఏడ్చింది. మాష్టరుగారికి తీరిక ఎక్కడ? లేకపోతే ఆయన్ని ఒకసారి దహిభాత్‌కి తీసుకెళ్లేదాన్ని. అందుకని బిలూబాబు తప్ప తనకు వేరుదిక్కులేరు అని అనేది. అన్నయ్య, నేను ఎంతో ప్రయత్నం చేశాం. కాని కపిలదేవ్ అన్యాయానికి విరుగుడు ఏమీ చెయ్యలేకపోయాం. మేము దహిభాత్ వెడితే కపిలదేవ్ పూరీకూర ఫలహారం యిప్పిస్తాడు. కాని పని దగ్గిర మాత్రం ఆమోదాన్ని తెల్పలేదు. అటు త్రిప్పి, ఇటు త్రిప్పి తాము కూడా మహాత్మాజీ భక్తులమని, తాను జిల్లా కాంగ్రెసు మెంబర్ని, ఆశ్రమంపైన కప్పువేయించటానికి-ఏటా రెల్లు తానే యిస్తున్నానని, ఒక తమ్ముణ్ణి కాంగ్రెస్‌కి దానం చేశానని - అని అన్నాడు ... అసలు సంగతి - పెద్ద ఉమ్మడి కుటుంబంలోనివారు - అందరూ భూములు - వ్యవహారాలు చూసుకోవాల్సిన అవసరం లేదు. ఇంట్లో దండుగ తిండి తింటూ ఊళ్లో ముఠాలను చేర్చటంకంటె - ఒకళ్లిద్దర్ని కాంగ్రెసులో చేరనివ్వటం మంచిది. ఇదే పెద్ద భూస్వాముల

1. అనాగరికులైనవారు ఏ జబ్బు చేసినా -ఫలానా అని తెలియనప్పుడు ఇలా అంటారు.

మనఃప్రవృత్తి. కాంగ్రెసు సంస్థనుంచి ఎన్ని సౌకర్యాలు పొందటం వీలవుతుందో అది ఈ దానం ద్వారా నిశ్చితమవుతుంది. అంతకంటె ఏం కావాలి? తమ్ముడు కనుక కాంగ్రెసు పెద్దల మనస్సుల్ని ఆకట్టుకుని ప్రవర్తిస్తే డిస్ట్రిక్ట్ బోర్డ్ మెంబరు వరకు కూడా కావచ్చు. అదీకాక ఒకవేళ ఏ విషయంలోనైనా భూస్వాములమీద ఒత్తిడి చెయ్యటం మొదలెడితే దాన్ని తప్పించుకోవచ్చు. చివరికి నైతిక ప్రభావం తప్ప కాంగ్రెసుకింక ఎలాంటి శక్తీలేదు.

తర్వాత ఒక రోజున ఈ తేలీ భార్య దుఃఖంతో, కోపంతో అన్నయ్యను సబిన్స్పెక్టర్ని కపిలదేవే కొనేశాడు, తెలుసు. నిన్ను కూడా కొనేశాడా? అని అడిగింది. తర్వాత యింకా ఎన్నో అనబోయింది. హఠాత్తుగా సహదేవ్ వచ్చిపడటం మూలంగా ఆగింది. శత్రుత్వం ఉండనీకాక సహదేవ్ 'భూ ఇయా' (బ్రాహ్మణులలో ఒకతెగ పేరు) బ్రాహ్మడు. ఉన్నత కులం జాతుడు. గ్రామంలో గౌరవం మర్యాద ఉన్న వ్యక్తి. అతని ఎదుట సామాన్యురాలయిన తేలీ భార్య గట్టిగా మాట్లాడలేదు. ఇహ సహదేవ్ని కూడా మేమీ విషయాన్ని గురించి ఏమయినా అడిగితే కపిలదేవ్భాయ్ యజమాని. దీని సంగతి నాకేం తెలుసు? అనేవాడు.

నాకు సహదేవ్ని కాంగ్రెస్ ఆశ్రమంనుంచి మెడపట్టుకుని బయటికి గెంటివెయ్యాలని అనిపించింది. తర్వాత చాలా రోజులు నేనతడితో మాట్లాడలేదు. అన్నయ్య నాతో మాత్రం - అతనిమీద కోపం తెచ్చుకుంటే ఏమైనట్లు? ఆ తప్పు సంస్థ పునాదుల్లోనే వుంది? అన్నాడు.

పందొమ్మిది వందల ముప్పై - ముప్పై రెండు ఆందోళనలో క్యాంప్ జైల్లో ఉన్న సమయంలో మా రాజకీయనీతి దృష్టి వ్యర్థమవటం సంగతి మేము గ్రహించాం. జైల్లో దీనికి సంబంధించి ఎన్నో సమాలోచనలు. వాదోపవాదాలు మనోమాలిన్యాలు ఏర్పడ్డాయి. ఈ వ్యర్థతను పైకి స్పష్టంగా వెల్లడించని వారి ముఖాల్లో నైరాశ్యం ముద్రలాగా స్పష్టంగా వుండేది. ఆ బీజం ఇన్నాళ్లకు మొలకెత్తింది. అన్నయ్య, నేను కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరాం. తేలీ భార్య సంఘటన సుప్తంగా ఉన్న బీజం మీద వేడిని, నీరును కురిపించింది. ఆమె ఇప్పటికీ తన భర్త గృహాన్ని అంటిపెట్టుకుని ఉన్నదో లేదో తెలియదు. కాని ఆమె కన్నీళ్లు మా హృదయాల్లోని అన్ని సంకోచాలను, సందేహాలను కొట్టుకుపోయేట్లు చేశాయి. హృదయకందరంలో అర్థజాగరితమైన ఆకాంక్ష, కిటికీలోంచి ఉషఃకాంతిని చూడగలిగింది. తర్వాత అన్నయ్య నేను ఒకే పార్టీలో వుంటూ-ఎంతో ఉత్సాహంతో పనిచేశాం. అతడు కేవలం తోటి కార్యకర్తకాదు, కామ్రేడ్కాదు, అతడు నా అన్న. ఎన్నో సుఖదుఃఖాల స్మృతులు కలిసిపోయి ఒకే

సూత్రంతో కట్టబడ్డాయి మా జీవితాలు. దీనివల్ల నాకు మేలు కలుగుతుంది. దీనివల్ల నాకు ఆనందం కలుగుతుందన్న ఆలోచనే ఎప్పుడూ అతడి మనస్సులో... తాను కాలేజీలో చదువుకోలేదు. అందుకని అతడి మనస్సులో చింతలేకపోలేదు. ఎర్త్‌క్వేక్ రిలీఫ్ వర్క్‌లో ఎలవెన్స్ డబ్బును-అన్నయ్య నా కాలేజీ చదువుకి ఖర్చుపెట్టాడు. అతడి మనస్సులోని కోర్కెను నామీదుగా తీర్చుకున్నాడు. రిలీఫ్ వర్క్ అయిపోయిన తర్వాత, సామాన్లన్నీ వేలం వేసినప్పుడు అన్నయ్య నాకొక సైకిల్ కొని యిచ్చాడు, ఇవన్నీ అల్ప విషయాలు. అన్నయ్య అనురాగప్రసక్తిలో ఈ విషయాలన్నీ ఉటంకించటం అన్నయ్య అపేక్షను కించపరచటమే అవుతుంది. నాకు తలనొప్పి వస్తే అన్నయ్య కంగారుపడిపోయేవాడు. జైల్లో ఆదివారంనాడు యిచ్చే బెల్లం అతనెప్పుడూ తినేవాడుకాదు. ఎందు కనంటే-నా భోజనమయిన తర్వాత కాస్త తీపికనుక తినకపోతే నా భోజనం పూర్తి అయినట్లు కాదని అతడికి తెలుసు. జైల్లో నియమంగా నా చొక్కాల్ని బనీనుల్ని ఉతికి యిచ్చేవాడు. అడ్డుచెప్పబోతే ఆగు, నీకలవాటులేదు అనేవాడు. అన్నయ్య నాకు ఇవన్నీ చెయ్యటం ఇది నా న్యాయమైన హక్కు. ఇందులో అసహజమేమీలేదు అనిపించింది మనస్సులో. కాని... కాని అన్నయ్యకు నామీదేం హక్కులేదూ? ఉండొచ్చు, ఉండవచ్చు ఏవిటి? ఖచ్చితంగా వుంది. దాని స్థానం రాజకీయక్షేత్రానికి వెలుపల. రాజకీయరంగంలో నేను నీలూనికాదు. అతడు అన్నాకాదు. ఇక్కడ వ్యక్తి, ఇక్కడ వ్యక్తిగతమైన ప్రశ్నలు వదిలేసి, ప్రతి కార్యపద్ధతిని హేతువాదపు ఒరపిడిరాయిమీద పరీక్షించి చూడాలి. నా పార్టీ దృష్టికోణాలలోంచి అన్ని విషయాలను ఆలోచించాలి. లోకం నన్ను గురించి తన యిష్టం వచ్చినట్లు భావించనీ, అన్నయ్య నా ఆంతర్యాన్ని సరిగ్గా అర్థం చేసుకుంటాడు. అక్కడ సంకుచితత్వం లేశమాత్రం కూడా లేదు.

పంథొమ్మిదివందల నలభైలో - అన్నయ్య నేను అరెస్టయినాం. అప్పటికి మేమిద్దరం సి.ఎస్.పి. మెంబర్లమే. కాని జైలులోపల కొద్ది నెలలలోపల ఎంత పరివర్తన జరిగింది... ఆ వార్డులోని పనసచెట్టుక్రింద చంద్రదేవ్‌తో మొట్టమొదట పరిచయం. అతడి దగ్గిర్నుంచి పుస్తకాలు తీసుకోవటం, అతడి లెక్చర్‌కి వెళ్లటం, పనసచెట్టు క్రింద కంబళ్లు పరిచి లెక్చర్‌క్లాస్-అంతా కళ్లముందు మెదులుతోంది. అతడి ఖండించటానికి వీల్లేని హేతువాదం ముందు తలవంచటం జరిగింది. మెల్లిమెల్లిగా కళ్లముందు మూగతెర తొలిగిపోతున్నట్లనిపించింది. అన్నయ్య రెక్కలమాటున వుండి రాజకీయ రంగాన్ని చూసిన తీరు - అది రోగగ్రస్త భ్రమ. అది అవకాశవాదులైన సామాన్య మధ్యతరగతి వర్గపు భావోద్వేగం మాత్రమే. నిరుపేదల సహజమైన ప్రబలశక్తికి అక్కడ తావులేదు. జాతీయతకి

వెలుపలివైపు చూడగలశక్తి లేదు వారికి. చంద్రదేవ్‌వర్గంలో చేరటానికి ముందు, అన్నయ్యతో ఆలోచించాలని అనుకున్నాను. చెపుదాం, చెపుదామని అనుకుంటూనే ఉన్నా చెప్పటం జరగలేదు. ముఖ్యంగా సంకోచంవల్ల-రెండోది అతడి యుక్తికి సమాధానం చెప్పలేనేమో అన్న భయంవల్ల. అన్నయ్య హేతువాదం తప్పని నాలో నేను గ్రహించాను. ప్రతియుక్తికి చంద్రదేవ్ దగ్గిర సమాధానం విని, మళ్లీ అన్నయ్య దగ్గరకు వచ్చి చెప్పగలిగినట్లయితే - తేలిపోయేది. చివరికి అన్నయ్యతో చెప్పకుండానే క్రొత్తవర్గంలో చేరాను. ఇంక అడగటం మాత్రం ఎందుకు? రాజకీయ రంగంలో పసితనం అనేది ఎప్పటికీ అలాగే వుండిపోతుందా? అప్పటినుంచి మా యిద్దరిమధ్య దాటటానికి వీల్లేనంత దూరం ఏర్పడింది. అది యిప్పటికీ అలాగే వుండిపోయింది. రాజకీయ కార్యకర్తల జీవితం వారి పార్టీ లోపలనే-పార్టీ బయట అతని అస్తిత్వాన్ని పూర్తిగా తుడిచివెయ్యాలి. అప్పటినుంచి నేను అన్నయ్యని తప్పించుకుని తిరగటానికి ప్రయత్నించాను. కేవలం వ్యక్తిగతమైన పనుల సంగతి తప్ప మరో ప్రసక్తిరాలేదు. మళ్లీ-నాపార్టీలోవారు ఏమనుకుంటారో అని ఎప్పుడూ నాకు భయమే. అన్నయ్య ప్రతిద్వంద్వివర్గంలో పేరుగల కార్యకర్త. అతడితోటి ఆత్మీయతను మా పార్టీలో వారు కచ్చితంగా హర్షించరు. బహుశా నాతో ఏమీ అనరు. కాని వారిలోవారు ఈ విషయమై తప్పకుండా చర్చించుకుంటారు. ఈ రెండువర్గాలేకాక ఇంకా కొందరు రాజకీయ ఉపవర్గాల కార్యకర్తలు కూడా అక్కడ వున్నారు. ప్రతివర్గంవారికీ తమవర్గంలో మరొక వర్గపు గూఢచారులున్నారని ఒక నమ్మకం. అసలు నిజం కూడా. ఎంతగోప్యంగా ఉంచాలనైనా ప్రయత్నించనీ-ఒక వర్గంలోని విషయాలు మరొక వర్గంలోవారు తప్పకుండా తెలుసుకుంటారు.

అన్నయ్య కూడా నా సంకోచాన్ని గమనించి - నన్ను తప్పించుకుని తిరిగేవాడు. పార్టీక్లాస్ నుంచి తిరిగివచ్చి రోజూచూసేవాణ్ణి - నా ప్రక్కదులిపివుండేది. ఈ శుభ్రంగా ఉన్న ప్రక్కమీద అన్నయ్య అనురాగ హస్తస్పర్శ గ్రహించేవాణ్ణి. అమ్మదగ్గర నుంచి కాని, నాన్న దగ్గరనుంచి కాని ఉత్తరం వచ్చిన రోజున మాత్రం అన్నయ్యతో మాట్లాడే అవకాశం కలిగేది. అమ్మ వ్రాసిన పోస్ట్‌కార్డు వచ్చింది. నేను చదివి అన్నయ్య ప్రక్కమీద పెట్టాను. ఎవరి దగ్గర్నుంచి ఉత్తరం? అమ్మదగ్గర్నుంచా యేం? అవును అన్నాను. అన్నయ్య ఉత్తరం చదువుతున్నాడు. ప్రొద్దున్నే-ఏమీ తినకుండా ఖాళీపొట్టతో టీ త్రాగొద్దు. మధ్యమధ్య త్రిఫలా (కరక్కాయ, తాడికాయ, ఉసిరికాయ) చూర్ణం 'ఈసబ్‌గుల్ (ఓషధి విశేషం) తిను. 'బేల్‌పాడా' (కుమ్ములో కాల్చిన మారేడుపండు) ఏర్పాటు చేసుకోగలిగితే

అన్నిటికంటె మంచిది. మీకు జైల్లో ప్రతిసారీ రక్తవిరేచనాలు పట్టుకుంటున్నాయి. అదే భయం నాకు. సెక్యూరిటీ ఖైదీలకు ఈ వస్తువులు ఏర్పాటు చేసుకోవటం అంతకష్టమైన పనేంకాదు. ఒకవేళ డబ్బుకనుక అవసరమైతే వ్రాయటానికి సిగ్గుపడకు. ఎలాగో అలా పంపిస్తాను... 'అమ్మ హంగామా' అని అన్నయ్య చిన్న నవ్వు నవ్వుకుంటున్నాడు. ఎడమబుగ్గ సొట్టపడింది. ఎన్నో సంగతులు మనస్సు విప్పి చెప్పాలనిపిస్తోంది. ఇది వరకయితే అమ్మను గురించి ఎన్ని కబుర్లు చెప్పుకునేవాళ్లం. ఇప్పుడు ఊ అని మాత్రం అన్నాను. గుండెనిండా ఎన్ని సంగతులు? కాని సంకోచపు శైత్యం పేరుకుని అణచిపెట్టేసింది. చిన్నప్పుడు అన్నయ్య నేను ఒక బొంతలో పడుకున్నాం. రాత్రి నాలుగింటి దగ్గర్నుంచి కబుర్లు మొదలయినాయి. ఆ కబుర్లకు అంతులేదు. ఇప్పుడు ఊ అన్నాక ఇంక ఏమీ మాటలే దొరకటంలేదనిపించింది. మాటలు అయిపోయాయన్న అశాంతి కళ్లలో ముఖంలో వ్యక్తమయింది. అది కప్పిపుచ్చుకోవటానికి ఏదో పనివంక పెట్టుకుని అక్కడినుంచి వెళ్లిపోవలసివచ్చింది. తర్వాత 'దేవులీ'కి బదిలీ అయే రోజు. మమ్మల్ని కొంతమందిని మాత్రం దేవులీకి పంపటం జరిగింది. అన్నయ్య మా జట్టులో లేడు. వెళ్ళేరోజున అన్నయ్య నా పెట్టె సర్దియిచ్చాడు. బాక్స్‌క్రింద తాటాకుల విసనకర్ర ఒకటి పెట్టి వుంది. విసనకర్రకి అమ్మ అల్లిన జాలరు వేసివుంది. దానిమీద ఒకచోట 'నీలూ బిలూ పిల్‌పిలూ!' అని రాసి వుంది. ఏ పరధ్యాన సమయంలో అమ్మకి ఏం తోచిందో - ఏమాలోచించి 'పిల్‌పిలూ' అని వ్రాసిందో తెలియదు. తన ఫౌంటెన్ పెన్ అన్నయ్య నా పాకెట్‌లో పెట్టాడు. ఇప్పటికీ నా పాకెట్‌లో ఆ కలం ఉన్నది.

"బాబూ సాబ్ నిద్రపోతున్నారాయేం:"

చూస్తే సుబేదార్‌సాబ్ ప్రక్కన వచ్చినుంచుని వున్నారు.

"లేదు, ఎందుకు?"

...అతడు డ్యూటీ వదిలి గేట్ బయటికెందుకు వచ్చాడు?

"మీ డ్యూటీ అయిపోయిందా యేం?"

"అహఁ. లేదు, నాకు రాత్రి డ్యూటీ ఉండదు. తెల్లవారకట్ల ఆఫీసర్లు - గీఫీసర్లు వస్తారుకదా! అందుకని యివాళ యిక్కడే పడుకుందామనుకున్నాను. ఇంతకు ముందు ఉరి జరిగినరోజున దొర రౌండ్‌కి వచ్చారు. ఉరిమంచెకి నాలుగువైపులా పెద్ద పెద్ద లైట్లువేసి, ఆ ప్రదేశమంతా పట్టపగలులాచేసి ఉంచారు. నలుగురు వార్డర్లు అక్కడే పహరా యిస్తూంటారు. పాడు - జైలు వ్యవహారం, ఎన్నో రకాల ఖైదీలు, ఎన్నో రకాల వార్డర్లు ఉన్నారు. ఎవరైనా డబ్బు గిబ్బా తిని, ఉరిమంచె దగ్గిర యేదైనా 'గోల్‌మాల్'

చేస్తే - అది పనికిముందు బయటపడదు. అందుకే ఇంత జాగ్రత్త! ఒక్క ఉరితీతలో గోల్‌మాల్ జరిగితే దొరదగ్గిర్నుంచి వార్డర్ వరకు, అందరి ఉద్యోగుల నౌకరీమీద కళంకం వచ్చి పడుతుంది. అసలు ఈ విషయాలన్నిటి బాధ్యత లోపల ఉండే హెడ్ జమాదార్ మీద ఉంచటం న్యాయం. కాని అతడు నవాబుబిడ్డ. దొరలేం నమ్మేట్లు చెప్పాడో తెలియదు. దొరకి నామీద మాచెడ్డ కోపం. దొర ఈ డిపార్ట్‌మెంట్‌కి క్రొత్తగా వచ్చాడు. జైలు నియమ నిబంధనలు ఏమీ తెలియవు. ఏమీ అర్థం చేసుకోలేడు. ఇలాంటి దొరల్నింతమందిని యుద్ధం సమయంలో చూశాను. ఎంతమంది దొరసానులు చేతిమీదుగా యిచ్చిన కమలాఫలాలు తిన్నాను. ఇప్పుడంటే పొట్టకోసం తప్పుచేయక పోయినా తిట్లు సహించాల్సివస్తోంది."

సుబేదారు సాబ్ నాకు ఏదో చెపుతాడు. దానికి ముందుపీఠిక అల్లుతున్నాడని గ్రహించాను.

"అయితే మీరిప్పుడు ఎక్కడికి వెడుతున్నారు?" అని అడిగాను.

"ఏం దోమలు? పడుకోవటానికి ఆస్కారం ఉందా? ప్రక్కకూడా ఆఫీసుగదిలో వేసి ఉంచాను. కాని మహా ఉక్కగా ఉంది. మీకు కూడా తప్పకుండా దోమలుండే ఉంటాయి. అందుకని యింటికి వెళ్ళి టీ త్రాగి వద్దామనుకున్నా. యుద్ధానికి వెళ్ళటంతో ఈ పాడలవాటు అయింది. ఆఁ. మీరు కూడా ఎందుకు రాకూడదు? ఈ దోమకాట్లతో రాత్రంతా పడి ఉండాల్సిన అవసరమేముంది? నోఖ్‌సింగ్ సంసారంతో ఉండటంలేదు. అతడి క్వార్టర్స్‌లో రాత్రి గడపవచ్చు. మీ మానసిక వ్యధను మేము తగ్గించలేము, కాని అలా అని మీకు ఎంత సేవచేయటానికి వీలవుతుందో - అదెందుకు చెయ్యను? నాకూ పిల్లా-జెల్లా ఉన్నారు. మేమూ విదేశాల్లో ఏం పెరిగినవాళ్ళం కాము."

"వద్దు. వద్దు - ఇక్కడ బాగానే ఉంది. దోమలంత ఎక్కువగా లేవుగా! మళ్ళీ ఇప్పుడీ రాత్రివేళ ఎక్కడికి పరుగెత్తను?" అన్నాను నేను.

అతడి మర్యాద ప్రవర్తన నన్ను తెల్లబోయేట్లు చేసింది. నా చిన్న అభ్యంతరాన్ని త్రోసిపుచ్చి, ఒక విధంగా బలాత్కారంగానే నన్ను లేవదీశాడు! నేను కంబళ్ళు చుడుతున్నాను. ఉండండి. ఉండండి. నాకు కొన్ని దుప్పట్లు ఇవ్వండి. ఇద్దరం కలిసి, చెరిసగం చేసి తీసుకెళ్ళొచ్చు" అన్నాడు సుబేదారు.

"ఏమంత బరువు?"

నాలుగు కంబళ్ళలో - మూడు అతడు తీసుకున్నాడు. నేను ఒకటి తీసుకున్నా.

"ఇదుగో దగ్గిరే క్వార్టర్స్" అన్నాడు.

రాస్తా దాటి, డాక్టరుగారి క్వార్టర్స్ కూడా దాటి వచ్చి వార్డర్ల క్వార్టర్స్ ఎదుట నుంచున్నా. క్వార్టర్స్ ఎక్కువ లేవు. ఒక్క సీనియర్ వార్డర్సుకి మాత్రం ఇళ్ళు దొరుకుతాయి. తక్కిన వారందరూ పెద్ద బారక్స్‌లో ఉంటారు. ఒక గుమ్మం దగ్గిరకెళ్ళి, తలుపుకొట్టి-

"అరె! ఇది తాళం వేసివుందే! బాబూ! నేను సొంతం మరిచిపోయాను. నోఖేలాల్ యిప్పుడు డ్యూటీలో ఉన్నాడు. మీకు అనవసరంగా శ్రమ యిచ్చాను" అన్నాడు.

"దానివల్ల పోయిందేముంది? నేను మళ్ళీ తిరిగి వెడతాను. ఎంత దూరం?" అన్నాను నేను.

"ఉండండి, దీపం తీసుకువస్తాను."

"వద్దు వద్దు. అక్కర్లేదు. ఇహ దీపం అవసరంలేదు...." రాత్రి స్తబ్ధతను ఛేదించి, ఒక బొంగురు కర్కశకంఠం 'లెఫ్ట్ టర్న్' అని అరిచింది. దూరపు కర్కశతను కాస్త తగ్గించుకుని, స్వరాన్ని మధురంగా చేసుకోవటానికి ప్రయాసపడుతోంది. జైలు లోపల ఆ ధ్వని. వార్డర్ల జట్టు మారుతోందనుకుంటా. సరీగ్గా గేట్ కెదురుగా కూర్చుని, రెండు గంటలక్రిందటి - వంతు మార్పు సమయాన్ని విననేలేదు. ఇప్పుడు గేట్‌కి కొంచెం దూరంలో ఉన్నాను కనుక ఈ ధ్వనిని విన్నాను. గేట్ యేమయినా sound-proof?

మళ్ళీ జైలు గేట్‌లోకి తిరిగి వచ్చి, ముందుచోటులో కంబళి పరచుకున్నాను. ఒక్కటే కంబళి. తక్కిన మూడు సుబేదార్ సాబ్ దగ్గిర ఉండిపోయాయి. ఇందుకనేనా సుబేదార్ సాబ్‌కింత సహృదయత? ఇందుకనేనా యేం రాత్రి రెండుజాములప్పుడు అతడి కింటికెళ్ళాలని గుర్తొచ్చింది? ఒక కంబళి నెవరైనా జైలుబయటికి పంపించాలనుకుంటే - అతడింకా మూడు కంబళ్ళు ముగ్గురు సహచరులకివ్వవలసివస్తుంది. ఇదే జైలు వస్తువులు బయటికి పంపటానికి ఆచరణలో ఉన్న నియమం. అలా కాకపోతే పట్టుపడే అవకాశం ఉంది. ఇలా సునాయాసంగా మూడు కంబళ్ళను ఇంటికి తీసుకెళ్ళే లోభాన్ని నిగ్రహించుకోవటం - సుబేదార్ విషయంలో అసంభవం. పైగా మళ్ళీ యిప్పుడు యుద్ధపు రోజుల బజారు...

మళ్ళీ వెనుకటి చోటులోకి వచ్చి కూర్చున్నాను. దేశంలో బ్రహ్మాండమైన పీడన యంత్రాంగాల్లో జైలుకి ఉండే స్థానం తీసివేయతగింది కాదు. చక్రంలోపల చక్రం. ఇలాంటి ఒకదాని యెదుట కూర్చుని ఉన్నాను. జైలుగేట్ - చాలా కఠినమైనదీ - ప్రాణంలేనిది. అన్నీ నియమానుసారమైన రొటీన్‌లో గడియారం ముల్లులా జరిగిపోతూంటాయి. గడియారం యంత్రాల్లో ప్రధానమైనచోట్ల'జ్యూయల్స్' ఏర్పాటు ఉంటుందో - అలాగే ఈ పీడన చక్రానికి రెండు వజ్రపు తునకలు - గేట్‌లోని సుబేదార్,

గేట్‌లోపల సెంట్రల్ టవర్‌లోని హెడ్ వార్డర్.

ఈ నాలుగయిదు గంటల్లోనే జైల్లోని మార్పులేని విధానం దుస్సహంగా తోచింది. చీకట్లో వార్డర్ల క్వార్టర్స్ దాకా తిరిగిరావటంవల్ల ఈ విసుగు నుంచి కాస్త బ్రతికిపోయి నట్లుంది... మళ్ళీ ఆ వార్డర్ల జట్టు - గడియారం ముల్లునుబట్టి ద్వారం తెరవటం, మూయటం. గేట్‌లో వార్డర్‌ని పెట్టకుండా యంత్రంతోనే పనులన్నీ జరిపిస్తే ఏమవు తుంది? ఒకేపని పునరావృత్తం అయ్యేప్పుడు యంత్ర సహాయాన్ని తీసుకోవటం తప్పకుండా అవసరమూ - సముచితంకూడా.

గేట్‌పైనుంచి ఒక వార్డరు మెట్లు దిగి క్రిందికి వస్తున్నాడు. గేట్ రెండో అంతస్తులో జైలరు దొర క్వార్టర్స్. దాని కెదురుగా బహిరంగంగా ఉండే వరాండాలో తుపాకీ ధరించిన వార్డరు - శీతాకాలంలో, వేసవికాలంలో, వర్షాకాలంలో, ఎండలో, మంచులో, రాత్రివేళా పగటివేళ - గంట మ్రోగిస్తుంటాడు. ప్రతి గంట గంటకీ గంట కొట్టటం ఉండనే ఉంది. అదికాక దొరవస్తే ఒక గంట కొడతాడు. గౌరవనీయులైన అతిథులు జైలుకి వచ్చే సమయంలో రెండుగంటలు కొడతాడు. ఇది బహుశా లోపలున్న వారందర్నీ సావధానంగా ఉండేట్లు చేయటానికి, పొరపాట్లు సరిచేసుకోటానికి తగినంత వ్యవధి యివ్వటంకోస మనిపిస్తుంది. వీటికి పైన మధ్య మధ్య 'పాగలీ' గంటలు ఉండనే ఉంటాయ్. ఆ గంటలు కొట్టేప్పుడు మధ్య విరామం ఉండదు. ఆ సమయంలో సరీగ్గా ఆదివారంనాడు దూరంనుంచి చర్చిలో గంటల మ్రోత విన్పిస్తున్నట్టుంటుంది. చర్చి - తమ వర్గాన్ని అదుపులో పెట్టుకునే ఆత్రతకోసం. 'పాగలీ' ఒక వర్గం స్వార్థాన్ని కాపాడటానికి ఏర్పాటయినది.

...గంటకొట్టే వార్డరు - రెండుగంటలు ఇంత పెద్ద బాధ్యత గల పని నిర్వర్తించి, సగర్వంగా గేట్‌ముందు నుంచి వెళ్ళిపోతాడు. గేట్ బయట ఉండే సెంట్రీ - "ఏమిటి భాయ్! నీకింత ఆలస్యమైంది. క్రొత్త వంతు వార్డరు పైకి వచ్చి చాలాసేపయిందిగా?" అని అడుగుతాడు.

"ఇంక ఎందుకడుగుతావ్ మిత్రమా! డ్యూటీ ప్రారంభించేప్పుడు ముందున్న వార్డరు ఒంటిగంటకు జైలరు దొరగారిని పిలవమని చెప్పి వెళ్ళాడు. జైలర్ దొరగారు రౌండ్స్‌కి బయలుదేరుతారేమో అనుకున్నాను. ఇప్పుడు గుమ్మందగ్గిర కెళ్ళి పిలవటానికి చూసేసరికి ఎగిరిపడ్డారు. "ఎందుకరుస్తావ్?" అంటారు యిప్పుడు. పెద్ద ఆఫీసరు - ఏం చేసినా బాగానే ఉంటుంది. ముందు మండిపడ్డారు. తర్వాత మళ్ళీ కొత్తగా వచ్చే వార్డరుతో తనని మూడు గంటలకు పిలవమని చెప్పు అని హుకుం జారీచేశారు. ఈ

వార్డరు ఒకవేళ పిలవకపోతే బావుంటుంది. దొర తానే వచ్చి పిలుస్తాడు. అప్పుడు బయటపడుతుంది మజా."

గేట్‌లో వున్న సెంట్రీ - "ఆగు, ఎక్కడికెడతావ్? కాస్త కవిలి - గివిలి ఉంటే ఇయ్యి" అన్నాడు.

"వద్దు భాయీ! ఇప్పుడు వెళ్ళింక పడుకుంటా. ఇంత రాత్రివేళ ఇంకా కవిలి-గివిలితినీ ఏం లాభం?"

ఈ మాట పైకి అన్నప్పటికీ - అతడు కవిలి కోసం ఎదురుచూస్తూ నుంచున్నాడు. బాగా ఉక్కగా ఉండటంవల్ల ననుకుంటా - తలమీద పాగా తీసేశాడు. తల బట్టతల. గేట్‌లోని సెంట్రీ - "కాస్త చల్లటి నూనె రాసుకోండి తలకు. బుర్ర వేడి తగ్గి చల్లబడుతుంది. జమాదార్ సాబ్ నూనె వదిలేసి వెళ్ళారు. బహుశా బి. డివిజన్ ఖైదీలకోసం అయి ఉంటుంది. అది కచ్చితంగా కంట్రాక్టర్ 'నజరానా'. బట్టతలమీద రాసుకోండి. జుట్టు కనుక పెరిగితే యింక దోమలు కుట్టవు" అన్నాడు.

ఇతడిది బట్టతల అయి ఉంటుందని అనుకోనేలేదు... మేరీస్టూవర్ట్ పొట్టి జుట్టుకి దేశవిదేశాల్లో కూడా ప్రసిద్ధి ఉండేది. వధ్యభూమికి తీసుకెళ్ళాక, ఆ జుట్టు స్వంతం కాదని, ఆమె విగ్ ధరిస్తుందని అప్పుడు తెలిసింది లోకానికి. పోలీస్ కానిస్టేబుల్స్‌కి బట్టతల చూసిన జ్ఞాపకంలేదు. వారి నెత్తిన పాగా ఉంటుంది. సన్యాసి నెత్తిన జటలుంటాయి.

నేను, అన్నయ్య ఆ జమీందారు అఖారీసింగ్ కచేరీకి వెళ్ళాం. ఆయన మేనేజర్ని కలుసుకోమని ఉత్తరం వ్రాశాడు... 'ధూర్తుడైన సొంతాల్ పల్లెకారి. తన భూమిని జమీందారు నుంచి కాపాడుకోవటానికి - మహాత్మాజీకి దానం చేశాడు. ఆ భూమి జమీందారుగారి 'మేళా' జరిగేచోటు ప్రక్కన మేళాలో - స్త్రీ రూప లావణ్యాలు విక్రయం చేసే డేరాలన్నీ అతడి భూమిప్రక్కనే - వరుసగా నిర్మిస్తారు. వృద్ధిలోకివస్తున్న ఈ మేళాకి - ఈ విభాగాని కీచోటుకూడా సరిపోవటంలేదు. అందుచేత జమీందారు దృష్టి దీనిమీద పడింది. పల్లెకారి - మహాత్మాజీ మనుషులు జమీందారుతో పోరాడరనీ - తర్వాత వారికి భూమి దఖలు చేయక్కర్లేదు అని అనుకున్నాడు. మేము మొదట్లో అతడి మనస్సులోని ఈ ఎత్తును గ్రహించలేకపోయాం. నాన్న కూడా 'అక్కడ భూమి తీసుకుని ఏం లాభం? నేను మేనేజరుకి ఉత్తరం వ్రాశాను. దానికి సమాధానంగా ఈ పిలుపు వచ్చింది' అన్నారు. కచేరీలోపలి కెళ్ళాక అఖారీసింగ్‌ని గుర్తించనేలేకపోయాం. అతడి నెత్తిన టోపీ లేదు. నెత్తి అంతా నిగనిగలాడుతున్న బట్టతల. వెనకాల పిలక ఉండేచోటులో

మాత్రం పొడుగ్గా పెరిగిన కాస్త జుట్టుంది. దాన్నే spiral లాగా మెలికలు త్రిప్పి త్రిప్పి 'బ్రిలియంటైన్'తో తల ముందువైపుకి తెప్పించుకున్నాడు. బట్టతల[1] ఉండేవారికి నిజంగానే చాలా డబ్బు ఉంటుందా?... మేథమెటిక్స్ టీచర్ రామేశ్వరబాబు జ్యామిట్రీ పాఠం చెపుతున్నారు. సరీగ్గా ఆయనకు నడినెత్తిన బట్టతల. బ్లాక్‌బోర్డు మీద 'టేక్ ది మిడిల్ పాయింట్' అని వ్రాశారు. క్లాసులో అందరూ ఘొల్లుననవ్వారు... పూర్వకాలంలో ఇందుకనేనా విగ్‌లు ధరించే సంప్రదాయం ఉండేది? అఖారీసింగ్ మేనేజర్‌తో ఇంగ్లీషులో ఏదో చెప్పారు. మేనేజరుగారు - మీరు మాష్టారుగారి కొడుకులా? కాంగ్రెసు వాలంటీర్లు ఈ పల్లెవారి భూమిలో పాక వేశారు. ఇటువైపు డేరాలను బాయ్‌కట్ చెయ్యమని పికెటింగ్ చేస్తారని విన్నాం. నిన్నరాత్రి ఇద్దరు వాలంటీర్లను పోలీసులు పట్టుకున్నారు, అర్ధరాత్రి డేరాలోంచి బయటికి వచ్చినందుకు. తెలుసా? మేళాలో పోలీసుల నిబంధనలు తెలుసనుకుంటాను. రాత్రి పన్నెండు దాటిన తర్వాత ఎవరూ డేరాలోంచి బయటికి రాకూడదు. పన్నెండులోపల వచ్చేసెయ్యాలి, లేదా తెల్లవారకట్ల రావాలి. ఎవరి అధికారంలో పడ్డారుమీరు? పైగా - ఎటువైపు నుండి పోరాడుతున్నారు? ఈ పల్లెకారికి నాలుగయిదు బిఘాల భూమి మరొకచోట యిస్తే మా పని అయిపోతుంది. కాంగ్రెసుకి పెద్ద చందా కావాలంటారా? ఇస్తాం. కాని బుద్ధిపూర్వకంగా ఇలాంటి గొడవల్లో తలదూర్చారంటే మాత్రం..."

"ఆదాబ్ బాబూసాబ్!"

గంట కొట్టే సిపాయి వెళ్ళేప్పుడు మళ్ళీ నాకు 'అదాబ్' చెపుతాడు - ఎందుకు? "మొన్న మధ్యాహ్నం - ఉరి ఖైదీల సెల్‌లో నా డ్యూటీ పడింది - బాబు పత్రిక చదవటం చూశాను." అన్నాడతడు. అతడు తనంతటతానే అన్నయ్య వార్త చెప్పటానికి వచ్చాడు. ఈ వార్డర్లనందర్నీ అన్నయ్య సంగతి అడుగుదామని చాలా సేపటినుంచి తహతహగా ఉంది. వారిలో ఎవరికి ఉరిఖైదీల సెల్‌లో డ్యూటీ? అని అడుగుదామని ఆశ. ఏమిటో సంకోచం కలిగింది. అడగలేకపోయాను. వీరందరూ బహుశా నే సాక్ష్యం యిచ్చిన సంగతి తెలుసుకునే ఉంటారు. జైల్లోనేగా విచారణ జరిగింది. వీరు నన్ను గురించి మనసుల్లో ఏమనుకుంటున్నారో ఏం తెలుసు?

అన్నయ్యని గురించిన వార్తలను అనుకోకుండా తెలిసే అవకాశం కలగటం

---

1. బెంగాలీలో టాక్ అంటే బట్టతల. 'టాకా ఉన్నవాడికి (బట్టతల ఉన్నవారికి) నిజంగా చాలా టాకా (డబ్బు) ఉంటుందా?' అని వాక్యం.

చాలా సంతోషం వేసింది. వార్డర్లను ఎన్నో సంగతులు గ్రుచ్చి గ్రుచ్చి అడిగాను. నేహాల్‌సింగ్ ద్వారా తెలిసిన సంగతులు ఒకొక్కటే వీరు చెప్పినవాటితో కలిపి చూశాను. భోజనానికేదైనా ప్రత్యేకమైన ఏర్పాటు జరిగిందీ లేనిదీ తెలియలేదు. నేహాల్‌సింగ్ అయితే డబ్బంతా తానే తిన్నాడా? అన్నయ్య కోసం యేకాస్త ఏర్పాటూ చెయ్యనేలేదా? బాబూజీ సెల్‌లో ఎంతసేపు అటు యిటు తిరిగిందీ, ఎప్పుడు లేచిందీ, ఎప్పుడు స్నానంచేసిందీ, ఎప్పుడు నిద్రపోయిందీ అన్నిటికీ వార్డరు సమాధానం చెప్పాడు. చాలా వరకు ఉజ్జాయింపున చెప్పాడనిపించింది. అసలతడు స్వయంగా ప్రత్యేకంగా ఏమీ చూడలేదు. ఒకరోజున బాబూజీ పిల్లికి పెరుగుపెట్టటం మాత్రం చూశాడట! అయి ఉండొచ్చు. అబద్ధాలు నిజాలు కలిసిన అతడి మాటలు వినటం నాకు బాగుండేది. కనీసం ఇంతవరకు మాత్రం నిజం. అతడు అన్నయ్యని చూశాడు... వార్డరు వెళ్ళిపోయాడు. కాళ్ళకి పట్టీకాని, మేజోళ్ళుకాని లేవు. ఎంత ఉక్క! ఖాకీ హాఫ్ ప్యాంట్ క్రింద కాళ్ళు రెండూ విల్లుబద్దలా వంకర తిరిగాయి అనిపించింది.

...చీనా మ్యాన్ పాదాలు ... రాక్షసుడి నీడ ఎక్కడ అంతమయిందో అక్కడ నడుస్తున్న రెండు పాదాలు. చీకటి గేట్ యొక్క ఒక్క మెరుపుతో - వెలుగు పడిన కాస్తంత తారురోడ్డు ప్రదేశం - చీకటి పులుముకున్న గోడ, గేట్ కటకటాలు ... మళ్ళీ గేట్‌లోపల దృష్టి నిబద్ధమైంది. అటుత్రిప్పి, యిటుత్రిప్పి ఈ వెలుతురు పడిన ప్రదేశమే దృష్టిని ఆకర్షిస్తోంది. దీనికి బయట ఇంతకంటె ఎన్నోరెట్లు విస్తృతమైన చీకటి, యోజనాల పర్యంతం వ్యాపించిన నక్షత్రాలతో కూడిన ఆకాశం ఉన్నాయి. అవి నా మనస్సుని దృష్టిని ఆకర్షించి ఉంచలేకపోయాయి. గేట్‌లోపల ప్రవేశిస్తే, మధ్య హాలు, కుడివైపున జైలు ఆఫీసు, ఎడమవైపున జైలరు సూపరింటెండెంట్ - ఇద్దరి డ్రాయింగ్ రూమ్. ఆఫీసు బయటివైపు కటకటాలమీద ఉక్కుజాలరు వేసి ఉంది. ఖైదీల ఆత్మీయులు బంధువులు వస్తే ఈ జాలరు వేసిన కటకటాల బయట నుంచోపెట్టి ఉంచుతారు. ఆశ్చర్యం ఈ జైలు వ్యవస్థ! చూడటానికి వచ్చినవారిని ఎండనుంచి, వాననుంచి రక్షించటానికి, దీనిపైన ఒక ఆచ్ఛాదన అనేది కూడా లేదు. జాలరు వెయ్యటం, మధ్య ఏ వస్తువులయినా అటు యిటు ఇచ్చి పుచ్చుకునే ప్రయత్నం చేస్తారని. ఏమీ తెలియనివారు చూడటానికి వస్తే ఎంతో డబ్బు ఖర్చుపెట్టి, ఎంతో శ్రమపడి జైలుగేట్ దగ్గిరకు చేరుకుంటారు. తర్వాత దరఖాస్తు చెయ్యటం హంగామాకి, దరఖాస్తు మంజూరు అయ్యేందుకయే ఖర్చుకి దిక్కుతోచని స్థితిలో పడాల్సిందే. ఈ దుస్తరమైన సముద్రాలన్నీ దాటి, గంటల తరబడి ఎదురుచూడగా చూడగా - కొద్ది నిమిషాలపాటు - కటకటాల

కవతల ఖైదీ దుస్తులు ధరించి, జుట్టు రేగిపోయి, బక్కచిక్కిన ఒక ఆకారాన్ని చూడగలుగుతారు. అప్పుడు అదే తనకు చిరపరిచితమైన మిత్రుని రూపమన్న సంగతి ఊహించుకోటానికి కొంత వ్యవధి పడుతుంది. సాధారణంగా మేట్స్, వార్డర్ల అవమానకరమైన మాటలు వీరిమీద నిస్సంకోచంగా వర్షం కురిసినట్లు కురుస్తాయి. ఖైదీల దుస్తులు ఖాకీ యూనిఫారం. తలపాగా, కటకటాలు, తాళాలు, సి.ఐ.డీ.లు - అన్నీ కలిసి, ఆ వాతావరణం - ఇక్కడ దిక్కుతోచక పడిపోకుండా ఉండటమే ఆశ్చర్యం అన్నట్లు తయారవుతుంది. మామూలు రెండు మూడు మాటలు మాట్లాడేసరికి - 'టైమయిపోయింది' అన్న మాట వినిపిస్తుంది. చూడటానికి వచ్చిన వారి కళ్ళముందు కొంచెంసేపయేసరికి అత్యంత ఆత్మీయుని రెండు రూపాలు - ఒకటి కటకటాల దగ్గిరకు వచ్చినప్పటి సిగ్గు, ఉత్కంఠ, సంకోచాలు వ్యక్తమైన ముఖం - మరొకటి తిరిగివెళ్ళిపోయే సమయంలోని నిరాశ, నిస్సహాయత, జాలి వ్యక్తమైన ముఖం మెదులుతాయి. అప్పుడు బలవంతంగా ముఖంలోకి నవ్వు తెచ్చుకోబోయిన వృధా ప్రయాస, గుండెలు పగిలే ఆక్రందనంకంటె హృదయవిదారకమనిపిస్తుంది.

... పంథొమ్మిది వందల ముప్ఫై మూడులో నాన్నను చూడటానికి హజారీబాగ్ జైలుకి వెళ్ళాను. పెద్దమ్మ ఒక టిఫిన్ క్యారియర్ నిండా నాన్నకోసం తినుబండారమేదో తయారుచేసి యివ్వటానికి తీసుకొచ్చింది. తీరా వెళ్ళాక ఆ రోజు అప్పర్ డివిజన్ ఖైదీలను కలుసుకునేరోజు కాదని, 'సి' క్లాసు ఖైదీలను చూసేరోజని తెలిసింది. చూడటానికి వచ్చినజనం స్టేషన్‌లో టిక్కెట్లిచ్చే కిటికీముందు జనంలాగా త్రోసుకోవటం మొదలెట్టారు. కటకటాలలోపల కూడా చాలామంది ఖైదీలు - కిటికీ చువ్వలదగ్గిరకు చేరుకోవటానికి ఒకర్నొకరు త్రోసుకోసాగారు. ఆ గందరగోళం మధ్య ఎవరు యేం మాట్లాడుతున్నారో, ఎవరితో మాట్లాడుతున్నారో తెలుసుకోగలగటం అసంభవం. ఒక ప్రౌఢ వయస్సులోని స్త్రీ బావురుమని యేడుస్తోంది. ఏడుపుతోపాటు గ్రామ్యభాషలో ఏమిటో మాట్లాడుతోంది. అందులో ఒక్క అక్షరమైనా ఆమె కొడుకుకూడా అర్థంచేసుకోగలడో లేదో సందేహమే. ఒక ముసలి ఆమె కాసిని జామకాయలు, ఒక కాయితపు సంచీతో పప్పుతో చేసిన వడలు తీసుకుని వచ్చింది. ఆమె వాటిని తన కొడుక్కి తినటానికి ఇవ్వటం కోసం వార్డర్‌ని పొగడుతూ బ్రతిమాలుతోంది. వార్డరు రేటుపెంచుతూ "డాక్టర్ సాబ్ మంజూరుచెయ్యందే ఎలా యిస్తాను? 'సి' క్లాసు వారికి బయటి నుంచి వస్తువులు తీసుకునేందుకు హుకుంలేదు. 'సి' క్లాస్ వారికి తినుబండారాలు అందచెయ్యటానికి నా కొక రూపాయి ఇవ్వాలి. డాక్టరుగారు మంజూరుచెయ్యటానికి ఇంకొక రూపాయి.

నా నౌకరీకి చిక్కు వచ్చే ఇది ఉంది. ఈ పనులన్నీ డబ్బు ఇవ్వందే నేనెందుకు చేస్తాను?" అన్నాడు. ఎంతోసేపు బ్రతిమాలగా బ్రతిమాలగా మొత్తం ఒక రూపాయికి సెటిల్ అయింది. ఇది ఆ నిరుపేదరాలి ఏడాది దాపరికమనుకుంటా. సిపాయిజీ రూపాయిని తలపాగాలోపల దోపి దాచుకున్నాడు. ఆ తినుబండారం ఉన్న సంచీ యథాస్థానానికి చేరుకుందో లేదో ఎవరికి తెలుసు?

గేట్‌లో ఎడమప్రక్క గోడను ఒక అద్దం ఫ్రేమ్ మధ్య నోటీసుబోర్డు వుంది. అందులో వెనక వున్న నల్లకాగితం మీద చాలా తెల్లకాగితాలు అతికించి ఉన్నాయి. అవి యేమి నోటీసులో తెలియదు. ఇతర జైళ్ళలో కేవలం జైలుకమిటీ మెంబర్ల పేర్లు మాత్రమే ఉండటం చూశాను. ఇన్ని నోటీసులా? బహుశా ఐ.జి. త్వరలో జైలు విజిట్‌కి వస్తాడనుకుంటా. నోటీసు బోర్డు క్రింద టెలిఫోన్ రిసీవర్. దీనికి పడమటివైపున అనుకుని - రైలుస్టేషన్‌లో ఉండేలాంటి తూకంవేసే యంత్రం. సరీగ్గా గేట్ మధ్యలోంచి ఒక రైల్వేలైన్ - నేరోగేజ్ అంత వెడల్పయినది - పోతూంటుంది. డి.హెచ్.ఆర్. తాలూకు కిషన్‌గంజ్ లైన్‌లో ఒకసారి చిన్న యింజన్‌తో ఒక యెద్దు ఢీకొంది. చూంగేపాడా దగ్గిర బండి 'డిరైల్డ్' అయింది. జైలు ఫ్యాక్టరీలోని వస్తువుల్ని మోసుకుపోయే ట్రాలీ - ఈ గేట్‌లోని లైన్‌మీదుగా వెడుతుంది. ఇనుపపట్టాల ప్రక్కన అక్కడక్కడ పేడ పడివుంది. బహుశా ఎద్దుబండి వెళ్ళి వుంటుంది. దొరగారు, జడ్జిగారు వస్తారని అందరూ హడావిడిపడటం చూశాను. కాని అక్కడినుంచి పేడ తీయించివెయ్యాలి అన్నది ఎవరికీ గుర్తులేదు. బహుశా ఉండే ఉండొచ్చు. కాని ప్రొద్దున్న ఖైదీలు రానంతవరకు ఎవరు బాగుచేస్తారు. మహామాన్యులైన వార్డర్‌దొరలు ఈ హేయమైన పని ఎందుకు చేస్తారు? రైల్వేలైన్, నోటీస్‌బోర్డు, తూనిక యంత్రం, టెలిఫోన్, గచ్చునేల - అన్నీ కలిసి ఆ ప్రదేశం రైలుస్టేషన్ అన్న భావాన్ని కలిగించాయి. రైలుకోసం ప్లాట్‌ఫాం మీద కంబళి పరుచుకుని కూర్చుని వున్నానని అనిపించింది.

...రామకృష్ణమిషన్ సంస్కార కమిటీకి కబురుపంపమని సొరేన్‌తో చెప్పాను, అందరూ ఖిడియాభాగ్ ఘాట్‌కి రావాలని. చిన్నటౌన్. ఎక్కువమంది ప్రజలు ఏదో విధంగా గవర్నమెంట్‌తో సంబంధం ఉన్నవారే - ప్లీడర్లు, అటర్నీలు, గుమాస్తాలు. వారందరూ ప్రస్తుతం గవర్నమెంట్ ఉద్దేశాన్ని గమనిస్తూ నడచుకోవాలి. ఒకవేళ రాకపోతే? పోలీసుల భయంవల్ల రాకపోనూవచ్చు. అలా అయితే? అలా అయితే జైల్లోవారే దహనం చేస్తారు. వీరు అయిదు రూపాయలకి, మోటర్ లారీ అందరికీ ఇస్తారు. సొరేన్‌కి ఊరేగింపు జరపాలని ఉద్దేశం ఉన్నట్లు గమనించాను. గురువారం నాడు కలెక్టరుగారిని

కలుసుకోవటానికి వెళ్లాను. కలెక్టరుగారు ఎలాంటి ఊరేగింపు జరపకుండా ఉండే షరతు మీద - మృతదేహాన్ని నాకు యివ్వటానికి అంగీకరించారు. లోకులకు బహుశా తెలియకపోవచ్చు. శ్మశానవాటికకు వెళ్లి ఒకవేళ అందరూ గుమిగూడితే అది ఎంత పెద్ద గుంపయినా కానవచ్చే నష్టం ఏమీ వుండదు. అలా అయితే నా మాట నిలుస్తుంది. కానీ ఎవరినని వారించగలం ? జనపనారమిల్లు వర్కర్ల యూనియన్‌కి అన్నయ్య సెక్రటరీ. ఎక్కాలాగేవాళ్ల యూనియన్‌కి అన్నయ్య ప్రెసిడెంట్. ఈ యూనియన్లన్నిటి లోని సభ్యులను ఎవరు అడ్డగించగలరు ? కలెక్టర్‌గారి దగ్గర మాట యిచ్చాను యివ్వలేదన్నదే ముఖ్యమా ? కాదు. ప్రొసెషన్ జరగనీ. అన్నయ్య మృతదేహం, బిలూ బాబు మృతదేహం, దేశం కోసం ప్రాణాలర్పించిన త్యాగవీరుని మృతదేహం, మాష్టరు గారి కొడుకు మృతదేహం - దీనికి కూడా లోకులు ప్రొసెషన్ జరుపకపోతే - దేనికి జరుపుతారు ? బళ్లు, కార్లు, అంతులేని జనం, పూలమాలలు, దేవదారు ఆకులు - ఇంటింటి ముందర గంగాజలం వర్షణ. రెండో అంతస్తులోంచి కొన్ని తాటాకుల విసనకర్రలు పడ్డాయి. వాటి కోసం పెనగులాట, జనం గుంపును త్రోసుకోవటం, త్రొక్కిసలాడటం - ఆ తర్వాత అంతులేని జన ప్రవాహం - వంకరబారులు తీర్చి వెళ్లటం ... నిశ్శబ్దత - 'గాంధీజీకి జయ్'లు లేవు. బిలూబాబుకు జయ్‌లు లేవు. శోకగీతికలు లేవు. విశృంఖలమైన జనసముద్రపు ఉద్దండతలేదు. ఉన్నదల్లా - మూర్ఛ కల్గించే శోకపు జడత్వం. ఒక రాజకీయ కుటుంబంలో ఒకరు తప్ప తక్కిన వారందరిపట్ల అంతులేని సానుభూతి వుంది. సుప్త దేశాత్మ బోధపట్ల ధిక్కారం వుంది. బూడిదలో కనిపించే శీతలత మధ్య వ్యర్థ ఆక్రోశపు జాగరూకమైన వహ్ని వుంది. ఒక్క సైగతో ఈ నిస్సహాయ శాంతప్రజావాహిని ఉన్మాదులై క్రూరంగా మారి నన్ను పట్టుకుని చీల్చి ముక్కలు చేసి, పారెయ్యగలదు... పూర్తి హర్తాళ్ పెద్దమ్మయింటి కెదురుగా వచ్చి ప్రొసెషన్ ఒక్క నిమిషం ఆగింది. పెద్దమ్మ మృతదేహం ముఖం మీదిపూలదండలు తప్పించి, దానివైపు చూడగలదా ? ఒక్క ముఖం మాత్రం కనిపిస్తూంటుంది. కంఠం వరకు నేను గుడ్డ కప్పేస్తాను. పూలు చందనంతో ముఖంలోని భీభత్సత కప్పివేయ బడింది. ముఖం కోణంలోంచి, ఎప్పుడు వచ్చిపడిందో కొన్ని ఎర్రని బిందువులు వచ్చిపడ్డాయి. ఇప్పుడు ఎండిపోయి రక్త చందనం ముద్రలాగా కనిపించసాగింది. కారు, పెద్దమ్మ ఇంటి ముందు కెళ్లింది... శ్మశాన ఘాట్‌లో అపారమైన జనసముద్రం. ఎర్ర పాగాలతో నాలుగు వైపులా ఆచ్ఛాదితమైపోయింది. తుపాకులు ధరించిన దేహరక్షకులతో కలసి మేజిస్ట్రేట్ - పోలీసు ఆఫీసరు కారులోంచి దిగారు... దహనకృత్యాల్లో

అనుభవజ్ఞుడైన మస్‌తీదా చితి పేరుస్తున్నాడు. అతడు సర్వవిధాలయిన ఉద్వేగాలకు - ఉద్రేకాలకు అతీతుడు. "మున్సిపాలిటీ కట్టెలనుకుంటాను. శవాన్ని దహనం చెయ్యటం కోసం ఎప్పటి నుంచి కట్టెలు స్టాక్ చెయ్యటం మొదలెట్టారో, అప్పటి నుంచి ఈ కట్టెలనే చూస్తున్నాను. సొంతం పుచ్చుపట్టిపోయాయి... పట్టవూ ? ... థర్డ్‌క్లాస్ మున్సిపాలిటీ - కట్టెల ఖర్చు ఎక్కడిది వీరికి?" అని అడిగాడు. శవాన్ని దహనం చేసే రోజున మస్‌తీదాకి ఒక బాటిల్ దేశమద్యం యివ్వాలి. ఈ సంగతి అందరికీ తెలుసు. ఇవాళ కూడా మస్‌తీదా నన్ను మద్యం అడుగుతాడా యేం? బూడిద కోసరం ఎంత లాగులాట ! ఆడవాళ్ల పైట చెంగులకు కట్టుకుని తీసుకెడుతున్నారు. కొందరు పిల్లల మొహాన పెడుతున్నారు. ఈ సమయంలో ఏ తల్లి అయినా కొడుకుని ఆప్యాయంగా పట్టుకుని - 'బిలూబాబులా కావాలి' లోపల్లోపల అనుకోగలిగిందా ? ... ఎప్పటికీ అనలేదు ... వెనక ఆటలమ్మ వచ్చి నేను అన్నయ్య కలిసి యెడ్ల బండిలో ఆశ్రమానికి వెళ్లాం. అమ్మ చేతిలో విసనకర్ర. రెండు ప్రక్కల మీద యిద్దరం పడుకున్నాం. మనస్సులోని ఉత్కంఠను - గంభీరమైన ఆవేదనను అణచుకోవటానికి ప్రయత్నిస్తూ మీరు నాకు పిచ్చెత్తిస్తారా? అని మాత్రం అన్నది. అమ్మ సరీగ్గానే అన్నది. క్షణంలో జనం నిగ్రహం కట్టలు తెంచుకుంది. 'జయ్' 'గాంధీజీకీజయ్' 'జయ్ బిలూబాబూకీ జయ్' 'నౌకర్‌సాహి నాశనమగుగాక' జయధ్వనుల నిర్ఘోషతో వాయ్వాకాశాలు నిండిపోయాయి. మిల్లులోని ఆ కూలీ సరీగ్గా సమయానికి వచ్చి 'జయ్‌జయ్'లు కొట్టించటానికి నేతృత్వం వహించాడు. సన్నగా వుండే అతనికింత పెద్ద గొంతు ఎలా సంభవమైంది ? అతను "వందే" - అంటే జనం 'మాతరం' అంటున్నారు. బిలూ బాబుకీ అని అతడంటే - జనం 'జయ్' అంటున్నారు. ప్రతిసారీ అనేప్పుడు అతని కుడిచెయ్యి పైకి లేస్తుంది. తర్జనీతో ఆకాశంలోని ఏదో అజ్ఞాత దిశ చూపిస్తున్నాడు. పోలీసులు జనాన్ని సర్దుబాటు చేశారు. తేలిక లాటీఛార్జి చెయ్యవలసిన అవసరంరాలేదు. కూలీ నాయకుడి గొంతు మాత్రం పగిలిపోయింది. చెయ్యిపైకియెత్తి మధ్య మధ్య - జయ్ జయ్‌లు కొట్టటానికి ప్రయత్నిస్తున్నాడు. దానివల్ల గాలి నిండిన రబ్బరు టైరు హఠాత్తుగా చిల్లి పడితే ఎలాంటి ధ్వని వస్తుందో అలాంటి ధ్వని వెలువడింది.

జైలుగేట్‌లోపల - జైలు సూపరెంటెండెంట్ గది వున్న వైపు గోడనిండా రకరకాల శిక్షలు అమలు పరిచే యంత్రాలు వ్రేలాడేసి ఉన్నాయ్ - రకరకాల సంకెళ్లు - హాండ్‌కప్స్ - గొలుసు సంకెళ్లు - ఎవరైనా జైలు లోపల వార్డర్‌ని ఎదిరించి మాట్లాడారు. మరెవరైనా బహుశా జైలరు దొరగారికి - అన్నం వడ్డించే కొలత గంటతీసి, అయిదు చటాకుల బియ్యానికి బదులు - మూడున్నర చటాకుల నూకలకూడు మాత్రమే వుందని చూపించి

వుండొచ్చు. ఇంకెవరో మూడు నెల్లనుంచి రోజూ గుమ్మడికాయ కూరతప్ప, ఇంకో కూరయేమీ వెయ్యనేలేదని తగాదా పెట్టుకోవచ్చు - ఇలాంటి అసంఖ్యాకమైన ప్రమాదకరమైన జైలు అఫెన్స్‌లకు శిక్షలు విధించటానికే సమస్త - సరంజామా. కొన్ని పెద్ద పీపాల మధ్య - వందల కొద్ది మంచి వెదురు లాఠీలు నిలబెట్టి వున్నాయి. దాని ప్రక్కన ఒక స్టాండ్‌లోని రంధ్రాల్లో లావుపాటి పేము కర్రలు అమర్చి వున్నాయి. చేత్తో ఊగించుకుంటూ తీసుకెళ్లటానికి లాఠీలకు పైవైపున వెడల్పాటి టేప్ వుంది. పై వైపు గోడను ఎన్నో పోలీసుల దుస్తులు - కుడి వైపున మూల గోడ వంకెలకుపైన FIRE అని వ్రాసి వున్న ఎర్రటి బక్కెట్లు తగిలించి వున్నాయి. ఒకవైపున వెదురు కర్రలకు గుడ్డలు కట్టి తయారు చేసిన కాగడాలు కొన్ని డజన్లు కుప్పగా పడేసి వున్నాయి. రాత్రిళ్లు లెక్క సరిపోవటం కుదరనప్పుడు ఈ కాగడాలు కిరసనాయిలులో తడిపి వెలిగించుకుని వార్డర్లు ఖైదీలను వెతకటానికి బయలుదేరుతారు.

ఒకసారి ఖైదీ పారిపోయే రిహార్సల్ జరుగుతోంది 'పాగ్' (Alarm) గంట మ్రోగుతోంది. దొర సెంట్రల్ టవర్‌పైన నుంచుని వున్నారు. వార్డర్లు దొరగారికి తమ తమ కార్యకుశలత చూపించటానికి కాగడాలు తీసుకుని అటుయిటు పరుగెత్తారు. చెట్లు పాయిఖానా దొడ్ల మీదనే వారి దృష్టి ఎక్కువగా వుంటుంది. వార్డరు మధ్య నుంచి సూపరెంటెండెంట్‌ని పిలిచి "సూపరెంటెండెంట్ సాబ్, ఓ సూపరింటెండెంట్ సాబ్ ఖైదీ పారిపోయే ప్రాక్టీసు - పిచ్చిదా?" అని అడిగాడు. వెతకటం పూర్తి అయి సూపరెంటెండెంట్ మా వార్డ్‌లోకి వచ్చారు. అప్పుడు మేము బుద్ధిమంతుల్లాగా ఎవరి ప్రక్కల మీద వాళ్లం వున్నాం. ఎక్కువ దూరంపోలేదు. టంగ్ టంగ్‌మని రెండు కొట్టింది. ఇంకమూడు గంటలు మాత్రమే. ఈ రోజుల్లో క్రొత్త టైం ప్రకారం అయిదున్నరకు ముందు సూర్యోదయం కాదనుకుంటాను తర్వాత ? సూర్యోదయానికి ముందే వీరి పనులన్నీ పూర్తి అయిపోవటం కావల్సింది. ఎందుకనంటే సూర్యోదయంతో పాటే జైలు దైనందినజీవితం ప్రారంభమవుతుంది. ఏడింటికి ముందే ప్రొద్దున గంజి త్రాగటం అదీ పూర్తి చెయ్యాలి. కారణం ఏడయేసరికి ఫ్యాక్టరీ తెరుస్తారు. అయిదున్నరకల్లా పొయ్యిలో నిప్పు వెయ్యకపోతే - ఏడుగంటలకు ముందు ప్రొద్దున తిండి పూర్తి చెయ్యటం ఎలా? వంట ఇంటి విభాగంలో పనిచేసే ఖైదీలకు ప్రాతఃకృత్యాలు తీర్చుకోవ టానికి కూడా వ్యవధి యివ్వాలి. కాదు. అయిదులోపలే పని పూర్తవుతుం దనుకుంటాను...

అన్నయ్య ఇప్పుడేం చేస్తున్నాడు ? బహుశా కటకటాలు పట్టుకుని చీకట్లో

నక్షత్రమయమైన ఆకాశం కేసి చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూ వుండి వుంటాడు. నా సంగతి కూడా ఒకసారి ఆలోచిస్తాడా ? అన్నయ్య నన్ను ఎప్పుడూ అపార్థం చేసుకోడు. ఈ విషయంలో అన్నయ్యతో వివరంగా స్పష్టంగా కనుక మాట్లాడగలిగితే అన్నయ్య దగ్గర నా ప్రవర్తనని స్పష్టంగా చెప్పవలసిన అవసరం కలగదు. కాని దీనివల్ల బహుశా మనసులోని భారం తేలికకావచ్చు. వారి పార్టీ ప్రోగ్రామ్‌ని అమలు జరపటమంటే అర్థం ఫాసిస్ట్ శక్తుల్ని బలీయం చేయటమే - ఇది అన్నయ్యకి తెలియదూ? కాని అన్ని యుక్తులను - అపాస్తం చేసి, అంతరాంతరాల్లో ఎక్కడో ఏదో గ్రుచ్చుతున్నట్లుంది. బహుశా యుక్తి విహీనమైన భావోద్రేకానికి అకారణమైన పశ్చాత్తాపమేమో! మా పార్టీలోని స్థానిక విభాగపు సభ్యులకు కూడా నేను అన్నయ్యకి విరుద్ధంగా సాక్ష్యమివ్వటం సరియైనది కాదని ఉద్దేశం. అన్నయ్యకి విరుద్ధమని కాదు, దేశంలోని ప్రజలకు వారి భ్రమను వ్రేలితో కళ్లకు చూపించటం - వారికి అర్థమయేట్టు చెయ్యటం మా కర్తవ్యమని వారి అభిప్రాయం. వారిని పోలీసులు పట్టుకుపోవటం మాత్రం మా కర్తవ్యంలోది కాదాయేం? ప్రపంచంలో అందరూ వారి యిష్టం ఏమయినా అనుకోనీ - మాపార్టీలోని వారికి మాత్రం నేను చేసిన పనిని గురించి - ఇదే unrindest cut of all అని అభిప్రాయం. మార్క్సువాదంలోని సూక్ష్మమైన వివరణ బహుశా నాకు సరిగ్గా తెలియదేమో! అన్నయ్య పార్టీలో ఉన్నన్నాళ్లూ - అన్నయ్య చెప్పినదాన్నే బోధిస్తూ వచ్చాను. అతని మాటే వేదవాక్యమని భావించాను. పంథొమ్మిది వందల నలభై రెండు ఫిబ్రవరిలో అన్నయ్య హజారీబాగ్ జైలునుంచి విడుదలయ్యాడు. సెక్యూరిటీ ఖైదీల కేసు scrutiny అవుతోంది. ఈ కార్యభారం ఒక హైకోర్టు జడ్జీ మీద వుంచబడింది. ఏదో వుండాలి పేరు మహారాష్ట్రీయుడు - జస్టిస్ భాటే. అన్నయ్య విడుదలయిన తర్వాత ఏప్రియల్‌లో మమ్మల్నిదే ఉలీ నుంచి హజారీబాగ్ జైలుకి తీసుకువచ్చారు. అందర్ని వారి వారి ప్రదేశాలకు తీసుకెడతారని విన్నాను. తర్వాత నన్ను జూన్ పద్దెనిమిదో తేదీన విడుదల చేశారు. ఫాసిస్ట్ విరోధి వర్గాన్ని ఇంక జైళ్లలో వుంచవలసిన అవసరం లేదు. ఇదే అప్పుడు గవర్నమెంట్ ఉద్దేశం ... జైలు నుంచి విడుదలయేప్పుడు కలిగినంత ఆనందం ఇంకెప్పుడూ కలగలేదు. పీడిత ప్రజానీకానికి జన్మ శత్రువైన ఫాసిజానికి విరుద్ధంగా నిలబడగలను. అవసరమైతే దీని కోసం నవ్వుతూ ప్రాణాల్ని కూడా త్యజించగలను - ఈ సదవకాశాన్నిచ్చినందుకు ప్రభుత్వం పట్ల కృతజ్ఞతతో నిండిపోయింది మనస్సు. స్పెయిన్‌లో కార్మికుల చరిత్ర, ఎర్రచైనాలో మృత్యువు జయించిన వీరుల చరిత్ర - మావ్‌సేటుంగ్ శౌర్యం పట్టుదల - చంద్రదేవ్ క్లాస్‌లో ప్రతిరోజూ చర్చ. శరీరంలోని

స్నాయువుల నన్నిటినీ ఉత్సాహాగ్నిని రగులుకొల్పాయి. నా జిల్లాలో ఎన్ని పనులు నాకోసం యెదురుచూస్తూ వుండిపోయింది! అక్కడి ప్రజలు మహాత్మాజీ మాష్టర్‌సాబ్‌ని తప్ప ఇంకెవర్నీ ఎరుగరు. అంధ విశ్వాసాలు పేరుకుపోయిన ప్రదేశంలో నేను హేతువాదపు పంటను పండించాలి. ఆశ్రమానికి తిరిగి వచ్చి ఒక్కసారి అమ్మను కలుసుకోకుండా వుండటానికి వీల్లేదు. నా ఆపరేషన్‌ని గురించి ఆమె దిగులు పెట్టుకుని వుంది. ఒకసారి అక్కడ అందర్నీ కలుసుకుని మాట్లాడి తర్వాత పని ప్రారంభించాలి. కారు, బస్, కోడేర్మా స్టేషన్, గయ వెయిటింగ్ రూమ్‌లో ఏం దోమలు! క్యూల్, సాహెబ్ గంజ్, మణిహారీ ఘాట్, కాటిహార్ - ఈ మార్గానికి అంతులేదు ...

ఆ వ్యాకులత ఈనాడు నన్ను ప్రస్తుత స్థితికి తీసుకు వచ్చింది. అన్నయ్య ... జనాభిప్రాయం మా పార్టీలోని స్థానీయ కామ్రేడ్‌ల అభిప్రాయం అన్నింటికంటె దుస్సహమైనది. పొరపాటు. ప్రపంచంలో ప్రజలందరిదీ పొరపాటు కావచ్చుకాని నాది మాత్రం పొరపాటు కాదు. పంథొమ్మిది వందల నలభై రెండు ఆగస్టులో సంఘటనల పరిధిలో నేను చేసిన పనిని విచారణ చెయ్యాలి ... ఒక విద్యుత్ శక్తి హఠాత్తుగా దేశంలోని ప్రజలనందర్నీ - ఉద్భ్రాంతుల్నీ, దిక్కుతోచని వారిని చేసింది. ఎక్కడికి వెళ్లినా ఏదో పిచ్చాసుపత్రి గేట్లు తెరిచేశారా అనిపించేది. కల్లోలితులై ఉద్రేకపు నిషా ఉన్న ప్రజలు ఏం చెయ్యాలో ఆలోచించుకోలేకపోయారు. మైళ్లకు మైళ్లు రైల్వే లైన్‌ని పీకి పారేశారు - ఇనుప రైలుపట్టాలను, పెద్ద పెద్ద రైల్వే స్లీపర్లను ఇంకా యెన్నో వస్తువుల్ని దూరంగా వున్న నదుల్లోకి తీసువెళ్లి పారేసి వచ్చారు. టెలిగ్రాఫ్ తీగెల్ని కోసెయ్యటం, పోస్ట్ ఆఫీసుల్నీ, మద్యపు దుకాణాల్నీ తగలపెట్టే భారం గ్రామాల్లోని కుర్రవాళ్ల మీద వేశారు. వయస్కులైన ప్రజలు ఈ తుచ్ఛమైన పనులన్నీ చేసి తమ చేతుల్ని కలుషితం చేసుకోతలచలేదు. తీగెలు తెంచటం యింతతేలిక, టెలిగ్రాఫ్ తీగెలంత దుర్బలమైనవని వారికి తెలియదు. ప్లయర్స్ (Plyers) యంత్రాలు, కత్తెరలు, కత్తులు ఏవీ అవసరంలేదు. త్రాళ్లు వ్రేలాడేసి కుర్రాళ్లు ఊగిపడుతున్నారు. ఎక్కడ మెలిక వేసి త్రెంచి వేస్తున్నారు. పెద్ద నూతన కార్యక్రమాన్ని కోరుతున్నారు. అయితే ఏంచెయ్యాలో ఆలోచించి నిర్ణయించుకోలేకపోతున్నారు. రైల్వేస్టేషన్స్, పబ్లిక్ కార్యాలయాలు, రిజిస్ట్రారు ఆఫీసులు, ఠాణాల పర్వం పూర్తి అయిపోయింది. చేతిలో పనేమీ లేదు. వారు గుంపులు గుంపులుగా ఎక్కడికి వెడితే అక్కడ వారి ఎదుట శక్తి స్తంభాలు నేలకరుచుకుంటున్నాయి. అత్యాచార చిహ్నాలను తలలువంచి స్వీకరిస్తు న్నాయి. ప్రభుత్వోద్యోగులు ప్రజల్ని ముఖస్తుతి చేస్తున్నారు. మార్వాడీలు ఏమీ

అనుకోకుండా చందాలిస్తున్నారు, జమీందారీ కచేరీల్లోని అధికారులు వారికి ఒక సంవత్సరం శిస్తుమాఫీ చేస్తామని అభయమిస్తున్నారు. పబ్లిక్ భవనాల మేనేజర్లు వారికి భోజనాల ఏర్పాట్లు చేస్తున్నారు. సబిన్స్పెక్టరు గాంధీటోపీ నెత్తిన పెట్టుకుని త్రివర్ణ పతాకాలు చేత పట్టుకుని వారి మనస్సుల్ని సంతోషపెట్టటానికి ప్రయత్నిస్తున్నారు. చౌకీదార్లు తమ యూనిఫాంలను తగలపెట్టి పనులకు రాజీనామా లిస్తున్నారు. పేద రైతులకు ఆనందం - వారింక జమీందారులకు శిస్తు లివ్వక్కర్లేదు. చౌకీదారీ టాక్స్ చెల్లించక్కర్లేదు. కొత్తగా ఏదయినా చెయ్యటానికి అవకాశం లభించటం లేదు. ఫర్బిష్గంజ్ లైన్లో లైన్ సరీగ్గా వున్నంత ప్రదేశంలో ఇంజన్ డ్రైవర్ గార్డ్ ప్రజల ఉత్తర్వు ప్రకారం రైళ్లు నడుపుతున్నారు. ప్రతిస్టేషన్లో టిక్కెట్లు యిచ్చే కిటికీ ముందు - "టికెట్కొని ప్రయాణం చెయ్యటం నిషిద్ధం' అని వ్రాసి పెట్టారు. గడ్బన్లీ స్కూల్లోని కొందరు విద్యార్థులు తెరపి లేకుండా 'రైలు ఎవరిది ?' 'మనది' 'స్టేషన్ ఎవరిది' 'మనది' 'ఇంజన్ ఎవరిది ?' 'మనది' - అని అరుస్తూనే ఉన్నారు. మరి కొందరు రైల్లో టికెట్ చక్కర్ పనిచేస్తున్నారు. టిక్కెట్ వున్నవారిని రైల్లోంచి దింపివేయాలి. ఒక ప్రయాణీకుని దగ్గర వీక్ ఎండ్ రిటర్న్ సగం టికెట్ బయటపడింది. 'దిగిపో, ఇప్పుడేదిగు, నువ్వు స్వరాజ్యాన్ని కోరటంలేదు' అన్నారు. అతడెన్నో విధాల బ్రతిమాలుకున్నాడు - ఇది పాత టికెట్ అని చెప్పుకున్నాడు. అతని మాట ఎవరు వింటారు ? చైన్ లాగి రైలు ఆపి, అతణ్ణి దింపటం జరిగింది. కొంత దూరం వెళ్లి మధ్యదారిలో రైలు మళ్లీ ఆగింది. తివారీజీ ఇటు ఎక్కడో మీటింగ్ జరపటానికి వెళ్లినట్టున్నారు. రెండు గంటలిక్కడ వెయిట్ చేశాక, దూరంగా కాంగ్రెస్ జెండా కట్టిన తివారీజీ ఎడ్లబండి కనిపించింది. తివారీజీ వచ్చి రైల్లో యెక్కారు. 'ఇంక్విలాబ్ జిందాబాద్' అరుపులతో ఆకాశం ప్రతిధ్వనించింది. రైలు బయలుదేరింది. స్టేషన్, స్టేషన్లోనూ ఫైర్స్, టేబిల్స్, గడియారం, Station Master's Office అని వ్రాసిన సైన్బోర్డు, పెద్ద పెద్ద ఎకౌంట్ పుస్తకాలు ఒకచోటకుప్పగా వేసి తగలపెట్టటం జరుగుతోంది. రైల్వే ఉద్యోగులకు వీరిపట్ల సానుభూతి ఉండటం గమనించాను. ఎక్కడా అడ్డుపడే ప్రయత్నం లేదు. అనేకచోట్ల స్వేచ్ఛగా సహాయపడుతున్నారు. ఒక విద్యార్థి ప్లాట్ఫారంలో ఒక దీపం తీసుకుని రాయ్బహదూర్ వేషంతో నృత్యభంగిమలో అందరి మనస్సులు రంజింపచెయ్యటానికి ప్రయత్నిస్తున్నాడు. కస్బాస్టేషన్లో, హైస్కూల్, కాలేజీ విద్యార్థులు టికెట్ చెక్కర్ బాబూసింగ్ని వంతు లేపుకుని కొట్టి ఎన్నాళ్ల నుంచో వున్న ఆక్రోశాన్ని తీర్చుకున్నారు...

...చకరీ ఠాణాలో మహాత్మాజీ న్యాయస్థానం ఏర్పాటయింది. ఇక ఎవ్వరూ

ప్రభుత్వం కోర్టులకు వెళ్లరు. సబ్ ఇన్‌స్పెక్టర్ని అరెస్టు చెయ్యటం జరిగింది. అతణ్ణి 'కామీ' (జాతీయ) జైలుకి తీసుకు వెడతారు. సబిన్‌స్పెక్టరు రెండో డివిజన్ ఖైదీని చేశారు. రోజూ పూరీలు పెడతారు. అంతేకాక అతని భార్య ఎప్పుడు చూడాలంటే అప్పుడు ఎంతో మర్యాదగా తీసుకెడతారు. జైలు తెరుచుకుని ఖైదీలు పారిపోతున్నారు. జైలు భవనం మీద కాంగ్రెస్ జెండా. సర్కారు ట్రెజరీలోని నోట్లను తగలపెట్టటం జరుగుతోంది. పడమటి గోరఖ్‌పూర్ జిల్లా మొదలుకొని తూర్పున వున్న పూర్ణియా జిల్లా వరకు - అన్నిచోట్లా ఇదీ దేశంలోని పరిస్థితి ... సంపూర్ణమైన అరాజకత్వం - ఫాసిస్టుల రాజత్వం - పెద్ద పెట్టున జాతీయ శక్తుల దుర్వినియోగం - చెల్లా చెదరుతనం - విశృంఖలత్వం - దూరపుచూపు లోపించటం - అయినా దుర్లభమైన నిస్వార్థపు త్యాగమహిమతో మహత్తరమైనది. ఎర్రటోపీలు, నల్ల మొహాలు, హెల్మెట్స్ ధరించిన యెర్ర మొహాలు, తుపాకులు, స్టెన్‌గన్‌లు - జనానీకాన్ని ఏవీ చలింప చెయ్యలేక పోతున్నాయి. దూరంగా వీరగాఁవ్ స్టేషన్ మార్కెట్‌లో స్టెన్‌గన్‌లు మ్రోగుతున్నాయి- ఇక్కడ మొక్కజొన్న చేలల్లో వాటికి నకలుగా కుర్రవాళ్ళు స్టేషన్ 'ఫాగ్ సిగ్నల్స్' వెలిగిస్తున్నారు. వారెందుకు అలా చేస్తున్నారో వారికి తెలియదు. హోలీ పండుగరోజున ఊళ్ళో యావన్మందీ నిషా చేసుకుంటే ఏమవుతుందో - సరీగ్గా ఇదీ అలాంటిదే. ఈ చంచలమైన ఉత్తేజననే అన్నయ్య వర్గం వారు విప్లవానికి డ్రెస్ రిహార్సల్ అంటున్నారు. ఇదే నా 'క్రాంతికి ప్రయత్నం' వీరగాఁవ్‌లో - ఈ 'క్రాంతి ప్రయత్న' నాయకులెవరు? వినాయక మిసరీ. అతను అన్ని రంగాల్లోనూ ఉన్నాడు. ఇరుగుపొరుగు గ్రామాల్లో సత్యనారాయణ వ్రతకథలు చెపుతాడు. షష్టిపర్వాల్లో పౌరోహిత్యం చేస్తాడు. హిందూ మిషనరీ లెక్చర్లు యిస్తాడు. క్రిస్టియన్ సొంతాలీన్లని శుద్ధి చేస్తాడు. కాంగ్రెసు మినిస్ట్రీ సమయంలో మంత్రిగారి టూర్‌లో కారులో వారి ప్రక్కన అనుకుని కూర్చుంటాడు. అతను చేతులుచూసి, పెళ్ళి ముహూర్తాలు పెట్టి, జన్మ పత్రికలు వ్రాసి, హోమ్యోపతి, ఆయుర్వేదం, చిట్కా మందులిచ్చి చాలా డబ్బు సంపాయించాడు. ఒక పెద్ద లావుపాటి హిందీ గ్రంథం అతని మూలధనం. ఇందులో చిక్కు ప్రశ్నల సమాధానాల దగ్గిర్నుంచి చిట్కా మందుల వరకు అన్నీ ఉంటాయి. 'ధాంగడ్' శ్రామికవాడలో కాళీ పూజామంత్రం చదివే సమయంలో - ఈ పుస్తకంలోంచి హిందీలో రామాయణం కథ చదువుతాడు. ఇలాంటి నాయకత్వంలో - ఇలాంటి 'ఆర్గనైజేషన్'లో ఇలాంటి సమయంలో జరుగుతుందా 'క్రాంతి?' ఈ సంగతి అన్నయ్యకెవరు బోధపరుస్తారు? నేనేమీ అన్యాయం చెయ్యలేదు. నా కర్తవ్యాన్ని మాత్రమే చేశాను. నేను సాక్ష్యం యివ్వకపోయినా మరొకరు

యిచ్చేవారు. గవర్నమెంట్‌కి జనం లేకపోలేదు. తేడా యేమిటంటే - నేను నా రాజకీయ సిద్ధాంతంకోసం, కర్తవ్యంపట్ల గౌరవంతోనూ యిచ్చాను. మరొకరైతే ప్రలోభంలో పడియిచ్చేవారు. ఈ విషయం అన్నయ్యతో కనుక అరమరికల్లేకుండా చర్చిస్తే బావుండును. అహఁ అది నిరర్థకం అవుతుంది. నేను ఎన్ని అయినా చెప్పనీ - అన్నయ్య ఏం మాట్లాడకుండా ఓపికగా అన్నీ వింటూ మధ్య మధ్య చిన్న నవ్వు నవ్వుతాడు. బహుశా ఒకటి రెండు - నా యుక్తి స్రవంతిని కల్లోలం చేసే ప్రశ్నలు అడగవచ్చు. ఆ చిరునవ్వులో బుగ్గను సొట్టపడగానే - నా ఆపాత తీక్ష్ణమైన యుక్తి - అతని దృఢమైన విమర్శనాశక్తి మీద కాస్త మచ్చనైనా కలిగించలేకపోయిందని నేను గ్రహించగలను. ఆ నవ్వు నన్ను ఓడించటానికి కాదు, అది కేవలం నన్ను విరమింప చెయ్యటానికే. ఒకటి రెండు ప్రశ్నలతో నా యుక్తి సౌధం నేలమట్టమయిపోతుంది.

క్రిందటివారం అన్నయ్యను కలుసుకోవటానికి వచ్చినప్పుడు నేనీ ప్రశ్న అన్నయ్యను అడగలేదు. యుక్తితో ఓడిపోతాననే భయంతో కాదు. సంకోచంతో.....అది అపరాధి మనస్సులో ఉండే సంకోచమా? కాదు. నేనే అపరాధమూ చెయ్యలేదు. అయితే మరి అపరాధజనితమైన సంకోచం నా మనస్సుకెలా వస్తుంది. ఈ సంగతులన్నీ యెత్తటం శోభస్కరంకాదు - అందుకనే సంకోచం. అంతిమ క్షణాన్ని ప్రతీక్షిస్తూ తులసి చెట్టుదగ్గరకు తీసుకొచ్చిన వాడిని - ఆ వీలునామా ఎక్కడ పెట్టావని అడుగుతారా? అక్కర్లేదు. అన్నయ్యకి నచ్చచెప్పవలసిన అవసరంలేదు. అతను నా పరిస్థితి సరీగ్గానే అర్థం చేసుకున్నాడు.

ఖాకీ హాఫ్ ప్యాంట్ ధరించిన ఒక యువ ఆఫీసరు గేట్‌లోపలికి వచ్చాడు. బహుశా అసిస్టెంట్ జైలరు రాత్రి రౌండులో వచ్చాడనుకుంటాను.

... క్రిందటి వారంలో అన్నయ్యని అతని సెల్‌లో కలుసుకున్నాను. వెంట సి.ఐ.డీ. పెద్దమనిషి ఉన్నాడు. ఒక వార్డరు అంతకుముందునుంచే అక్కడనుంచుని వున్నాడు. వారి యెదుట యెక్కువ యేం మాట్లాడటానికి వీలవుతుంది. నా చేతిలో రూమాలుతో మూటకట్టిన కాసిని పళ్ళు ఉన్నాయి. లోపలికి వెళ్ళేప్పుడు సి.ఐ.డీ. పరిహాసంగా "చూడండి మహాశయా ! అందులో ఏదైనా గొడవతీసుకొచ్చిపెట్టే వస్తువేం లేదుకదా! చివరికి నా ఉద్యోగాన్ని మాత్రం కాటువేయకండి. ఈ దేశంలో బెంగాలివాడి ఉద్యోగం అంటే ఈ రోజుల్లో ఏమిటో తెలుసుగా మీకు. కోరుకుని వచ్చానా ఈ ఉద్యోగంలోకి"? అన్నాడు. అతనికి రుమాలు మూటవిప్పి చూపించబోయేసరికి "చాలు చాలు నేను ఊరికే అన్నాను. మీరు భలేవారే ! మేము మనుషుల్ని గుర్తించగలం మహాశయా" అన్నాడు. సి.ఐ.డీ.

కూడా నన్ను విశ్వసించాడు. ఇంత పెద్ద సర్టిఫికెట్ రాజకీయ కార్యకర్తకి ఇంకేముంటుంది? దీనికి నేను సంసిద్ధంగాలేను. అన్నయ్యకు విరుద్ధంగా సాక్ష్యం యిచ్చినప్పట్నుంచీ వీరికి నా మీద సందేహంగా ఉంటోంది. అన్నయ్య సెల్‌లో కటకటాల వెనుక నుంచుని ఉన్నాడు. రేగిన జుట్టు - బాగా చిక్కిపోయాడు. ముక్కు కత్తిలాగా నిటారుగా వుంది. ఒంటిరంగు ఇందివరకటికంటె తెల్లనైనట్లుంది. చేతులమీద పాదాలమీద గజ్జి మచ్చలున్నాయి. అతని నవ్వు మొహం, ఔత్సుక్యభరితమైన కోమలదృష్టి నన్ను సంకోచించే అవకాశాన్ని యివ్వలేదు. ముందు తానే "రుమాల్లో ఏమిట్రా"? అని అడిగాడు. ముందు సంభాషణ మొదలుపెట్టే సంకోచం తీరిపోయింది. "పెద్దమ్మ పంపించింది" "అలాగా? పెద్దమ్మ ఎలా వుంది? ఏమయినా చెప్పిందా యేం?"... మొదట్లో పెద్దమ్మ తిండి, నిద్ర మానేసిందని నిజం చెపుదామనుకున్నాను. వద్దు. స్నేహభరితమైన అన్నయ్య మనస్సుకి మళ్ళీ యెందుకు బాధ కలిగించటం! "ఏదో ఉన్నదలాగే. ఎప్పుడూ నీ మాటే అంటూ వుంటుంది" అన్నాను. ముఖం చూసేసరికి అన్నయ్య నేను నిజం దాచిపెట్టాలని చేసిన ప్రయత్నం పసికట్టాడనిపించింది. "తలుపు తీయండి లోపలకు వెళ్ళి కూర్చోరాదూ?" అన్నాడు సి.ఐ.డి. "అక్కర్లేదు, అక్కర్లేదు" అన్నాను కాని, వార్డరు తలుపు తీసేశాడు. లోపలకు వెళ్ళి అన్నయ్య కంబళి మీద కూర్చున్నాను. ఆరోజున నేను యే ప్రశ్నా అడగలేకపోయాను. ఏమిటో మాటలన్నీ అయిపోయినట్లున్నాయ్. అన్నయ్య నా మనస్సులోని అవస్థ గ్రహించాడనుకుంటాను. అతనే నన్ను యెన్నో సంగతులు అడగటం మొదలెట్టాడు. నేను సమాధానాలు మాత్రం చెప్పాను. వచ్చే ముందు అన్నయ్య - "అమ్మని కలుసుకో" అన్నాడు. అన్నయ్య నాతో మాట్లాడిన చివరిమాట యిదే. అతని ఈ చివరిమాట, ఈ చివరి కోరికను నేను నిలుపుకోలేకపోయాను. అమ్మ ఏడుస్తూ నన్ను ఏమంటుందో ఆ మాట తలపుకి వచ్చేసరికే వణకిపోయాను. అన్నయ్య నా మనస్సులోని ఇన్ని సంగతులు గ్రహిస్తాడుకాని యిప్పుడు నేను అమ్మని కలుసుకోవటం యెలా సంభవము అన్నదిమాత్రం ఊహించలేకపోయాడు. నాకు ఏది బాగుంటుందో - ఏది బాగుండదో కూడా తెలుసు. అన్నయ్యని ఒకసారి మంచి కవిత ఒకటి వ్రాసి యివ్వమని అడిగాను. నేనే గొప్పగొప్ప కవుల దుఃఖోద్వేగ స్వరం అర్థం చేసుకోలేను. అంచేత అన్నయ్య నాకు తెలిసే ధోరణిలో వ్రాసి యిచ్చాడు:

'చాఇ ఆమి షాక్‌తర్ పూర్ణ అధికార్
తాహార్ అల్పేతే తుష్ట కాఖన్ హోచేనా

పరపుష్ఠా ధానికేర్ ఉపేఖ్యా సంబొనా
శ్రామికేర్ పేషనేర్ కొబె ప్రతీకార్
హబె, అభిషే ఇదిన్‌పాన్ చాహి
అభే మోర్ నిశ్చయ్ బిశ్వాస్
యంత్రపిష్ట శ్రామికర్ హతాశ్ నిశ్వాస్
అనిచే ప్రాలయ్! అర్ అన్నసాధ్ నాహి
ఉదిచే నూతన్ సూర్య, క్షుధాక్లిష్టముఖేద్‌ఖాదిచే
హాషిరేఖా!నాథాకుక్‌చిత్తకార్ ఒ అతుల్ అగాధ్
షామ్‌రాజ్యే కర్మచిన్తా స్వాధీన్ అబాధ్...'

(నేను అందరికి సంపూర్ణ అధికారాన్ని కోరుతున్నాను. అంతకంటె తక్కువతో సంతృప్తి పడను. ఇతరులచే పోషింపబడిన ధనవంతుల ఉపేక్షాభావాన్ని సహించను. శ్రామికుల పీడనానికి ప్రతీకారం జరిగే రోజుకోసం యెదురుచూస్తున్నాను. నాకు పూర్తి విశ్వాసం వుంది. యంత్రాల్లో పడి నలిగే శ్రామికుల నిరాశా నిశ్వాసలు ప్రళయాన్ని తీసుకువస్తాయి. అంతకంటె వేరుమార్గం లేదు. క్రొత్త సూర్యుడు ఉదయిస్తాడు. ఆకలితో శుష్కించిన ముఖాల్లో హాసరేఖను చూపిస్తాడు. అపరిమితమైన ఐశ్వర్యం ఉండకూడదు. సామ్యపరిపాలనలో పని ఆలోచన అడ్డులేని స్వేచ్ఛ...)

ఇంక జ్ఞాపకం రావటంలేదు. ఆ కవిత అంతా నాకు కంఠస్థంగా ఉండేది. రెండేళ్ళలో నాలో యెంతో పరివర్తన కలిగింది. నేను అన్నయ్య ప్రభావంనుంచి విముక్తుణ్ణి కావటానికి శక్తికొద్దీ ప్రయత్నించాను. అందుకు అచ్చేతనమైన నా మనసు కూడా, నా స్మృతిపటం నుంచి కవితను తుడిచి వెయ్యటానికి సాయం చేసిందనుకుంటాను. కవిత ఆశ్రమంలో అమ్మగది వరాండాలో వ్రేలాడకట్టి వుంచాను. ఇప్పటికీ ఉన్నదేమో ఎవరికి తెలుసు! ఇన్నాళ్ళూ ఆ సంగతి ఒక్కసారి కూడా గుర్తురాలేదు. ఈసారి వెళ్ళి తప్పకుండా వెతికి చూస్తాను.

"మేల్కొనే ఉన్నారా బాబూజీ!"

సుబేదార్ క్వార్టర్స్‌నుంచి తిరిగి వస్తూండటం చూశాను. ముఖం కళ్ళు చూస్తే కాసేపు నిద్రపోయి వుంటాడనిపించింది. కంగారుగా లేచి కూర్చున్నాను.

"కూర్చోండి, విశ్రాంతి తీసుకోండి బాబూజీ!" ఎవరితోనూ మాట్లాడబుద్ధి పుట్టడంలేదు. సుబేదార్ సాబ్ గేట్‌లోకి వచ్చాడు. ఆఫీసు గదివైపు వెడుతున్నాడు. సాయంత్రం వేసిన చుట్టి వేస్తున్నాడనుకుంటాను. అన్నయ్య ఇప్పుడు యేంచేస్తూ

ఉంటాడు. బహుశా ఉత్తరాలు వ్రాస్తూంటాడు. అన్నయ్య తప్పకుండా కొన్ని ఉత్తరాలు వ్రాస్తాడు. నేహాల్‌సింగ్‌కి పుస్తకం (పాడ్) పెన్సిల్ కోసం యిచ్చిన డబ్బుతో అన్నయ్యకి కావలసిన వస్తువులన్నీ కొని యిచ్చాడో లేదో ఏం తెలుసు? ఇచ్చినా వాటిని సెల్‌లో ఉంచుకోటం కష్టం - కచ్చితంగా ప్రతిరోజూ సెర్చ్ జరుగుతుంది. వ్రాయటానికి వీలు ఉన్నప్పటికీ అన్నయ్య అందరిలాగా బహుశా ఉత్తరాలు వ్రాయడు. ఆశ్చర్యం అతని మనస్సు! అతనేపని శోభస్కరమైనది కాదని, దృష్టికి కటువుగా వుంటుందని భావిస్తాడో దాన్ని నేను ఊహించనుకూడా లేను. మేరీ ఆంటోనెట్‌కి మరణ దండన అమలు జరుగటానికి ముందు రోజున రాత్రికి రాత్రి జుట్టంతా తెల్లగా నెరిసిపోయిందని విన్నాను. అన్నయ్య నెరిసిన జుట్టును ఊహించను కూడా ఊహించలేను. అతను బహుశా నిశ్చింతగా నిద్రపోతూంటాడు. సర్ వాల్టర్ ర్యాలీ ఉరికంబంమీద తల అనించేముందు ఘాతకుడి (కసాయివాడు)తో వేళాకోళంగా "చూడు భాయీ నా కెంతో ప్రియమైన గడ్డాన్ని మాత్రం కత్తిరించెయ్యకు" అన్నాడట. పూర్వం ఇది అతిశయోక్తి అనిపించేది. అన్నయ్యను గురించి చెప్పబోతుంటే ఇది యింక అత్యుక్తి అనిపించటంలేదు. ఎంత మంది రాజకీయ ఖైదీల ఉరితీసే మంచెమీద యెక్కేముందు ఎన్నిరకాల ఆచరణల కథలు విన్నాను! కొందరు పడిపోయారు. కొందరు సూపరెంటెండెంట్‌ని తిట్టారు. కొందరు భగవంతుడే దోషి అని నిర్ధారణ చేశారు. కొందరు భగవంతుని ధ్యానించారు. కొందరు లెక్చరివ్వటానికి వ్యర్థ ప్రయత్నం చేశారు. కొందరు "శిర్ ఫరో శీకా తమన్నా" (శిరస్సు ఇచ్చేవాని ఆవేదన) పాట పాడుతూ నిర్వికారభావంతో మెట్లెక్కి కొయ్యబల్లపైకి వెళ్ళి నిలబడ్డారు. అన్నయ్య అవన్నీ కొద్దోగొప్పో 'నాటకీయా'లంటాడు. అన్నయ్య ఇలాంటి వన్నీ యేమీ చెయ్యడు. అతని పెదవుల మీద అవజ్ఞాభరితమైన నవ్వు ఉంటుంది. అతని నిర్లక్ష్య భావంముందు సూపరెంటెండెంట్ కళ్ళు క్రిందికి వాలిపోతాయ్. మేజిస్ట్రేట్ చూపు మరొకవైపుకి మరల్చుకుంటాడు. జైలర్ సాబ్ నిష్కారణంగా టార్చ్ వెలిగించి మణికట్టు మీది గడియారం చూసుకుంటాడు. కాస్త 'రెమిషన్', అయిదు రూపాయల కోసం గర్హ్యమైన ఈ ఘాతక కృత్యం చేసే నిర్వికారఖైదీకి కూడా గుండె కొంచెం గబగబా కొట్టుకుంటుంది. అన్నయ్య మరొక విధమైన ఆచరణ నేను ఊహించలేనిది.

"ఖట్...ఖట్...ఖట్!" గేట్ రెండో అంతస్తులోంచి ఎవరో మెట్లు దిగి కిందికి వస్తున్నారు. బలదృప్తుడు, గర్వాంధుడు అయిన వ్యక్తి పౌరుషాన్ని సూచించే పదధ్వని - ధోరణీ! ఈ స్థానంలో మాత్రం ఇంకెవరి అధికారమూ, ఆదేశమూ చెల్లనేరవు...ఇక్కడ నేనే సర్వాధిపతినని తెలుసుకో నువ్వు - అన్నభావం! చాలాసేపట్నుంచి ఈ పదధ్వని

కోసమే ఎదురుచూస్తున్నాను. ఖాకీ జైలుదుస్తులు ధరించిన బలిష్ట దేహుడైన ఒక పెద్దమనిషి దిగి వచ్చాడు. గేట్‌లోని సెంట్రీ బూటుని నేలకి తాటించి సాల్యూట్ చేశాడు. తర్వాత నిటారుగా బిగుసుకుపోయినట్లు నిలబడ్డాడు. లోపలి వార్డరు సలాంచేసి గేట్ తలుపు తెరిచాడు. సుబేదార్ సాబ్ గేట్ కెదురుగా నుంచుని ఉన్నాడు. తెలుపు నలుపు కలసిన ముందు పళ్ళు బయట పడుతున్నాయి. నవ్వుతో బుద్ధిపూర్వకమైన ముఖస్తుతి సూచన వ్యక్తం చెయ్యాలనే ప్రయాస స్పష్టంగా తెలుస్తోంది. సుబేదార్ సలాం చెయ్యగానే జైలర్ సాబ్ "అన్నీ సరీగ్గా ఉన్నట్లేగా" అని అడిగాడు.

"ఆఁ ఆఁ హుజూర్!" అన్నాడు సుబేదార్ - ఏదో రాత్రంతా ఈ ఏర్పాట్లన్నీ చెయ్యటానికి ఒళ్ళంతా హూనం హూనం అయేలా శ్రమపడినట్లు.

జైలరు సాబ్ దృష్టి ట్రాలీలైన్ ప్రక్కన ఇటూ అటూ పడి ఉన్న పేడ మీదికి పోయింది. పాదం త్రిప్పి బూటు అడుగుభాగం చూసుకున్నాడు. ముఖంలో కోపచిహ్నాలు స్పష్టంగా కనిపించాయ్. సుబేదారు కూడా భయంభయంగా అతని బూట్‌వైపే చూస్తున్నాడు. బూటు అడుగున పేడ అంటలేదు. అతను హమ్మయ్య అనుకుని తేలిగ్గా నిట్టూర్చాడు.

"ఈ పేడ ఎత్తివేయించి యెందుకు శుభ్రం చేయించలేదు?" అని జైలర్ సాబ్ అడిగాడు.

"ఖైదీ ఎవరూ దొరకలేదు హుజూర్."

"ఎందుకని? లాకప్ అయినాక ఎడ్లని గేట్‌లోంచి ఎందుకు వెళ్ళనిచ్చారు?"

ఇంక ఎక్కువ ఏమీ చెప్పనవసరంలేకపోయింది. లోపల వార్డరు తానే ఈ పని చెయ్యటం మొదలెట్టాడు. ఇవాళ సుబేదార్‌సాబ్ రోజు బాగుండలేదు. తెల్లవారకముందే ఈగొడవ. జైలర్ సాబ్ లోపలి తలుపు చెరుచుకుని జైలులోపలికి వెళ్ళాడు.

"చూస్తాను, ఇహ లోపల యేర్పాట్లు యెలా వున్నాయో. మీ మీద యే బాధ్యత వదిలి, నిశ్చింతగా ఉండటానికిలేదు. దొరగారిగది, నా ఆఫీసుగది సరీగ్గా వుండాలి" అన్నాడు.

"ఆఁ హుజూర్! అది యింక చెప్పక్కర్లేదు. అన్నీ సరీగ్గా పెట్టే ఉంచాను".

సుబేదార్ సాబ్ వార్డరుతో - "గుడ్లగూబలా మొహం పెట్టుకుని యేమిటి చూస్తున్నావ్? వెళ్ళు. దొరగారి గది సరీగ్గా ఉందో లేదో చూడు. ఈ కొత్తగా నియమించిన వాళ్ళతో పనులు జరిపించటం కష్టం. కాంగ్రెసు ఆందోళనకోసం -బళ్ళు తోలేవాళ్ళు, నాగలి దున్నేవాళ్ళు, గొడ్లు కాచేవాళ్ళు ఎంతమంది ఉన్నారో అందరూ వచ్చి చేరారు.

ఒక్క మాట తెలియదు. వాళ్ళకి ఒక్క పనీ తెలియదు. పెద్ద చికాకు వచ్చి పడింది"... అన్నాడు.

చిన్నవాళ్ళనుంచి పెద్దవాళ్ళవరకు తమ క్రింది ఉద్యోగులతో ఒకే విధంగా ప్రవర్తిస్తారు.

నాలుగయిన గంట పడింది. మళ్ళీ వార్డర్ల క్రొత్త జట్టు వస్తారు. ఒక జట్టుకి ఇరవై ఇద్దరు ఉంటారు. ఒకే దృశ్యం మళ్ళీ అభినయించటం - అంతా యేదో ఒక రాత్రిలోనే ముఖస్థమయిపోయింది. ఏదో రైల్వే స్టేషన్ ప్లాట్‌ఫారం - ఎంతోమంది రైల్లోంచి దిగారు. మరి కొంతమంది యెక్కారు. కోలాహలం, విచ్చలవిడితనం మళ్ళీ యెలాగో అలాగే... అన్నయ్య సెల్‌లో కటకటాలు పట్టుకుని నుంచుని తుది క్షణం కోసరం ప్రతీక్షిస్తున్నాడా? ఇప్పుడు నాలుగు గంటలు కొట్టటం అన్నయ్య విన్నాడా? గేట్‌పై నిశబ్ద తరంగాలు - వాయుమండలంలోపల కంపనాన్ని సృష్టించి కన్‌డెమ్డ్ సెల్‌లో చేరుతున్నాయి. నా ఆలోచనాతరంగాలు చేరుకోలేవా? అన్నయ్య చివరి క్షణంలో ఎవరి సంగతి తలచుకుంటాడు? అమ్మ సంగతా? పెద్దమ్మ సంగతా? నా సంగతా? నా సంగతి ఎందుకాలోచిస్తాడు? తప్పకుండా ఆలోచిస్తాడు. శక్తి అంతా క్రుంగిపోయిన దౌర్బల్యంతో విషాదంతో నామీద అభిమానంతో చింతాక్రాంతుడై ఉంటాడు. అది యుక్తి తర్కానికి చాలా పైవిషయం....ఇహ మీదట నేను పూర్ణియాలో ఉండటం అసంభవం. పెద్దమ్మకి నా మొహం యెలా చూపించను? వీధిలో నలుగురి యెదుటికి ఎలా వెళ్లను? సాక్ష్యమిచ్చినప్పట్నించి ఇన్నాళ్ళూ ఈ అవస్థ కొంతవరకలవాటయింది. కాని అమ్మ ఎదుటి కెళ్లటం అసంభవం. అన్నయ్య అంతిమ దినపు ఈ చిత్తరువు ఆకస్మికమైనది, ఎదురు చూడనిదీ కాదు. గత కొన్ని మాసాలనుంచి ఈ రోజుకోసం మనస్సును సంసిద్ధం చేసుకున్నాను. అయినప్పుడు - కానప్పుడు ఈ చిత్తరువు మనసుని బరు వెక్కించేది...."పాకూడ్ మర్డర్‌కేస్" వార్తలు ప్రతి రోజూ చదివి, నేను, అన్నయ్య అమ్మకి నచ్చచెప్పేవాళ్ళం.

"అమ్మో అన్నతమ్ములమధ్య ఇలా అవుతుందా?" అన్నది అమ్మ. కాని ఈనాడు! ఇన్నాళ్ళూ ప్రజాభిప్రాయాన్ని ఉపేక్షించాను. కాని యిప్పుడు మనస్సు వికలమవుతోంది. ఎందుకని? ప్రజాభిప్రాయాన్ని నిర్లక్ష్యం చెయ్యవచ్చు కాని అవ్యక్త వేదనాభరితమైన అమ్మదృష్టిని, పెద్దమ్మ మౌనతిరస్కారాన్ని ఉపేక్షించటం సాధ్యపడదు. ఎందుకు సాధ్యపడదు? Sentimental nonsense... నాముందు వేదనాజర్జరితమైన సమాజపు అంతులేనన్ని పనులు పడి వున్నాయి. యుగయుగాలనుంచి సంచితమైన సమాజం

కన్నీటిని తుడిచే భారం పైన ఉన్నవారు - సంకుచితమైన గృహకోణంలోని నాలుగయిదు వేడి కన్నీటి బిందువుల సంగతి ఆలోచిస్తే చెల్లుతుందా? ఖద్దరు చీరె అంచుతోనే కొన్ని చుక్కల కన్నీళ్ళు తుడుచుకుపోతాయి. చిరిగిపోయిన బొంత, మాసిపోయిన తలగడ ఈ కొద్ది బిందువుల కన్నీళ్ళను వేడి ఇసుక గుట్టలాగా ఇంకిపోయేట్లు చేస్తాయి. నేను దీనికోసరం పడివుంటే సాగుతుందా? ఇప్పటికీ నాకు నా భవిష్యత్తుని గురించే బెంగపడుతున్నాను. నాకు ఏం జరుగుతుందో అన్నదాని గురుత్వమే నాకు యెక్కువది. అన్నయ్యకు ఏం జరగబోతోంది అన్నది కాదు.

కానాయిలాల్ మృత శరీరం ఫొటోలోని ముఖం తలపుకు వస్తోంది. అన్నయ్యను కూడా ఇలా ఇనుప స్ట్రెచర్‌మీద ఇలా పడుకోబెడతారా? కళ్ళు రెండూ అర్ధనిమీలితాలు చివరి శ్వాస తీసుకునే ప్రయత్నంలో ముఖం బీభత్సంగా కాలేదు. కనుగ్రుడ్లు రెండూ కోటరంనుం తోసుకుని బయటికి వచ్చిపడలేదు. ప్రశాంత నిద్రాభావం! కేవలం మెడ మాత్రం కొంచెం ఉబ్బింది. రక్తం గడ్డకట్టుకుపోయి నీలంరంగు ఫొటో - మచ్చలు. జైలు డాక్టరు అఘోరబాబు జైలు గేట్‌లో ప్రవేశించాడు. పెద్ద మనిషి త్వరగా లేవాలనే ప్రయత్నంలో అలసిపోయాడు. ఎటు తిరిగి చూడటానికి అవకాశం లేదతడికి. జైల్లో అయిదారుగురు డాక్టర్లు ఉన్నారనుకుంటాను. కాని జైలు పెద్ద డాక్టర్ సివిల్ సర్జన్ పట్నంలో ఉంటాడు. అతనికిక్కడ క్వార్టర్స్‌లేవు. యుద్ధానికి ముందు సివిల్ సర్జన్ జైల్ సూపరింటెండెంట్ అయ్యేవాడు. అఘోరబాబు మరి ఎందుకొచ్చారు? "డాక్టర్‌సాబ్! మీరు మళ్ళీ వచ్చారెందుకు?" సుబేదార్ అడిగాడు.

"ఊరికేనే వచ్చాను".

సుబేదార్‌సాబ్ స్వయంగా సంగతంతా యెరిగి వున్నాడు. ఇవాళ దొరగారిదగ్గిర తమ కర్తవ్యపరాయణత చూపించుకోవాలని అందరి యిచ్ఛ. అఘోరబాబుతో నాకు పరిచయం ఉంది. అదృష్టవశాత్తూ నామీద అతని దృష్టి పడలేదు. లేకపోతే అదీ యిదీ ప్రశ్నిస్తూ కూర్చునేవాడు. అతను ఆఫీస్ గదిలోకి వెళ్ళాడు. జైలర్‌సాబ్ తిరిగి వచ్చారు. అతని గదిలో లైట్ వెలిగింది. ఫాన్ తిరుగుతోంది. హాఫ్‌ప్యాంట్, సాదాహాఫ్ షర్ట్ ధరించిన సూపరెంటెండెంట్ సాబ్ వచ్చి చేరుకున్నారు.

వార్డర్ ముఖంలో అతిభయం... శాల్యూట్ - ఎటెన్షన్ కుక్క లోపలకు వచ్చే ముందు ఏమనుకుందో నా చుట్టూ తిరిగి వెళ్ళింది. లోపలి వార్డరు కుక్కకోసం తలుపు సగం తెరిచి ఉంచాడు. దొరగారికంటె అతని కుక్కమీద జైలు ఉద్యోగుల అనుగత్యం తక్కువదికాదు. ఇది చూపటానికందరూ ప్రయత్నిస్తున్నారు. జైలర్ సాబ్ గదిలోంచి

బయటికి వచ్చారు. దొరగారిని అభ్యర్థన చేయటానికి. అఘోరబాబు అక్కడికి వచ్చి నుంచున్నారు. సుబేదారు జైలర్ సాబ్ మర్యాద కాపాడటానికి - అతణ్ణి రాచుకుంటూ నుంచోకుండా కొంచెం దూరంలో నిల్చున్నాడు. దొర నవ్వుతూ ఏదో మాట్లాడుతున్నాడు. పరధ్యానంతో చేతిలో టార్చ్‌ని ఒకసారి వెలిగిస్తున్నాడు. ఒకసారి ఆరేస్తున్నాడు. కుక్క ఒకసారి ఆఫీసు గదిలోకి, ఒకసారి ప్యాసేజ్‌లోకి వచ్చిపోతూవుంది. కాగడాలు వాసన చూస్తోంది. దొరదగ్గరకొచ్చి ఏదో వార్త గుర్తుచేసిపోయింది. రాత్రి నిస్తబ్ధతను చీల్చుకుంటూ - లారీధ్వని వినిపించింది. దగ్గరకు వస్తోంది - బొఁయ్ బొఁయ్‌మంటూ - ఇంతబిగ్గరగా కూడా మోటరు హారన్ ధ్వనిస్తుంది. అన్నయ్య, అమ్మ, నాన్న బహుశా అందరి చెవులకీ యిది విన్పించి వుంటుంది. ఒక మోటారు వ్యాన్ గేట్‌కి కొంచెం దూరంలోకి వచ్చి ఆగింది. ఇంక డోర్ తెరుచుకుని ఒకరివెనకాల ఒకరు ఆర్మ్‌డ్ పోలీసులు దూకుతారు. ఎబౌట్ టర్న్...రైట్...అయింది. ఎవరూ దిగలేదు. అందరూ బహుశా వ్యాన్‌లోనే ఉండిపోయారనుకుంటాను. డ్రైవరు వ్యాన్ దీపాలు ఆర్పాడు. రోడ్డు క్వార్టర్స్ మళ్ళీ చీకటిలో మునిగిపోయాయి. దొరగారి కుక్క మొరుగుతోంది. కుక్క గేట్ కటకటాల్లోంచి బయటికి వచ్చింది. తన రాజ్యంలో శాంతి భంగం ఎలా సంభవించింది అని చూస్తోంది. దీపం హఠాత్తుగా ఎందుకు వెలిగింది. మళ్ళీ ఎందుకు ఆరిపోయింది అన్న అన్వేషణలో అది బయటికి వెళ్ళిపోయింది.

దేశ సంచలన చక్రం మెల్లిగా - కాని నిశ్చితగమనంతో రాత్రింబగళ్ళు నడుస్తూనేవుంది. ఎప్పుడో కొన్నాళ్ళ క్రిందట అభాగ్యుడైన మూర్ఖుడెవరో దీని యెదుట తల యెత్తుకుని నిలబడటానికి వ్యర్థమైన దుస్సాహసం చేశాడు. అది పునరావృత్తి కాకుండా ఉండాలనే ఉద్దేశంతో దేశవ్యాప్తంగా చిన్నవీ పెద్దవీ చక్రాలు అసంఖ్యాకంగా నియోజితమయినాయి. ఆ ఘటనను దాని నాయకుణ్ణి నిశ్చిహ్నం చేస్తేనే కాని దేశానికి శాంతి, మేలు జరుగవు. ఏ స్వాప్నిక విలాసం కొన్ని ఆధునిక హృదయాలను ఉద్వేలితం చేసిందో భవిష్యత్తులో ఏదో అది భయంతో మొద్దుబారి, కుంటిదయిపోవాలనే దాని కామ్యం...కోరహఖానా, ఇన్‌స్పెక్టర్ వెంకటేశ్వర్, పోలీసు ఆఫీసర్ సెషన్స్ కోర్ట్, గవర్నమెంట్ వకీలు, జడ్జీ మహాశయుడు, ప్రభుత్వం వారి సాక్షి నీలూ, జైలు ఉద్యోగులూ - ఒకరి వెంట ఒకరు దండలో రంగురంగుల పూసల్లా గ్రుచ్చబడి ఒక స్థిరమైన ఉద్దేశ్యంతో సాగిపోతున్నారు. ఏ ఉద్దేశ్యం కోసం వీరు నియోజితులో - ఆ చరమ ముహూర్తానికి ఇంకెంత ఉంది ఆలస్యం? కేవలం ఘాతకునే బాధ్యుణ్ణి చేస్తే యెలా చెల్లుబా టవుతుంది? ఈ బర్బరతకు నైతిక బాధ్యతలో జడ్జి దగ్గిర్నుంచి వార్డరు వరకు అందరూ

సమానులే... ఈ విశేషజ్ఞుల యుగంలో యెవరూ తమ పరిధులు దాటి బయటికి చూడరు. అతను స్వయంగా యంత్రంలో ఏ అంశానికి బాధ్యుడో - దాన్ని మటుకు బాగా నడిపించగలిగితే చాలు, బ్రహ్మాండమైన సంచాలనశక్తి, కీలక మెక్కడో అతనికేమి అవసరం? ఇంజన్ నుంచి బెల్టింగ్ యిచ్చి ఈ శక్తి అంశికంగా దాని దగ్గరకు చేర్చితే సరిపోతుంది. తర్వాత అది తాను సగం తయారు చేసిన సరుకును ఆ తర్వాతి స్థానానికి చేర్చుతుంది. ఇంతదూరం వరకు యెన్ని చేతులు మారి వ్యవహారం వచ్చిందో. దానికి అన్నిచోట్లా రాష్ట్ర దానవుని నగ్నతను, బర్బరతను కప్పిపుచ్చటానికి ఒక ప్రయాస ఉంది. కాని యిప్పుడు - ఇంక మొహమాట పడవలసిన అవసరంలేని స్థానానికి చేరుకుంది. crush or be crushed జగన్నాథుడి రథం తన గమన గర్వంతో వెళ్ళిపోతూనే వుంటుంది. చక్రాలక్రింద నిశీధి పిలుపుతో విహ్వలుడైన ఏ హతభాగ్యుడైనా పడి పిండిపిండి అయిపోయినాడా లేదా అన్నది తెలుసుకోటానికి దానికి రవంతయినా ఆసక్తిలేదు. శ్రేణీ స్వార్థపు స్టీమ్ రోలర్ దారిపై నుంచి అనవరతం నడిపించుకుపోవలసిందే. విరామం యిస్తే కలుపు మొక్కలు తల యెత్తున పైకి లేస్తాయి... ఆశ్రమంలోకి వచ్చే దారి అన్నయ్య తన చేతులతో వేసింది. రెండు ప్రక్కల రజనీగంధ చెట్లు వరుస. తీరిక దొరికితే తవుగోల తీసుకుని అన్నయ్య దారిలో మొలిచిన గడ్డిని కలుపుమొక్కల్ని తీసి వెయ్యటానికి కూర్చుంటాడు - ఒక సాదాఖద్దరు బనీనుతో...

మరొక మోటారుకారు వచ్చి ఆగింది. యూనిఫారం వేసుకున్న చప్రాసీ తలుపు తెరచాడు. హ్యాట్ కోట్ ధరించిన పెద్దమనిషి నోట్లో చుట్ట... సివిల్ సర్జన్. సూపరెంటెండెంట్‌గారి వర్గం అతనికి అభ్యర్థన తెలిపింది.

"నాది ఆలస్యమయిందాయేం? నా కోసరం ఎదురుచూడటం లేదుకదా?!" అన్నాడు సివిల్ సర్జన్.

"లేదు...లేదు ఇంతవరకింకా మేజిస్ట్రేట్ రానేలేదు" సూపరింటెండెంట్ రిస్ట్‌వాచి చూశాడు. ముఖంలో చిరాకు భావం... "రండి గదిలో కూర్చోవచ్చు" చెయిర్ లాక్కున్న ధ్వని విన్పించింది. గదిలోపల్నుంచి మెల్లిగా మాటల సవ్వడి వస్తోంది. మళ్ళీ కారు హారన్ చప్పుడైంది. ఒక కారు వచ్చి ఆగింది... హాఫ్ పాంట్ ధరించిన ఒక అల్ప వయస్కుడైన పెద్దమనిషి కారులోంచి దూకి దిగాడు. అతను పరుగెత్తుకుంటూ జైలు గేట్‌లోకి వచ్చాడు. జైలర్ సాబ్ అతనికి అభ్యర్థన తెలిపాడు.

"లేదు లేదు, మీది ఆలస్యంకాలేదు. మేమే అదరాబాదరా వచ్చాం. డాక్టర్, సూపరెంటెండెంట్ ఆ గదిలో మీకొరకు ఎదురుచూస్తున్నారు. రండి, గదిలో

కూర్చుందురుగాని."

ఇంక గదిలోకి వెళ్ళటం జరగలేదు. సూపరెంటెండెంట్, సివిల్ సర్జన్ అందరూ జైలులోపలకు వెళ్ళటానికి రెడీ అయి, గది బయటికి వచ్చారు. ఒక్కొక్కరే అందరూ లోపలకు వెళ్ళారు. గుమ్మం కొంచెం యెత్తు తక్కువ. అందరూ తలలు వంచుకోవలసి వచ్చింది...ఢిల్లీ దర్బార్‌లో ఇలాంటి ఒకగేట్ కథ విన్నాను. ఎక్కడి రాజాయో ఒకరు దీన్ని అవమానంగా భావించి లోపలికే రాలేదట. యక్షపు అంధకారం ఒక్కొక్కరినే సూపరెంటెండెంట్ వర్గంలోని వారందరినీ మ్రింగేసింది. ఇప్పుడు ఇక్కడినుంచి పారిపోతే ఏమవుతుంది? శవదేహంకేసి నేను చూడలేను. ఇక్కడినుంచి పారిపోతే ఎవరూ చూడను కూడా చూడరు...మేజిస్ట్రేట్ హుకుం జైలు ఉద్యోగులకు చూపించాలి. లేకపోతే వారు నాకు శవదేహాన్ని యెందుకిస్తారు? ... ఏమయిపోయింది కాగితం? ఏ జేబులోనూ లేదు చూస్తే. ఏమయింది? ఇంట్లోవదిలేసి వచ్చానా యేం? అలా అయితే ఇప్పుడే వెళ్లాలి. పోనీ, మంచిదే అయింది. దొరక్కపోతేనే మంచిది... తర్వాత రైల్లో పాట్నాయో లేదా బొంబాయో వెడితే ఏమవుతుంది? మా వర్గంలోని Intellectual కామ్రేడ్స్‌ని కలుసుకోవటం చాలా అవసరం. అహఁ... ఇదిగో, కాగితం జేబులోనేవుంది... నిన్న నా చేతితో ఈ జేబులోనే పెట్టాను. ఎక్కడికి పోతుంది? అయినా ఇప్పుడే జేబులన్నీ వెతికి చూశాను... ఎక్కడా కనిపించలేదు.

సుబేదార్ సాబ్ ముఖం మీదికి దృష్టిపోయింది. అతనూ నావైపే చూస్తున్నాడు. అతను చూపు వెనక్కి త్రిప్పుకున్నాడు. అతనిక నావైపు చూడలేకపోతున్నాడు.

దూరంగా ఒకరిద్దరు వంతున జనం కూడినట్లు తోస్తోంది. ఆర్మ్‌డ్ పోలీసుల భయం మూలంగా ఎక్కువమంది జనం రాలేదనుకుంటాను. లేకపోతే ఈపాటికి ఈ చోటంతా జనంతో నిండిపోవాలసింది! ఒక క్వార్టర్ తలుపు తెరుచుకుంది. అందరూ శవదేహాన్ని చూడాలనే ఉత్సుకతతో ఉన్నారల్లేవుంది. అన్నయ్య కంఠం మీద నల్లటి మచ్చ వుందా?... శీతాకాలంలో కాషాయ వస్త్రాలు ధరించి పంజాబీ జ్యోతిష్కుల జట్టు ప్రతియేడూ పూర్ణియాకు వస్తుంటుంది. వారిలో ఒకరు ఒకసారి మా ఆశ్రమానికి వచ్చాడు. వచ్చి వికృతమైన ఉచ్చారణతో కొంచెం హాస్యంతో నేను 'ఫార్చ్యూన్ టెల్లర్'ని అన్నాడు. అతను అన్నయ్య అభ్యంతరం చెప్పినా అన్నయ్య చెయ్యిచూసి, ఎనభై సంవత్సరాలు అన్నయ్య పరమాయుర్దాయం అని చెప్పాడు. అందరూ వంచకులు, అబద్ధాలు చెప్పేముఠా. అన్నయ్య అతని మాట విని నవ్వాడు "ఇది కాంగ్రెసు ఆఫీసు, మేము నీవింత శ్రమ తీసుకున్నందుకు డబ్బు యివ్వలేము" అన్నాడు.

సరే... అన్నయ్య ఒకవేళ భయంతో తెలివితప్పిపడిపోతే అలా అయినా వీరు ఆ స్థితిలోనే ఉరికంబానికి వ్రేలాడతీస్తారా? అలా జరుగుతుందా?

ఉరిత్రాటిని తీసుకుని 'మేట్' పహరావాళ్ళు అటు యిటు లాగుతున్నారు. అస్పత్రి జైల్లో సంగతి గుర్తుకొస్తోంది. త్రాడును వాళ్ళు ముక్కలు ముక్కలుగా కోసి వెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు. మెత్తటి కొవ్వు పూత పూసిన త్రాడుపైన పదునులేని యినపరేకు ముక్కలుగా జారిపోతోంది. అదృష్టవంతులకి ఒక్కొక్క ముక్క దొరికింది. దానితో సత్వర ఫలితాన్నిచ్చే వశీకరణ కవచం చేస్తారుట.

ఈసారి లోపల గేటు తెరుచుకుంది. సూపరెంటెండెంట్, మేజిస్ట్రేట్, సివిల్ సర్జన్, జైలర్, అఘోరబాబు, అసిస్టెంట్ జైలరు - ఆ వార్డరు, ఆ వార్డరు, కుక్క, ఆ వార్డరు - ఆ వార్డరు -

అందరూ ఏదో బలవంతంగా ముఖాల్లోకి నవ్వు తెచ్చుకునే ప్రయత్నంలో ఉన్నారు. ఈ సామాన్య సంఘటనకు వారేమీ విచలితులుకాలేదని, దీనివల్ల తమకు టీత్రాగటానికి కాస్త ఆలస్యమయిందని చూపాలనుకుంటున్నారు. సూపరెంటెండెంట్ సివిల్ సర్జన్‌ని, మేజిస్ట్రేట్‌ని తన బంగళాలో టీ త్రాగటానికి రావలసిందిగా 'రుతున్నాడు. గేట్ తెరవబడింది. కుక్క ముందు దారిచూపిస్తూ నడిచింది. మోటారు కార్లు రెండు వారి వెనకాలే బంగళా ప్రక్కకి వెళ్ళి ఆగాయి. లారీ డ్రైవర్లు రెడీ అయి స్టీరింగ్ వీల్ పట్టుకుని కూర్చున్నారు. వార్డరు లోపలి తలుపున్న ఇప్పటికీ కాస్త యెడంచేసి పట్టుకుని వుంచాడు. ఇదిగో వచ్చి పడిందనుకుంటా - అక్షణం...

"అరే నీలూ బాబూ, నమస్కారాలు. ఇంత చీకటిలో ఇటువైపు ఎక్కడికి? ఇంటర్వ్యూ విషయం తెలుసుకోటానికనుకుంటాను. సి.ఐ.డి. ఎనిమిదిలోపున రాడు. రండి మా యింటికి. ఈలోగా కాస్త టీ - గీ - తీసుకోవచ్చు ఏమంటారు?"

అఘోరబాబు నాకు సమాధానం చెప్పే అవకాశాన్ని ఇవ్వలేదు. ఎలాగో అతి కష్టంమీద - "అహ( ఇంటర్వ్యూ కోసం రాలేదు. వచ్చింది - ఇవాళ - అన్నయ్య - అదే...." ఇంక మాట పెకిలిరాలేదు. పెదవులు వణుకుతున్నాయి. కాని మాట పైకి రావటంలేదు. ఎవరో - ఏదో దృఢమైన చేతులతో కంఠాన్ని నొక్కి పట్టుకున్నారు. నా కళ్ళ వెంబడి కూడా నీళ్ళు వచ్చాయి. మరొక వైపుకి చూస్తూ యెలాగో మేజిస్ట్రేట్ ఉత్తరం ఆయనకిచ్చాను. అఘోరబాబు ఉత్తరం చదువుతున్నారు. కళ్ళనీళ్ళు తుడుచుకున్నాను.

"అరె. అలా చెప్పు! ఏమిటి మీరు వినలేదా?" ఆయన మెడ వాటేసిపట్టుకున్నారు. ఉరితీత అర్డరు వాయిదావేసినట్లు గవర్నమెంట్ ఉత్తరం వచ్చిందిగా."

"ఆఁ ఏమన్నారు? అఘోరబాబు పిచ్చివారయినారాయేం?" ఆయన చేతులు రెండూ పట్టుకున్నాను.

"మిలిటరీ ఇలాకాలోతప్ప భారతదేశంలో అన్నిచోట్లా ఆగస్టు ఆందోళన సమయంలో - 'స్యాబటేజ్' కోసం ఎవరిమీద ఉరి శిక్ష ఉత్తర్వులయినాయో - వారి ఉరితీతలు - నిరవధికంగా వాయిదా పడిపోయాయి. ఈ ఆర్డర్‌కి ముందే మధ్య మధ్య ఇతరచోట్ల ఉరితీతలు అయిపోయాయి. మర్డర్ చార్జీలు యెవరిమీద ఉన్నాయో వారు మాత్రం ఈ ఆర్డరులోకిరారు. ఇవాళ ఒక సాధారణ ఖైదీ ఉరితీత ఉంది. అతడు మూడో నంబరు సెల్‌లో ఉన్నాడు. మొన్న ఆర్డర్ వచ్చింది. మీ అన్నయ్యని ఒకటో నంబర్ సెల్‌లోంచి తరలించలేదు. "హంగామా పెంచి ఏం లాభం" అన్నారు దొర. అందు మూలంగా తప్పు జరిగింది. ఉరితేదీ ముందుగానే - జైలరు ఖైదీలకు చెప్పాలనే నియమం లేదిప్పుడు. అందుచేతనే మీకు పొరపాటు వార్త వచ్చింది" అని చెప్పారు ఆయన.

నాకింక మాట్లాడే శక్తి లుప్తమైపోయింది. అంతా శాంతించింది. ధమనుల్లో రక్త ప్రసారం కూడా స్తంభించింది. చెట్ల ఆకులు కూడా కదలటంలేదు. గ్రహాలు గమనాన్ని మరిచిపోయి స్థిరంగా నిలిచిపోయాయి. 'వీరభోగ్యా వసుంధరా' దేవీ రూపం! ఊపిరితీసుకోవాలన్నా భయం వేస్తోంది. ఉమాదేవి తపస్సు భగ్నమవుతుందా యేం?

...ధమనులకు మళ్ళీ స్పందన కలిగింది. చెట్టు చెట్టునా పక్షుల కిలకిలారావాలు. ఆకు ఆకునా ప్రభాత వాయువు కదలికలు. లాస్యమయి అయిన పృథివి నానా విధాల లయవిన్యాసాలతో విలసితురాలయింది...రాతి జైలు గేట్ పై భాగంలో హఠాత్తుగా ఉషా బాల ఆ రక్తిమ కాంతి ప్రసరించి మనోహరంగా కనిపిస్తోంది.

- సమాప్తమ్ -

Lasertypeset at Visalaandhra, Vijayawada
and printed at Beauty Print, New Delhi-110055